# నిర్ణయ సింధువు

(ప్రథమ భాగము)




కర్త:
కమలాకరభట్టు

అనువాదకుడు
డా॥ కిడాంబి నరసింహాచార్య

# NIRNAYA SINDHU

By

## KAMALAKARA BHATTA

Telugu Translation

By

## Dr. Kidambi Narasimhacharya

## నిర్ణయ సింధువు (ప్రథమభాగము)

ప్రథమ ముద్రణ : అక్టోబర్, 1995

ప్రతులు : 1000



వెల : రూ. 40/-

ప్రకాశకులు / ప్రాప్తిస్థానము
శ్రీమతి కిడాంబి పద్మ
H.No. EWSH - 208
న్యూ సంతోష్‌నగర్ కాలనీ,
హైదరాబాదు - 500 059 (ఆం. ప్ర)

శ్రీ టి.పి. యాదగిరి ఆచార్య
H.No. 19/100/B,
కోదండరాం నగర్
దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్ - 36.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
1.1.517/B/1,
న్యూ బాకారం, గాంధీనగర్,
హైదరాబాదు - 500 330.
ఫోన్ : 7611413

# మనవి మాట

శ్రీమాన్ తిరువడందపురత్తు యాదగిరాచార్యులగారికి (మా చెల్లెలు భర్త, మా బావగారు) బజారుకెళ్ళినప్పుడు దారిలో పుస్తకాల షాపులు చూస్తూ ఉండటం, బుద్ధిపుడితే వెంటనే ఆ పుస్తకాన్ని కొనటం అలవాటు. అట్లా కొన్నవాటిలో (శ్రీరామా బుక్‌డిపో వాళ్ళు ఈ మధ్య అచ్చేసిన) నిర్ణయ సింధు వొకటి. అది మూలమాత్రం.

ఆ పుస్తకాన్ని నేను వారిచేతిలో చూడటం తటస్థించింది. ఆ సందర్భంలో వారు, ఈ పుస్తకాన్ని మీరు తెలుగులో అనువాదం చేయరాదా అని అనటం, నేను చేస్తాననటం జరిగిపోయింది. దాని పరిణామమే ఈ నిర్ణయ సింధువు మొదటి పరిచ్ఛేదానువాదం.

శ్రీరామా వారిది ఫుల్‌స్టాప్, కామాలు వగైరా కాని, హెడ్డింగులు కాని లేని గ్రంథం. ఏ విషయాన్ని వివరిస్తున్నారు, ఎక్కడికి వాక్యం పూర్తైంది, ఎక్కడకి అన్వయం ఈ పదానికి, వగైరాలు అర్థం చేసుకోవటానికి కొంత శ్రమ పడాల్సి వచ్చింది. అందునా, ఇందలి విషయం జ్యోతిష సంబంధి. జ్యోతిషంలోని విషయాలు అవగాహన లేకుంటే గ్రంథం అర్థం కావటం కష్టం. ఐనా కొంత గ్రంథం అనువాదం చేశాక మిత్రులు డా॥ బి. నరసింహాచార్యుల ద్వారా ఉస్మానియా యూనివర్సిటీలోని నిర్ణయసింధువు సంస్కృత ప్రతి నాకు లభించింది. ఆ తర్వాత కొన్నాళ్ళకు శ్రీ వేంకటేశ్వర వేదాంతవర్ధిని సంస్కృత కళాశాల ప్రిన్సిపల్ డా॥ కం రామానుజాచార్యుల ద్వారా వారి కళాశాలలోని మరో నిర్ణయ సింధువు గ్రంథం, హిందీ వ్యాఖ్యానం కలది లభించింది. వీటి సహాయంతో ఒక పరిచ్ఛేదాన్ని అనువదించాను.

అనువదించబడ్డ భాగం అచ్చయ్యాక రెండవ భాగం అనువాదాన్ని చేపట్టాలని భావించి, తర్వాతి అనువాదాన్ని ఆపాను ప్రస్తుతం. ఇన్నాళ్ళకు అనగా షుమారు 1990 నుండి ఈ ప్రయత్నం ఆరంభమై, ఎన్నో అవాంతరాల నెదుర్కొని ఈనాటికి అచ్చైంది. (అనువదించటమంత సులభం కాదు అచ్చు వేయటం, అచ్చువేసిన అనుభవజ్ఞులకు ఇది సువిదితం.)

తన కాలంలోని ధర్మశాస్త్రాలన్నీ చూచి, సంగ్రహించి, తనదైన నిర్ణయాన్ని (అవసరమైన సందర్భాల్లో ఇది నిర్ణయశైలి అని) తెలుపుతూ రచించబడ్డ ధర్మశాస్త్రగ్రంథం నిర్ణయసింధువు. అంతకు ముందు ఇలాంటి నిర్ణయ గ్రంథము లేదు. కమలాకరభట్టే ధర్మశాస్త్ర గ్రంథ క్రోడీకరణలో తొలివాడనాలి. నాటి నుండి నేటివరకు ధర్మాచరణలో, సంశయాలకు సమాధానాన్నందించే గ్రంథమిది. ఇప్పటి వరకూ మనం చూస్తుంటాం. ఒక పండుగను కొందరు ఒకరోజు చేస్తే మరికొందరు మరో రోజు చేస్తున్నారు. ఉగాది ఆంధ్రులకొకరోజు, తమిళులకొకరోజు, కృష్ణాష్టమి స్మార్తులకొకరోజు, శ్రీవైష్ణవులకింకొకరోజు-ఇట్లా ఎన్నో పండుగలు ఎన్నో ప్రాంతాలలో, ఒకే ప్రాంతంలోనైనా భిన్నభిన్నంగా ఎందుకు జరుగుతాయి అనే ప్రశ్నకు నిర్ణయ సింధువు చూస్తే కొద్ది సమాధానం దొరుకుతుంది. ధర్మ శాస్త్రాలు, ధర్మ శాస్త్ర గ్రంథకర్తలు అనేక మంది ఉన్నారు. ("ఋషయశ్చభిన్నాః, మతయశ్చభిన్నాః".) ఆ కారణంగా ఆయా పెద్దల అభిప్రాయాల ననుసరించి ఒక రోజు ఒకరు చేస్తే మరో రోజు మరొకరు చేస్తారు. నాటినుండి ఇదే స్థితి. పంచాంగ కర్తలు ఒక పండుగను నిర్ధారించాల్సి వస్తే నిర్ణయ సింధువులోని శ్లోకాల నుట్టంకిస్తూ ఒక నిర్ణయాన్ని ఇప్పటికీ చేస్తున్నారు. ఇది దీని ప్రాశస్త్యం.

ఇందులో స్త్రీ పురుషభేదం లేకుండా అన్ని వర్ణములవారికి ధర్మాచరణం చెప్పబడింది. "వర్ణత్వాత్ ధర్మ మర్హతి" అని అంటాడు కర్త.

శ్రీ వైష్ణవాగమ దీక్ష దీసుకుంటే - తీసుకున్నవారు మాత్రమే శ్రీవైష్ణవత్వాన్ని పొందుతారు (తండ్రి వైష్ణవ దీక్ష తీసుకుంటే పుత్రునకు వైష్ణవత్వం రాదు) అని అంటూ శ్రీ వైష్ణవత్వమైనా, స్మార్తత్వమైనా వంశపారం పర్యంగానే (ఉన్నదాన్ని) అంగీకరిస్తారు పెద్దలు అని అంటాడు కర్త. ఒక వ్యక్తి స్మార్తుడో వైష్ణవుడో కావటానికి ఒక మార్గం వంశక్రమాగతమైతే, రెండో మార్గం దీక్ష స్వీకరించటం. ఈ రెండు మార్గాలు కమలాకరభట్టు కాలానికి ఉండి, తర్వాత తర్వాత ఒక వంశ పార్యంపర్య లక్షణమే మిగిలిపోయిందనాలి.

అధికమాసం, క్షయమాసం - ఇవి ఎందుకొస్తాయో, దేన్ని అధికమాసం, దేన్ని క్షయమాసం అంటారో సామాన్యులూ తెలుసుకోగలిగినంత - సులభంగా చెప్పాడు కమలాకరభట్టు. స్త్రీలు ఒక వ్రతం ఆచరించేప్పుడు ఎట్లా అలంక

రించుకోవాలో చెప్పాడు. ఉపవాసం ఎవరు చేయాలి, ఎంతకాలం చేయాలి, ఎప్పుడు చేయాలి అనేదీ చెప్పాడు. స్నానం చేసేప్పుడు "గంగే చ యమునేచైవ గోదావరి సరస్వతీ నర్మదా సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధింకురు" అనే శ్లోకం చదువుతారు. ఆయా పుణ్యనదుల పేర్లను స్మరిస్తూ స్నానం చేయటం కూడా పుణ్యప్రదమంటాడు కర్త. గ్రహణంలో అట్లా స్నానం చేయమంటాడు. ఏ నీళ్ళతో స్నానం చేయాలో కూడా వివరంగా చెప్తాడు. ఏ వ్రతం చేయటానికి ఏ తిథి ముఖ్యమో చెప్తాడు. ఉదా॥ గణేశ చతుర్థి. తదియ + చవితి ఉన్నరోజున మధ్యాహ్న కాలానికి చతుర్థి ఉంటే ఆరోజే, గణేశ చతుర్థి చేయాలి. 1) చవితి + పంచమి ఉంటే, 2) మధ్యాహ్నానికి చవితిలేకపోతే గణేశ చతుర్థి చేయరాదు. అని అర్థం. శ్రీవైష్ణవుల ఏకాదశిని గూర్చి, స్మార్తులాచరించాల్సిన ఏకాదశిని గూర్చి దీర్ఘంగా చర్చించాడు.

రచయిత కర్మకాండ, జ్యోతిష, ధర్మ, ఛందో, సాహిత్య శాస్త్రిలలో నిష్ణాతుడు. అంతేకాక తర్క, వ్యాకరణ, మీమాంసాశాస్త్రిలలోను అఖండ పరిజ్ఞానం కలవాడు. పశుమిత్ర విందాది ప్రకరణం, వైశ్వానరాధికరణం మొదలుగా ఎన్నో మీమాసాశాస్త్రంలోని, న్యాయాలను ఉట్టకించా డీ గ్రంథంలో ఆయా సందర్భాల్లో.

అట్లాగే మలమాసశ్రాద్ధసందర్భంలో, గ్రహణ సందర్భంలో ఇంకా ఇతరత్రా కమలాకరభట్టు చేసిన వాదనలు, ప్రతిపక్షిని ఉద్దేశిస్తూ చేసిన వాదనలు అతని తార్కికశక్తిని తెలియజేస్తాయి.

పౌత్ర శబ్ద విచారంలో, అద్యతన శబ్ద విచారంలో (మహాభాష్య పంక్తులను ఉట్టంకిస్తూ) చేసిన వాదనలో అతని వ్యాకరణ శాస్త్ర ప్రావీణ్యం కన్పిస్తుంది. ప్రపితామహులకాలంనుండి వంశపారంపర్యంగా లభించిన శాస్త్ర పాండిత్యం కమలాకరభట్టులో ఆత్మవిశ్వాసాన్ని కూడా పెంచింది. ఆ కారణంగా ఏదైనా నిర్ణయించేప్పుడు స్పష్టంగా "నతన్మమమతం" "ఇతి నిర్ణయ శైలి" అని దృఢంగా చెప్తాడు.

18 ధర్మశాస్త్ర గ్రంథాలు, 3 వైదిక గ్రంథాలు, 2 వేదాంత గ్రంథాలు, 3 మీమాంసా గ్రంథాలు, 1 భక్తి గ్రంథం, 2 కావ్య గ్రంథాలు, కావ్య ప్రకాశ

అనే అలంకారశాస్త్ర గ్రంథానికి టీక, నిర్ణయ సింధువు, ఇవన్నీ ఈతని రచనలు. క్రీస్తు శకం 1612 ఈతని రచనా కాలం (నిర్ణయ సింధువు).

ఇంతటి విపుల గ్రంథకర్త, ఇంతటి శాస్త్ర జ్ఞాన సంపన్నుడైన కమలాకర భట్టు గ్రంథం నిర్ణయసింధువు. దానిలోని ఒక పదచ్ఛేదానికి, నా శక్తి కొలది తాత్పర్యాన్ని వ్రాశాను అందలి గుణాలను గ్రహించి, దోషాలను తెలుపవలసిందిగా కోరుతున్నాను. ఇది తరువాతి ప్రకరణానువాదంలో ఉపయోగపడ్తుందని భావిస్తున్నాను.

నా ఈ అనువాదానికి తమ "ప్రస్తావన" నందించిన సహృదయులు ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి.

తమ "కర్తవ్య సందేశా"న్నందించిన డా॥ మూలంపల్లి చంద్రశేఖర శర్మ గారికి—

"ధర్మోరక్షతి రక్షితః" అంటూ ధర్మ రక్షణావశ్యకతను తెలియజెప్పిన డా॥ C.V.B. సుబ్రహ్మణ్యంగారికి—

సంస్కృత మూలానికి తెలుగు అనువాదం కాగా ఇంగ్లీషులో foreword ఏమిటంటూనే, నా కోరిక ప్రకారం ఇంగ్లీషులో తమ అభిప్రాయాన్ని తెలిపిన ఆచార్య బి. నరసింహాచార్యులగారికి—

ఈ పుస్తక ముద్రణలో ద్రవ్య సహాయమందించిన శ్రీ ముత్తయ్య A S.W.O. గారికి, పుస్తకాల పద్మావతి సత్యనారాయణ గారలకు—

ఈ పుస్తకానికి ముఖపత్ర చిత్రం వ్రాసి ఇచ్చిన జగన్నాథ్‌గారికి—

ఈ పుస్తకాన్ని చక్కగా ముద్రించి ఇచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, శివాజీ ప్రెస్ వారికి—

గ్రంథ ప్రేరకులైన ఆచార్యులగారి కులదైవం ఏదులాబాద్ ఆండాళ్ తల్లికి, ఇందులో సహకరించిన అందరికీ కృతజ్ఞతలు.

# ప్రస్తావన

ఐహికాముష్మిక శ్రేయస్సాధనమైన ధర్మాన్నీ, పరిత్యాజ్యమైన అధర్మాన్నీ బోధించే ఏకైక శాస్త్రం వేదం. ధర్మాలు వేదంలోని వివిధ స్థానాలలో, కొన్ని చోట్ల ప్రత్యక్షంగాను, కొన్నిచోట్ల సూచనా రూపంలోను బోధించబడి ఉన్నాయి. సామాన్యులకు అందుబాటులో ఉండడంకోసం ఆయా మహర్షులు, ఆయా కాలాలలో ఆ ధర్మాలను వేదం నుండి గ్రహించి ధర్మశాస్త్ర గ్రంథాలు నిర్మించారు. వీటిలో కొన్ని సూత్రరూపంలోను, కొన్ని శ్లోకరూపంలోను ఉన్నాయి. గౌతమ-అపస్తంబాదుల గ్రంథాలు మొదటి తెగకు చెందినవి; మనుస్మృతి - యాజ్ఞవల్క్య స్మృత్యాదులు రెండవ తెగకు చెందినవి; వీటిలో కొన్ని బృహత్ప్రమాణాలు, కొన్ని అల్పప్రమాణాలు. ధర్మశాస్త్ర గ్రంథాలలో ప్రధానమైనవి అని చెప్పుకొనే మనుస్మృతి-యాజ్ఞవల్క్య స్మృత్యాదులలో ఆచారం, వ్యవహారం (రాజధర్మాలు, రాజ్యపాలన మొదలైనవి), ప్రాయశ్చిత్తం అనే మూడు విషయాలు విస్తృతంగా ప్రతిపాదింపబడ్డాయి. కొన్నింటిలో ఆచారం మాత్రం, కొన్నింటిలో ఆచార ప్రాయశ్చిత్తాలు చెప్పబడి ఉంటాయి.

అయితే, ఈ ధర్మశాస్త్ర గ్రంథాల సంఖ్య కూడా అత్యధికంగా ఉండడం చేత ఏదైనా ఒక విషయాన్ని గూర్చి సందేహం కలిగినప్పుడు స్మృతిగ్రంథాలన్నింటినీ సంప్రదించడం చాలా కష్టమైన విషయం. కొన్నిచోట్ల ఒక స్మృతిలో చెప్పినదానికి మరొక స్మృతిలో చెప్పినదానికి విరోధం ఉన్నట్లు కనబడవచ్చు. అందుచేత ఆయా విషయాలను తీసికొని, వాటికి సంబంధించిన ధర్మశాస్త్ర వాక్యాలను ఉదాహరిస్తూ, జాగర్తగా వివిధ వాక్యాల సమన్వయం చేస్తూ కొన్ని నిర్ణయాలు చేసి కొందరు పండితులు గ్రంథాలు రచించారు. వీటికి నిబంధ గ్రంథాలని పేరు. వీటిలో ఆచార ప్రాయశ్చిత్తాలు మాత్రమే ఉంటాయి.

ఇలాంటి నిబంధ గ్రంథాలలో చాలా ప్రసిద్ధమైనది "నిర్ణయసింధువు." మహారాష్ట్రాంధ్ర దేశీయులు దీని నిర్ణయాలకి అత్యధిక ప్రామాణ్యం ఇస్తారు. దీని రచయిత కమలాకర భట్టు సకలశాస్త్రపారంగతుడు. 17 వ శతాబ్దంలో

మహారాష్ట్రంలో జన్మించిన ఈ మహాపండితుడు దాదాపు అన్ని శాస్త్రాలలోను గ్రంథాలు రచించాడు. 'కర్మవిపాకరత్నం', 'కలిధర్మనిర్ణయం', 'కార్తవీర్య పద్ధతి', 'గోత్రప్రవర నిర్ణయం (దర్పణం)', 'దానకమలాకరం', 'తీర్థకమలాకరం' (సర్వతీర్థవిధి), 'నీతికమలాకరం', 'పూర్తకమలాకరం', 'ప్రాయశ్చిత్త రత్నం', "బహ్వృచాహ్నికం", 'భక్తిరత్నం', 'రుద్రపద్ధతి', 'వివాదతాండవం', 'వ్రతకమలాకరం', 'శాంతికమలాకరం' (శాంతిరత్నం), 'శూద్రకమలాకరం' (శూద్ర ధర్మతత్త్వం), 'సంస్కార పద్ధతి' (సంస్కార ప్రయోగకమలాకరం), 'శాస్త్రతత్త్వ కౌతూహలం' (తత్త్వకమలాకరం), 'నిర్ణయసింధు' - ఇవి ఈయన రచించిన ధరశాస్త్రగ్రంథాలు.

నిర్ణయసింధువు' అతి బృహత్ప్రమాణంగల ప్రామాణిక గ్రంథం. దీనిలో ఆయా విషయాలు చర్చించే సందర్భంలో కమలాకరభట్టు దాదాపు ఒక వంద స్మృతులనుంచీ, మూడువందల నిబంధాలనుంచీ వాక్యాలను ఉద్ధరించాడు. ఈ గ్రంథం మూడు పరిచ్ఛేదాలలో విభక్తమై ఉంది. మొదటి పరిచ్ఛేదంలో సంవత్సరం, అయనం, మాసం మొదలైన కాలవిభాగాలు నిర్ణయం చేయబడింది. హేమాద్రి మాధవుల మతాలు, ఇతర ఆచార్యుల మతాలు బాగా పరిశీలించి ఈ పరిచ్ఛేదంలో కాలనిర్ణయం చేస్తున్నట్లుగా రచయిత ఈ క్రింది శ్లోకంలో చెప్పాడు—

"హేమాద్రిమాధవమతే ప్రవిచార్య సమ్యక్
ఆలోచ్య తత్త్వ మథ తీర్థ కృతాం పరేషామ్,
శ్రీరామ కృష్ణతనయః కమలాకరాఖ్యః
కాలే యథామతివినిర్ణయమాతనోతి" (ని.సి. 1.7)

రెండవ పరిచ్ఛేదంలో తిథి నిర్ణయమూ, ఆయా తిథులలో చేయవలసిన వివిధ కర్మల నిర్ణయమూ చేయబడింది.

ప్రకీర్ణం అనే పేరు గల తృతీయ పరిచ్ఛేదంలోని పూర్వార్ధంలో గర్భాధానాది సంస్కార నిర్ణయం, ఉత్తరార్ధంలో శ్రాద్ధాది నిర్ణయమూ ఉన్నాయి.

నిర్ణయసింధువులో చేసిన ధర్మనిర్ణయాలు ఈనాటికి కూడా వైదిక కర్మాసక్తులైన ఆస్తికులకు శిరోధార్యాలు. సంస్కృత భాషాపరిచయం తక్కువ ఉన్నవారికి కూడా దానిలోని విషయాలు తెలియడం ఎంతైనా అవసరం. శ్రీమాన్ కిడాంబి నరసింహాచార్యులు గారు దీనిని తెలుగులోకి అనువదించి ఆస్తిక లోకానికి దానిలోని విషయాలు అందజేయడానికి చేస్తున్న ప్రయత్నం శ్లాఘనీయమైనది. ఇలాంటి గ్రంథాలు భాషాంతరంలోనికి అనువదించాలంటే కేవలం సంస్కృత భాషా జ్ఞానం ఉంటే చాలదు. మంచి శాస్త్రజ్ఞానం కూడా కావాలి. ధర్మశాస్త్రానికి పూర్వమీమాంసా శాస్త్రానికి అవినాభావ సంబంధం. ధర్మశాస్త్రానికి సంబంధించిన విషయాలు చర్చించేటప్పుడు పూర్వమీమాంసాన్యాయాలను ప్రమాణంగా చూపడం శాస్త్ర సంప్రదాయం. నిర్ణయసింధువులో చాలా చోట్ల ఈ పూర్వమీమాంసా విషయాలు ప్రమాణంగా చూపబడుతుంటాయి. కొన్నిచోట్ల నైయాయికుల పారిభాషిక పదాలు కనబడుతుంటాయి ఈ రెండు శాస్త్రాల జ్ఞానం ఉన్నవారే దీనిని అనువదించ కలుగుతారు. శ్రీ నరసింహచార్యులుగారు సంప్రదాయ పద్ధతిలో శాస్త్రాధ్యయనం చేసి ఉండటం చేత ప్రామాణికమైన అనువాదాన్ని తెలుగువారికి అందించగలుగుతున్నారు. ఇప్పుడు ప్రథమ పరిచ్ఛేదానువాదం మూలంతో సహా ప్రచురిస్తున్నారు. మొత్తం గ్రంథం అనువదించడం శ్రమసాధ్యం. అయినా శ్రీ నరసింహాచార్యులుగారు పట్టుదలతో దీనిని పూర్తిచేయగలరని నా విశ్వాసం. ఇలాంటి గ్రంథాలను గూర్చి విన్నవారు గాని, స్మరించేవారుగాని అరుదైన ఈ కాలంలో వీరు చేపట్టిన ఈ కార్యక్రమం హిందువునని చెప్పుకొనే ప్రతివారు ఆదరించదగినది.

హైదరాబాదు
యువనామ సంవత్సర గురుపూర్ణిమ
12 7-1995.

**పుల్లెల శ్రీరామచంద్రుడు**
"వేదాంత శిరోమణి"
"వేదాంత విశారద", "విద్వాన్",
M.A., Ph.D (San) M.A. (English), M.A. (Hindi),
Recipiant of Presidents Certificate of Honour,
Professor of Sanskrit O.U (Rtd).

# కర్తవ్యసందేశము

ధర్మమనగా కర్తవ్యము అనగా చేయదగినది. దీనికి ఏమి చేయదగినది? ఎవరికి చేయదగినది? ఎప్పుడు చేయదగినది? ఎక్కడ చేయదగినది? ఎందుకు చేయదగినది? ఎందుకు చేయదగనిది కాదు? (అది చేయకున్ననేమి?) ఎట్లు చేయదగినది? మొదలగు ప్రశ్నలు గలుగును. ఆ ప్రశ్నలకు సరియైన సమాధానములు వచ్చినపుడు అది నిజముగా చేయదగిన ధర్మమగును. లేనిచో అధర్మమగును. దీనిని చక్కగా విమర్శించి కర్తవ్యమును నిర్ణయించి నిరూపించునదే ధర్మశాస్త్రము.

శాసించుటచే రక్షించునది శాస్త్రము. శాసనేన్‌త్రాయత ఇతి శాస్త్రమ్. ధర్మమును శాసించుటద్వారా మానవులను రక్షించునది ధర్మశాస్త్రము.

మానవుడు స్నానము చేయుట కర్తవ్యము. ప్రాతఃకాలమున జేయవలెను. నదీ జలములలో జేయవలెను. అంతర్బహిశ్శుద్ధికై చేయవలెను. చేయనిచో అంతర్బహిశ్శుద్ధి జరుగక మలినుడై రోగపీడితుడగును. నదిలో నడుమువరకు వెళ్ళి ఒక మునుగు మునిగి, హృదయమువరకు వెళ్ళి, మొదట దేశకాలములతో సంకల్పముచేసి, కాయిక వాచిక మానసిక సాంసర్గిక జ్ఞాతాజ్ఞాత స్పృష్టా స్పృష్ట భుక్తాభుక్త పీతాపీత సకల పాపక్షయార్థం గంగా భాగీరథీ తీర్థే స్నానమహంకరిష్యే అని ఆపోహిష్ఠామ మన్త్రముతోను ఆపోవా ఇదం సర్వం అను మన్త్రముతోను ఇమంమే గంగే మన్త్రముతోను గంగా యమునాదులను స్మరించి ఋతంచ సత్యంచ అను మన్త్రముతో మూడుమారులు మునిగి అఘమర్షణ స్నానము చేయవలెను. దైహికముగా మృత్తికాది లేపనములతో దేహమలినములను, మానసికముగ దైవధ్యాన మన్త్రములతో ఆంతరిక మలినమును గడిగివేయుచు స్నానము జేయవలెను. విష్ణు సూర్య గంగల కర్ఘ్య మీయవలెను. ఆ తరువాత దేవ-ఋషి-పితృ తర్పణము జేయవలెను. చివరకు "యన్మయా దూషితంతోయం శారీరమల సంభవాత్ తద్దోషపరిహారార్థం యక్ష్మాణం తర్పయామ్యహం" అని యక్ష్మ తర్పణము జేయవలెను. (ఆ తరువాత మానస్తోకే

మంత్రముతోను త్ర్యంబక మంత్రముతోను సద్యోజాతాది పంచబ్రహ్మ మన్త్రములతోను భస్మవిలేపనము జేయవలెను). ఇది స్నానవిధి.

ఇచట స్నానమను ధర్మమును చేయదగిన వ్యక్తి మానవుడు. కాలము ప్రాతఃకాలము. దేశము నద్యాది పవిత్ర జలాశయములు. ఉద్దేశ్యము లేదా ఫలము ఆత్మ దేహశుద్ధి. చేయదగిన విధి పైన చెప్పబడిన విధము

ఇచట మధ్యాహ్నాది స్నానములు దేహశుద్ధికే యెక్కువగా ఉపయోగించును. ప్రాతస్నానము ఆత్మశుద్ధి కెక్కువ ప్రాధాన్యమిచ్చి సంపూర్ణ దేహశుద్ధి చేయును. నదీస్నానము ప్రవాహజలములో జరుగునుగాన పరిశుద్ధ జల స్నాన సిద్ధియే కాక ఆ జలము అనేక భూ పర్వత మణ్యౌషధులపై అత్యున్నత జల పాతములతో ప్రవహించుచు వాని ప్రభావము నాకర్షించి పుచ్చుకొని వచ్చును గావునను విశిష్టమైన విద్యుత్తరంగ శక్తిని గూడ పొందును గావునను అందలి స్నానము మానవులకు భౌతిక శారీరకముగనే కాక ఆధ్యాత్మికముగను దివ్య చైతన్య ప్రభావమును గలిగించును. కావుననే పెద్దలు "ప్రవాహినీగంగా" అన్నారు. గంగా గోదావరీ కావేరీ మొ॥ నదుల తీరములలో నున్న జనులు నేటికిని విశిష్ట ప్రతిభాపాటవముల జూపుచున్నారు. ఈ ప్రవాహముతోబాటు ఆయా సంవత్సరములలో సూర్యాది గ్రహముల యొక్క ఆయా నక్షత్రరాశి ప్రవేశము లాధారముగా నదులకు సముద్రములకు పుష్కరములు చెప్పబడినవి. సింహ రాశిలో గురువున్నప్పుడు గోదావరికి పుష్కరము వచ్చును. అనగా అప్పుడు గోదావరిలో సర్వనదీ సముద్ర తీర్థప్రభావము లేకీకృతములై యుండును. అప్పుడు గోదావరీ స్నానము విశేష పుణ్య ఫలదము.

ఇచట పుణ్యమనగా సదాత్మశక్తి. సామాన్యముగా ఆత్మ సర్వనియన్త గావున ఆత్మశక్తిమంతమైనచో మానసిక శారీరక పీడలన్నియు తొలగిపోవును. ఇక పుష్కరస్నానమున బాహిరముగా శరీరము శక్తివంతము కాక తప్పదు. ఆ పుష్కరస్నానము శుక్లపక్షములో ప్రత్యేక పూర్ణిమనాడు జరిగినచో మానసిక శక్తిగూడ సమృద్ధమగును. అమావాస్యనాడు సూర్యుడు ప్రబలుడై నదీక్షేత్రాదులలో తన ప్రభావమును జూపును. కావున ఆనాటి స్నానము పైతృకశక్తితో బాటు (ఆత్మకారకుడుగాన) ఆత్మశక్తిని గూడ వృద్ధిచెందించును. ఇక మానవుల

లోని శారీరక మానసికాధ్యాత్మిక దోష (పాప) ములన్నియు ఆ నద్యాదులలో సంక్రమించి ప్రవాహ క్రమణములతో శుద్ధములగును.

ఈవిధముగా భారతీయుల యాచార వ్యవహారము లన్నియు కాల-దేశ-కర్మల సుప్రభాత సంయోజనరూపములేయై యున్నవి.

కాలము సర్వాధారము. అది ఒక మహాచక్రము. అది చక్రముగా పరిభ్రమించుచున్నట్లు సూర్యచంద్రుల యుదయాస్తమయములవల్ల మనకు తెలియుచున్నది. చంద్రపరిభ్రమణమున ప్రథమాదితిథులు శుక్లకృష్ణచక్రములు ఏర్పడుచున్నవి. పూర్ణిమనాటి నక్షత్రమునుబట్టి చైత్రాదిమాసము లేర్పడినవి. సౌరమానమునుబట్టి సూర్యుడుండు రాసుల ప్రకారము మేషాదిమాసము లేర్పడుచున్నవి. చైత్రాదిగా రెండేసి మాసముల చొప్పున వసంత-గ్రీష్మ-వర్షా-శరత్-హేమంత-శిశిరములను ఋతువు లేర్పడుచున్నవి. ప్రతి నిత్యము సూర్యాది నవగ్రహముల యొక్క సూక్ష్మప్రభావములు తెలియబడకపోయినను, సూర్యరాశిభ్రమణహేతుకమైన ఋతువుల ప్రభావమ్ము మాత్రము ఎవ్వరును కాదననిరీతిగా మన భూమిపై స్పష్టముగ గనబడుచున్నది. కాని సూర్యాది నవగ్రహముల కావల అశ్విన్యాదిగా 27 నక్షత్రమండలములతో నేర్పడిన మేషాదిరాశిచక్రము గలదు. ఆయా రాశుల ప్రభావములుగల సూర్యాదిగ్రహముల యొక్క ప్రభావము భూమిపై బడినపుడు భూమండలము భిన్నభిన్న ప్రభావములకు గురియగుచుండును. ఆ ప్రభావములే దక్షిణాయనోత్తరాయణములు, షడృతువులు మొదలగునవి. ఇవి సంవత్సరముతో నియతముగా వచ్చునవి. ఇక అనియతముగా వచ్చునవి భూకంపములు జ్వాలాముఖుల స్ఫోటనములు మొ॥ అనేక ప్రకృతి వైపరీత్యములు, ధూమకేతు ప్రభావములు, ఆతప-జల-శీత ప్రళయములు మొదలగునవి.

ఆకాశమున నక్షత్రమండలములతో నేర్పడిన మేషాది 12 రాసులను గడియారములోని 12 అంకెలుగా పోల్చుకొనవచ్చును. సూర్యగ్రహమును గంటలుచూపు ముల్లుగాను, చంద్రగ్రహమును నిమిషములు జూపు ముల్లుగాను స్థూలముగా జెప్పుకొనవచ్చును. వివరముగా జెప్పవలెనన్న సూర్యాది (నవ) గ్రహములన్నియు మేషాదిరాసుల అంకెలపై వాని వాని వేగములతో తిరుగునట్టి ముల్లులని యనుకొనవచ్చును. కాని, గడియారములో నిముషముల ముల్లు

12 పైకి వచ్చినపుడే గంట మోగునట్లు ఏర్పాటు చేయబడినది. ఆ గంటలు 1 నుండి 12 వరకు మనకు సమయమును జూపి హెచ్చరించును కాని, కాల చక్రమున ముఖ్యముగా సూర్యుడు ఆయా రాసుల యంకెల పైకి రాగానే ప్రకృతిలో విశిష్టమైన ప్రభావములను జూపును. అవి స్థూలములుగా నున్నపుడు మనకు స్పష్టముగా అనుభవములోనికి వచ్చును. కాని, సూక్ష్మములైనపుడు వానిని శాస్త్రీయముగా తప్ప మరొక విధముగా కనుగొనలేము. సూర్యుడు మకరములో ప్రవేశించగానే ఉత్తరాయణము, కర్కాటకములో ప్రవేశించగానే దక్షిణాయనము ప్రారంభమగును. మృగశిరా నక్షత్రమున ప్రవేశింపగనే వర్ష ఋతువునకు సంబంధించిన మార్పులు వచ్చును.

ఈ ఋతువుల ప్రారంభములలోని మార్పులకు స్థూలమయిన జగత్ప్ర కృతియే ప్రకోపించి మెల్లిగా సర్దుకొనును. అనగా జల - స్థల హిమ శిశిర వాయు పీడనములు (తూఫానులు) చెలరేగి కొంత ప్రళయము సాగించి సర్దుకొనునన్న మాట. అట్లే ఈ ఋతుపరివర్తనములు ప్రాణులయు మానవులయు ఆంతరికము లైన సూక్ష్మ ప్రకృతులను ప్రకోపములకు గురిచేసి మానవప్రళయమును సృష్టించును. సద్దుకొనుటకు గూడ అవకాశము నీయదు. అట్టి సమయములలో భారతీయుల ధర్మశాస్త్రములచే జగత్ప్రకోపముల ప్రశాన్తికై ఋతువుల సక్రమ సత్ప్రభావ సంపాదనమునకై యజ్ఞాదికర్మలు ధర్మములుగా ఉపదేశింపబడినవి. అట్లే ప్రాణులయు మానవులయు ప్రాకృతిక ప్రకోప ప్రశాన్తికై చాతుర్మాస్యాది వ్రతములు జప ఉపవాసహోమ సురార్చనాదులును ఉపదేశింపబడినవి.

యజ్ఞప్రక్రియ భారతీయులు అనాదినుండి అఖండమైన ఆధిభౌతిక - ఆధిదైవిక - ఆధ్యాత్మిక విజ్ఞానములతో పరిశోధించి కనుగొన్నట్టియు, ఇంకను నవీన వైజ్ఞానికులు సంపూర్ణ పరిశోధనము గావించి తెలిసికొనవలసియున్నట్టిదియు నైన ఒక సర్వ శాస్త్ర సమగ్రమై ప్రేయశ్శ్రేయస్సులను అనగా ఐహికాముష్మిక సుఖములనన్నింటిని సాధించు విశిష్ట ప్రక్రియ. యజ్ఞ కుండ నిర్మాణము సూక్ష్మమై విశ్వ వైశాల్యమునకు సమసంబద్ధము. దక్షిణాగ్ని గార్హపత్యము ఆహవనీయము అను త్రేతాగ్నులు అందు హోమము జేయబడు ద్రవ్యములు ఔషధములై భౌతికముగను, రాసాయనికముగను, ఋగ్యజుస్సామాథర్వణ మన్త్రపూతములై యాధ్యాత్మికముగను, సర్వ ప్రకోపముల నుశమింపజేసి

సర్వేష్టకామ్యములను గూర్చుటతోబాటు విశ్వ జనులకు సద్బుద్ధినిచ్చి విశ్వ కల్యాణమును గూర్చును. అవి సర్వ ప్రకాశములైన విశిష్ట ప్రయోగశాల లన వచ్చును (Open Laboratories) స్వర్లోకోద్దేశ్యములైన జ్యోతిష్టోమాదులు, కామ్యములైన పుత్ర కామేష్టి - మొ. అభిచారికములై నశ్యేనయాగాదులు మానవ ప్రకృతి ప్రకోపశమన ధర్మ ప్రక్రియలకు ఉదాహరణములు.

దోమలబాధను నివారించుటకు దోమలకు తెరగట్టక మనచుట్టే తెరగట్టు కొందుము గదా! ఎండ వానలకు గొడుగుబట్టక మనకే గొడుగుబట్టుకొందుముగదా! అట్లే బాహిర ప్రాకృతిక ప్రకోపములు మన యాంతర ప్రకృతికి ప్రకోపము లను గలిగింపకుండుటకై ఆయా కాలములలో వ్రతోత్సవాదులను జేసికొందుము. చైత్రారంభమున నింబ కుసుమభక్షణము, మకర సంక్రమణమున తిలగుడ భక్షణము అతప - శీతప్రకోపములశమింపజేసి సమశీతోష్ణతను మన యాంతర ప్రకృతిలో నెలకొల్పును. వర్షారంభమున చాతుర్మాస్య వ్రతోపవాసములు కలరా మొదలగు వానిని దప్పించును. వ్రతమనగా వృణోతి తన నావరించును. లోపలనున్న సమతకు భంగము గలుగనీయదు. వారయతి=వెలుపలినుండి వచ్చు రోగ క్రిములను వారించును. రానీయదు. కావున వ్రతమయినది. కావున ఇవి యాత్మ రక్షణకు ధరించిన కవచములవంటివి. ఇవి ఆయా అయన - మాస నక్షత్ర - తిథివారములను అనుసరించి చెప్పబడుచున్నవి. అనగా, ఆ దినములలో సూర్యచంద్రుల ప్రభావము ముఖ్యముగను, గుర్వాదిగ్రహముల ప్రభావము విశిష్ట సమయములలోను, మంచిదిగనో చెడుగనో ఉండును.

ఆ ప్రభావముల మంచిని గ్రహించి, చెడును వారించునట్టి ఆయా వ్రతములు నిబంధింపబడినవి. ఉదాహరణమునకు శ్రీ సిద్ధి వినాయక చతుర్థీవ్రతము. అందులో చెప్పబడిన 21 పత్ర పుష్పములు ఔషధప్రాధాన్యము గలవి. తుమ్మ, మారేడు, గరిక, జిల్లేడు, ఉత్తరేణు, కమలములు, శమీ మొదలగునవన్నియు వర్షాకాల సంబంధి వ్యాధులకు దగిన యౌషధములే. భూతసంబంధములైన పైశాచికాది ప్రభారములకు గూడ గాణేశ మన్త్రయన్త్రతన్త్రములు సుసిద్ధశక్తి ప్రక్రియలు. బౌద్ధికవ్యాధులకు తిరుగులేని శోధనప్రక్రియ సిద్ధిబుద్ధి గణేశోపాసన.

ఇవికాక కేవలాధ్యాత్మికప్రాధాన్యములైన ఏకాదశీ వ్రతములు మాస చతుర్దశి మొ॥ శివరాత్రి వ్రతములు ఆదిత్యాది శన్యంత వారవ్రతములు చెప్ప బడినవి.

మానవుడు సంఘజీవి. తాను చేయు పని తనకును, తన సంఘమునకును సత్ఫలితము నిచ్చునదిగా నుండవలెను. అట్లే మానవ సంఘము కూడా తాను జేయు పని సంఘమునకును, సంఘములోని ప్రతి వ్యక్తికిని ఏ హానిని కలుగ నీయని సత్ఫలితము నీయవలెను. అప్పుడే సంఘజీవియైన మానవుని పని గాని, వాని సంఘపు పని గాని ధర్మమనబడును. ఈ రెండు విధములైన ధర్మములే పునః పునః పరిశోధితములై ఆశ్రమధర్మములు-వర్ణధర్మములుగా రూపొందినవి.

వర్ణములు బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్రరూపములు. ఇవి రాజ్యతంత్రము సర్వసుభిక్షమై సర్వసమృద్ధముగా ధర్మార్థకామ మోక్షరూపమైన పురుషార్థ సాధనముగా నిబంధింపబడినవి. విజ్ఞాన ప్రధానజాతి - శత్రుజైత్రమై-స్వ-ఆత్మీయరక్షణపాటవ ప్రధాన జాతి - కృషి వాణిజ్య గోరక్షా నిర్వహణ ప్రధాన జాతి-బ్రహ్మ, క్షత్రియ, వైశ్య కర్మలనన్నింటిలో నన్ని విధముల సేవలే ప్రధానమైన జాతి. వీరు నిర్వహించు పనులు పరస్పర సర్వ సుఖసంపత్ప్రదములే కాని మాతుకములు గావు. కావుననే ధర్మములైనవి. అనగా చాతుర్వర్ణ్య సార్వత్రిక రక్షణమే సర్వవర్ణ ధర్మపరమార్థమన్నమాట. అట్లుకానిచో అది స్వార్థ మగును అది పరార్థభంజకముగాన ఎవరికివారు త్యజింతురేకాని ఆచరింపరు. ఇందులో రహస్యమేమియు నుండదు. ప్రతివాడు తన ధర్మమును నిర్వహించి, ఇతర ధర్మములదెలిసికొనవచ్చును. భారతమున ధర్మవ్యాధు డుదాహరణము.

ఇక ఆశ్రమధర్మము, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ(భిక్షు) సన్యాసములు 4 మానవుని యాశ్రమములు. ఇవి ఆధ్యాత్మిక మోక్షైక లక్ష్యమై వైయక్తికమైన సునిశ్చిత సుసమగ్ర సోపాన మార్గము. బ్రహ్మచర్యము అనగా అవివాహితుడై జ్ఞానోపార్జనచేయుట చాతుర్వర్ణ్యమున నుండును. ఒక్క శూద్రజాతిలో ఉపనయన సంస్కారముండదు. అంతమాత్రమున శూద్రజాతి తక్కువయని భావింపరాదు. జ్ఞానమార్జించుటకు సర్వులకధికారముండును. మహాభారతములో ఏకలవ్య ధర్మవ్యాధు లుదాహరణములు. అట్లే స్త్రీలకు గూడ. గార్గి మొ. ఉదాహరణము. గృహస్థాశ్రమము వివాహిత జీవనము. ఇది చాతుర్వర్ణ్యమున నుండియే యున్నది. ఇక వానప్రస్థ - సన్న్యాస (భిక్ష) ఆశ్రమములు శూద్రజాతికి సంస్కార పూర్వకముగ లేవు. తక్కిన త్రివర్ణములకివి సంస్కారపూర్వకముగ నున్నవి. అంతియే భేదము. "చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ'' అని

శ్రీశంకరులన్నారు కదా! పరిశీలింపగా ఈ నాలుగాశ్రమములలో గృహస్థాశ్రమము వైయక్తికమగుచునే తక్కిన యాశ్రమములకు మూలమును పోషకమును అగుచున్నది. గార్హస్థ్యము లేనినాడు బ్రహ్మచారికి వానప్రస్థ సన్యాసులకును జన్మలే యుండవుగదా! కావున "(సర్వేషాం) గృహస్థోయోనిర్ ప్రజనత్వాత్" అని గౌతమ స్మృతి యన్నది. ఈ వివాహిత జీవనములోని ధర్మములు కూడ గార్హస్థ్య ధర్మములకు తక్కిన యాశ్రమ ధర్మములకును సహకారములుగనే యుండునుగాని ఘాతుకములు గావు.

వానప్రస్థము సన్యాసాశ్రమమునకు సాధనమగు అనాసక్తత వైరాగ్యములను సాధించు ఆశ్రమము. ఇందు వనవాస మృణ్మయపాత్ర భోజనము సాంసారిక సర్వస్వ త్యాగము ధర్మములు. ఆ తరువాతి సన్యాసము సర్వసంగ పరిత్యాగము. ఆత్మైక చింతనము. ఈ రెండాశ్రమములు, ఉన్నవారు తమ స్థానములను వదిలి, వచ్చువారికి ఆ స్థానముల నందునవకాశమిచ్చుటకును మోక్ష ప్రాప్తికిని ఉద్దేశించినవి.

ఈ ఆశ్రమ ధర్మములలో ముఖ్యముగా గృహస్థాశ్రమములో తమ సంతానమునకు నిర్వర్తింపదగిన 16 సంస్కారములు గలవు. అవికూడ శిశువు గర్భమున ప్రవేశించుట మొదలుకొని వాని వివాహపర్యన్తము క్రమముగా జేయదగిన సంస్కారములు. సంస్కారములనగా శారీరకముగను, మనోబుద్ధ్యాత్మకముగను ఉన్న దోషములను సరిదిద్ది శరీర మనోబుద్ధ్యాత్మలను సుశక్తములుగా జేయునవి. అవి : 1. గర్భాదాన, 2. పుంసవన, 3. సీమన్తోన్నయన, 4. బలి, 5. జాతకర్మ, 6. నామకరణ, 7. నిష్క్రమణ, 8. అన్నప్రాశన, 9. చౌల, 10. ఉపనయన, 11. మహానామ్నివ్రత, 12. మహావ్రత, 13. ఉపనిషద్వ్రత, 14. గోదానవ్రత, 15. స్నాతక, 16 వివాహములు అంగిరసుడు మొత్తము సంస్కారములు పుట్టుట మొ. గిట్టుట వరకు 55 అన్నాడు. (ఇవి బ్రహ్మకర్మ సముచ్చయములో నీయబడినవి.) అందులో ఇప్పటికిని పాటింపబడుచున్నవి పైన దెలిపిన 16 సంస్కారములు.

ఇవికాక వాపీకూపతటాక దేవాలయోద్యానాది జనసంఘోపయోగి ధర్మములనేకములున్నవి. ఇవికూడ ఐహికాముష్మిక సుఖలక్ష్యములుగనే నిబంధింపబడును.

భారతీయ ధర్మశాస్త్రములో మానవుడు జీవించియున్న సందర్భమున నాచరింపదగిన ధర్మముల విచారమెంతయున్నదో - అంతకన్న నింక కొంచె మెక్కువగనే కాని, ఏమాత్రము తక్కువ గానంతగా మానవుడు మరణించిన సందర్భముగా జేయదగిన ధర్మముల విచారముగలదు. కారణమేమైయుండును?

భారతీయ తాత్త్విక పరిశోధన ననుసరించి మరణము అనగా జీవి శరీర మును మాత్రమే విడచుట. శరీరియై చేసిన పుణ్యపాప సంస్కారములను ఆ జీవి తన వెంటనే యుంచుకొని, ఆ పుణ్యపాప ఫలితముల ననుభవించుటకై మరు జన్మల నెత్తును. పుణ్యపాపానుగుణముగా కీటాది రాజజన్మలెత్తుచుండును. మానవుడు జీవించియుండు సమయము సామాన్యముగా 100 ఏండ్లు. కాని మర ణించిన యా మానవజీవి (మరల మరల అనేక జన్మల నెత్తుచుండుట తెలియదు గావున) సమయ మనన్తము. కావున మృత పితరుల శాశ్వతబ్రహ్మలోకావాప్తికై శ్రాద్ధధర్మ ప్రక్రియలో శ్రద్ధాతిశయము చూపబడియుండవచ్చును. భారతీయులే కాదు-ప్రపంచ జాతులన్నియు మానవుని మృతదేహ సంస్కారములలో వేర్వేరు సమాధుల (పిరమిడ్స్) నిర్మాణార్చనాదుల ద్వారా శ్రద్ధాతిశయమును జూపిన వనవచ్చును.

ఈ విషయమున నవీన శాస్త్రీయ పరిశోధనము (ఆయా జాతీయ ధర్మ శాస్త్ర సమోధ్యతో) జేసినచో అనేక తాత్త్విక విషయములు స్పష్టమగు నను కొందును.

అనాదియైన భారతీయ ధర్మ చరిత్రలో కృతయుగమున తపస్సు, త్రేతాయుగమున జ్ఞానము, ద్వాపరయుగమున యజ్ఞము, కలియుగమున దాన మును ధర్మములైనవి. అనగా కృత త్రేతలు జ్ఞానయోగమును ద్వాపరకలులు కర్మయోగమును ధర్మములుగా నిర్వహించినవి. శాన్తిపర్వము రాజధర్మ - ఆపద్ధర్మ - మోక్షధర్మ పర్వములతో నుండుటచేతను, అనుశాసన పర్వము దానధర్మ పర్వముగా జెప్పబడుటచేతను ధర్మ (దానధర్మము దేవతోద్దేశ్యేన ద్రవ్య త్యాగరూపయాగము) అర్థ - కామ (రాజధర్మము) మోక్ష (మోక్షధర్మ) ములు నాలుగును ధర్మముగనే మహాభారతము సమ్మతించి నిరూపించినట్లు స్పష్టమగును. కావుననే ధర్మము వేదవిహితమై సుకర్మ (సుకృత) రూపమై

కామదమై (వృషము) మోక్ష(శ్రేయస్) రూపమై న్యాయాచార యజ్ఞనిగ్రహ రూపమైనదని అమరుడు సర్వధర్మ సంగ్రాహక నిర్ణయముగా వివరించినాడు.

"జానామిధర్మం నచమే ప్రవృత్తిః, జానామ్యధర్మం నచమే నివృత్తిః, ఏకేనదేవేన హృదిస్థితేన యథానియుక్తోఽస్మితథాకరోమి - అన్నట్లు స్వేచ్ఛగా నడచుచు ధర్మశాస్త్ర నిర్ణీత ధర్మముల నమ్మి యెవరాచరింతురు? అన్న ప్రశ్న వచ్చును. కావున ధర్మమనగా ధరింపబడి తనను, ఇతరులను రక్షించునది ధర్మ మని యీ ధర్మశాస్త్రములు నిరూపించిన విధమును వారికి హృదయంగమమగు నట్లు చేసినచో వారు తప్పక ఆచరింతురు. మొన్నమొన్నటి దాక యోగము నమ్మనివారు ఇపుడు యోగాభ్యాసమునకు ఊనుకొనుట లేదా? అట్లు కానిచో ఈ ధర్మముల నాచరింపజేయు కర్తవ్యభారము రాజుపై నున్నది మహాభారతము:

కాలోవాకారణం రాజ్ఞః రాజావాకాలకారణమ్
ఇతితే సంశయో మాభూత్ రాజాకాలస్య కారణమ్. మ.భా.శాన్తి 69.79

దండనీత్యాం యదారాజా సమ్యక్కార్త్స్న్యేన వర్తతే
తదాకృత యుగం నామ కాలసృష్టం ప్రవర్తతే. మ. భా. శాన్తి 69.80

రాజే తన దండనీతిని పూర్తిగా ప్రయోగించి ప్రజలను సర్వానుకూల (అప్రతిరోధ) స్వధర్మ ప్రవర్తనులజేసి యేకాలమునైనను కృతయుగముగా జ్ఞానయోగ ధర్మవర్తులను జేయగలడని చెప్పినది. సామాన్యముగా కాలము రాజులను మార్చును. కాని, దండనీతితో రాజు కాలము (సత్కాలము)ను సత్య యుగకాలముగా మార్చగలడనుట తథ్యము. ప్రస్తుత కాలమున ప్రజా రాజ్యమున ప్రజలే రాజులు గావున వారే దండనీతిని "ఓటు"తో ప్రయోగించి స్వధర్మములు నాచరింపబడునట్లు చేయగల ప్రభుత్వముల నెన్నుకొనవలసి యున్నది. కావుననే భారతీయ ధర్మశాస్త్రము లన్నియు ప్రాంతీయ భాషలలో ననువదింపబడవలసి యున్నది. దానివలన ప్రజలందరు ధర్మజ్ఞులై ప్రజారాజ్యమును నిష్కలంక స్వధర్మ రాజ్యముగా జేయగలుగుదురు.

ఆ ప్రణాళికలోనే శ్రీమాన్ డా॥ కిళాంబి నరసింహాచార్యులుగారు కమలా కరభట్ట కృతమై ఆసేతు శీతాచల మాదరింపబడిన ప్రాచీన ధర్మశాస్త్ర గ్రంథ

మైన "నిర్ణయ సింధు" గ్రంథమును చక్కని శిష్ట వ్యావహారి కాంధ్రభాషలో ననువదించినారు. అనేక సంశయ వాదవివాదములతో గూడిన ధర్మ నిర్ణయములు గల సంస్కృత నిర్ణయ సింధువు ననువదించుట సామాన్యము గాదు. దాని కసాధారణ సంస్కృత ధర్మశాస్త్ర పాండిత్యము, దానికి ఆధారములైన వైదిక విజ్ఞానము, దానికి గావలసిన మీమాంస శాస్త్ర విజ్ఞానమును అవసరములు. ఆయుర్వేద విద్వాంసులైన కిళాంబి శ్రీనివాసాచార్యుల పుత్రులైన శ్రీ నరసింహా చార్యులు గారు సర్వశాస్త్ర సాహిత్యతత్త్వవిజ్ఞాన విధానమైన వేదాంతవర్ధినీసంస్కృత కళాశాలలో సర్వ శ్రీమాన్ శఠగోప రామానుజస్వామి కడను, శ్రీమాన్ వంగీ పురం రామానుజాచార్యులుగారు, శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులుగారు మొదలగు విద్వచ్ఛిరోమణుల దగ్గర తమ శాస్త్రీయాధ్యయనము జేసిరి. సాహిత్య B.O.L, M A. తెలుగు పట్టముల నందిరి. హరిజనులు శ్రీ వైష్ణవ సాంప్ర దాయిక కీర్తనలుగా పాడునట్టి "తిరు నామము"లను గ్రంథముగా సంకలనంజేసిరి. ఆ తిరు నామములనే విషయముగా దీసికొని పరిశోధనము గావించి కాకతీయ విశ్వవిద్యాలయమునుండి 1980 లో Ph.D పట్టమును గూడ పొందిరి. 1970 నుండి డిగ్రీ కళాశాలలో ఉపన్యాసకులై, ప్రస్తుతము సంగారెడ్డి డిగ్రీ కళాశాలలో రీడరుగా పనిచేయుచున్నారు. వీరు మెదకు జిల్లా దొంతి గ్రామవాసులు. దొంతి శివం పేటలు ప్రాచీనకాలమునుండియు బహు పండితుల నివాసగ్రామములు.

మూల సంస్కృత నిర్ణయ సింధువును రచించిన కమలాకరభట్టు క్రీ శ. 17వ శతాబ్దివాడు. వీరిది భట్టవంశము, ఉత్తరోత్తర విద్వత్తముల కాలవాలము, మూలపురుషుడు ఆశ్వలాయన శాఖీయుడు గోవిందభట్టు, పుత్రుడు రామేశ్వర భట్టు (కాశీవాసి). ఈతని పుత్రుడు నారాయణభట్టు. యవనులు విశ్వనాథ మంది రమును ధ్వంసముజేసి కరువు కాటకములను సృష్టింపగా ప్రాయోపవేశముజేసి కరువు కాటకములు పోగొట్టి తిరిగి యవనులు విశ్వనాథ మందిర నిర్మాణము జేయునట్లు చేసిన దైవ ప్రభావశాలి. జగద్గురువై ప్రయోగ రత్నాకరము (నారాయణ భట్టీయము) (ద్విజ సంస్కార బోధకము) త్రిస్థలి సేతువు - అను గ్రంథములు వ్రాసెను. ఈతనికి రామకృష్ణభట్ట శంకరభట్టులు ఇద్దరు పుత్రులు అందులో రామకృష్ణభట్టు బహు గ్రంథకర్త. తంత్ర వార్తిక వ్యాఖ్య, జీవత్పి తృక నిర్ణయము, ద్వైత నిర్ణయము మొదలగునవి. ఈతనికి దినకరభట్ట - కమలాకరభట్ట - లక్ష్మణ భట్టులు పుత్రులు. దినకరభట్టు భాట్టదినకరము -

ఉద్యోతము - (మీమాంసా శాస్త్ర సంబంధములు), శాన్తిసారము (ధర్మశాస్త్రం) గ్రంథములను వ్రాసెను. ఈతని పుత్రుడు విశ్వేశ్వరభట్టు గ్రంథములు కాయస్థ ప్రదీపము, భట్ట చింతామణి మొ॥ లక్ష్మణభట్టు ఆచార రత్నాది గ్రంథములను వ్రాసెను.

కమలాకర భట్టు 20-22 గ్రంథములను వ్రాసెను. నిర్ణయ సింధువు, దానకమలాకరము, పూర్తకమలాకరము, శాన్తికమలాకరము, వ్రతకమలాకరము, కమలాకరాహ్నికము, శూద్రకమలాకరము, సర్వతీర్థవిధి- ఇవి లభించిన ధర్మశాస్త్రములు, న్యాయ వ్యవహార (Law) సంబంధి వివాద తాండవము, సాహిత్యామున కావ్యప్రకాశటీక - ఇవి కమలాకరభట్ట వంశీయులు వ్రాసిన ధర్మశాస్త్ర గ్రంథములు. నిర్ణయ సింధువు అప్పటికున్న ధర్మశాస్త్రములన్నింటిని పరిశీలించి ధర్మనిర్ణయములు చూపిన గ్రంథము. ఇందు దాదాపు 100 స్మృతి గ్రంథములు, 300 లకు మించిన గ్రంథకర్తలు నుట్టంకింపబడిరి. ఈ కమలాకర భట్టే ఛత్రపతి శివాజీ పట్టాభిషేకమును నిర్వహించెనట.

భారతీయాచార వ్యవహారములను గూర్చి వందలకొలది గ్రంథములు వెలసిన యా కాలమున భారతీయాచార వ్యవహారములను సుసూక్ష్మేక్షణికతో పరిశీలించి ప్రేయశ్శ్రేయోనుగామిగా నిర్ణయ గ్రంథముల నెప్పటికప్పుడు రచించి ప్రకటించెడి వారని తెలియుచున్నది. వైదిక పౌరాణిక ధర్మాచార వ్యవహారముల కిప్పటి మనవారు దూరమగుచుండుటకు కారణము అవి కేవల సంస్కృతభాషలో నుండి ప్రాంతీయ భాషలలో ననువదింపబడకుండుటయే. ఆ లోపము దీర్చు మార్గమున డా॥ కిళాంబినరసింహాచార్యులుగారు పై నిర్ణయసింధు గ్రంథము నందలి ప్రథమ పరిచ్ఛేదమును తెలుగున శిష్టవ్యావహారిక భాషలో సుస్పష్టముగా ననువదించుట ముదావహము. ఈ ప్రథమ పరిచ్ఛేదమున సంవత్సర - అయన - మాస-ఋతు-సంక్రాన్తి-మలమాస - తిథి(ప్రత్యేకముగ ఏకాదశి)- వ్రత-ఇష్టి-పితృయజ్ఞ-(శ్రాద్ధ) గ్రహణ-సముద్ర నద్యాదిస్నాన నిర్ణయములు గలవు. ద్వితీయ పరిచ్ఛేదమున చైత్రాది మాసముల వారీగా తిథినక్షత్ర వ్రతోత్సవాదుల నిర్ణయములు గలవు. తృతీయ పరిచ్ఛేదమున పూర్వార్థమున సంస్కారములు వాపీ కూపదేవ ప్రతిష్ఠలు గృహాది నిర్మాణములు, ఉత్తరార్థమున శ్రాద్ధ-జాతమృతాశౌచ-సతీకృత్య సన్యాసములు నిర్ణయింపబడినవి.

శ్రీ నరసింహాచార్యులుగారు త్వరలో తక్కిన పరిచ్ఛేదములననువదించి యాపదాంధ్రదేశమున భారతీయులందరు భారతీయ ధర్మాచార వ్యవహారముల వైశిష్ట్యమును దెలిసి వానియందు సాదర ప్రవర్తనులగునట్లు చేయుదురని విశ్వసించుచున్నాను. బాగుగా విచారించి చూచినచో నిర్ణయసింధు ప్రథమ పరిచ్ఛేదము తక్కిన పరిచ్ఛేదముల సంగ్రహరూపమే యనదగును. అనువాదకర్త యీ కృషి సంస్కృతములోనున్న సకల ధర్మశాస్త్ర గ్రంథముల యాంధ్రానువాదమునకు రాజమార్గము వేయుగాతయని యా ధర్మస్వరూపియగు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ధర్మమేవ జయతే

తేజస్వినావధీతమస్తు - మా విద్విషావహై

ఇట్లు
బుధజనవిధేయుఁడు

మూలంపల్లి చంద్రశేఖర శర్మ
165/SRT సైదాబాదు కాలనీ,
హైదరాబాదు - 500 059.

స్వస్తి యువ శ్రావణ శుద్ధ దశమి
భానువాసరము 6-8-1995

Dr. C·V.B. SUBRAHMANYAM
M.A. Tel, M.A. Skt. Ph.D.
Dept. of ASTROLOGY & VASTU
TELUGU VNIVERSITY
Public Garden, Hyderabad - 500 001.
Visiting Prop: Astrology Maharshi Vedik University
Holland & U.S A.

# ధర్మో రక్షతి రక్షితః

మన ధర్మాన్ని మనం ఆచరిస్తే మనని అది కాపాడుతుంది. గీతాచార్యుని బోధనలో స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః అనే వచనం స్వధర్మాచరణ విషయంలో ఉండవలసిన పట్టుదలను వ్యక్తీకరిస్తోంది. వేద వేదాంగ వేదాంతాలన్నిటికి, సారాంశభూతమైన ఆణిముత్యం ఆ పలుకు. కొందరు తెలియనివారు ఎరుగని పాపం యేట్లో కలుస్తుందని నానుడి సృష్టించారు. తెలిసి ముట్టుకున్నా, తెలియక ముట్టుకున్నా నిప్పు కాలడం ప్రకృతి సహజం. చట్టం నాకు తెలియదు కాబట్టి తప్పు చేశానంటే చెల్లుతుందా? ధర్మాచరణ చేయదగిన జన్మను పొంది ధర్మం తెలిసికోకపోతే, తెలుసుకోవలసిన అవసరం లేని జన్మను (పశు, పక్ష్యాదులు) పొందుతారన్నారట, ధర్మమే మూర్తీభవించిన శ్రీరామ చంద్రుడు.

మనకు ధర్మశాస్త్ర గ్రంథాలన్నీ సంస్కృతంలో ఉన్నాయి, సంస్కృతం అధ్యయనం చేసేవారి సంఖ్య నానాటికి తగ్గుతోంది. ఈ ధర్మశాస్త్రాలు మాతృ భాషలలో ప్రచారం కావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ అవసరాన్ని తీర్చడం కోసం భగవానుడు శ్రీమాన్ కిడాంబి నరసింహాచార్యుల వారి మనసును ప్రేరేపించాడు. ఉత్తమమైన 'నిర్ణయ సింధువు'ను ఆంధ్రభాషలో అందించడానికి వారు ప్రయత్నం ఆరంభించారు. నిర్ణయసింధువులో సమగ్రమైన ప్రమాణ పరిశీలన కమలాకరభట్టు చేశారు. ఆసమగ్రతకు భంగం కలుగకుండా నరసింహాచార్యుల వారు అనువదించారు. అనువాదం ఒక ప్రత్యేకమైన కళ. బాణంతో

లక్ష్యచ్ఛేదనకంటే మొదటి బాణం గుచ్చుకున్న ప్రదేశంలోనే రెండవ బాణం తగిలేలా వేయడం చాలా కష్టం మూలార్థం భంగపడకుండ అనువాద రచన అలాంటిది. జ్యోతిశ్శాస్త్ర ప్రవక్తలలో ధర్మశాస్త్ర కర్తలు దర్శనమిస్తారు. అంటే జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులంతా జ్యోతిశ్శాస్త్ర గ్రంథకర్తలు కారు. ధర్మశాస్త్ర కారులు కాలానుగుణమైన క్రియ ప్రేరణను కలిగిస్తే కాల సంబంధమైన పరిజ్ఞానము జ్యోతిషమందిస్తోంది. అందుచేత ధర్మశాస్త్రకర్తలు కూడా జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులైనారు. మన ఆచార్యులవారు జోతిశ్శాస్త్రాంశాలను, ధర్మశాస్త్రాంశాలను - మూలానుసారిగా అనువదించారు. ఆంధ్రులకు అందుబాటులోకి తెచ్చి భగవంతుని ప్రేమకు పాత్రులైనారు. వారి రచనలు చదవడంద్వారా మన కర్తవ్యాలను తెలుసుకొని స్వధర్మాన్ని ఆచరించి ధర్మబద్ధమైన రక్షణ పొంది పురుషార్థపరులమవుదామని ఆశిస్తున్నాను.

# నా 'తిరునామము'లను (1983) సంకలన గ్రంథాన్ని గూర్చిన పెద్దల అభిప్రాయాలు కొన్ని

1) సంప్రదాయం దేనికి చెందినదైనా దాన్ని పరిరక్షించటం, ప్రచారం చేయటం అత్యవసరం. పాటలు మత సంప్రదాయంలో విడదీయరాని భాగం. పాటలు ప్రచారమున కనువైన ముఖ్య సాధనం. నేటివరకు మౌఖికంగానే "తిరునామములు"గా ప్రచారములోనున్న వైష్ణవ భక్తి గీతాలను ఆచార్యులు గ్రంథముగా ప్రకటించారు. ఈ పాటల్ని క్యాసెట్ల రూపంగా కూడా రికార్డుచేసి ప్రజల్లోకి తీసుకొనిరావాలి. జాతి మత భేదములేక పాడుకొనబడు ప్రేమ, భక్తి భరితములైన ఈ పాటల సేకరణకు వీరు సాగించిన కృషి మిగుల ప్రశంస నీయము.

జనవరి' 83

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరుస్వామివారు

2) తిరునామములు చమత్కారంగా, ఎన్నో వైష్ణవ మత రహస్యాల కాలవాలంగా ఉన్నాయి. సామాన్య భాష, జాతీయఛందం ప్రతివ్యక్తికీ సుబోధ మైన శైలిలో ప్రసన్నంగా వాళ్ళెలా చెప్పారో! ఆ సంప్రదాయమును ఆచార్యులు చాలా చక్కగా గ్రంథస్థం చేశారు.

అనంతపురం,
21-4-83.

ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు

3) సంగీత త్రిమూర్తుల సంగీత సంప్రదాయం అన్నమాచార్య పద పద్ధతులు ప్రకాశంలోనికి రానికాలంలోనే శ్రీ వైష్ణవ సంప్రదాయంలో "తిరు నామా"లనే పేరుగల గేయాలున్నాయి. ద్రావిడ పూర్వాచార్యులు ప్రసాదించిన ప్రబంధాలలోని సారం అంతా తిరునామాలలో సవిస్తరంగా ప్రతిపాదించారు. అర్థమహిమ, తగిన సంగీత వస్తువు, తాళవిన్యాసాలు, పదబంధంలో నేర్పయిన కూర్పు, అంత్యప్రాసాది కవితా సౌందర్యాలు అన్నీ వీటిలో ఉన్నాయి. సాహిత్య పరంగా అన్నీ మేలుబంతులే. ఈ మధ్యనే వీనిని సేకరించి ప్రచురించిన కిడాంబి నరసింహాచార్యుల కృషి ప్రశంసనీయము.

విజయవాడ
3-7-83

శ్రీ నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్య

4) తమిళనాడులో విశేష వ్యాప్తిలో నుండె తమిళ దివ్య ప్రబంధములవలె తెలుగులో ఎక్కువ భాగం ముఖస్థంగానే వ్యాప్తిలో యుండేవి "తిరునామములు". వీనిని మొదటిసారిగా అచ్చులోకి తెచ్చిన సంపాదకుల కృషి అభినందనీయము.

శ్రీ చ. రాజేశ్వరశర్మ
(ఆంధ్రపత్రిక)

10-7-84

5) 'తిరునామములు' జనసామాన్యానికి అర్థమయ్యే రీతిలో తెలుగులో వేదాంత రహస్యాల్ని బోధిస్తున్నాయి. వీనిని సేకరించిన నరసింహాచార్యులు అభినందనీయుడు.

జనవరి 83
సీతారాంబాగ్,

శ్రీ మరింగంటి శ్రీరంగాచార్య

6) ఒకనాడు దేశాన్ని పాలించిన సంకీర్తనాపద సంప్రదాయంలో ఒక మేలిమిభాగాన్ని "తిరునామములు అను ఈ గ్రంథం ఆవిష్కరించినదనడంలో సందేహం లేదు. ఆ కష్టభరిత కృషికి బాధ్యులైన సంకలనకర్త అభినందన పాత్రులే.

ఆగస్టు '83

శ్రీ సోమసుందర్
(భారతి)

# నా తిరునామములు - సమగ్ర పరిశీలన అను సిద్ధాంత గ్రంథాన్ని గూర్చిన పెద్దల అభిప్రాయాలు కొన్ని

1) శ్రీ విష్ణు సంబంధమైన స్తుతి పరక గీత వాఙ్మయాన్ని 'తిరునామములు' పేరుతో ఎత్తి చూపుతూ శ్రీ వైష్ణవ ధర్మాలను సోదాహరణంగా సంఘటించారు. శ్రీ వైష్ణవ స్వరూప స్వభావాలను నిశ్శంకంగా తెలుసుకోవాలనేవారికి యీ గ్రంథం సువిమలాదర్శం.

యామిజాల పద్మనాభస్వామి
(భారతి, జూన్ '85)

2) ఈ గ్రంథరాజము వైష్ణవలోకమున నొక క్రొత్త వెలుగును ప్రసాదింపగలదనుట నిశ్చయము, ఈ గ్రంథ రచనలో వీరుచేసిన పరిశ్రమ నిరుపమానము.

గుంటూరు
24-11-84

ధనకుధరం వరదాచార్యులు

3) భగవదారాధనతోపాటు భాగవతారాధన కావించి, ఆచార్య పురుషలనూ, వారి రచనలనూ సేవించి; నిత్యులూ, సత్యవ్రతులూ అయిన తెలుగునాటి గాయకుల ఆలాపనలకు అక్షర రూపం ప్రసాదించి సాధించిన ఈ కృషి ఆంధ్రావళికి ఆనందదాయకం.

చెదురు చెదురుగా ఉన్న సంస్కృతి శకలాలను సమర్థంగా సేకరించి, సరసంగా వ్యాకరించి ఓర్పుతో నేర్పుతో (ఈ రెంటినీ) సాధించినందుకు ఆచార్యులకు హార్దికమైన మా అభినందనాలు.

నాగార్జున నగర్
30-11-84

ఆచార్య తూమాటి దోణప్ప

4) పెక్కు గ్రంథములు పరిశీలించి, ఇతరులవలన విషయమును శ్రమతో సంగ్రహించి రచితమైన ఈ పరిశీలన గ్రంథము విశిష్టాద్వైతులకేకాక తిరునామములనుగూర్చి తెలుసుకొనదలచిన వారికందరిని మిక్కిలి ప్రయోజనకారి.

ఆంధ్రప్రభ "ఆయాన్య"
13-3-85

5) తాము సేకరించిన తిరునామాలను తలస్పర్శిగా పరిశోధించి ఈ సిద్ధాంతవ్యాసం వ్రాశారు. ఈ గ్రంథాన్ని ఇతర భాషల (ఆంగ్లహిందీ) లో అనువదిస్తే చాలా ప్రఖ్యాతి కల్గుతుంది.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక తిరుమల రామచంద్ర
30-11-85

6) కులనిరాస, జాతిని ఒకే త్రాటిపై నడుపుట, భావసమైక్యత, మోక్షకాంక్ష (పుణ్యము, పురుషార్థము) - వీటిని సాధించిన తిరునామములను గురించి తెలుసుకోదలచినవారందరికీ ఈ ఉద్గ్రంథం మణిముకురం.

సప్తగిరి చల్లా రాధాకృష్ణశర్మ
డిసెంబర్ 1985

7) తిరునామములలో విశేషాలను గూర్చి సమగ్ర పరిశోధన గావించి విశేషాలను వెల్లడించి జిజ్ఞాసువుల ఆదరానికి పాత్రులైనారు. శ్రీవైష్ణవమతం గురించి తెలుసుకోవాలనే కుతూహలంగలవారికి మిక్కిలి విలువైన సమాచారం అందించారు. ఈ గ్రంథం సహృదయుల మెప్పును పొందగలదు. సుబోధకశైలి, విషయ వివరణలో నేర్పు యీ పుస్తకంలో మెచ్చుకోదగిన విశేషాలు.

ఆంధ్రజ్యోతి రామమోహనరాయ్
12-7-85

8) ఈ గ్రంథంలో శ్రీవైష్ణవ సిద్ధాంత విషయాలను నూతన పంథాలో చెప్పారు. ఈ సిద్ధాంత గ్రంథానికి మూలమైన తిరునామములను సంప్రదాయబద్ధంగా రికార్డుచేసి క్యాసెట్ల రూపంలో భద్రపరచాలి.

హైదరాబాదు డా॥ దాశరథి
అక్టోబర్ 20-'84 (ఆం.ప్ర. ఆస్థానకవి)

# విషయసూచిక


| క్ర.సం. | విషయం | | పేజి నెం. |
|---|---|---|---|
| | మనవి మాట | .... | iii |
| | ప్రస్తావన | .... | vii |
| | కర్తవ్య సందేశము | .... | x |
| | ధర్మోరక్షతిరక్షితః | .... | xxii |
| | రచయిత పూర్వగ్రంథాల గూర్చి | ... | xxiv, xxvi |
| | విషయసూచిక | .... | xxviii |
| 1. | దైవస్తుతి | .... | 1 |
| 2. | పితామహస్తుతి | ... | 1 |
| 3. | పితృస్తుతి | .... | 1 |
| 4. | మాతృస్తుతి | .... | 2 |
| 5. | భ్రాతృస్తుతి | .... | 2 |
| 6. | పూర్వ ధర్మశాస్త్రకర్తల స్తుతి | .... | 2 |
| 7. | ఆత్మవినయ ప్రదర్శన | .... | 2 |
| 8. | కాలవిభజన | .... | 2 |
| 9. | అబ్దవిభజన | .... | 3 |
| | అ) మాధవ మతం | .... | 3 |
| | ఆ) హేమాద్రి మతం | .... | 3 |
| | ఇ) మలమాస మతం | .... | 3 |
| | ఈ) అబ్దనామాలు | .... | 3 |
| | ఉ) ప్రభవాది నిర్ణయము | .... | 4 |
| 10. | అ) ఆయన నిర్ణయము | .... | 5 |
| | ఆ) వీని వినియోగం | .... | 5 |
| | ఇ) ఉత్తరాయణంలో చేయాల్సినవి | .... | 6 |
| | ఈ) కాశీలో విశేషం | .... | 6 |
| 11. | అ) ఋతు నిర్ణయం | .... | 6 |
| | ఆ) దీని వినియోగం | .... | 7 |
| | ఇ) వీని పేర్లు | .... | 7 |
| 12. | అ) మాస నిర్ణయం | .... | 7 |
| | ఆ) సంక్రాంతి నిర్ణయం | .... | 8 |
| | ఇ) కమలాకరాదుల మతం | .... | 8 |

ఉ) సంక్రాంతిలో దానవిశేషాలు .... 10
ఊ) సంక్రాంతిలో ఉపవాస నిర్ణయిం .... 11
ఎ) పుత్రులుగల గృహస్థు ఉపవసించరాదు .... 11
ఏ) సంక్రాంతిలో శ్రాద్ధం .... 12
ఐ) విష్ణువదస్వరూపం .... 13
ఒ) పిండరహిత శ్రాద్ధం .... 14
ఓ) మంగళకార్యాల్లో విశేషం .... 14
ఔ) గౌడుల మతం .... 17
క) చాంద్రాదిమాస నిర్ణయం .... 18
ఖ) మలమాసము .... 20
గ) అధికమాస కాల నియమం .... 21
ఙ) క్షయమాసం .... 21
చ) క్షయ ఆగమన కాలం .... 23
ఛ) మలమాసంలో చేయాల్సినవి .... 25
జ) మలమాసంలో చేయకూడనివి .... 32
ఝ) క్షయమాసంలో మరణించినవారి ప్రత్యాబ్దిక విషయంలో విశేషం .... 33
ట) బాల్యాది లక్షణం .... 36
ఠ) బాల్యాది పరిమాణం .... 36
డ) వీని నిర్ణయం .... 36
ఢ) దేశాన్ననుసరించి .... 36
ణ) అస్తాదులకు అపవాదం .... 37
త) మలమాసంలో వ్రతవిశేషం .... 38
పక్ష నిర్ణయము .... 39
అ) తిథి వేధాది నిర్ణయము .... 39
ఆ) తిథి విశేషంలో వేధ విశేషము .... 40
ఇ) కర్మకాల వ్యాపిని తిథి విచారం .... 41
ఉ) మంగళకార్యాల్లో ప్రతిపదాది విచారం .... 42
ఊ) ఖర్వాదర్ప హింసలు తిథిపరమైతే విచారం .... 43
ఏక భక్తము .... 44
అ) నక్తము .... 45
ఆ) హరినక్తంలో విశేషం .... 47

17. అ) నక్షత్ర వ్రతకాలము .... 48
ఆ) వ్రత పరిభాషా .... 48
ఇ) ఇక్కడ విశేషం .... 51
ఈ) అన్ని వ్రతాల్లో సంకల్పవిధి వివరణం .... 51
ఉ) వ్రతారంభ కాలం .... 51
ఊ) భద్రగూర్చి .... 52
ఎ) వ్రతారంభంలో విశేషం .... 54
ఏ) ప్రతిమాస్వరూపం .... 57
ఐ) హోమద్రవ్య విచారం .... 57
ఒ) మంత్రవిచారం .... 57
ఓ) గ్రహాదిహోమవిచారం .... 57
ఔ) బ్రాహ్మణోపవాసంలో విచారం .... 58
క) ఉద్యాపన చెప్పనిచో వివరణ .... 58
ఖ) శక్తిలేనిచో .... 58
గ) అన్నికర్మలలో దక్షిణగూర్చి వివరణ .... 59
ఙ) పరాన్నం తింటే ఫలవిచారం .... 59
చ) క్షారపదార్థాల వివరణ .... 59
ఛ) వ్రతంలో గోధుమాదులగూర్చి వివరణ .... 60
జ) వ్రతం ఆరంభించి వదిలితే వివరణ .... 61
ఝ) కోపంవస్తే ప్రాయశ్చిత్తం .... 61
ఞ) ఉపవాసం చేతకాకపోతే .... 62
ట) వ్రతాల్లో మంచి చెడ్డలు .... 62
ఠ) స్త్రీ వ్రతాల్లో విశేషాభిప్రాయాలు .... 63
డ) స్త్రీ విషయంలో నియమాలు .... 63
ఢ) వ్రతంలో రక్తవస్త్రధారణ విషయం .... 63
ణ) విధవలకు శుక్ల వస్త్రధారణ విషయం .... 64
త) ఉపవాసంలో దంతధావనాదులు .... 64
థa) వ్రతంలో సూతకాదులైతే .... 65
b) కమలాకర మతం .... 66
ద) బహుకాలికసంకల్పంలో వివరణ .... 67
ధa) ప్రతినిధి విచారం .... 68
b) ఇక్కడొక విశేషం .... 70
న) వ్రతాదులు కలిసివస్తే వివరణ .... 71

18. a) ప్రతిపదాది తిథి నిర్ణయం .... 73
b) అన్ని తిథుల్లో వదలాల్సినవి .... 73
c) ద్వితీయాతిథి నిర్ణయం .... 74
d) తృతీయాతిథి నిర్ణయం .... 74
e) గౌరీవ్రతంలో విశేషం .... 74
f) చతుర్థీ తిథి నిర్ణయం .... 75
g) పంచమీ తిథి నిర్ణయం .... 77
h) షష్ఠీ నిర్ణయం .... 78
i) సప్తమీ నిర్ణయం .... 79
j) అష్టమీ నిర్ణయం .... 79
k) శివశక్త్యుత్సవంలో విశేషం .... 79
l) నవమీ తిథి నిర్ణయం .... 80
m) దశమీ తిథి నిర్ణయం .... 80

19. a) ఏకాదశి ఉపవాస నిర్ణయం .... 80
b) శంఖజలపానాది నిషేధం .... 80
c) గృహస్థాదులకు భోజన నిషేధం .... 80
d) ఏకాదశీ వ్రతరూపం, భేదాలు .... 81
e) ఉపవాస నిషేధంలో విశేషం .... 85
f) తినతగినవి .... 85
g) దశమీవేధ విషయం .... 85
h) అరుణోదయం అనగా .... 86
i) మాధవ మతంలో సంపృక్తాదిభేదాలు .... 89
j) దశమీయుక్త ఏకాదశి ఆచరిస్తే ప్రాయశ్చిత్తం .... 90
k) కొందరిమతంలో దశమివేధ .... 92
l) 18 ఏకాదశి భేదాలు .... 97
m) ఇక్కడొక ఉపయుక్తాంశ వివరణ .... 101
n) అధికారి విచారం .... 102
o) ఉపవాసానికి శక్తిలేకపోతే .... 102
p) వ్రతం చేయకున్నచో ప్రాయశ్చిత్తం .... 103
q) కామ్యవ్రతవిధి ప్రకారము .... 103
r) దశమిలో చేయాల్సినవి .... 103

| | | | |
|---|---|---|---|
| s) | వ్రతఘ్నములు | .... | 104 |
| t) | శక్తి లేకున్నచో | .... | 104 |
| u) | వీటికి ప్రాయశ్చిత్తం | .... | 104 |
| v) | ఏకాదశికి శ్రాద్ధంవస్తే | .... | 106 |
| w) | వ్రతాన్ని చెరచనిని | .... | 107 |
| x) | దీనికి అపవాదం | .... | 107 |
| a) | ఏకాదశిలో సంకల్పం | .... | 108 |
| b) | మంత్రము | .... | 108 |
| c) | శైవాదులకు విశేషం | .... | 109 |
| d) | పుష్పాంజలి విచారం | .... | 109 |
| e) | అష్టాక్షరమంత్ర అభిమంత్రిత జలపానం | .... | 109 |
| f) | మాధవమతంలో సంకల్పవిచారం | .... | 109 |
| g) | సంకల్పార్చన విచారం | .... | 109 |
| h) | విష్ణుపూజనలో విచారం | .... | 109 |
| i) | దేవుని ఎదుట జాగరణం | .... | 109 |
| j) | ద్వాదశి నివేదన మంత్రం | .... | 110 |
| k) | బ్రాహ్మణ భోజన విచారం | .... | 110 |
| l) | ఉపవసించి తులసిమిశ్రిత భోజనం చేస్తే హత్యా పాప నివర్తనం | .... | 110 |
| a) | ద్వాదశిలో వదలాల్సినవి | .... | 110 |
| b) | మాటలాడతగనివారితో మాట్లాడినచో | .... | 111 |
| c) | రజస్వలాది శబ్దాలు వ్రతంమధ్యలో వింటే | .... | 111 |
| d) | సూతకం మొదట్లో ద్వాదశీవ్రతం వస్తే | | 111 |
| e) | సూతకం చివర దానాదులు | .... | 111 |
| f) | ఏకాదశిన రజోదర్శనమైతే | .... | 112 |
| g) | శక్తిలేనిచో | .... | 112 |
| | మహాద్వాదశులు - 8 | .... | 112 |
| b) | పారణ విచారం | .... | 114 |
| | ద్వాదశీ తిథి నిర్ణయం | .... | 115 |
| a) | త్రయోదశీ తిథి నిర్ణయం | .... | 116 |
| b) | మాధవమతంలో త్రయోదశి తిథి | .... | 116 |
| | చతుర్దశీ తిథి నిర్ణయం | .... | 116 |

a) పూర్ణిమ - అమావాస్య విచారం .... 116
b) అమాయందు విశేష యోగము .... 116
వ్యతిపాత నిర్ణయము .... 117
a) ఇష్టి కాలము .... 117
b) రెండు రకాల విభాగం .... 117
c) లౌగాక్షి మతం .... 117
d) హేమాద్రి మతం .... 118
e) బౌధాయన మతం .... 118
f) మదన రత్నాది మతం .... 119
g) పౌర్ణమానీలో విశేషం .... 120
h) అమాయందు విశేషము .... 120
i) కాత్యాయనాదుల మతం .... 120
j) శేషపర్వంలో ఇష్టిఐతే విశేషం .... 121
k) యాజ్ఞికుల మతం .... 123
a) వికృతేష్టి కథనం .... 124
b) విశేష కథనం .... 124
c) పశువుయందు, సోమమందు కాలాంతరం చెప్పటం .... 125
d) పశువులో విశేషం చెప్పటం .... 125
a) సాగ్నిక మతంలో అమా నిర్ణయం .... 129
b) వ్యతిరేక కథనము .... 130
పిండ పితృయజ్ఞంలో ఇతరుల మతాలు చెప్పటం .... 131
చంద్రక్షయ కాలము .... 133
సంపూర్ణ దర్శంలో విశేషాన్ని చెప్పటం .... 136
పిండపితృ యజ్ఞం చేయనిచో ప్రాయశ్చిత్తం .... 137
కుతప కాలమనగా .... 138
దర్శంలో వార్షిక శ్రాద్ధాదులు వస్తే .... 139
అమాశ్రాద్ధం అతిక్రమిస్తే ప్రాయశ్చిత్తం .... 140
a) గ్రహణం గురించి .... 141
b) చంద్ర గ్రహణంలో భోజనాదులు .... 141
c) గ్రహణమందు నీళ్ళు తాగితే ప్రాయశ్చిత్తం .... 144
d) వేధాదులున్నప్పుడు భోజనం చేస్తే ప్రాయశ్చిత్తం .... 144

e) చంద్రాదిగ్రహణమందు ఉపవాసాదులతో ఫలం .... 145
f) పారణ విచారం .... 145
g) చూడామణి యోగం గురించి .... 145
h) గ్రహణమందు హోమాదులు .... 145
i) గ్రహణంలో సూతకాదులు .... 147
j) గ్రహణంలో స్నానం చేయకపోతే .... 147
k) గ్రహణంలో గంగాదినదులలో స్నానంగూర్చి .... 147
l) గ్రహణంలో కార్తీకమాసాది స్నానాలగూర్చి .... 148
m) చంద్ర సూర్య గ్రహణాదుల్లో ఫల తారతమ్యము .... 148
n) కూపాదులలో గ్రహణ స్నానం చేసినచో .... 148
o) గ్రహణంలో నద్యాదులలో స్నానంచేస్తే తారతమ్యము.... 148
p) గ్రహణంలో నర్మదాది జలస్పర్శవల్ల పుణ్యం ఎక్కువ ... 148
q) గ్రహణంలో సముద్ర స్నానంచేస్తే ఎంతో గొప్పపుణ్యం.... 148
a) సూర్యచంద్ర గ్రహణ స్నానంవల్ల ఎంతో ఫలం .... 149
b) సూర్యగ్రహణంలో గంగా పుష్కరాది స్నానం చేస్తే .... 149
c) గ్రహణంలో స్నానం సంభవించకపోతే తీర్థస్మరణము.... 149
d) గ్రహణంలో శ్రాద్ధం చేస్తే విశేషఫలం .... 151
e) గ్రహణంలో శ్రాద్ధం చేయకపోతే ఎంతో కష్టం .... 151
f) గ్రహణంలో శ్రాద్ధం చేస్తే గొప్ప ఫలం .... 151
g) పాకం కుదరకపోతే .... 151
h) గజచ్ఛాయాయోగంలో శ్రాద్ధాదులు .... 151
i) గ్రహణంలో భోక్తకు దోషం .... 151
j) గ్రహణంలో భోజనంచేస్తే మళ్ళీ పురుషత్వంరాదు .... 151
k) ఆశౌచమధ్యంలో కూడా స్నానశ్రాద్ధాదులు చేయాలి .... 151
l) గ్రహణాది నిమిత్తంగా స్నానంలో రజస్వలా స్నానవిచారం .... 153
m) గ్రహణంలో రాత్రికూడా శ్రాద్ధాదులు చేయొచ్చు .... 153
n) పగలు చంద్రగ్రహణం రాత్రి సూర్యగ్రహణం వస్తే .... 153
o) గ్రహణం రోజు వార్షిక శ్రాద్ధం వస్తే .... 153
p) "గ్రహణాత్తు ద్వితయేహ్ని" అనేవి నిర్మూలాలు .... 154

q) సూర్యగ్రహణంలో దీక్షావిచారం .... 155
r) చంద్రగ్రహణంలో దీక్షావిచారం .... 156
s) జన్మరాశిలో గ్రహణం వస్తే .... 156
t) మంత్రపాఠంద్వారా ప్రార్థన .... 159
a) గ్రహణదర్శనం చేయాల్సిన విధం .... 162
b) మంగళకృత్యాలలో విశేషవిధి .... 163
c) మరొక పద్ధతి .... 163
d) గ్రహణకాలంలో మంత్రజపము .... 164
e) హోమాదులు .... 164
f) హోమానికి శక్తిలేకున్న జపము .... 164
g) కురుక్షేత్రంలో దానం స్వీకరిస్తే ప్రాయశ్చిత్తం .... 164
h) గ్రహణకాలంలో పూర్వసంకల్పిత ద్రవ్యం రెట్టింపౌతుంది .... 165
i) కొందరు ఇట్లా అంటారు .... 165
a) సముద్రస్నాన విషయం .... 173
b) పాషాణాన్ని విసరటం .... 174
c) స్నానంలో ఉచ్చరించాల్సిన మంత్రాలు .... 175
d) అర్ఘ్యమంత్రం .... 175
e) పిప్పలాదులకు తర్పణం ఇవ్వటం ... 176
అనుబంధము - 1 .... 177
అనుబంధము - 2 .... 184
అనుబంధము - 3 .... 191
అనుబంధము - 4 .... 193
అనుబంధము - 5 .... 195
అనుబంధము - 6 .... 200
అనుబంధము - 7 .... 203
అనుబంధము - 8 .... 205
అనుబంధము - 9 .... 207

నా జన్మస్థానం
నాచగిరి నృసింహస్వామికి దగ్గర
నా అక్షరాభ్యాసం ప్రాథమిక విద్య
యాదగిరి లక్ష్మీనృసింహుని సన్నిధిలో
మా ఆచార్యుల జన్మస్థానం
ఘటికాచల నృసింహస్వామి పీఠ

అందుకే

మాతా నృసింహశ్చ పితా నృసింహః
భ్రాతా నృసింహశ్చ సఖా నృసింహః
విద్యా నృసింహో ద్రవిణం నృసింహః
స్వామీ నృసింహః సకలం నృసింహః

# కు సు మ స మ ర్ప ణ

## శ్రీశ్రీశ్రీ సద్గురు సమర్థ నారాయణ మహారాజ్

(పదకొండవ పీఠాధిపతి) (యంత్రపురం, హరిహర 577602)



గారి ప్రియ శిష్యులు శ్రీ ముత్తయ్యగారు (ద్రవ్యదాత) ASWO

మరియు శ్రీ దుగ్గ్యాల, లక్ష్మయ్య ASWOగారలు.

ఈ గ్రంథమునకు

ద్రవ్యసహాయ మందించిన

శ్రీ ముత్తయ్య ASWO గారి

మాతృమూర్తి

శ్రీమతి బోడ ఎల్లమ్మ గారి

స్మృత్యర్థముగా ప్రచురితము

॥ श्रीः ॥

# Foreword

**Dr. B. Narasimhacharyulu**
Prof. & Head Dept. of Skt.
Osmania University
Hyderabad-7

धर्मेण ध्रियते लोको धर्मस्सर्वहितंकरः ।
सर्वो धर्मे हि वर्तेत जह्याद्धर्मं न जातुचित् ॥१॥
धर्मे लोकप्रतिष्ठाच सत्ये धर्मः प्रतिष्ठितः ।
सत्यमाचारमूलं हि तेनाचारं प्रवर्तयेत् ॥२॥ (मम)

There is order in the cosmos, nature has a course, the jungle has a law. Sun rises at the appointed fixed place and hour, the earth revolves round in order, seasons come in time and go. Every thing in the world has an order and abides by certain law. In the vedic period it was called ऋत Later it was known as सत्य; thus we have the negative अनृत falsehood in later period. It was (called) also known as धर्म. The word धर्म Can be derived from the following roots i) धृङ् अव स्थाने, to stay ध्रियते-तुदादिगण, ii) धृज धृजि गतौ to go ध्रजति; धर्जति भ्वादि. iii) धृ—वयोहानौ

(जृ) धृणाति-(धरा probably derived from this cf. पृथिवी गत यौवना-महाभारत) iv) धृञ् धारणे to uphold, to nourish to support भ्वादिः-धरति In Veda it is used in neuter gender even -तानि धर्माणि प्रथमान्यासन् etc. Even according to Brahmana works "dharma appears to be leading a life of duty and responsibility" Dharma was used in the sense of law and order in the Rgvedic period. As the cultural contexts differ, some words of one language, are not easily and satisfactorily translatable into another language, though both languages derived from or belonged to the same language. The word धर्म is one such word. In sanskrit धर्म is used in the following meanings-law, truth, leagal activity, order, tradition, restriction, confession of guilt, good activity, virtue, religion, rightiousness, duty, and the deity of law. This धर्म is of three kinds says the Mahabharata-वेदोक्तः परमो धर्मः, स्मृतिशास्त्रगतो परः। शिष्टाचीर्णः परः प्रोक्तस्त्रयो धर्माः सनातनाः ।। अनु पर्व. 141-65. आचार -the custom or tradition or the practice of the learned is one of the main sources of धर्म. Such practices after some time take the shape of rules of धर्म. Every one should follow the dharmas ordained to man. He should not think in terms of gain and loss. The practice of dharma is a नित्यकर्म Nityakarmas are to be performed without aiming at the result. But the नैमित्तिक and काम्य are also to be performed as the health and resources permit. The Indian tradition has vast literature on धर्म variously designated. There are injunctions in the Vedas i.e. samhitas, the brahmanas the aranyakas and Upanishads-There are 'Dharmasutras forming part of the Kalpa Sutras which in turn are the अङ्ग s or ancillary texts of the Vedas. There will be differences of opinion as regard to the fixation of time for the rituals, the actual performance, the methods of performance, eligibility conditions etc.

Such problems are discussed threadbare in the निबन्धS. These works record शिष्टाचीर्णधर्म and are themselves स्मृति-शास्त्राS. Thus they constitute the two-thirds of three fold Dharma excepting the Vedoktadharma. The Nirnayasindhu is one such famous work.

The Nirnayasindhu is composed by the renouned Kamalakarabhatta. The Bhatta family migrated to Benaras from the south. His grand father Narayanabhatta was well-known and bore the title 'Jagadguru', He was given first place of honour in the learned assembly. He is credited with the works अन्त्येष्टिपद्धतिः, त्रिस्थलीसेतुः, प्रयोगरत्नम् etc. and a commentary on वृत्तरत्नाकर. He was blessed with a son रामकृष्णभट्ट. R.K. Bhatta married Umadevi. They had three sons Divakara (or Dinakara), 6th verse p. 2 Kamalakara Bhatta and Laksmanabhatta. अधीत्य लक्ष्मणाख्येन कमलाकर सोदरात् । आचाररत्नं सुधिया यथामति वितन्यते ।। 7th intro verse of आचार रत्नम्....Kamalakara praised his father रामकृष्णs erudition in the following verse—यो भट्टतन्त्रगहनार्णवकर्णधारः, शास्त्रान्तरेषु निखिलेष्वपि मर्मभेत्ता । योऽत्रश्रमः किल कृतः कमलाकरेण प्रीतोऽमुनास्तु सुकृतीबुधरामकृष्णः ।। शू-कमलाकर. Kamalakara was worthy son of great scholar-father. He has commented on Kavyaprakash, where in he speaks of his profound scholarship In various sast ras and disciplines. तर्के दुस्तर्कमेधाः फणिपतिभणितिः,पाणिनीये प्रपञ्चे न्याये प्रायः प्रगल्भः प्रकटितपटिमा भाट्टशास्त्रप्रघट्टे । प्राभः प्राभाकारीये पथि प्रथितदुरूहान्तवेदान्तसिन्धुः, श्रौते साहित्यकाव्ये प्रचुरतरगतिर्धर्मशास्त्रेषु यश्च ।। He has composed twenty works, half of which are on Dharmasastra only. All his Dharma sastra works are very popular and quoted in judicial matters. It is said by M. M. P. V. Kane, the author of the History of Dharmasastra, that the Sudrakamalakara, the Vivadatandava and the Nirnayasindhu were the most famous of his works on Dharmasastra. In the words of the learned historion

M. M. P. V. Kane, the Kamalakara is a monument of erudition, industry and lucidity'. It is no surprise that as early as 1905 it was translated into marathi and published.

The N.S. was composed in the 1668 Vikramasamvat on 14th day of the dark fortnight of the month of Magha in the Roudra year of the sixty-year-cycle, This is equalent to 20th Feb. 1612. M. M. Haraprasad sastri had different version according to which K. Bh. wrote N.S. in the year 1678. It is rightly refuted by M.M. Kane as that did not corroborate with the Roudra. The verse in question is the 6th verse at the end of N.S.

"वसुऋतुऋतुभूमिते गतेऽब्दे नरपतिविक्रमतोऽथ याति रौद्रे ।
तपसि शिवतिथौ समापितोऽयं रघुपतिपादसरोरुहेऽर्पितश्च ॥

M.M. Sastri's version has वसुधातुऋतुभूमिते etc. Besides other discrepancies, noticed by earlier writers the meter will be wrong if this reading is to be accepted. Thus Kamalakara's literary activity as decided by earlier writers on the His. of **Dharma shastra** as between 1610-1640, seems to be the most acceptable proposition.

From the works of KB and NB the genealogical tree of KB can be written as under :-



It is wonderful coincidence that Grandfather and grandson completed their work in the year Roudra cf याति विक्रमशके द्विखषड् भू (1602) सम्मिते सितगकार्तिकेरुद्रे etc. 4th verse at the end of Vrttaratnakara's sixth chapter end and K. Bhattas वसुऋतुऋतुभूमिते गतेऽब्दे नरपतिविक्रमतोऽथ याति रौद्रे etc. sixth verse at the end of NS.Like Narayana Bhatta, Ka-bh was also the devotee of Sri Rama & the both dedicated their works to Sri Rama and placed them at his feet. NB. said कुर्मो रामचन्द्रपदपूजनपुष्पम् and KBh. रघुपतिपादसरोरुहयोरर्पितश्च । Not only the NS all the works of K, Bh are dedicated to the Lord Rama.

The references to the works and authors in NS also support the period for the author given above. According to P.V. Kane one hundred smrtis and three hundred Nibandha-karas are mentioned in the NS. It appears to me that the erstwhile निर्णयसागर press might have been named on the Nirnayasindhu.

The Nirnayasindhu is volumious work, dividedin to three paricchedas. The author gives his decision on the proper time for the performance of religious rituals. This he does after due ponderance over the opinions of Hemadri and Madhava, thc exponents of the dharmasastra works. As righ-tly pointed out by him, only a gifted and selected few could follow his work. सम्यक्....परेषां, काले यथामति । I-7 and सन्ति यद्यपि विद्वांसः तन्निबन्धाश्च कोटिशः । तथाप्यमुष्यवैदग्धीं केचित् विज्ञातुमीशते ।। I-8. Thus the work may, also, be called as काल-निर्णयः ।

The first pariccheda deals with decision of what is lhe year, how many types of year; likewise month. Then it takes up sankranti rites and gifts to be given on the occasion. It has discussion on ksayamasa, suddha and viddha tithis, various vratas and festivels to be performed during the year.

My friend Dr, K. Narasimhacharyulu, has rendered the NS into simple and lucid telugu. But for whose rendition the Nirnaya sindhu would have been in the reach of distingvished scholars alone. As the svadhyaya is to be studied without profit motive, Dharma should be adhered an practised without pros and cons of profit and loss. It is an odd combination of things. The work is in Sanskrit on Dharmasastra, it is translated into telugu and I am requested to write foreword in english, I, who do not know much either of Dharmasastra or Telugu. My only qualification is friendship with the translator since 30 years. I wish the Telugu reading public whould accept the book with great fervour and benefit by it. I also wish, the author, my friend, shall bring out an early translation & publication of the remaining two chapters of the N. S.

—:0:—

శ్రీః

# నిర్ణయ సింధువు

## మంగళాచరణం

కారుణ్యైక నికేతనం రామం సీతాలతా యుక్తం
విశ్వామిత్రా న్వవాయ వ్రతతి సమాలంబ శాఖినం వందే॥ 1

దయకు ఏకైక స్థానమును, సీతయనెడి తీగతో కూడినవాడును, విశ్వామిత్రుని వంశమనే తీగకు ఊతగా ఐన వృక్షమును ఐన శ్రీరామచంద్రుని నమస్కరిస్తున్నాను.

లక్ష్మీ సహాయం కల్పద్రుమ తలం రంజితగోకులం
బర్హా పీడం ఘనశ్యామం మహః కించిదుపాస్మహే॥ 2

లక్ష్మిని తోడుగా గలవాడు, కల్పవృక్ష స్వరూపుడును, గోకులాన్ని ఆనందింపజేసిన వాడును, తలపై నెమలి పింఛము గలవాడును, నీలమేఘ శ్యాముడును ఐన ఒక గొప్ప తేజస్సును ఉపాసిస్తున్నాను.

వేదార్థ ధర్మరక్షార్థై మాయామానుష రూపిణం
పితామహం హరిం వందే భట్టనారాయణాహ్వయం॥ 3

వేదార్థ ధర్మ రక్షణ కొరకు మాయామానుష రూపియై వచ్చిన, మా పితామహుడు (తాత) హరి స్వరూపుడు ఐన భట్ట నారాయణుని నమస్కరిస్తున్నాను.

యత్పాద సంస్మృతిః సర్వమంగళ ప్రతిభూర్మతా
తాన్ భట్టరామకృష్ణాఖ్యాన్ శ్రీతాతచరణాన్నుమః॥ 4

ఎవరి పాద సంస్మరణ సమస్త మంగళములకు మరొక జన్మస్థానముగా భావింపబడినదో అట్టి భట్ట రామకృష్ణులను పేరుగల నా తండ్రిగారిని నమస్కరిస్తున్నాను.

సర్వకల్యాణ సందోహనిదానం యత్పదద్వయం
ద్యునదీసోదరీమంబాం ఉమాఖ్యాంనౌమి సాదరం॥ 5

ఎవరి పాదద్వయము సర్వకల్యాణములకు స్థానమో, ఎవరు ఆకాశ గంగకు తోబుట్టువు వంటిదో, అట్టి ఉమ అను పేరుగల మా తల్లిగారిని గౌరవ పూర్వకంగా నమస్కరిస్తున్నాను.

బిందుమాధవ పాదాబ్జరోలంబీకృత విగ్రహం
జ్యాయాంసంభ్రాతరం భట్టదివాకరముపాస్మహే॥ 6

బిందుమాధవుని పాదములనే తామరలందు తనను తుమ్మెదగా భావించిన వాడును, నాకంటె పెద్దవాడును ఐన భట్టదివాకరుడనే పేరుగల నా అన్నగారిని నమస్కరిస్తున్నాను.

హేమాద్రి మాధవమతే ప్రవిచార్యసమ్యక్
ఆలోచ్యతత్వమథ తీర్థకృతాంపరేషాం
శ్రీ రామకృష్ణతనయః కమలాకరాఖ్యః
కాలేయథామతి వినిర్ణయమాతనోతి॥ 7

హేమాద్రి మాధవుల అభిప్రాయములను బాగా ఆకళింపు చేసుకుని ఇతర ధర్మశాస్త్రకారుల అభిప్రాయములను గూడా బాగా ఆలోచించి శ్రీ రామ కృష్ణుని కుమారుడైన కమలాకరుడను పేరుగల నేను గ్రంథరచనా కాలాన్ని గమనించి నా బుద్ధి ననుసరించి నిర్ణయం చేస్తున్నాను.

సన్తియద్యపి విద్వాంసః తన్నిబంధాశ్చకోటిశః
తథాప్యముష్య వైదగ్ధీం కేచిత్ విజ్ఞాతుమీశతే॥ 8

ఇతర విద్వాంసులెందరో ఉన్నారు. వారు వ్రాసిన గ్రంథాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. ఐనా ఈ గ్రంథం యొక్క గొప్పతనాన్ని (నాయొక్క నేర్పరితనాన్ని) కొంతమంది తెలుసుకోవటానికి ఇష్టపడతారనుకుంటాను.

మూ॥ **కాలనిర్ణయము** : తత్ర సంక్షేపతః కాలఃషోఢా అబ్దః, అయనం, ఋతుః, మాసః, పక్షః, దివసః ఇతి.

కాలము ఆరువిధములు అబ్దము, అయనము, ఋతువు, మాసము, పక్షము, దివసము అని.

మూ॥ అబ్ద నిర్ణయము : తత్రాబ్దః మాధవమతే పంచధా సావనః, సౌరః, చాంద్రః, నాక్షత్రః, బార్హస్పత్య ఇతి.

మాధవుని మతమున అబ్దము ఐదు విధములు - సావనము, సౌరము, చాంద్రము, నాక్షత్రము, బార్హస్పత్యము అని.

మూ॥ గురోర్మధ్యమరాశిభోగేన బార్హస్పత్యః సచజ్యోతిశ్శాస్త్రే ప్రసిద్ధః.

గురువునకు మధ్యమరాశి భోగమైన బార్హస్పత్యవత్సరమనబడును. అది జ్యోతిషశాస్త్రమందు ప్రసిద్ధము.

మూ॥ హేమాద్రిస్తు అన్త్యయోఃధర్మశాస్త్రే అనుపయోగాత్ త్రిసఏవ విధా ఆహ తత్రవక్ష్యమాణైః సావనాది ద్వాదశమాసైః తత్తదబ్దం.

హేమాద్రిమాత్రము చివరివాటికి (నాక్షత్ర, బార్హస్పత్య) ధర్మశాస్త్రంలో ఉపయోగంలేదు కాబట్టి అబ్దములు మూడు రకములే అని అనెను. (సావన, సౌర, చాంద్రములు) చెప్పబోయే పన్నెండుమాసములతో సావన మొదలగు ఆయా అబ్దము లేర్పడును.

మూ॥ మలమాసేతు సతి షష్టిదినాత్మక ఏకోమాస ఇతి ద్వాదశమా సత్వమ విరుద్ధమ్ తథాచవ్యాసః

''షష్ట్యాతుదివసైః మాసః కథితో బాదరాయణైః'' ఇతి.

అధికమాసము (మలమాసము) వచ్చినపుడు అరవైరోజులు కలిపి ఒకేమాసమనబడును. కనుక పన్నెండుమాసములు సంవత్సరము అను మాటకు విరోధము రాదు. ఇందుకు ప్రమాణము వ్యాసుడు— ''అరువది దినములతో మాసము అని బాదరాయణులు చెప్పిరి'' అని.

మూ॥ తత్రచాంద్రోఽబ్దః షష్టిభేదః తదాహగర్గః
ప్రభవో విభవః శుక్లః ప్రమోదోఽథ ప్రజాపతిః
అంగిరాః శ్రీముఖోభావో యువాధాతా తథైవచ॥
ఈశ్వరో బహుధాన్యశ్చ ప్రమాదీ విక్రమోవృషః
చిత్రభానుః సుభానుశ్చ తారణః పార్థివోఽవ్యయః॥
సర్వజిత్ సర్వధారీచ విరోధీవికృతః ఖరః
నందనో విజయశ్చైవ జయోమన్మథ దుర్ముఖౌ॥

హేమలంబో విలంబోఽథ వికారీ శార్వరీప్లవః
శుభకృత్ శోభనః క్రోధీ విశ్వావసు పరాభవౌ॥
ప్లవంగః కీలకః సౌమ్యః సాధారణ విరోధకృత్
పరిధావీ ప్రమాదీచ ఆనందో రాక్షసోఽనలః॥
పింగలః కాలయుక్తశ్చ సిద్ధార్థో రౌద్ర దుర్మతీ
దుందుభీ రుధిరోద్గారీ రక్తాక్షీ క్రోధనః క్షయః॥ ఇతి.

చాంద్ర సంవత్సరము అరవై విధములు. గార్గ్యులు దానినిట్లా వివరించారు:- ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోద, ప్రజాపతి, అంగిర, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాథి, విక్రమ, వృష, చిత్రభాను, సుభాను, తారణ, పార్థివ, అవ్యయ, సర్వజిత్, సర్వధారి, విరోధి, వికృత, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖ, హేమలంబ, విలంబ, వికారి, శార్వరి, ప్లవ, శుభకృత్, శోభన, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధకృత్, పరిధావీ, ప్రమాది, ఆనంద, రాక్షస, అనల, పింగళ, కాలయుక్త, సిద్ధార్థ, రౌద్ర, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, క్షయ అని.

మూ॥ యద్య పిజ్యోతిషే గురోః మధ్యమరాశి భోగేన ప్రభవాదీనాం మాఘా ద్యౌప్రవృత్తి రుక్తా, తథాఽపి ప్రభవాదీనాం చాంద్రత్వమప్యస్తి. "చాంద్రాణాం ప్రభవాదీనాం పంచకే పంచకేయుగే" ఇతి మాధవోక్తేః తేన చాంద్రః ప్రభవాదిః చైత్రసితే ప్రవర్తతే బార్హస్పత్యస్తు మాఘాదౌ. తయోర్వి నియోగః జ్యోతిర్నిబంధే బ్రహ్మసిద్ధాంతే:-

వ్యావహారిక సంజ్ఞోఽయం కాలః స్మృత్యాది కర్మసు
యోజ్యః సర్వత్ర తత్రాపి జైవోవా నర్మదోత్తరే॥

ఆర్ష్టిషేణః :-

స్మరేత్సర్వత్ర కర్మాదౌ చాంద్ర సంవత్సరం సదా
నాన్యం యస్మాద్వత్సరాదౌ ప్రవృత్తి స్తస్యకీర్తితా॥ ఇతి

జ్యోతిష శాస్త్రమందు గురువునకు మధ్యమరాశి భోగమైన ప్రభవాదులు మాఘమాసారంభమందు ఆరంభమగునని చెప్పబడినను ప్రభవాదులు చాంద్ర

సంవత్సరములు కూడా ఔతాయి "చాంద్ర వత్సరములైన ప్రభవాదులు ఐదేసి ఐదేసి జతలుగా ఉంటా"యని మాధవుల వచనము. అందువలన చాంద్రమానము ప్రభవాది వత్సరములు చైత్ర శుక్లంలో అరంభమగును. బార్హస్పత్యమానము మాఘమాసాదిలో ఆరంభమగును. వాని ఉపయోగము జ్యోతిషశాస్త్రంలో బ్రహ్మ సిద్ధాంతమందు ఇట్లా చెప్పబడింది: ''వ్యవహారమునకైన పేర్లు కలిగిన ఈ కాలము స్మృత్యాది కర్మలలో అంతటా స్వీకరింపతగినది కాని, నర్మద ఉత్తర తీరప్రాంతాల్లో బార్హస్పత్య మానము స్వీకరింపబడవచ్చును లేకపోనూవచ్చును" అని.

ఆక్షిప్తేషణుడు:- "కర్మారంభమందు అంతట చాంద్రవత్సరమును స్వీకరింపవలెను. మరొకటి కూడదు. ఎందుకంటే, సంవత్సరం మొదలు దీనితోనే ఆరంభమగునని చెప్పబడినది గదా" అని.

మూ॥ అయన నిర్ణయము : అయనంతు సౌరర్తుత్ర యాత్మకం "సౌర ర్తుత్రి తయం ప్రదిష్టమయనం" ఇతి దీపి కోక్తేః తత్ ద్వివిధం దక్షిణ ముత్తరం చేతి కర్కే సంక్రాంతిః దక్షిణాయనం, మకరే అన్యం.

అయనము మూడు సౌర ఋతువులకు ఒకటి చొప్పున ఉండును. దీపికలో ఇట్లా చెప్పబడింది: "సౌర సంబంధి, మూడు ఋతువులు ఒక ఆయనము" అని. అది రెండు విధములు దక్షిణాయనము, ఉత్తరాయణము అని. కర్కాటక సంక్రాంతి దక్షిణాయనము మకర సంక్రాంతి ఉత్తరాయణము.

మూ॥ అనయోశ్వినియోగ మాహ మదన రత్నే సత్యవ్రతః
దేవతారామవాప్యాది. ప్రతిష్ఠోదఙ్ము ఖేరవౌ
దక్షిణాశాము ఖేకుర్వన్ నతత్ఫల మవాప్నుయాత్

వీని ఉపయోగమును గూర్చి మదన రత్నమందు సత్యవ్రతుడు ఇట్లా అన్నాడు: దేవాలయం, తోట, బావి మొదలగువాని ప్రతిష్ఠ సూర్యుడు ఉత్తరాయణంలో ఉండగా చేయాలి. దక్షిణాయనంలో వీటి ప్రతిష్ఠ చేస్తే ఫలితం లభించదు.

మూ॥ వైఖానసః : మాతృభైరవ వారాహ నరసింహ త్రివిక్రమాః
మహిషాసుర హన్త్ర్యశ్చ స్థాప్యావై దక్షిణాయనే

వై శబ్దో అప్యర్థే, నతుదక్షిణాయన ఏవేతి నియమః పూర్వవచనే దక్షిణాయనే నిషిద్ధాయాః దేవప్రతిష్ఠాయాః దేవవిశేషే ప్రతిప్రసవమాత్రాత్.

వైఖానసుడు ఇట్లా అంటాడు : మాత, భైరవ, వరాహ, నరసింహ, త్రివిక్రమ, మహిషాసురహన్త్రి ఈ దేవతల ప్రతిష్ఠ దక్షిణాయనంలో చేయాలి. వై శబ్దము కూడా అని అర్థం. దక్షిణాయనంలోనే చేయాలి అనే నియమం కాదు. పై మాటల్లో దక్షిణాయనంలో దేవ ప్రతిష్ఠ నిషేధించబడింది. అది విశేష దేవతల విషయంలో తిరిగి విధించబడింది. (నిషేధమునకు నిషేధము ప్రతిప్రసవము).

మూ॥ రత్నమాలాయాం :

గృహప్రవేశః త్రిదశప్రతిష్ఠా వివాహ చౌల వ్రతబంధపూర్వం
సౌమ్యాయనే కర్మ శుభం విధేయం యద్గర్హితం తత్ఖలు దక్షిణేచ॥ ఇతి.

రత్నమాలయందు : గృహప్రవేశము, దేవతా ప్రతిష్ఠ, వివాహము, చౌలము. ఉపనయనం (వ్రత బంధం) - ఈ శుభ కర్మలు ఉత్తరాయణంలో చేయాలి. నిందితమైన కర్మలను దక్షిణాయనంలో చేయాలి అని.

మూ॥ అస్యాపవాదః కాశీఖండే :

సదా కృతయుగం చాస్తు సదా చాస్తూత్తరాయణం
సదా మహోదయశ్చాస్తు కాశ్యాం నివసతాం సతాం ॥ఇత్యయనం.

దీనికి అపవాదము కాశీ ఖండంలో ఇలా ఉంది: "ఎప్పుడూ కృతయుగం ఉండనీ ఎప్పుడూ ఉత్తరాయణం ఉండనీ, ఎప్పుడూ మోక్షం లభించనీ కాశిలో ఉండే సజ్జనులందరికి'' అని. ఇంతవరకు అయన చర్చ.

మూ॥ ఋతు నిర్ణయము : ఋతుః మాసద్వయాత్మా. మలమాసేతు మాసద్వయాత్మక ఏకోమాసః తేన మాసద్వయాత్మకమ విరుద్ధం. సద్వేధా. చాంద్రః సౌరశ్చ చైత్రారంభో వసంతాదిః చాంద్రః. మీనారంభో, మేషారంభో వాసౌరః మీనమేషయోః మేషవృష యోర్వావసంతః ఇతి బౌధాయనోక్తేః.

రెండు నెలల కాలం ఋతువు. అధిక మాసంలో కూడా రెండు మాసాలు కలిపి ఒకే నెల కనుక రెండు నెలల కాలం ఋతువు అనేది విరుద్ధం కాదు. అది

రెండు విధములు చాంద్రము, సౌరము అని. చైత్రము ఆరంభముగా వసంతాది ఋతువులు చాంద్రము. మీన ఆరంభమో మేష ఆరంభమో సౌరము. 'మీన మేషములు లేదా మేషవృషభములు వసంత ఋతువు' అని బోధాయనుని ఉక్తి.

మూ॥ త్రికాండమండనః :

శ్రౌతస్మార్త క్రియాః సర్వాః కుర్యాచ్చాంద్రమాసర్తుషు।
తదభావేతు సౌరర్తుష్వితి జ్యోతిర్విదాంమతం॥

వీని ఉపయోగమును గూర్చి త్రికాండమండనుడు ఇట్లా అన్నాడు: "శ్రౌత స్మార్త - క్రియలన్ని చాంద్రమాస ఋతువులలో చేయాలి. అది లేనప్పుడు సౌరఋతువులలో చేయాలి" అని జ్యోతిషశాస్త్రజ్ఞుల మతం.

మూ॥ సద్వివిధోఽపిషోఢా : వసన్తః, గ్రీష్మః వర్షాః, శరత్, హేమన్తః, శిశిరః ఇతి - ఋతుః.

అవి రెండు విధములవి (చాంద్ర, సౌర) కూడా ఆరు రకాలు. వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత శిశిరములు అని ఇంతవరకు ఋతు విషయము.

మూ॥ మాస నిర్ణయము మాసః చతుర్ధా సావనః, సౌరః, చాంద్ర, నాక్షత్ర ఇతి త్రింశద్దినః సావనః అర్కసంక్రాంతేః, సంక్రాంత్యవధిః సౌరః యద్యపి హేమాద్రి మాధవకాలాదర్శాద్యాలోచనేన "మేషసంక్రాన్త్యాం సమాప్తాయాం అమావాస్యాకత్వం చైత్రత్వం'' ఇతి లక్షణాచ్చ మేష సంక్రాన్తేశ్చైత్రత్వం ప్రతీయతే తథాపి మేషసంక్రమే దర్శద్వయేసతి వైశాఖస్యై వాధిక్యాత్ పూర్వ భావిత్వేన మీనస్యైవ చైత్రత్వం యుక్తం. ఏవం మేషాదయో వైశాఖాద్యాః అతో మీన సంక్రాంతి మధ్యస్థపౌర్ణమాసీకత్వం, తాదృషాద్యతిథికత్వం వాచైత్రత్వమితి లక్షణాత్ మీన ఏవ సౌరశ్చైత్రః ఏవం వైశాఖాదయోపి మేషాద్యాఃజ్ఞేయాః.

మాసము నాల్గు రకములు- సావనము, సౌరము, చాంద్రము, నాక్షత్రము అని. ముప్పదిరోజుల నెల సావనము. సూర్యుని ఒక రాశి సంక్రమణము నుం మరొక రాశి సంక్రమణ పర్యంతము (ఆ సంక్రాంతి ముగిసేవరకు) సౌరము హేమాద్రి మాధవకాలాదర్శాదుల ఆలోచన ప్రకారం మేషసంక్రాంతి యందు అమావాస్య సమాప్తినందితె అది చైత్రమాసమని భావింధారు. కాన మేషసంక్రాం

తికి చైత్రమాసమని పేరైనట్లు తెలుస్తోంది. కాని ఒకవేళ ఒకే మేషసంక్రాంతిలో రెండు అమావాస్యలు వస్తే వైశాఖ మాసమే అధికంగా ఉంటుంది కాబట్టి మేషం కంటే ముందున్న మీనమే చైత్ర మాసమనుట యుక్తము. అప్పుడు మేషాదులు వైశాఖాది మాసాలౌతాయి. అందువల్ల మీనసంక్రాంతి, మధ్యగా పూర్ణిమ కలిగి ఉండటమో లేదా అటువంటిదే మరోతిథి (వర్షాదితిథి) మొదటి తిథిగా కలిగి ఉండటమో చైత్రమాసము అని చెప్పాలి. అప్పుడు మీనమే సౌరమాస చైత్రము మేషాదులు సౌర వైశాఖాదులని తెలుసుకోవాలి.

మూ॥ **సంక్రాంతి నిర్ణయము :** (సౌరమాస ప్రసంగాత్ సంక్రాంతి నిర్ణయ ఉచ్యతే) తత్ర "పూర్వతోఽపి పరతోఽపి సంక్రమాత్ పుణ్య కాల ఘటికాస్తు షోడశ" ఇతి సామాన్యతః పుణ్యకాలః సర్వైరుక్తః. విశేషస్తూచ్యతె. అత్రమామకాః సంగ్రహ శ్లోకాః—

ప్రాగూర్ధ్వా దశ పూర్వతః షడవనిః తద్వత్పరాః పూర్వతః
త్రింశత్ షోడశ పూర్వతోఽథపరతః పూర్వాః పరాః స్యుర్దశ।
పూర్వాఃషోడశ చోత్తరా ఋతుభువః పశ్చాత్ ఖవేదాః పునః
పూర్వాఃషోడశ చోత్తరాః పునరథో పుణ్యాస్తుమేషాదితః॥

అస్యార్థః - మేషే ప్రాగూర్ధ్వంచ దశఘటికాః పుణ్యకాలః ఇతి వృషే పూర్వాఃషోడశ. మిథునేపరాఃషోడశ. కర్కేపూర్వాః త్రింశత్. సింహేపూర్వాః షోడశ. కన్యాయాంపరాః షోడశ తులాయాం ప్రాగూర్ధ్వాదశ. వృశ్చికేపూర్వాః షోడశ. ధనుషిపరాఃషోడశ. మకరేచత్వారింశత్పరాః. ఇదంచహేమాద్రి మతే నోక్తం. మాధవమతేతు అత్రపరాః వింశతిః పుణ్యాః. కుంభేపూర్వాః షోడశ. మీనేపరాః షోడశేతి.

సౌరమాస సందర్భాన్ని పురస్కరించుకొని సంక్రాంతి నిర్ణయము చెప్తున్నాడు. సంక్రమణం కంటే ముందైనా తరువాతైనా 16 ఘడియలు పుణ్యకాలమని సామాన్యంగా అందరు చెప్పారు. విశేషము చెప్తున్నాను. ఇక్కడ నా సంగ్రహ శ్లోకాలు (గ్రంథకర్తవి) దాని అర్థము—

| | | | | |
|---|---|---|---|---|
| మేష సంక్రమణంలో | ముందరి | - | తరువాతి పది ఘడియలు | పుణ్యకాలము |
| వృష సంక్రమణంలో | ముందరి | - | — పదహారు ఘడియలు | పుణ్యకాలము |
| మిథున సంక్రమణంలో | — | - | తరువాతి పదహారు ఘడియలు | ,, |
| కర్కాట ,, | ముందరి | - | — ముప్పది ఘడియలు | ,, |
| సింహ ,, | ముందరి | - | — పదహారు ఘడియలు | ,, |
| కన్యా ,, | — | - | తరువాతి పదహారు ఘడియలు | ,, |
| తులా ,, | ముందరి | - | తరువాతి పది ఘడియలు | ,, |
| వృశ్చిక ,, | ముందరి | - | — పదహారు ఘడియలు | ,, |
| ధనుస్సు ,, | — | - | తరువాతి పదహారు ఘడియలు | ,, |
| మకర ,, | — | - | తరువాతి నలభై (ఇది హేమాద్రిమతం) | |
| మకర ,, | — | - | తరువాతి ఇరవై (ఇది మాధవమతం) | |
| కుంభ ,, | ముందరి | - | — పదహారు ఘడియలు | పుణ్య కాలం |
| మీన ,, | — | - | తరువాతి పదహారు ఘడియలు | ,, అని. |

మూ॥ యాప్యుత్తరా పుణ్యతమామయోక్తా
సాయం భవేత్సాయదిసాఽపి పూర్వా
పూర్వాతు యోక్తా యదిసా విభాతే
సాప్యుత్తరా రాత్రి నిషేధతః స్యాత్॥
అర్వాఙ్నిశీథాద్యది సంక్రమః స్యాత్
పూర్వేఽహ్ని పుణ్యం పరతఃపరే హ్ని
ఆసన్నయామద్వయమేవ పుణ్యం
నిశీథమధ్యేతు దినద్వయం స్యాత్॥
కర్కేఝషే ప్యేవమితి హ్యువాచ
హేమాద్రిసూరిశ్చ తథా పరార్కః
ఝషఃప్రదోషే యదివాఽర్ధ రాత్రే
పరేఽహ్ని పుణ్యం త్వథ కర్కటశ్చేత్॥
ప్రభాతకాలేయదివా నిశీదే
పూర్వేఽహ్ని పుణ్యం త్వితి మాధవార్యః॥

అత్ర మూల వచనాని మాధవాపరార్క హేమాద్ర్యాదిమ ద్రష్టవ్యాని.

కొన్నింట సంక్రమణ కాలం తరువాతి ఘడియలు పుణ్యప్రదమైనవి అని చెప్పాను. అక్కడ ఒకవేళ సంక్రమణం సాయంకాలమైతే పుణ్య ఘడియలు తరువాత కాక, ముందే పుణ్య ఘడియలుగా భావించాలి. పూర్వపు ఘడియలు పుణ్యమైనవి అని చెప్పినచోట సంక్రమణం ఒకవేళ ప్రభాత కాలమందు జరిగితే అప్పుడు తరువాతి ఘడియలు పుణ్య గడియలుగా భావించాలి. రాత్రి కాలాన్ని పుణ్య గడియలుగా భావించరాదని నిషేధము. అర్ధరాత్రికన్న ముందు సంక్రమణ మైతే పూర్వ దివసంలో పుణ్య గడియలు అర్ధరాత్రి తర్వాత సంక్రమణమైతే తరువాతి దినంలో పుణ్య గడియలు ఉంటాయి. ఆ పుణ్య గడియలు సంక్రమణానికి దగ్గరలో ఉన్న రెండు జాముల కాలము మాత్రమే (2 జాములనగా 15 ఘడియలు అనగా ఆరు గంటలు) అర్ధరాత్రి సంక్రమణం జరిగితే రెండు రోజుల లోను పుణ్య గడియలుంటాలు (ముందు రోజు, తరువాతి రోజు) కర్కాట మందు, మకర మందు, ఇట్లాగే పుణ్య గడియలుంటాయని హేమాద్రి సూరి, అపరార్కులన్నారు. మాధవార్యులు ఇట్లా అన్నారు- మకర సంక్రమణం మునిమాపు లేదా అర్ధరాత్రి జరిగితే తరువాతి రోజు పుణ్య కాలముంటుంది. కర్కాట సంక్రమణం ఉదయం కాని, రాత్రి కాని జరిగితే పుణ్య గడియలు ముందు రోజుంటాయని అన్నారు. ఇందుకు మూల వచనాలు మాధవ, అపరార్క, హేమాద్రి మొదలగువారి గ్రంథాల్లో చూడవలెను.

మూ॥ సర్వాసు సంక్రాంతి షుదాన విశేషో హేమాద్రౌదానకాండే ఉక్తః విశ్వామిత్రః

మేష సంక్రమణే భానోః మేషదానం మహా ఫలం
వృష సంక్రమణే దానం గవాంప్రోక్తం తథైవచ॥
వస్త్రాన్న పానదానాని మిథునే విహితానితు
ఘృత ధేను ప్రదానం చ కర్కటేపి విశిష్యతే॥
ససువర్ణం ఛత్రదానం సింహేఒపి విహితం తథా
కన్యా ప్రవేశే వస్త్రాణాం వేశ్మనాం దానమేవచ॥
తులా ప్రవేశే ధాన్యానాం గోరసానామ పీష్టదం
అన్నకి చలితే భానౌ ద్వీప ధానం మహా ఫలం॥ (అన్నకి=వృశ్చికః)

ధనుష్ప్రవేశే వస్త్రాణాం యానానాం చ మహా ఫలం
ఝషప్రవేశేదారూణాం దానమగ్నే స్తథైవచ॥
కుంభ ప్రవేశే దానంతు గవామంబు తృణస్యచ
మీన ప్రవేశే స్థానానాం మాలానా మపి చోత్తమం॥

సంక్రాంతు లన్నింటిలో చేయవలసిన దాన విశేషముల గూర్చి హేమాద్రి దానకాండయందు చెప్పాడు. విశ్వామిత్రుడు - మేష సంక్రమణమందు మేష దానము, వృషభ సంక్రమణమందు గోదానము, మిథునంలో వస్త్ర అన్న పాన దానములు, కర్కాటంలో నెయ్యి, గోదానములు, (నెయ్యితో చేసిన గోదానము) సింహమందు సువర్ణముతోకూడిన ఛత్రదానము, కన్యయందు వస్త్ర, గృహ దానములు, తులయందు నువ్వులు, మజ్జిగదానము, వృశ్చికంలో దీపదానము, ధనుస్సుయందు వస్త్ర వాహన (గుఱ్ఱము, ఏనుగ, బండి వగైరా) దానములు, మకరంలో కట్టెలు, అగ్నిదానము (బంగారం లేదా ఇత్తడి), కుంభంలో గో(గోవులకు)జల, తృణ దానములు, మీనంలో గృహదానము మాలాదానము శ్రేష్ఠమనిరి.

మూ॥ అత్ర ఉపవాసమాహ హేమాద్రావాప స్తంభః—
అయనే విషువే చైవ త్రిరాత్రో పోషితో నరః
స్నాత్వాయ స్త్వర్చయేత్ భానుం సర్వకామఫలంలభేత్॥
అశక్తౌతువృద్ధవాసిష్ఠః-అయనే సంక్రమే చైవగ్రహణే చంద్రసూర్య యోః
అహోరాత్రోషితః స్నాత్వాసర్వపాపైః ప్రముచ్యతే॥

అత్ర ఉపవాసః సంక్రమదినే, దానాదితుపుణ్యకాలదినే ఇత్యాచార్య చూడామణిః, విధిలాఘవాత్ పుణ్యకాలదినే ఏవ ఉభయమితి వృద్ధాః. ఇదంచ పుత్రి గృహస్థ అతిరిక్త విషయం.

ఈ సందర్భంలో హేమాద్రియందు అపస్తంభవచనం ఉపవాసమును గూర్చి ఇట్లా ఉంది. సూర్యుని అయన కాలమందు (ఉత్తర, దక్షిణ,) విషువత్కాలంలో (మేష, తుల) మూడు రాత్రులు ఉపవాసం ఉండి, పిదప స్నానంచేసి సూర్యుని పూజించిన నరుడు అన్ని కోరికల ఫలమును పొందును. ఉపవాసం చేతకాని పక్షంలో వృద్ధవసిష్ఠునిమాటః- అయనంలో, సంక్రమణంలో, సూర్య చంద్రుల గ్రహణ కాలమందు పగలు రాత్రి ఉపవాసం ఉండి స్నానం చేసిన

సర్వపాపములనుండి విముక్తుడగును. సంక్రమణం రోజున ఉపవాసం, పుణ్యకాల దినమున దానాదులు చేయాలని ఆచార్య చూడామణి అభిప్రాయం. విధి లాఘవం కనుక పుణ్యకాలదినంలోనే ఉపవాస, దానములు చేయాలని పెద్దలమాట. ఈ మాటలు సంతానం కల గృహస్థులకు వర్తించదు. ఇందుకు ప్రమాణం—

మూ॥ ఆదిత్యేఽహని సంక్రాంతౌ గ్రహణే చంద్ర సూర్యయోః
ఉపవాసో నకర్తవ్యః పుత్రిణాగృహిణా సదా॥ ఇతి జైమిని వచనాత్.

ఆదివారంనాడు, సంక్రమణంనాడు, సూర్యచంద్రుల గ్రహణకాలం నాడు, సంతానం కల గృహస్థు ఉపవసించరాదు అని జైమినివచనము.

మూ॥ అత్రశ్రాద్ధముక్తం హేమాద్రౌ విష్ణుధర్మే -
శ్రాద్ధంసంక్రమణే భానోః ప్రశస్తం పృథివీపతే.
అపరార్కేఽపి విష్ణుః - ఆదిత్య సంక్రమశ్చైవ విశేషేణాయనద్వయం
వ్యతీపాతోఽథ జన్మర్క్షం చంద్ర సూర్యగ్రహస్తథా॥
ఏతాంస్తు శ్రాద్ధకాలాన్ వైకామ్యానాహ ప్రజాపతిః ఇతి.

ద్వాదశాది దినైరర్వాక్ అయనాంశ ప్రవృత్తావపి పుణ్యం వక్తుమయన గ్రహణం అన్యథా సంక్రమేణ సిద్ధేరయన గ్రహణం వ్యర్థం స్యాదిత్యపరార్కః.

హేమాద్రియందు విష్ణు ధర్మంలో ఈ సందర్భంలో శ్రాద్ధం చెప్పబడింది. ఓ రాజా! సూర్యుని సంక్రమణ కాలమందు శ్రాద్ధము చేయుట శ్రేష్ఠము అని.

అపరార్కమందు విష్ణువు - సూర్యసంక్రమణము, ప్రత్యేకించి రెండు అయనములు, వ్యతీపాతయోగము, జన్మనక్షత్రము, సూర్యచంద్ర గ్రహణ కాలము - ఇవి శ్రాద్ధము చేయుటకు తగిన కాలములు అని ప్రజాపతి చెప్పాడు అని. పన్నెండు మొదలు అంతకంటే ముందు (పూర్వం) దినములలో అయనాంశ ప్రవృత్తి జరిగినా పుణ్యకాలమన్ని చెప్పుటకే అయన గ్రహణము చేయబడినది. లేనిచో సంక్రమణ శబ్దమే సరిపోగా అయనశబ్దము వాడుట వ్యర్థమగును అని అపరార్కుడు.

మూ॥ హేమాద్రావపిగాలవః-
అయనాంశకతుల్యేన కాలేనైవస్ఫుటంభవేత్
మృగకర్కాదిగేసూర్యేయామ్యోదగయనేసతి॥
తదాసంక్రాంతికాలేస్యుః ఉక్తావిష్ణుపదాదయః॥ ఇతి

అయనాంశకచ్యుతిరూపే సంక్రాంతికాలేఽపి విష్ణుపదాదయః ప్రవర్తన్తే తేన ప్రయుక్తం పుణ్యకాలాది తత్రాపి జ్ఞేయమితి సఏవవ్యాచఖ్యౌ॥ తచ్చమేషాయనం వృషాయన మిత్యాదిసర్వత్ర జ్ఞేయం.

మాధవీయేప్యపిజాబాలిః - సంక్రాంతిషుయథాకాలఃతదీయేఽప్యయనేతథా

అయనేవింశతిఃపూర్వామకరేవింశతిః పరా॥ ఇతి

మకరాయనే పూర్వావింశతిఘటికాః పుణ్యాః మకరసంక్రాంతౌతు పశ్చాత్ వింశతిః అన్యత్రాయనేతత్ సంక్రాంతివదిత్యర్థః.

హేమాద్రియందు గాలవుడు ఇట్లా అన్నాడు-అయనాంశకతుల్యమైనకాల మందే మకర కర్కాటాది రాసులలో సూర్యుడుండగా దక్షిణ ఉత్తరాయనములు స్పష్టమగును. ఆ సంక్రాతికాలమందు విష్ణుపదాదులు ఉండును అని చెప్పబడినది అని అయనాంశకచ్యుతి రూపమైన సంక్రాతి కాలమందు గూడ విష్ణుపదాదులు ప్రవర్తించును. కనుక అయనాంశప్రయుక్త పుణ్యకాలాదులు అయనమందుకూడా గ్రహించాలి అని అతడే వ్యాఖ్యానించాడు. అందువలన మేషాయనం, వృషా యనం అని మొదలుగా అన్ని సంక్రాంతులలో గ్రహించాలి.

మాధవీయంలో జాబాలి ఇట్లా అంటాడు - సంక్రాతులలో ఎట్లా కాలము పుణ్యప్రదమో అట్లాగే దానికి చెందిన అయనములలో గూడా కాలము పుణ్య ప్రదము. మకరాయనములో మొదటి ఇరువై ఘడియలు, మకరసంక్రాంతి యందు మాత్రం తరువాతి ఇరవై ఘడియలు పుణ్యప్రదములు అని. ఇతర అయనములలో ఆ సంక్రాంతివలె గ్రహించాలి అని భావం.

మూ॥ విష్ణుపదాది స్వరూపం దీపికాయాముక్తం—
హర్యంఘ్రిః వృషసింహవృశ్చికఘటేష్వర్కస్య యః సంక్రమః
కన్యామీనధనుర్నృయుక్షుషడశీత్యాఖ్యంతులామేషయోః
ప్రోక్తం తద్విషువం ఝషేఽయనముదక్ కర్కాటకేదక్షిణం॥ ఇతి
హర్యంఘ్రిః = విష్ణుపదం; నృయుక్ = మిదునం.

విష్ణుపదాది స్వరూపము దీపికయందు ఇట్లా చెప్పబడింది :- వృషభసింహ, వృశ్చిక,కుంభసంక్రమణములు విష్ణుపదము కన్య, మీన, ధనుస్, మిధునసంక్ర మణములు షడశీతి అనిపేరు. తుల మేష సంక్రమణములు విషువత్తని పేరు. మకరసంక్రమణము ఉత్తరాయణము. కర్కాటసంక్రమణము దక్షిణాయనము అని

మూ॥ అత్రచపిండరహితం శ్రాద్ధంకుర్యాత్. తథాచాపరార్కే-మాత్స్యే :-
ఆయన ద్వితయే శ్రాద్ధం విషువత్ద్వితయేతథా
సంక్రాంతిషుచసర్వాసు పిండనిర్వాపణాదృతే॥ఇతి

సంక్రమణమందు పిండరహితమైన శ్రాద్ధము చేయవలెను. అపరార్క మందు మాత్స్యోక్తి: - రెండయన ములయందు, రెండు విషువత్తులందు, అన్ని సంక్రమణములయందు పిండ ప్రదానం లేకుండానే శ్రాద్ధంచేయాలి అని.

మూ॥ శ్రాద్ధశూలపాణిస్తు అస్యనిర్మూలత్వాత్, సమూలత్వేపి—
తతః ప్రభృతి సంక్రాంతా వుపరాగాదిపర్వసు
త్రిపిండమాచరేత్ శ్రాద్ధం ఏకోద్దిష్టం మృతేఽహని॥ ఇతి.

మాత్స్యోక్తేః గ్రహణాగ్రహణవత్ వికల్ప ఏవేత్యాహ తన్న అస్యపార్వణానువాద కత్వేన పిండావిధాయకత్వాత్. పిండోవ్యక్తిః. అన్యథా ఏకపదే పిండానువాదేత్రిత్వ విధౌవషట్ కర్తుః ప్రథమభక్ష్యవత్ వైరూప్యాపత్తేః. తథాచ ఉభయసమూలత్వేపిండరహితం పార్వణం కర్తవ్యమితి ఉభయవచనయోరర్థః. త్రిపిండశబ్దేనఏకోద్దిష్ట వ్యావర్తనమాత్రం.

శ్రాద్ధశూలపాణి ఐతే దీనికి మూలం లేదనెను. ఒకవేళ మూలం ఉన్నా "అప్పటినుండి సంక్రమణమందు, గ్రహణాది పుణ్యకాలమందు త్రిపిండశ్రాద్ధ మాచరించవలెను. ఏకోద్దిష్టము చనిపోయిన రోజు చేయాలి" అని మాత్స్యోక్తిచే స్వీకరించుట, స్వీకరించకపోవుట అనేది వికల్పమేగదా అని అనెనో అది తప్పు. ఇది పార్వణవిషయసంబంధి కనుక పిండాన్ని విధించటంలేదు. పిండమనగా వ్యక్తి. లేనిపక్షంలో ఒకేచోట పిండానువాదంలో త్రిపిండవిధానము విధించుట హవిస్సు వేసేవానికి మొదటి ముద్దవలె వైరూప్యమేర్పడును. అందువల్ల రెండు మూలాధారములు కలవే ఐన పిండము లేకుండ పార్వణం చేయాలి అని రెంటికి సమన్వయం చేయాలి. త్రిపిండశబ్దము ఏకోద్దిష్టమును నివర్తించుట కొరకు మాత్రమే.

మూ॥ జ్యోతిర్నిబంధేనారదః -
త్యాజ్యాః సూర్యస్యసంక్రాంతేః పూర్వతః పరతస్తథా
వివాహాదిషుకార్యే షునాడ్యః షోడశ షోడశ॥

ఏతత్పుణ్యకాలోపలక్షణం

భానోఃసంక్రాంతి భోగశ్చకులికశ్చార్థయామకః. ఇతి జ్యోతిశ్శాస్త్రే వర్జ్యేషు పరిగణనాత్ అయన వ్యతిరిక్తాసు దశసు సంక్రాంతి షు రాత్రౌ స్నాన శ్రాద్ధాది, నకార్యం.

అహ్ని సంక్రమణే కృత్స్నమహః పుణ్యం ప్రకీర్తితం
రాత్రౌ సంక్రమణే భానోః దినార్థం స్నానదానయోః॥
అర్ధరాత్రా దధఃతస్మిన్ మధ్యాహ్నస్యో పరిక్రియా
ఊర్ధ్వం సంక్రమణే చోర్ధ్వముదయాత్ప్రహరద్వయం॥
పూర్ణేచే దర్ధరాత్రేతు యదాసంక్రమతే రవిః
ప్రాహుర్దినద్వయంపుణ్యం ముక్త్వామకరకర్కటౌ॥ ఇతి

వృద్ధవసిష్ఠాదివచనైః అహః పుణ్యత్వోక్త్యా.

రాత్రౌ సంక్రమణే భానోః దివాకుర్యాత్తు తత్క్రియాం
పూర్వస్మాత్ పరతోవాऽపి ప్రత్యాసన్నస్య తత్ఫలం॥ ఇతి

వసిష్ఠవచనాచ్చార్థాత్ రాత్రౌ స్నానాదినిషేధప్రతీతేః

మంగళకార్యములందు విశేషమైనవాటిని గూర్చి జ్యోతిర్నిబంధమందు నారదుడి మాట:- సూర్యసంక్రమణానికి ముందు, వెనుక వివాహాది కార్యాలు చేయాల్సివస్తే పదహారు, పదహారు ఘడియల కాలమును వదలాలి అని. ఇది పుణ్యకాలమునకు సామాన్య లక్షణము.

సూర్యుని సంక్రాంతి భోగము కులికము (విడువదగ్గ కాలం) సగము జాము మాత్రమే అని జ్యోతిషశాస్త్రమందు విడువతగినవానిలో చెప్పినందున (యామ ప్రహర = 3 గంటలు; ½ జాము 1 గం 30 ని. కాలము) అయన వ్యతిరిక్త (ఉత్తర, దక్షిణ) ఇతర పది సంక్రమణములలో రాత్రియందు స్నాన శ్రాద్ధాదులు చేయరాదు.

పగలు సంక్రమణమైతే పగలు పూర్తికాలము పుణ్యకాలము. రాత్రి సూర్య సంక్రమణమైన స్నానదానములకు సగమురోజు మాత్రమే పుణ్యకాలము అర్ధరాత్రికి ముందు సంక్రమణమైన ఆరోజు మధ్యాహ్నం తరువాత పుణ్యకాలము. అర్ధరాత్రి తరువాత సంక్రమణమైన తెల్లవారి ఉదయం తర్వాత రెండుయాముల కాలము మంచిది. పూర్తిఅర్ధరాత్రి సంక్రమణమైన ముందువెనుక రెండురోజులు

పుణ్యదినములు, మకర కర్కాటములలో తప్ప అని వృద్ధ వసిష్ఠాది వచనములచే పగలు పుణ్యకాలముగా చెప్పబడినందున రాత్రి సంక్రమణమైన ఆ క్రియలను పగలు చేయాలి. ముందురోజుగాని తరువాతరోజుగాని దగ్గరలో ఉన్నదానికి మాత్రమే ఆ ఫలితం ఉంటుంది అని వసిష్ఠవచనం. కనుక సారాంశమేమన, రాత్రియందు స్నానాదులు చేయరాదని (నిషేధము) తెలిసినది.

మూ॥ యానితు—

వివాహవ్రత సంక్రాంతి ప్రతిష్ఠాఋతు జన్మసు
తథోపరాగ పాతాదౌస్నానే దానేనిశా శుభా॥ ఇతి
రాహుదర్శన సంక్రాంతి వివాహాత్యయవృద్ధిషు
స్నానదానాది కంకుర్యుః నిశికామ్యవ్రతేషుచ॥

ఇత్యాదీని విష్ణుగోభిలాదివచనాని తాని మకర కర్క సంక్రాంతి విషయాణి 'ముక్త్వామకర కర్కటౌ ఇతితయోః దివానుష్ఠానస్య పర్యుదస్తత్వాదితి హేమాద్రి మాధవాదయః. వస్తుతస్తుప్రాగుక్త వచనేనతయోః దినద్వయ పుణ్యత్వాదేరేవ పర్యుదాసాత్ మకర కర్కటయోరపి' స్నానం దానం పర్యేఽహని' ఇత్యాదిభిరహః పుణ్యత్వోక్తేః, అహః పుణ్యత్వానుప పత్త్యాకల్ప్య రాత్రి నిషేధస్యచ ప్రత్యక్ష రాత్రి విధినాబాధాత్ సర్వ సంక్రాంతిషు రాత్రావనుష్ఠాన వికల్పః సచదేశాచారాత్ వ్యవతిష్ఠత ఇతియుక్తః పంథాః ఆయన యోస్తు వక్తవ్యోవిశేషః శ్రావణేమాఘేచ వక్ష్యతే.

ఏవైతే— వివాహ, వ్రత (యజ్ఞోపవీత) సంక్రాంతి, ప్రతిష్ఠా, ఋతు, జన్మగ్రహణ. పాతాదులందు స్నానదానములు రాత్రిచేయుట శుభము అని, రాహు దర్శన (పాతము,) సంక్రాంతి, వివాహ, అత్యయ (మరణం - అశుభం) వృద్ధి (జాతాశౌచ) కామ్యవ్రతములందు రాత్రిపూట స్నానదానాదికములు చేయ వలెను అని మొదలగు విష్ణుగోభిలాది వచనములు ఉన్నవో అవి మకర కర్కాట సంక్రాంతి విషయకములు 'మకర కర్కాటమువదలి' అని వాటిని పగలు అనుష్ఠించటాన్ని నిషేధించారు కాబట్టి అని హేమాద్రి మాధవాదులు అన్నారు. (పర్యుదస్త=exclude) నిజమునకు పైమాట ననుసరించి వానికి రెండురోజుల పుణ్యకాలత్వము (excepted) నిషేధింపబడగా మకర కర్కాటములకు గూడా "స్నానదానములు పరదినమందు" అను మాటలచే పగలు పుణ్యకాలముగా

చెప్పబడగా, పగలు పుణ్యకాలము కాకపోవటాన్ని బట్టి, కల్ప్యరాత్రి నిషేధము ప్రత్యక్షరాత్రి విధితో బాధింపబడినందున, అన్ని సంక్రాంతులందు రాత్రియందు అనుష్ఠించుట వికల్పమని (చేయవచ్చు, చేయకపోవచ్చు) తేలినది అది కూడా దేశాచారము ననుసరించి ఉంటుందనేది సరియైన మార్గం. అయనముల గూర్చి చెప్పవలసిన విశేషము శ్రావణ, మాఘ మాసములలో చెప్పబడును.

మూ॥ జ్యోతిర్నిబంధేగర్గః—

యస్యజన్మర్క్ష మాసాద్య రవిసంక్రమణం భవేత్
తన్మాసాభ్యంతరేతస్య వైరక్లేశధన క్షయాః
తగర సరోరుహపత్రైః రజనీ సిద్ధార్థలోధ్ర సంయుక్తైః
స్నానం జన్మర్క్షగతే రవిసంక్రమణేనృణాం శుభదం॥

హేమాద్రౌ—

అహ్నిచేద్రాత్రి యుగ్మంస్యాత్ రాత్రౌచే ద్వాసరద్వయం
సంక్రాంతిఃపక్షిణీజ్ఞేయా దానాధ్యయనకర్మసు॥

జ్యోతిర్నిబంధమందు గర్గుడు : ఎవని జన్మ నక్షత్రంలో సూర్య సంక్రమణం జరుగునో, వానికి ఆ మాసంలోనే వైరము, కష్టము, ధనక్షయము జరుగుతుంది. నంది వర్ధనము (తగర), తామర ఆకులు, పసుపు (రజని) తెల్ల ఆవాలు (సిద్ధార్థ) లొద్దుగు (లోధ్ర)తో కలిపి జన్మ నక్షత్రమందు సూర్యుడు సంక్రమించిన వేళ స్నానం చేస్తే మనుష్యులకు క్షేమకరము.

హేమాద్రియందు : పగలు సంక్రమణమైతే ముందు, తరవాతి రెండు రాత్రులు, రాత్రి సంక్రమణమైతే రెండు రోజులు దాన అధ్యయన విషయములందు సంక్రాంతి అని తెలుసుకోవాలి. (పక్షిణీ=రెండు పగళ్ళతో కూడిన రాత్రి)

మూ॥ యత్తుగౌడాః : సంక్రాన్త్యాం పక్షయోరంతే ద్వాదశ్యాం శ్రాద్ధవాసరే
సాయం సంధ్యాంన కుర్వీతకుర్వంశ్చ పితృహాభవేత్॥ ఇతి.

కర్మోపదేశిన్యాం వ్యాసోక్తేః సాయం పుణ్యకాలే సంధ్యా నిషేధమాహుః తన్నిర్మూలం. అన్యచ్చబహువక్తవ్యం విస్తరభీతేః నోచ్యతే ఇతి సంక్రాంతి నిర్ణయః.

గౌడులైతే సంక్రాంతి యందు, పక్షాంతమందు (కృష్ణ, శుక్ల), ద్వాదశి యందు శ్రాద్ధపు రోజున సాయం సంధ్య చేయకూడదు. ఒకవేళ చేసిన పితృ హంతకుడగును అని కర్మోపదేశినియందు వ్యాసోక్తి అని సాయం పుణ్యకాల మందు సంధ్యా నిషేధాన్ని చెప్పారో అది నిరాధారము. ఇంకా ఎంతో చెప్పవలసి ఉంది. విస్తారమౌనని ఎంచి భయముచే చెప్పటలేదు అని ఇంతవరకు సంక్రాంతి నిర్ణయము.

మూ॥ **చాంద్రాది మాస నిర్ణయము :** పక్షయుగళశ్చాంద్రో మాసః సద్వేధా శుక్లాదిః అమాంతః కృష్ణాదిః పూర్ణిమాన్తశ్చేతి తథాచ త్రికాండమండన.

చాంద్రోఽపిశుక్ల పక్షాదిః కృష్ణాదిర్వేతిచ ద్విధా
ఇత్యుక్త్వా దేశ భేదేన తద్వ్యవస్థా మాహ -
కృష్ణోపక్షాదికం మాసం నాంగీకుర్వంతి కేచన
యేపీచ్ఛంతిన తేషామపీష్టో వింధ్యస్య దక్షిణే॥ ఇతి.

వింధ్యస్య దక్షిణే కృష్ణాది నిషేధాత్ ఉత్తరతో ద్వయోరభ్యనుజ్ఞాగమ్యతే తత్రాపి శుక్లాదిర్ముఖ్యః కృష్ణాదిర్గౌణః శాస్త్రీయ చైత్ర శుక్ల ప్రతి పద్యేవచాంద్ర సంవత్సరారంభోక్తేః తదుక్తం దీపికాయాం - చంద్రోఽబ్దో మధుశుక్ల ప్రతిప దారంభః ఇతి. నహియే కృష్ణాదిం మన్యంతే, తేషాం వత్సరారంభోభిద్యతే. అతః శుక్లాదిః ముఖ్యః. కృష్ణాదినా మలమాస అసంభవాచ్చ చంద్రస్య సర్వ నక్షత్ర భోగేన నాక్షత్రోమాసః.

సావనాదీనాం వ్యవస్థోక్తా హేమాద్రౌ బ్రహ్మసిద్ధాంతే
అమవాస్యా పరిచ్ఛిన్నోమాసః స్యాత్ బ్రాహ్మణస్యతు.
సంక్రాంతి పౌర్ణమాసీభ్యాం తథైవ నృపవైశ్యయోః.

రెండు పక్షములతో కూడినది చాంద్రమాసము. అది రెండు విధములు- శుక్లము నుండి ఆరంభమై అమావాస్యతో ముగియునది. కృష్ణముతో ఆరంభమై పూర్ణిమతో ముగియునది అని త్రికాండ మండనుడు ఇట్లా - చాంద్ర మాసము శుక్ల పక్షాది, కృష్ణ పక్షాది అని రెండు విధములు అని చెప్పి, దేశ భేదముచే దాని ఉనికిని చెప్పాడు. కొందరు కృష్ణపక్షాది మాసమును అంగీకరించరు. ఎవరైనా ఇష్టపడినా వాళ్ళుకూడా వింధ్యకు దక్షిణంలో ఉంటే ఇష్టపడరు అని వింధ్యకు దక్షిణ భాగంలో కృష్ణాది మాసాన్ని నిషేధించినందున, ఉత్తరంలో రెంటిని

అంగీకరిస్తున్నారని తెలుస్తుంది. అక్కడ కూడా శుక్లాది ముఖ్యము, కృష్ణాది అప్రధానము. శాస్త్రములందు చైత్ర శుక్ల ప్రతిపదయే చాంద్రవత్సరారంభమని చెప్పారు. దీపికలో ఇట్లా చెప్పారు- చంద్రవత్సరము చైత్ర (మధు) శుక్ల ప్రతి పదతో ఆరంభము అని. కృష్ణ పక్షము ఆరంభము భావించే వాళ్ళకుగూడా వత్స రారంభము భిన్నము కాదు. అందువల్ల శుక్లాది ముఖ్యము. కృష్ణాదితో మల మాసము ఆరంభము కాదు. చంద్రుడు అన్ని నక్షత్రములతో భోగించుటచే నాక్షత్ర మాసము.

సావనాదుల వ్యవస్థ హేమాద్రియందు బ్రహ్మ సిద్ధాంతమందు ఇట్లా చెప్ప బడింది- బ్రాహ్మణునకు అమావాస్యతో ముగియునది మాసము. వైశ్యునకు పౌర్ణిమతో ముగియునది మాసము. నృపునకు సంక్రమణముతో ముగియునది మాసము.

మూ॥ అత్ర బ్రాహ్మణాదీనాం యత్రకర్మ విశేషే వచనాంతరేణ 'వసన్తే బ్రాహ్మణోఽగ్నినాదధీత' ఇత్యాదివత్ మాసఉక్తః తత్ర దర్శాన్తత్వమాత్రం నియమ్యతే. నతు సర్వకర్మసు దర్శాన్త ఏవేతి. వృష్ట్యాద్యర్థ సౌరభరే హిషాది నిధననియమవత్ విధి లాఘవాత్ త్రైవర్ణికానాం సర్వకర్మసుమాస విశేషవిధేః సావనాదీనాం శూద్రానులోమాది పరత్వాపత్తేశ్చేతి గురుచరణాః.

జ్యోతిర్గర్గః - సౌరోమాసో వివాహాదౌ యజ్ఞాదౌసావనః స్మృతః
అబ్దికే పితృకార్యేచ చాంద్రోమాసః ప్రశస్యతే॥

ఋష్యశృంగః - వివాహవ్రతయజ్ఞేషు సౌరంమాసం ప్రశస్యతే
పార్వణేత్వష్టకాశ్రాద్ధే చాంద్ర మిష్టం తథాఽబ్దికే॥

స్మృత్యంతరే - ఏకోద్దిష్ట వివాహాదౌ ఋణాదౌ సౌరసావనౌ

జ్యోతిర్గర్గః - ఆయుర్దాయ విభాగశ్చ ప్రాయశ్చిత్త క్రియాతథా
సావనేనైవకర్త వ్యాశత్రూణాం చాప్యుపాసనా॥

విష్ణుధర్మే - నక్షత్ర సత్రాణ్యయనానిచేన్దోః
మాసేనకుర్యాత్ భగణాత్మకేన॥ ఇతి

బ్రాహ్మే - తిథికృత్యేషుచ కృష్ణాదిం వ్రతేశుక్లాది మేవచ
వివాహాదౌచసౌరాదిం మాసం కృత్యే వినిర్దిశేత్॥

ఇక్కడ బ్రాహ్మణాదులకు ఏ కర్మ విశేషమందు ఒక మాటతో 'వసంతంలో బ్రాహ్మణుడు అగ్నిని స్థాపించాలి' అని మొదటగా మాసం చెప్పారో అక్కడ అమావాస్యతో ముగియుటే చెప్పబడింది. కాని అన్ని కర్మలలో అమావాస్యతో ముగియుటే మాసం అని కాదు. వృష్ట్యాది ప్రయోజనం కొరకు 'సౌరభం' అను సామము నుండి 'హీషది' అను సామవేద అంతిమ భాగ నియమంవలె విధి లాఘవం అని భావించాలి. త్రైవర్ణికులకు అన్ని కర్మలలో మాస విశేషమును విధించినందువల్ల సావనాదులకు శూద్రానులోమాది పరత్వా పత్తి కూడా వస్తుంది అని గురుచరణుల అభిప్రాయం (అనులోమ = ఆరోహణ).

జ్యోతిర్గర్గుడు:- వివాహాదులందు సౌరమాసము, యజ్ఞాదులందు సావన మాసము, ఆబ్దికము పితృకర్మ- వీనియందు చాంద్రమాసము ప్రశస్తమైనది.

ఋష్యశృంగుడు:- వివాహవ్రత యజ్ఞములందు సౌరమాసము ప్రశస్తము. పార్వణము, అష్టకాశ్రాద్ధము, ఆబ్దికము- వీనికి చాంద్రమాసము శ్రేష్ఠము.

స్మృత్యంతరంలో (మరో స్మృతిలో) :- ఏకోద్దిష్ట వివాహాదులందు ఋణాదులందు సౌరసావనములు తగుననిరి. (ఋణ=దేవ, పితృ ఋషి.)

జ్యోతిర్గర్గుడు:- ఆయువు, దాయవిభాగము, ప్రాయశ్చిత్తక్రియ, శత్రూ పాసన - ఇవన్ని సావనమాసమందే చేయాలి.

విష్ణుధర్మమందు:- నక్షత్ర, సత్ర (యాగ)ములు, అయనములు భగ ణాత్మకమైన (నక్షత్ర గణాత్మకమైన) చాంద్రమాసములో చేయాలి అని.

బ్రాహ్మమందు:- తిథికృత్యములందు కృష్ణాదిని, వ్రతమందు శుక్లాదిని వివాహాదులందు సౌరాది మాసమును నిర్దేశించాలి.

మూ॥ **మలమాసము** తత్ర ఏకమాత్ర సంక్రాంతి రహితః సితాదిః చాంద్రః మలమాసః ఏకమాత్ర సంక్రాంతి రాహిత్యం అసంక్రాంతత్వేన సంక్రాంతి ద్వయత్వేనచ భవతీతి. మలమాసోద్వేధా. అధిమాసఃక్షయమాసశ్చేతి. తదుక్తం కాఠకగృహ్యే-

యస్మిన్ మాసేన సంక్రాంతిః సంక్రాంతి ద్వయమేవవా
మలమాసః సవిజ్ఞేయోమాసః స్యాత్తుత్రయోదశ॥ ఇతి.
సత్యవ్రతోఽపి—
రాశిద్వయం యత్రమాసే సంక్రమేత దివాకరః
నాధిమాసోభవేదేష మలమాసస్తు కేవలం॥

ఇక మలమాసము. ఒక్క సంక్రమణము కూడా లేనిది. శుక్ల పక్షంతో మొదలయ్యే చాంద్రమాసము మలమాసము. ఒక్క సంక్రాంతి కూడా లేకుండా పోవటం అనేది సంక్రాంతి లేనందువల్ల, రెండు సంక్రాంతులున్నందువల్ల కూడా సంభవిస్తుంది అని మలమాసము రెండు విధములు- అధిమాసము, క్షయమాసము అని. కాఠకగృహ్యమందు ఇట్లా చెప్పబడింది - ఏ మాసంలో సంక్రాంతి లేదో లేదా రెండు సంక్రాంతులున్నాయో అది మలమాసమని తెలియాలి. అది పద మూడవ మాసము అని.

సత్యవ్రతుడు కూడా : ఏ మాసంలో సూర్యుడు రెండు రాసులలో సంక్రమిస్తాడో అది అధిమాసం కాదు, కేవలం మలమాసమే.

మూ॥ **అధిమాసకాలనియమం - వసిష్ఠః—**

ద్వాత్రింశద్భిః మితైర్మాసైః దినైః షోడశభిస్తథా

ఘటికానాంచతుష్కేణ పతత్యధికమాసకః॥ ఇతి.

ఏతచ్ఛ సావనాదిమానేన సంభవార్థం, నతునియమార్థం. అన్యథా షోడశ దినాధిక ద్వాత్రింశన్మాసానంతరం కృష్ణపక్షనియమేన శుక్లాదిత్వభంగాపత్తేః. తేన న్యూనాధికకాలే మలమాస పాతేఽపినదోషః అత ఏవోక్తం మాధవీయే 'మాసే త్రింశత్తమే భవేత్' ఇతి.

**అధికమాసమునకు కాలనియమమును వశిష్ఠుడు** ఇట్లా చెప్పాడు- ముప్పది రెండు మాసములు, పదహారు దినములు, నాల్గు గడియల తరువాత అప్పుడు అధికమాసం వస్తుంది అని. ఇది సావనాదిమాసముతో సంభవిస్తుంది కాని, ఇదే నియమం కాదు. అట్లాకాకపోతే పదహారు రోజులు ఎక్కువైన ముప్పది రెండు మాసాల అనంతరం కృష్ణపక్షం వస్తుంది. మరి (అధికమాసం) శుక్లపక్షారంభంతో (ఆరంభం) అనే మాటకు భంగకరం. కనుక (పైన చెప్పినట్లు ఖచ్చితంగా కాక) హెచ్చు, తగ్గుగా మలమాసం వచ్చినా దోషం లేదు. అందువల్లే మాధవీయంలో ఇట్లా అన్నారు - 'ముప్పదవ మాసంలో (మలమాసం) వస్తుంది' అని.

మూ॥ **ఇక క్షయమాసం గూర్చి :**

క్షయమాసోఽపి జ్యోతిః శాస్త్రే—

అ సంక్రాంతి మాసోఽధికమాసః స్ఫుటంస్యాత్

ద్వి సంక్రాంతిమాసః క్షయాఖ్యః కదాచిత్

క్షయః కార్తికాదిత్రయే నాన్యతః స్యాత్

తదా వర్షమధ్యేఽధిమాస ద్వయంచ॥ ఏకం క్షయాత్పూర్వం. పరతశ్చ కతః. ఇత్యధిమాస ద్వయంభవతీత్యర్థః.

అత్రవిశేషమాహజాబాలిః—

మాసద్వయేఽబ్ద మధ్యేతు సంక్రాంతిర్న యదాభవేత్

ప్రాకృతః తత్రపూర్వః స్యాత్ అధిమాసస్తథోత్తరం॥

ఇతి ఉత్తరే ఏవ కాలాధిక్యం. నపూర్వస్మి నిత్యర్థః.

యత్తుబ్రహ్మసిద్ధాంతే —

చైత్రా దర్వాఙ్నాధిమాసః పరతస్త్వధికో భవేత్

ఇతి. తత్ర చైత్రాత్పూర్వం అసంక్రాంతద్వయే పూర్వోనాధికః కింతుపర ఇత్యర్థః.

యచ్చజ్యోతిస్సిద్ధాంతే—

ఘటకన్యాగతే సూర్యే వృశ్చికేవాఽథ ధన్విని

మకరేవాఽథ కుంభేవానాధిమా సోవిధీయతే॥ ఇతి తత్ వృశ్చికాది చతుష్టయే మలమాసే సతిపూర్వం తులాకన్యాగతే సూర్యేక్షయా త్పూర్వభావ్యధిమాసస్య కాలాధిక్యమాత్ర నిషేధార్థం నత్వధికమాసస్య.

దశానాం ఫల్గునాదీనాం ప్రాయః మాఘస్యచక్వచిత్

నపుంసకత్వం భవతీత్యేష శాస్త్రవినిశ్చయః॥ ఇతి హేమాద్రౌ విష్ణుధర్మ విరోధాత్.

మలమాసే అష్టకాది నిషేధానుపపత్తేశ్చ. "మకరేవాథ కుంభేవా" ఇతి దృష్టాంతార్థం ప్రాప్త్యభావాత్.

**క్షయమాసము** : జ్యోతిషశాస్త్రంలో క్షయమాసం-సంక్రాంతిలేని మాసం అధిమాసము అని, రెండు సంక్రమణములుకల మాసం క్షయ మాసమని. కార్తికాది మూడు మాసాలలో క్షయమాసం వస్తుంది, మరొకప్పుడు రాదు. ఆ సంవత్సరం మధ్యలో రెండు అధిమాసాలు వస్తాయి. ఒకటి క్షయం కంటే ముందు, మరొకటి క్షయం తర్వాత అని అధిమాసద్వయం వస్తాయి. అని అర్థం. ఇక్కడ జాబాలి ఒక విశేషం చెప్పాడు. సంవత్సర మధ్యంలో రెండు మాసములలో సంక్రమణం రాకున్న యెడల అందుల్లో మొదటిది సాధారణంగా వచ్చే

మాసం, రెండవది అధిమాసము అని. రెండవదానిలో కాలాధిక్యం, మొదటి దానిలో కాదు అని అర్థం. బ్రహ్మసిద్ధాంతమందు - చైత్రంకన్న ముందుది అధి మాసం కాదు, పరమైనదే అధికము అని ఏది చెప్పారో అక్కడ చైత్రంకన్న ముందు రెండు అసంక్రమణ మాసాలుంటే అందు మొదటిది అధికం కాదు. కాని పరమైనదే అధికము అని భావం.

జ్యోతిషసిద్ధాంతమందు : సూర్యుడు తుల (ఘట), కన్య, వృశ్చికం, ధనుస్సు, మకర, కుంభములలో గాని సంక్రమించినపుడు అధికమాసం రాదు అని చెప్పారో అది వృశ్చికాది నాల్గు మాసములలో మలమాసం ఉంటే, ముందు సూర్యుడు తుల, కన్యగతుడైనప్పుడు మలమాసం ఉంటే (తర్వాత క్షయమున్న) సూర్యుడు తుల, కన్యగతుడు కాగా క్షయముకన్న ముందున్న అధిమాసంలో కాలాధిక్యం ఉండదు అని మాత్రమే నిషేధం కాని అధికమాస నిషేధం కాదు. ఫాల్గుణ ఆది పది మాసములు అట్లాగే మాఘమాసము ఒక్కొక్కప్పుడు (11 మాసాలు) నపుంసక మాసాలౌతాయి. (అనగా సంక్రమణ రహితమౌతాయి.) ఇది శాస్త్ర నిశ్చయము. ఇది హేమాద్రియందు విష్ణు ధర్మవిరోధము మల మాసంలో అష్టకాది నిషేధము అనువవన్నమౌతుంది (వర్తించదు) కూడా. మకరంలో లేదా కుంభంలో అన్నమాట దృష్టాంతముకొరకే అధికమాసప్రాప్తి లేదు కాబట్టి. (నిషేధం కొరకు కాదు.)

మూ॥ **క్షయమాసం వచ్చే కాలము సిద్ధాంత శిరోమణౌ-**
గతోఽబ్ధ్యద్రినందైః గతేశాకకాలే
తిథీశైః భవిష్యత్య ఖాంగాక్ష సూర్యైః
గజాద్ర్యగ్నిభూమిస్తథా ప్రాయశోయం
కువేదేందువర్షైః క్వచిత్ గోకుభిశ్చ॥ ఇతి

అబ్ధయః చత్వారః, అద్రయఃసప్త, నందాఃనవ, ఏషాంప్రాతిలోమ్యేన పాతే 974 త్రైర్మితేవర్షేకశ్చిత్ క్షయమాసః పూర్వంజాతః ఇత్యర్థః తిథయః పంచదశ, ఈశాః ఏకాదశ, 1115 ఏవంమితేయాతే కశ్చిద్భవిష్యతీత్యర్థః అంగ 6, అక్ష 5, సూర్యాః 12, ఏకత్ర 1256. గజాః 8, అద్రయః 7, అగ్నయః 3, భూః 1, ఏకత్ర 1378, కుః 1, వేదాః 4, ఇందుః 1, ఏకత్ర 141, గావః 9, కుః 1, ఏకత్ర 19 ఏత్రైర్మితే వర్షేయాతే కశ్చిద్భవిష్యతీత్యర్థః.

సిద్ధాంత శిరోమణియందు— శక సంవత్సరం 974 లో ఒక క్షయ మాసం వచ్చింది. 1115 లో ఒక క్షయమాసం వస్తుంది. 1256, 1378 తరువాత 141 సంవత్సరాలకు తర్వాత 19 సంవత్సరాలకు క్షయమాసం వస్తుంది అని అర్థం.

మూ॥ **మలమాసంలో చేయతగినవి, చేయతగనివి తత్ర జాబాలిః—**

నిత్యనైమిత్తికే కుర్యాత్ శ్రాద్ధం కుర్యాత్ మలిమ్లుచే
తిథి నక్షత్ర వారోక్తం కామ్యంనైవక దాచన॥
అయంచకామ్య నిషేధ ఆరంభ సమాప్తి విషయః
అసూర్యానా మయేమాసా నతేషుమమ సంమతః
వ్రతానాంచైవ యజ్ఞానాం ఆరంభశ్చ సమాపనం॥

ఇతి తెనైవోక్తత్వాత్ అసూర్యా అధికమాసా ఇత్యర్థః తత్ర "మండలం తపతేరవేః" ఇతి వచనాత్. కారీర్యాదేః కామ్యస్యతు ఆరంభ సమాప్తౌ భవత ఏవేత్యా దిరన్యత్ర విస్తరః కాఠకగృహ్యేపి— మలేఽనన్యగతింకుర్యాత్ నిత్యాం నైమిత్తికీం క్రియాం॥ ఇతితాని నైమిత్తికాని దీపికాయాముక్తాని—

యన్నైమిత్తిక మగ్ని నష్ట్యను గతాగ్న్యాధాన మర్చాసువా
సంస్కారాదివిలోపనే సతి పునః ప్రోక్తం ప్రతిష్ఠాదికం ॥ఇతి గత్యంతర యుతంతు సోమాది హేయమేవ.

జాబాలి:- మల మాసంలో నిత్య నైమిత్తిక కర్మలు, శ్రాద్ధము చేయాలి. తిథి నక్షత్ర వారములతో చెప్పబడిన కామ్యకర్మలు చేయరాదు. ఈ కామ్యకర్మ నిషేధము ఎట్లా అంటే-ఆ నెలలోనే మొదలుపెట్టి ఆ నెలలోనే పూర్తి చేయుట కూడదు. అని అధిక మాసములలో వ్రతములు, యజ్ఞములు ఆరంభించి ముగించుట నాకు ఇష్టము కాదు అని ఆయనే చెప్పాడు (అసూర్య=అధిక మాసం). అక్కడ సూర్యమండలం తపిస్తున్నది అని ప్రమాణము. కారీరి మొదలగు కామ్య కర్మల ఆరంభ సమాప్తులు జరుగును అను మొదలగు అంశం మరోచోట విస్తరించబడును. కాఠక గృహ్యంలో కూడా - మరొక గతి లేని నిత్యనైమిత్తిక కర్మలను అధిక మాసంలో చేయాలి అని ఉంది. ఆనైమిత్తికముల గూర్చి దీపికలో చెప్పారు - హోమాగ్ని నాశమైన దానిని కూర్చుట, దేవతా ప్రతిమకు సంస్కారాదులు (అర్చా) లోపించిన తిరిగి ప్రతిష్ఠాదులు చేయుట నైమిత్తికము

లని చెప్పబడినది. (ఇవి అగతికాలు కనుక మల మాసంలో చేయాలి). మరో గతి కల్గిన సోమాదులు విడువ తగినవి (చేయరాదు)

మూ॥ **అక్కడ చేయతగినవి** కాలాదర్శే—

ద్వాదశాహాస పిండాంతం కర్మ గ్రహణ జన్మనోః
సీమంతే పుంసవే శ్రాద్ధం ద్వావేతౌ జాత కర్మచ॥
రోగేశాన్తిః అలబ్ధే చ యోగే శ్రాద్ధం వ్రతానిచ
ప్రాయశ్చిత్తం నిమిత్త స్యవశాత్ పూర్వేపరత్రచ॥
అబ్దోదకుంభమన్వాది మహాలయయుగా దిషు
శ్రాద్ధం దర్శేవ్యహరహః శ్రాద్ధమూనాది మాసికం॥
మలిమ్లుచాన్య మాసేషుమృతానాం శ్రాద్ధమాబ్దికం
శ్రాద్ధంతు పూర్వ దృష్టేషు తీర్థేష్వేవం యుగాదిషు॥
మన్వాదిషుచ యద్దానం దానం దైనందినం చయత్
తిల గో భూ హిరణ్యానాం సంధ్యోపాసనయోః క్రియా॥
పర్వ హోమశ్చాగ్రయణం సాగ్నేరిష్టిశ్చపర్వణి
నిత్యాగ్ని హోత్ర హోమశ్చ దేవతాఽతిథి పూజనం॥
స్నానంచ స్నానవిధినాఽప్యభక్ష్యాపేయ వర్జనం
తర్పణంచ నిమిత్తస్య నిత్యత్వాదు భయత్రచ॥ ఇతి

ఏతౌచ పుంసవనసీమన్తౌ ఏతచ్చ గర్భాధానాద్యన్న ప్రాశనాన్త సంస్కారోప లక్షణం తదుక్తం దీపికాయాం—

గార్భాదాన ముఖంచ చేల విధితః ప్రాగ్జాతయాగం వినా
కృచ్ఛ్రేష్ట్యాగ్రయణం గజేంద్ర పురతః ఛాయా మమానంగయోః
తీర్థేందు క్షయయోశ్చ పిత్ర్యమధికే మాస్యేవ మాద్యాచరేత్॥ ఇతి

అలబ్ధేయోగే అర్ధోదయ పద్మకాదౌ కామ్యాన్యపి వ్రతాదీని కార్యాణీత్యర్థః పూర్వే పరత్ర - మలెశుద్ధేచేత్యర్థః మహాలయ శబ్దేన మహా త్రయోదశీ ఉచ్యతే ఇతి మాధవః దర్శశ్రాద్ధం మలేఽపికార్యం.

కాలాదర్శమందు :- సపిండీకరణంతో ముగిసే పన్నెండవ రోజు కర్మ, గ్రహణకర్మ. జన్మకర్మ, సీమంత పుంసవనములందలి శ్రాద్ధము, సీమంతం, పుంసవనం జాతకర్మ, రోగమునకు శాంతి. అవకాశం లభించని శ్రాద్ధము,

వ్రతములు, నిమిత్తం వల్ల ఏర్పడ్డ ప్రాయశ్చిత్త కర్మ పూర్వం మలమాసంలో, తర్వాతి శుద్ధమాసంలో చేయాలి అబ్ధిక మందలి ఉదకుంభదానం, మన్వాది, మహాలయమందు, యుగాదులందు అమావాస్యయందు (దర్శ) చేయాల్సిన శ్రాద్ధకర్మ, నిత్యశ్రాద్ధము, ఊనాదిమాసిక శ్రాద్ధము మలమాసంలో చేయాలి. అధికేతరమాసాల్లో మరణించిన వారి ఆబ్దిక శ్రాద్ధం ఇదివరకే చూడిన తీర్థములందు శ్రాద్ధము యుగాదిశ్రాద్ధము చేయాలి. మన్వాదులందలి దానము, నిత్యదానము, (తిల, గో, భూమి హిరణ్యములు), సంధ్య, ఉపాసనకర్మ, పర్వహోమము, ఆగ్రయణము, పర్వమందు సాగ్నిక ఇష్టి, నిత్యాగ్ని హోత్రహోమము, దేవత, అతిథిపూజ, స్నానవిధిగా స్నానము, అభక్ష్య అపేయములను వదలటం చేయాలి. నైమిత్తిక తర్పణము నిత్యమైంది కాబట్టి వదలరాదు-రెండు చోట్ల ఆచరించాలి అని. ఏతే అను శబ్దం పుంసవన సీమంతాదులకు అర్థం. ఇది గర్భాధానం మొదలు అన్న ప్రాశనవరకైన సంస్కారములకు సూచకము. దీపికలో ఇట్లా చెప్పారు - గర్భాధానము మొదలు చౌలవిధి కంటె ముందువరకు (జాతకర్మ తప్ప), కృచ్ఛ్రములందు ఆగ్రయణము (మార్గశిర పూర్ణిమా యజ్ఞం), గజచ్ఛాయాయజ్ఞం, మఘ, త్రయోదశికర్మలు, తీర్థ, అమావాస్యాదులందలి శ్రాద్ధకర్మలు మొదలగునవి అధికమాసంలో ఆచరించాలి అని. అవకాశంలేని పక్షాన అర్ధోదయ పద్మకాదులందలి కామ్యవ్రతములు మొ॥ నవి కూడా చేయాలి అని అర్థం (పూర్వం=మలమాసం. పరం=శుద్ధమాసం) మహాలయ శబ్దం వల్ల మఘ త్రయోదశిని గ్రహించాలి అని మాధవులు. దర్శ శ్రాద్ధమును మలమాసంలో కూడా చేయాలి.

మూ॥ యత్తుఋష్యశృంగః - సంవత్సరాతి రేకేణ మాసోయః స్యాన్మలిమ్లుచః
తస్మిన్ త్రయోదశే శ్రాద్ధం నకుర్యాదింద సంశయే॥ ఇతి

తత్ కామ్యదర్శ శ్రాద్ధవిషయం 'కామ్యం నైవకదాచన' ఇతి వచనాత్. దర్శేచ కామ్యం శ్రాద్ధం 'కన్యాం కన్యావేదినశ్చ' ఇత్యాది నాయాజ్ఞవల్క్యేనోక్తం నిత్యంతు మలేఽపి భవత్యేవ. దర్శేప్యహరహః శ్రాద్ధం దానంచ ప్రతివాసరం.

గోభూతిల హిరణ్యానాం మాసేఽపిస్యాన్మలిమ్లుచే॥
ఇతి మాత్స్యోక్తేరితి హేమాద్ర్యాదయః.

దివోదాసీయేపి - అనిందురిందు పూర్ణాచ హరివారో బుధాష్టమీ
నాధిమాసేపరిత్యాజ్యాః సీమంతాన్నాశనే శిశోః॥

ఇతి. అనిందు=దర్శః. 'ద్వివిధమప్యమా శ్రాద్ధంన కార్యం' ఇతిత్వ పరార్కః 'తత్ర యద్విహితం కర్మ ఉత్తరేమాసికారయేత్' ఇత్యుక్తేః 'షష్ట్యా తుదివసైర్మాసః' ఇతి శుద్ధమాసకరణేఽపి శాస్త్రార్థోపపత్తేః దర్శశ్రాద్ధం మలే న కార్యమితి ప్రాచీనగౌడాః, శూలపాణిశ్చ.

ఋష్యశృంగుడు - సంవత్సరం దాటిన తరువాతి మాసం అధికమాసం. ఆ త్రయోదశమాసంలో, అమావాస్యయందు శ్రాద్ధము చేయరాదు అని ఏది చెప్పారో అది కామ్య దర్శ శ్రాద్ధవిషయము కామ్యం ఎప్పుడూ చేయరాదు అని ఉండటం వల్ల, కన్యను ఎరిగినవారు కన్యను గ్రహించకపోవటం వలె దర్శ మందు కామ్య శ్రాద్ధము చేయరాదని మొదలుగా యాజ్ఞవల్క్యులు చెప్పారు. నిత్యశ్రాద్ధము మలమాసంలో కూడా చేయాలి. అమావాస్యయందు నిత్యశ్రాద్ధము, ప్రతిరోజు గో,భూ,తిల, హిరణ్యముల దానము మలమాసంలో కూడా ఉంటాయి అని మాత్స్యోక్తి అని హేమాద్ర్యాదులు చెప్పారు.

దివోదాసీయమందు కూడా ఇట్లా - అమావాస్య, పూర్ణిమ, ఏకాదశి, బుధ వారం, అష్టమి, సీమంతము, శిశువునకు అన్నప్రాశన - వీనిని అధిమాసంలో వదలరాదు అని. అపరార్కుడు - రెండు విధములైన అమాశ్రాద్ధములను చేయ రాదని అనెను. అక్కడ విధించిన కర్మను తరువాతి మాసంలో చేయాలి అనే వచనాన్నిబట్టి. అరవై రోజులతో మాసము అని శుద్ధమాసం చేసినా శాస్త్రార్థము సిద్ధించినా దర్శశ్రాద్ధము మలమాసంలో చేయరాదని ప్రాచీన గౌడులు, శూలపాణి అన్నారు.

మూ॥ సంవత్సరప్రవిష్టేఽపి — ఏకరాశి స్థితేసూర్యే యదాదర్శద్వయాభవేత్
దర్శశ్రాద్ధంతదాఽదౌస్యాత్నపరత్రమలిమ్లుచే॥

అత్రాపి (నిత్యకామ్యభేదేన) ప్రాగ్వద్వ్యవస్థా యద్యపికాలాదర్శే 'సర్వం వార్షికం మాసద్వయేకార్యం' ఇత్యుక్తం. తథాపి హేమాద్రి మాధవ అపరార్కా దిమతాత్ ప్రథమాబ్దికం త్రయోదశేమలమాసే, ద్వితీయాద్యాబ్దికంతు శుద్ధమాసే ఏవకార్యం.

అసంక్రాంతేఽపి కర్తవ్యమాబ్దికం ప్రథమం ద్విజైః
తథైవమాసికం శ్రాద్ధం సపిండీకరణం తథా॥ ఇతిహారీతో క్తేః

ఆబ్దికం ప్రథమం యత్స్యాత్ తత్కుర్వీతమలిమ్లుచే (చతుర్దశే) త్రయోదశేతుసంప్రాప్తే కుర్వీత పునరాబ్దికం॥ ఇతి స్మృత్యన్తరో క్తేశ్చ పునరాబ్దికంద్వితీయాదివార్షికం త్రయోదశేమాసే అతీతే చతుర్దశాద్యదినే కుర్యాదిత్యర్థః.

యత్తుసత్యవ్రతః—వర్షే వర్షేతుయచ్ఛ్రాద్ధం మాతాపిత్రోః మృతేఽహని
మలమాసేనతత్కార్యం వ్యాఘ్రస్యవచనం యథా॥

ఇతితత్ ద్వితీయాది వార్షిక విషయం ఆబ్దికం ప్రథమం యత్స్యాత్ తత్కుర్వీత మలిమ్లుచే ఇతి పూర్వోక్తవచనాత్ తేనయత్ర ద్వాదశం మాసికం శుద్ధమాసే భవతి, తత్ర త్రయోదశే అధికే ఏవ ఆద్యాబ్దికం కార్యం. యత్రత్వధిక మధ్యే ద్వాదశం మాసికం తత్రతస్య ద్విరావృత్తిం కృత్వాచతుర్దశే శుద్ధే ఏవ ప్రథమాబ్దికమితినిష్కర్షః తేనద్వితీయాది శుద్ధమాసే ఏవ పృథ్వీచంద్రోదయే దివోదాసీయే మదనపారిజాతే చైవం మలమాసమృతానాంతు యదాస ఏవాధికః స్యాత్తదాతత్రైవ ప్రతి సాంవత్సరికం కార్యం యథాఽఽహపైఠీనసిః.

మలమాసేమృతానాంతు శ్రాద్ధంయత్ప్రతి వత్సరం
మలమాసేఽపికర్తవ్యం నాన్యేషాంతు కథంచన॥ ఇతి

సంవత్సరప్రదీపమందు కూడా. సూర్యుడు ఒకే రాశిలో ఉండగా రెండు అమావాస్యలు వచ్చిన దర్శశ్రాద్ధము మొదట ఔతుంది. తరువాతి అధికమాసంలో కాదు. ఇక్కడ కూడా ముందు చెప్పినట్లుగా (నిత్య కామ్య భేదంతో) నియమం కాలాదర్శంలో. అన్ని వార్షిక శ్రాద్ధములు రెండు మాసాల్లో చేయాలని చెప్పినప్పటికీ హేమాద్రి, మాధవ, అపరార్కుడు మొదలగువారి మతంవల్ల ప్రథమాబ్దికము 13వ మలమాసమందు, ద్వితీయాది ఆబ్దికము మాత్రం శుద్ధమాసంలోనే చేయాలి అని సంక్రమణం లేకపోయినా ప్రథమ ఆబ్దికమును మాసికశ్రాద్ధమును సపిండీకరణమును ఆ మాసంలోనే బ్రాహ్మణులు చేయాలి అని హారీతుడు చెప్పాడు అధిక మాసంలోనే ప్రథమాబ్దికమును చేయాలి. పదమూడవ మాసం గడిచాక 14 వ మాసం మొదటి రోజున ద్వితీయాది వార్షిక ఆబ్దికములు చేయాలి అని స్మృత్యంతరంలో చెప్పారు. సత్యవ్రతుడు, ప్రతి సంవత్సరం తలిదండ్రులు చనిపోయిన రోజున వచ్చే శ్రాద్ధాన్ని మలమాసంలో చేయరాదని వ్యాఘ్రుడు

చెప్పాడు, అని అన్నమాట ద్వితీయాది అబ్దికములకు సంబంధించిన విషయము. ప్రథమ అబ్దికమును అధికమాసంలో చేయాలి అని ముందు చెప్పినమాటే. అందు వల్ల ద్వాదశమాసికం శుద్ధమాసంలో వస్తే, త్రయోదశమాసం అధికమాసమైతే అందులోనే మొదటి అబ్దికము చేయాలి. అధికమాసం మధ్యలో ద్వాదశమాసికం వస్తే, దాన్ని రెండుసార్లు ఆవృత్తి చేసి 14 వ శుద్ధ మాసంలోనే ప్రథమాబ్దికము చేయాలి అని నిష్కర్ష. అందువల్ల ద్వితీయాది ఆబ్దికాలు శుద్ధ మాసంలోనే అని పృథ్వీ చంద్రోదయంలో, దివోదాసీయంలో - మదన పారిజాతంలోనూ ఉంది. మలమాసంలో మృతి చెందినవారికి అదే అధిక మాసం వస్తే దానియందే ప్రతి సాంవత్సరికం చేయాలి పైఠీనసుడు ఇట్లా అంటాడు - మల మాసంలో మృతి చెందిన వారి ప్రతి సంవత్సర శ్రాద్ధాన్ని మలమాసంలోకూడా చేయాలి. ఇతరుల విషయంలో అట్లా కాదు అని

మూ॥ హేమాద్రౌవ్యాసోఽపి -

మల మాసకృతానాంతు సౌరం మానం సమాశ్రయేత్

స ఏవ దివసస్తస్య శ్రాద్ధ పిండోదకాదిషు॥

యత్తు వృద్ధ వసిష్ఠః—శ్రాద్ధీయాహనిసం ప్రాప్తే అధిమాసో భవేద్యది

మాసద్వయేపి కుర్వీత శ్రాద్ధమేవం నముహ్యతి.

యచ్చవ్యాసః— ఉత్తరే దేవకార్యాణి పితృకార్యాణి చోభయోః

ఇతి తన్మాసికాది విషయం—

యౌగాది కంమాసి కంచ శ్రాద్ధం దాపర పక్షికం

మన్వాదికం తైర్థికంచ కుర్యాన్మా సద్వయేఽపిచ॥

ఇతి స్మృతి చంద్రికోక్తేః తైర్థికం=తీర్థశ్రాద్ధం తచ్చ దైవాత్ తీర్థప్రాప్తౌ మా సద్వయేఽపి కార్యమితి త్రిస్థలీసేతౌ భట్టాః

కే చిత్తు—ప్రతి మాసం మృతాహేచ శ్రాద్ధం యత్ప్రతివత్సరం

మన్వాదౌచయుగా దౌచ తన్మాసోరుభయోరపి॥ ఇతి మరీచివచనాత్ -

వర్షే వర్షేతుయత్ శ్రాద్ధం మాతాపిత్రోః మృతేఽహని

మాసద్వ యేపి తత్కుర్యాత్ వ్యాఘ్రస్య వచనం యథా॥

ఇతి గాలవోక్తేశ్చ ప్రత్యాబ్దికం మా సద్వయే కార్యమిత్యాహుః, తత్ తుచ్ఛం. ప్రతిమాసే మృతాహే క్రియమాణం మాసికం, ప్రతి సంవత్సరం క్రియ

మాణం మాసికం, ప్రతి సంవత్సరం క్రియమాణం కల్పాది శ్రాద్ధం, ఇతి మరీచి వచసోమదనరత్నే వ్యాఖ్యానాత్. గాలవీయస్యచ మాసద్వ యాత్మకే క్షయమాసే ఇది మాధవేన వ్యాఖ్యానాత్. యచ్చకైశ్చిదుక్తం ప్రథమాబ్దికం మాసద్వయే కార్యం - ఆబ్దికం ప్రథమం యత్ స్యాచ్ తత్కుర్వీత మలిమ్లుచే త్రయోదశేచసం ప్రాప్తే కుర్వీతపునరాబ్దికం॥ ఇతి యమోక్తేఃతి, తదపి చింత్యం. పునరాబ్దికం ద్వితీయాది వార్షికం త్రయోదశే అతీతే చతుర్దశేకుర్యాత్ అన్యథా సాంవత్సరం నవర్ధేత శ్రాద్ధంతత్ర మృతేఽహని, ఇతి పైఠీనసి విరోధః స్యాదితి హేమా ద్రౌపృథ్వీ చంద్రోదయేచ. ఏతేన 'నవర్ధేత' నఛింద్యాత్. శుద్ధేపికుర్యాదేవ ఇత్యనంతభట్ట వ్యాఖ్యామానాభావాత్ పరాస్తా పూర్వ వ్యాఖ్యాయాంతు హారీతీయే ప్రథమ గ్రహణమేవమానం.

హేమాద్రియందు వ్యాసోక్తి : మలమాసంలో మృతి చెందినవారికి సౌర మానాన్ని అనుసరించాలి. వారికి శ్రాద్ధ పిండోదక క్రియలందు అదే దివసము. వృద్ధ వసిష్ఠుడు - శ్రాద్ధపు రోజు వచ్చినప్పుడు అధిమాసం ఉంటే రెండు మాసా లలోకూడా శ్రాద్ధం చేయాలి అని అన్నాడో, వ్యాసుడు - దేవకార్యాలు ఉత్తర మాసంలో, పితృ కార్యాలు రెండు మాసాలలో చేయాలి అని అన్నాడో ఇది మాసికముల విషయము. స్మృతిచంద్రికలో యోగాదికము, మాసికశ్రాద్ధము, కృష్ణపక్షశ్రాద్ధము, మన్వాదికము, తైర్థికము ఇవి రెండు మాసాలలో చేయాలి అని చెప్పారు. తైర్థికం=తీర్థశ్రాద్ధము. అది దైవవశాత్తు తీర్థమందు సంభవిస్తే రెండు నెలలలో చేయాలని త్రిస్థలీసేతువునందు భట్టులు చెప్పారు.

కొందరు ప్రతి మాసం మరణించినరోజుచేసే శ్రాద్ధం, ప్రతి సంవత్సర శ్రాద్ధము, మన్వాదులందు, యుగాదులందు చేయు శ్రాద్ధము-ఇవి రెండు మాసము లలో చేయాలని మరీచి వాక్కు ఉండటంవల్ల ప్రతి వత్సర శ్రాద్ధము, తలి దండ్రుల మరణపు రోజు చేసేది దాన్ని రెండు నెలల్లోనూ చేయాలి వ్యాఘ్రుని వచనప్రకారం అని గాలవుడన్నమాట ఉండటంవల్ల ప్రత్యాబ్దికము రెండునెలల్లో చేయాలి అని (కొందరు) అన్నారో అది తుచ్ఛము ప్రతిమాసము చచ్చిన రోజున చేయబడేది మాసిక శ్రాద్ధము, ప్రతి సంవత్సరం చేయబడేది కల్పాదిశ్రాద్ధము అని మరీచి మాటలను మదనరత్నంలో వ్యాఖ్యానించారు. గాలవుని మాట ాసద్వయం' అనుదాన్ని 'క్షయమాసం' అని మాధవుడు వ్యాఖ్యానించాడు. ందరు-ప్రథమాబ్దికాన్ని రెండు మాసాలలో చేయాలి. మొదటి ఆబ్దికాన్ని మల

మాసంలో చేయాలి. 13 వ నెల వచ్చిన పిదప మళ్ళీ అబ్దికం చేయాలి అని యమోక్తి అని అన్నారో అదికూడా విచారించాలి.పునరాబ్దికం అంటే ద్వితీయాది అబ్దికం 13 నెల గడిచాక 14 నెలలో చేయాలి. లేకున్న ప్రథమ సంవత్సర శ్రాద్ధము చనిపోయిన రోజే చేయాలి. సంవత్సరం దాటకూడదు అనే పైఠీనసి మాటకు విరోధము అగును అని హేమాద్రియందు, పృథివీ చంద్రోదయమందు కూడా చెప్పారు. దీనివల్ల 'నవర్తేత' దాటకూడదు. శుద్ధమందు కూడా చేయాలి అని అనంతభట్ట వ్యాఖ్యకు ప్రమాణం లేనందువల్ల తొలగిపోయింది. పూర్వ వ్యాఖ్యయందు, హారీతవచనమందు ప్రథమ గ్రహణం ఉందే అదే ప్రమాణం.

మూ॥ యదపి నిర్ణయామృతే పూర్వోక్త కాలాదర్శవచనాత్ మలమాసే శ్రాద్ధదినస్య వంధ్యత్వ నిరాసార్థం పిత్రాద్దేశేన బ్రాహ్మణాన్ భోజయిత్వా శుద్ధ మాసే సపిండకం శ్రాద్ధం కుర్యాత్-

పిండవర్జమ సంక్రాంతే సంక్రాంతౌ పిండసంయుతం
ప్రతి సంవత్సరం శ్రాద్ధం ఏవం మాసే ద్వయేఽపిచ॥ ఇతి

వృద్ధవరాశరోక్తే రితితదపిచింత్యం పూర్వోక్త వచనస్య క్షయపూర్వభావి అధికమాస విషయత్వాత్ తత్రహిమాసద్వయే శ్రాద్ధముక్తం తదాహసత్యతపాః-

ఏకఏక (వ) యదామాసః సంక్రాంతి ద్వయసంయుతః
మాసద్వయగతం శ్రాద్ధం మలమాసేఽపి శస్యతే॥ ఇతి

మాసద్వయగతం - పూర్వాసంక్రాంతి గతం, క్షయగతంచ మలమాసే- క్షయమాసే అపిశబ్దాత్ తత్పూర్వాధిమాసే చేతి హేమాద్రిః. దీపికాఽపి-

తత్ప్రాక్ సత్ యధిమాసకో యదిభవేత్ తత్రత్య సాంవత్సరం
తస్మిన్ శుద్ధతయా క్షయేచ వచనాత్ కుర్యాత్ ద్వయోః కోవిదః॥ ఇతి కాలాదర్శేఽపి ఏతద్విషయ ఏవ ఇత్యలంబహునా.

నిర్ణయామృతంలో, ముందు చెప్పిన కాలాదర్శవచనాన్ననుసరించి మల మాసంలో శ్రాద్ధదినం వ్యర్థం కాకుండా ఉండేందుకు పితరుల నుద్దేశించి బ్రాహ్మ ణులకు భోజనం పెట్టి, శుద్ధమాసంలో సపిండశ్రాద్ధం చేయాలి. సంక్రమణం లేకున్న పిండరహితశ్రాద్ధం, సంక్రమణమున్న పిండయుతశ్రాద్ధము-ఈ రకంగా ప్రతి సంవత్సరము రెండు నెలల్లోనూ శ్రాద్ధం చేయాలి అని, వృద్ధపరాశరోక్తి అని అన్నారో అది ఆలోచించాలి. ముందు చెప్పిన మాట క్షయమాసంకన్న

ముందున్న అధిమాసం గూర్చినది. అక్కడ రెండు మాసాల్లో శ్రాద్ధం చెప్పారు. దాన్నే సత్యతపుడు-ఒకే మాసం రెండు సంక్రమణములతో కూడివుంటే రెండు మాసాల్లో చేయాల్సిన శ్రాద్ధాన్ని మలమాసంలో కూడా చేయటం ప్రశస్తము అని అన్నాడు. మాసద్వయగతం అంటే సంక్రమణంలేని పూర్వ అధిమాసం, క్షయ మాసం అని. మలమాసం-క్షయమాసం అపిశబ్దంవల్ల అంతకుముందటి అధి మాసమందలి అని హేమాద్రి చెప్పాడు. దీపిక కూడా-మొదలు అధికమాసం ఉంటే అక్కడ చేయాల్సిన ప్రథమ సంవత్సర శ్రాద్ధాన్ని శుద్ధమాసంలోచేసి క్షయమాసంలో వచనపూర్వకంగా రెండుమాసాల్లో బుద్ధిమంతుడు చేయాలి అని. కాలాదర్శమందు కూడా ఇదే విషయం. ఇంక విస్తరించటం చాలు.

**మూ॥ మలమాసంలో విడువ తగినవి :**

కాలాదర్శే - అనిత్యమ నిమిత్తం చదానం చమహాదాదికం
అగ్న్యాధానాధ్వరా పూర్వ తీర్థయాత్రాఽమరే క్షణం॥
దేవారామ తడాగాది ప్రతిష్ఠా మౌంజిబంధనం
ఆశ్రమస్వీకృతిః కామ్యవృషోత్సర్గశ్చ నిష్క్రమః॥
రాజ్యాభిషేకః ప్రథమశ్చూడా కర్మ వ్రతానిచ
అన్న ప్రాశనమారంభో గృహాణాంచ ప్రవేశనం॥
స్నానం వివాహోనామాతిపన్నం యత్రదేవమహోత్సవః
వ్రతారంభ సమాప్తీచ కర్మకామ్యంచ పాప్మనాం॥
ప్రాయశ్చిత్తంతు సర్వస్య మలమాసే వివర్జయేత్
ఉపాకర్మోత్సర్జనంచ పవిత్ర దమనార్పణం॥
అవరోహశ్చ హైమంతః సర్పాణాం బలిరష్టకాః
ఈశానస్య బలిః విష్ణోః శయనం పరివర్తనం॥
దుర్గేంద్ర స్థాపనోత్థానే ధ్వజోత్థానంచ వజ్రిణః
పూర్వత్రప్రతిషిద్ధాని వరత్రాన్యచ్ఛ దైవికం॥

ఇతి అత్రమూల వచనాని హేమాద్రి మాధవాది భ్యోజ్ఞేయాని.

దివోదాసీయేఽపి - యాత్రోత్సవంచ దేవాది శపథం దివ్యమేవచ
మలమాసే న కుర్వీత వ్యాసస్యవచనం యథా॥

ఇతి అయం నిర్ణయః క్షయమాసేఽపి జ్ఞేయః.

రవి సంక్రమహీనే యోవర్జ్యావర్జ్య విధిః స్మృతః
సఏవతు ద్విసంక్రాంతే మలమా సేప్యు దీరితః॥

ఇతి కాఠక గృహ్యోక్తేః

కాలాదర్శంలో - నిత్యం కాని కర్మ, నిమిత్తంలేని కర్మ, మహాదానము, అగ్న్యాధానము, యజ్ఞము, పూర్వం చేయని తీర్థయాత్ర, దైవదర్శనం, దేవత, తోట, చెరువు మొదలగువాని ప్రతిష్ఠ, ఉపనయనము, సన్యాసాది ఆశ్రమ స్వీకారము, కామ్యవృషోత్సర్గము నిష్క్రమణము, రాజ్యాభిషేకము, మొదటి పుట్టువెంట్రుకలు వ్రతములు అన్నప్రాశనము, గృహారంభము, గృహప్రవేశము, స్నానము, వివాహము, నామకరణము, దేవోత్సవము, వ్రత ఆరంభ - సమాప్తులు, కామ్యకార్మ, పాపములకు ప్రాయశ్చిత్తము అన్నీ మలమాస మందు వదలిపెట్టాలి. ఉపాకర్మ, ఉత్సర్జనము, పవిత్ర దమనార్పణము, హేమంతఋతు ఉత్సవము, సర్పములకు బలి, అష్టకాశ్రాద్ధము, ఈశానబలి, విష్ణుశయనము, పరివర్తనము,దుర్గ ఇంద్రస్థాపన ఉత్థాపనలు, ఇంద్రధ్వజోత్థానము మలమాసంలో విడువతగినవి అని. ఇందుకు హేమాద్రి మాధవుల మూలవచనములు గ్రహించవచ్చును.

దివోదాసీయమందు - యాత్ర, ఉత్సవము, దేవాదిశపథము, దివ్యకర్మ మలమాసంలో చేయరాదని వ్యాసుని వచనము అని ఉంది. ఈ నిర్ణయము క్షయమాసమందు కూడా అని తెలుసుకోవాలి. రవి సంక్రమణం లేని మాసంలో విడువతగిన, విడువతగని అంశముల విధి ఏ దుందో, అదే రెండు సంక్రాంతులు కల మలమాసానికి కూడా చెప్పబడింది. ఇది కాఠక గృహ్యోక్తి.

మూ॥ **క్షయమాన మృతులకు ప్రత్యాబ్దికంలో విశేష నిర్ణయం:** క్షయమాసే

మృతానాం ప్రత్యాబ్దికే విశేషో హేమాద్రౌ
తీర్థ్యర్థే ప్రథమే పూర్వో ద్వితీయేఽర్ధేతథోత్తరః
మాసావితిబు ధైశ్చిన్త్యౌ క్షయమాసస్య మధ్య గౌ॥

అబ్దికవత్ వర్ధాపనేఽపి జ్ఞేయం. యన్మలమా సేవర్జ్య ముక్తం తచ్ఛుక్ర గుర్వోః అస్తాదిష్వపి జ్ఞేయం తదాహబృహస్పతిః—

బాలేవా యదివా వృద్ధే శుక్రేవాస్తంగతే గురౌ
మలమాస ఇవైతాని వర్జయేత్ దేవదర్శనం॥ ఇతి
అనాది దేవతాం దృష్ట్వాశుచః స్యుః నష్టభార్గవే
మలమాసే ప్యనావృత్త తీర్థయాత్రాం వివర్జయేత్॥

అవృత్తతీర్థే దోషాభావమాత్రం, నతుఫలమితి వాచస్పతి మిశ్రాఃతన్న అసతిబాధకే ఫలహేతుత్వాక్షతేః లల్లోపి-

నీచస్థే వక్రసంస్థేఽప్యతి చరణగతే బాలవృద్ధాస్తగేవా
సంన్యాసో దేవయాత్రా వ్రతని యమవిధిః కర్ణవేధస్తు దీక్షా
మౌంజీ బంధోఽంగనానాం పరిణయన విధిః వాస్తుదేవ ప్రతిష్ఠా
వర్జ్యాః సద్భిః ప్రయత్నాత్ త్రిదశపతి గురౌ సింహరాశి స్థితేచ॥

ఇతి. దీక్షా-యాగదీక్షా, నత్వాగమదీక్షా తథా-

ఉద్యాన చూడావ్రత బంధదీక్షా
వివాహ యాత్రాశ్చ వధూప్రవేశం
తటాగకూపత్రి దశప్రతిష్ఠా
బృహస్పతౌ సింహగతే నకుర్యాత్॥

దివోదాసీయే -

గుర్వాదిత్యే గురౌ సింహేనష్టే శుక్రేమలిమ్లుచే
గృహ కర్మవ్రతం యాత్రాం మనసాపిన చింతయేత్॥

అస్య అపవాదః తత్రైవ బ్రాహ్మే -

ముండనం చోపవాసశ్చ గౌతమ్యాం సింహగే గురౌ
కన్యాగతేతు కృష్ణాయాం నతుత త్తీర వాసినాం॥

తథా - ఆద్యాసౌ గౌతమీ గంగా ద్వితీయా జాహ్నవీస్మృతా
సర్వ తీర్థఫలం స్నానాత్ గౌతమ్యాం సింహగేగురౌ॥

సంహితాప్రదీపే -

స్యాత్ సప్తరాత్రం గురుశుక్ర యోశ్చ
బాలత్వ మహ్నాందశకంచ వార్ధ్యం
వృద్ధాసితేజ్యావశుభౌ శిశుత్వే
శనౌ యతస్తావుపచీయమానౌ॥

వసిష్ఠః -

అతిచారగతే జీవే వర్జయే త్తదనంతరం
వ్రతోద్వాహాది కార్యేషు అష్టావింశతి వాసరాన్॥

క్షయమాస మృతులకు ప్రత్యాబ్దిక విషయంలో విశేషం హేమాద్రి యందు - ప్రథమతిథ్యర్ధంలో మరణిస్తే పూర్వమాసంలో, ద్వితీయార్ధంలో మరణిస్తే ఉత్తరమాసంగా అని పండితులు క్షయమాస మధ్యంలోని వాటిని రెండు మాసాలుగా గ్రహించాలి. ఆబ్దికమునవలె జన్మదినవేడుకందును గ్రహించాలి. మలమాసంలో విడువతగిందని చెప్పింది శుక్రగురువుల అస్తాదులందు కూడా గ్రహించాలి. బృహస్పతి ఇట్లా - శుక్రగురువులు బాల, వృద్ధ, అస్తంగతులైనపుడు వానిని మలమాసంవలె భావించాలి, దేవదర్శనం చేయరాదు అని అన్నాడు. శుక్రుడు నష్టమయ్యాక అనాది దేవతను చూచిన అశుచులౌతారు. మలమాసమందు ముందుచూడని తీర్థయాత్రను (కొత్త) కూడా విడిచిపెట్టాలి. (చూడొద్దు.) చూచిన తీర్థయాత్రచేస్తే దోషంమాత్రం లేదు, ఫలితం లేదు అని వాచస్పతి మిశ్రులన్నారు. అది తప్పు. బాధకం లేకపోతే ఫలం కలగాలిగదా! లల్లుడుకూడా - సింహరాశి యందున్న బృహస్పతి నీచస్థుడు, వక్రుడు, అతిచారుడు, బాలవృద్ధ, అస్తగుడైనా, సన్యాసము, దేవయాత్ర వ్రత, నియమ విధి, కర్ణవేధ (యజ్ఞ), దీక్ష, ఉపనయన, స్త్రీవివాహం, వాస్తు, దేవప్రతిష్ఠ వీటిని సజ్జనులు ప్రయత్నపూర్వకంగా వదలాలి. (చేయొద్దు) అని (దీక్ష=యాగదీక్ష ఆగమదీక్షకాదు). అట్లాగే - బృహస్పతి సింహరాశియందుండగా తోటపెట్టటం, పుట్టువెంట్రుకలు, ఉపనయనం, వివాహము, యాత్రలు, వధూప్రవేశము, తటాకము, కూపము, దేవప్రతిష్ఠ వీనిని చేయరాదు. దివోదాసీయంలో - గురువు ఆదిత్యుని యందుండగా, గురువు సింహమందుండగా, శుక్రుడు నష్టమైనదశలో, మలమాసంలో గృహకర్మ, వ్రతము యాత్ర - వీటిని మనసులో గూడా తలచరాదు. దీనికి అపవాదు (వ్యతిరేకం) అక్కడే బ్రాహ్మంలో ఇట్లా - గురువు సింహరాశియందుండగా గౌతమి తీరమందు (గోదావరి) ముండనము, ఉపవాసము చేయాలి అట్లాగే గురువు కన్యాగతుడైనపుడు కృష్ణానదీ తీరమందు ముండనము, ఉపవాసము చేయాలి. ఆయా నదీతీరములందున్న వారికి మాత్రం ఇది వర్తించదు. అట్లాగే - ఈ గౌతమి మొదటిగంగ, రెండవది జాహ్నవి. గురువు సింహరాశియందుండగా గౌతమియందు స్నానంచేస్తే సర్వతీర్థముల

ఫలం లభిస్తుంది. సంహితాప్రదీపంలో-గురు శుక్రులకు ఏడురోజులు బాలత్వము. పదిరోజులు వృద్ధత్వము. వీరిద్దరు వృద్ధులుగా అశుభులు, బాలత్వమంద శుభులు. ఎందువల్లంటే - వీరు అభివృద్ధి చెందేవారు కాబట్టి. వసిష్ఠుడు - బృహస్పతి అతిచారగుడైన ఆ పిదప ఇరవై ఎనిమిదిరోజుల వరకు వ్రత, ఉద్వాహాదికార్యాలు చేయరాదు.

మూ॥ బాల్యాదిలక్షణ ముక్తం బ్రహ్మ సిద్ధాంతే—

రవిణాసత్తిరన్యేషాం గ్రహాణాంఅస్త ఉచ్యతే

తతోఽర్వాక్ వార్ధకం ప్రోక్తం ఊర్ధ్వబాల్యం ప్రకీర్తితం॥

ఇతి బాల్యాది పరిమాణంచ వృత్తశతే -

బాలఃశుక్రో దివసదశకం పంచకంచైవ వృద్ధః

పశ్చాదహ్నాం త్రితయముదితః పక్షమైంద్ర్యాం క్రమేణ

జీవోవృద్ధః శిశురపితథా పక్షమన్యైః శిశూతౌ

వృద్ధౌప్రోక్తౌ దివసదశకం చాపరైః సప్తరాత్రం॥

పశ్చిమత ఉదయేదశదినానిబాలః, అస్తే పంచదినానివృద్ధః పూర్వతో దినత్రయం బాలః పక్షంచవృద్ధః ఇత్యర్థః అన్యత్రతు అన్యథాఉక్తం -

ప్రాక్పశ్చాదుదితః శుక్రఃపంచ సప్తదినంశిశుః

విపరీతేతు వృద్ధత్వం తద్వదేవ గురోరపి॥ ఇతి.

బ్రహ్మ సిద్ధాంతమందు చెప్పబడిన బాల్యాదిలక్షణములు : ఇతర గ్రహాలకు సూర్యునితో సాహచర్యం అస్తమనబడును. దానికన్న ముందు వార్ధకం, ఆపైన బాల్యం అని. వృత్తశతమందు బాల్యాది పరిమాణం ఇట్లా - శుక్రుడు పశ్చిమంలో ఉదయిస్తే పదిరోజులు బాలుడు, పశ్చిమంలో అస్తమిస్తే ఐదు రోజులు వృద్ధుడు, తూర్పున ఉదయిస్తే 3 రోజులు బాలుడు, అస్తమిస్తే 15 రోజులు వృద్ధుడు. ఇదేరకంగా గురువుకూడా వృద్ధుడు బాలుడు. ఇతరులు, వారు 15 రోజులు బాలురు, పదిరోజుల వృద్ధులు అనగా ఇతరులు ఏడురోజులు వృద్ధులు అని అన్నారు. ఇంకోచోట మరోరకంగా చెప్పబడింది. శుక్రుడు తూర్పు పడమరలలో ఉదయిస్తే ఐదు, ఏడురోజులు శిశువు అస్తమిస్తే ఐదు, ఏడురోజులు వృద్ధత్వం- అట్లాగే గురువునకు కూడా అని.

మూ॥ మిహిరః - బహవోదర్శితాః కాలాఃయేబాల్యే వార్ధక్యేఽపివా

గ్రాహ్యాః తత్రాధికాఃశేషాః దేశ భేదాదుతాపది॥ ఇతి

మదనరత్నే గార్గ్యః -
శుక్రోగురుః ప్రాక్చ పరాక్చ బాలః
వింద్యే దశావన్తిషు సప్తరాత్రం
వంగేషుహూణేషుచ షట్చపంచ
శేషేచదేశే త్రిదినం వదంతి॥

ఇతి. కాశీఖండే - నగ్రహాస్తో దయకృతో దోషోవిశ్వేశ్వరాలయే. త్రిస్థలీ సేతౌ వాయవీయే - గోదావర్యాం గయాయాంచ శ్రీశైలే గ్రహణద్వయే.

సురాసుర గురూణాంచ మౌఢ్యదోషోనవిద్యతే॥ గ్రహణద్వయే= తన్ని మిత్తక కురుక్షేత్ర యాత్రాదానాదా విత్యర్థః తదాహ త్రిస్థలీసేతౌల్లః.

ఉపప్లవే శీతలభాను, భాన్వోః
అర్ధోద యేవైకపిలాఖ్య షష్ఠ్యాం
సురాసురేజ్యా స్తమయేఽపి తీర్థే
యాత్రావిధిః సంక్రమణేచ శస్తః॥
ఇత్యలంబహూనా.

ఈ వాదములను మిహిరుడు ఇట్లా నియమించాడు: గురుశుక్రుల బాల్య వార్ధకముల విషయంలో అనేక కాలములు చెప్పబడ్డాయో అక్కడ అధిక కాలాన్ని గ్రహించాలి. మిగిలినవి, దేశభేదంవల్ల లేదా ఆపత్కాలంలో గ్రహించ తగినవి అని మదనరత్నంలో గార్గ్యుడు - శుక్రుడు, బృహస్పతి తూర్పు పడమర లలో వింధ్యప్రాంతంలో పదిరోజులు, అవంతి ప్రాంతంలో ఏడురాత్రులు, వంగ దేశంలో ఆరురోజులు, హూణ దేశంలో ఐదురోజులు ఇతర ప్రాంతంలో మూడు రోజులు బాలురు అని అన్నారు అని. కాశీఖండమందు - విశ్వేశ్వరాలయంలో గ్రహముల అస్త, ఉదయకృతదోషం ఉండదు అని అన్నారు. త్రిస్థలీసేతువు యందు వాయుపురాణ వాక్యంలో - గోదావరి, గయ, శ్రీశైలం - ఈ ప్రాంతా లలో గురుశుక్రుల మౌఢ్య దోషము ఉండదు. గ్రహణద్వయంలో అనగా సూర్య చంద్ర గ్రహణనిమిత్తంగా చేసిన కురుక్షేత్రయాత్ర, దానాదులందును మూఢ దోషముండదు. త్రిస్థలీ - సేతువుయందు ఇల్లుడు ఇట్లా అంటాడు - చంద్ర సూర్యుల గ్రహణకాలంలో, అర్ధోదయమందుకపిల షష్ఠియందు, సంక్రమణ మందు, గురు శుక్రుల అస్తమయమందు కూడా తీర్థయాత్రావిధి ప్రశస్తము అని. ఇకచాలు.

మూ॥ మలమాసే వ్రతవిశేషః— హేమాద్రౌపాద్మే—
అధిమాసేతు సంప్రాప్తే గుడ సర్పిర్యుతానిచ
త్రయస్త్రింశద పూపాని దాతవ్యాని దినేదినే॥
సాజ్యాని గుడమిశ్రాణి అధిమాసే నృపోత్తమ
అధిమాసేతు సంప్రాప్తే త్రయస్త్రింశత్తు దేవతాః॥
ఉద్దిశ్యా పూపదానేన పృధ్వీదానఫలం లభేత్
త్రయస్త్రింశద పూపాన్నం కాంస్యపాత్రే నిధాయచ॥
సఘృతంచ హిరణ్యంచ బ్రాహ్మణాయ నివేదయేత్
విష్ణురూపీ సహస్రాంశుః సర్వపాపప్రణాశనః॥
అపూపాన్న ప్రదానేన మమపాపంవ్యపోహతు
నారాయణ జగద్బీజ భాస్కర ప్రతిరూపక॥
వ్రతేనానేన పుత్రాశ్చ సంపదంచాభి వర్ధయ
యస్య హస్తే గదా చక్రే గరుడోయస్య వాహనం॥
శంఖః కరతలేయస్యసమే విష్ణుః ప్రసీదతు
కలా కాష్ఠాదిరూపేణ నిమేష ఘటికాదినా॥
యోవంచయతి భూతాని తస్మైకాలాత్మనే నమః
కురుక్షేత్రమయందేశః కాలః పర్వ, ద్విజోహరిః॥
పృధ్వీ సమమిదందానం గృహాణ పురుషోత్తమ
మలానాంచ విశుద్ధ్యర్థం పాపప్రశమనాయచ॥
పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థంతవదాస్యామి భాస్కర
మంత్రేణానేన యోదద్యాత్ త్రయస్త్రింశద పూపకాన్॥

ప్రాప్నోతి విపులాం లక్ష్మీం పుత్రపౌత్రాది సంపదః॥ ఇతి మలమాస నిర్ణయః.

హేమాద్రియందు పాద్మమందలి వాక్యం :- అధికమాసం వస్తే ప్రతి రోజూ, బెల్లము నేయితో కూడిన 33 అప్పాలను దానం చేయాలి. నేయి, బెల్లంతో కూడిన వానిని దానంచేయాలి.అధికమాసంలో 33 దేవతల నుద్దేశించి అపూపదానం చేస్తే భూదానఫలం లభిస్తుంది. 33 అపూపముల కాంస్య పాత్రయందుంచి నెయ్యి హిరణ్యము కూడా కలిపి బ్రాహ్మణునకు ఇవ్వాలి. విష్ణురూపుడు, వేయికిరణాల వాడు, అన్ని పాపముల నశింపచేసేవాడు అపూపదానంతో నా పాపముల తొల

గించనీ. నారాయణ, జగత్కారణ, భాస్కరరూపకుడ, ఈ వ్రతంతో పుత్రులను సంపదను అభివృద్ధి పొందించు. చేతులందు గద, చక్రములు, గరుడుడు వాహనము, మరో చేతిలో శంఖం కలిగిన విష్ణువు నన్ననుగ్రహించనీ. కల, కాష్ఠ మొదలగు రూపంతో, నిమేషఘటికాది రూపంతో ప్రాణులను మోసగించే కాలస్వరూపునకు నమస్కారము. ఈ దేశము కురుక్షేత్రమువంటిది, పర్వకాలము, బ్రాహ్మణుడు విష్ణుస్వరూపుడు, ఈ దానం భూదానంతో సమానం, పురుషోత్తమ, దీన్ని స్వీకరించు భాస్కర! మలవిశుద్ధికొరకు, పాపనాశం కొరకు పుత్ర పౌత్రాభివృద్ధి కొరకు నీకే దానం ఇస్తున్నాను. ఈ మంత్రంతో 33 అపూపముల నెవడిస్తాడో వాడు అధికమైన లక్ష్మిని పుత్రపౌత్రాది సంపదను పొందుతాడు అని ఇంతవరకు మలమాస నిర్ణయము.

మూ॥ **పక్షనిర్ణయస్తు - దైవేముఖ్యః శుక్ల పక్షః, కృష్ణః పిత్ర్యేవిశిష్యతే॥ ఇతి మాధవేనోక్తః.**

పక్షనిర్ణయంను మాధవుడు: ఇట్లా చెప్పాడు దైవకార్యాలలో శుక్ల పక్షము, పితృకార్యాలలో కృష్ణ పక్షము శ్రేష్ఠము అని.

మూ॥ **తిథివేధాది నిర్ణయం.**

తత్రతిథిర్ద్వేధా. శుద్ధా విద్ధాచ. దినేతిథ్యంతర సంబంధరహితా శుద్ధా, తత్సహితావిద్ధా. తత్ర శుద్ధాయాం అసందేహాత్ విద్ధానిర్ణీయతే. తత్రసామాన్యతో వేధమాహ మాధవీయేపైఠీనసిః—

పక్షద్వయేఽపి తిథయః తిథిం పూర్వాంత థోత్తరాం
త్రిభిర్ముహూర్తైః విధ్యన్తి సామాన్యోఽయం విధిః స్మృతః॥ ఇతి

హేమాద్రి మదనరత్నాదౌతు ద్విముహూర్తోఽప్యుక్తః—

ఉదితే దైవతం భానౌ పిత్ర్యమస్తమితేరవౌ
ద్విముహూర్తా త్రిరహ్నశ్చ సాతిథిః హవ్యకవ్యయోః॥

ఇతి విష్ణుధర్మోక్తేః. ద్విముహూర్తత్వంచ అనుకల్పః—

'ద్విముహూర్తాపికర్తవ్యా యాతిథిః వృద్ధిగామినీ' ఇతి దక్షేణాపిశబ్దోక్తేః. అయంవేధః ప్రాతరేవసాయంతు త్రిముహూర్త వేధ ఏవ.

యాంతిథింసమను ప్రాప్య యాత్యస్తం పద్మినీ పతిః
సాతిధిఃతద్దినే ప్రోక్తా త్రిముహూర్తైవయాభవేత్॥ ఇతి స్కాన్దోక్తేః।

దీపికాయామపి - 'త్రిముహూర్తగాతు సకలా సాయం' ఇతి

యానితు - వ్రతోపవాస స్నానాదౌ ఘటికైకాపియా భవేత్

ఉదయేసాతిథిర్గ్రాహ్యా విపరీతాతు పైతృకే॥ ఇత్యాదీని స్కాన్దాది వచనాని తాని వైశ్వానరాధికరణ న్యాయేన అవయవస్తుత్యా త్రిముహూర్త ప్రశంసా పరాణి.

తిథి రెండు రకములు- శుద్ధ, విద్ధ అని దినమందు మరొక తిథితో సంబంధంలేనిది శుద్ధ దినమందు మరొక తిథితో సంబంధము కలది విద్ధ. శుద్ధ విషయంలో సందేహం లేదు కాబట్టి (దాన్ని వదలి) విద్ధను నిర్ణయిస్తున్నాము. మాధవీయంలో పైఠనసి వచనం సామాన్య వేధను గూర్చి ఇట్లా చెప్పబడింది. రెండు పక్షములందు (శుక్ల, కృష్ణ) తిథులు, పూర్వతిథిని, ఉత్తరతిథిని మూడు ముహూర్తములు వేధిస్తాయి. ఇది సామాన్య విధి అని గ్రహించాలి అని. హేమాద్రి మదన రత్నాదులందు రెండు ముహూర్తములని కూడా చెప్పబడింది: సూర్యోదయం తర్వాత రెండు ముహూర్తములవరకు ఉన్న తిథిలో దేవకార్యంకు సూర్యుడు అస్తమించాక మూడు ముహూర్తములవరకు తిథి ఉంటే పితృ కర్మకు వేధ. మిగిలిన దినం హవ్యకవ్యములకు యోగ్యం అని, విష్ణుధర్మోక్తి ద్విముహూర్త మనేది గౌణము (Secondary), తిథి వృద్ధి దశలో ఉంటే దాని రెండు ముహూర్తముల కాలములో కూడా కర్మ ఆచరించాలి అని దక్షుడు అపి (కూడా) శబ్దం ద్వారా చెప్పాడు. ఈ వేధ ప్రాతఃకాలమందే. సాయంకాలమందు త్రిముహూర్తవేధనే. సూర్యుడు ఏ తిథిలోకి వచ్చి అస్తమిస్తాడో, ఆ తిథి ఆ రోజు అని గ్రహించాలి. ఆ తిథి త్రిముహూర్తముల కాలమున్నా అని స్కాంద వచనం. దీపికయందు కూడా— ఏ తిథి సాయంకాలమందు మూడు ముహూర్తముల కాలం ఉంటుందో అదే మొత్తము అని.

వ్రత ఉపవాస స్నానాదులందు ఉదయమందలి ఘడియ కాలముండే తిథినే గ్రహించాలి, పితృ కర్మలలో ఇందుకు విపరీతము అని మొదలైన స్కాందాది వచనములు వైశ్వానరాధికరణ న్యాయాన్ననుసరించి అవయవ స్తుతిచే త్రిముహూర్త ప్రశంసాపరములైనవే.

మూ॥ **తిథి విశేషే వేధ విశేషః** స్కాన్దే -

నాగో ద్వాదశ నాడీభిః దిక్ పంచదశభిస్తథా

**భూతోఽష్టాదశ నాడీభిః దూషయత్యుత్తరాంతిథిం.**

**ఇతి అయంచ ఉపవాస అతిరిక్త విషయ ఇతి వక్ష్యతే ఇతి వేధః.**

తిథివిశేషంలో వేధ విశేషము సప్తమి పన్నెండు ఘడియలు, దశమి పదిహేను ఘడియలు, చతుర్దశి పద్దెనిమిది గడియలు తరువాతి తిథిని వేధిస్తుంది. ఇది ఉపవాస అతిరిక్త విషయము అని చెప్పబోతున్నాము. ఇది వేధ.

మూ॥ తత్ర సర్వాతిథిః యదహః కర్మకాల వ్యాపినీ, సైవగ్రాహ్యా కర్మణో యస్యయః కాలః తత్కాలవ్యాపినీ తిథిః.

తయా కర్మాణి కుర్వీత హ్రాసవృద్ధీన కారణం॥ ఇతి విష్ణు ధర్మోక్తేః. దినద్వయేతద్వ్యాప్తౌ ఏకదేశ వ్యాప్తౌ వాయుగ్మ వాక్యాన్నిర్ణయః తస్య పూర్వాఽబాధేనోపపత్తేః కర్మకాలస్య ప్రధాన త్వాచ్చ యుగ్మ వాక్యంతు నిగమః—

యుగ్మాగ్ని యుగ భూతానాం షణ్మున్యోః వసురంధ్రయోః
రుద్రేణ ద్వాదశీ యుక్తా చతుర్దశ్యాంచ పూర్ణిమా॥
ప్రతి పద్యప్యమావాస్యాతిథ్యోర్యుగ్మం మహాఫలం
ఏతద్వ్యస్తం మహా దోషం హన్తి పుణ్యం పురాకృతం॥ ఇతి. అత్ర రంధ్రాంతాః శబ్దాః ద్వితీయాదినవమ్యన్తతిథి వాచకాః రుద్రః=ఏకాదశీ ద్వితీయా తృతీయాయుతా, సాచద్వితీయాయుతేతి సప్తయుగ్మానీత్యర్థః ఇదంచ శుక్లపక్షే అమాప్రతిపద్యుగ్మస్య పూర్ణిమా యాశ్చతత్రైవ సత్వాత్ ఇతికేచిత్ తత్వంతు అమాప్రతిపద్యుగ్మాత్ కృష్ణపక్ష లింగాత్ పక్షద్వయపరమిదం తత్ర ద్విషేశ వాక్యైః కృష్ణేతిథి విశేషే అపోద్యతే ఇతి.

**కర్మ కాల వ్యాపి** యైన తిథినే ఆ రోజు తిథిగా గ్రహించాలి. ఏ కర్మ చేయటానికి ఏది కాలమో ఆ కాల వ్యాపియైనది ఏ తిథో ఆ తిథిలోనే కర్మలు చేయాలి. తిథి యొక్క హ్రాస, వృద్ధులు కారణం గాదు అని విష్ణు ధర్మోక్తి. ఆతిథి రెండు రోజులు వ్యాప్తిచెందినా, ఏకదేశంలో (ఒకే భాగంలో) వ్యాప్తి చెందినా యుగ్మ వాక్యాన్ననుసరించి నిర్ణయం చేయాలి. దానివల్ల ముందు దానికి బాధ కలగకుండా సిద్ధిస్తుంది. కర్మకాలము ప్రధానం కాబట్టి. యుగ్మ వాక్యము ప్రమాణము. ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమి, షష్ఠి. సప్తమి, అష్టమి, నవమి, రెండు తిథుల సమాగమం మహా ఫలం. ఏకాదశితో కూడిన ద్వాదశి, చతుర్దశియందు పున్నమి, ప్రతి పదయందు అమావాస్య రెండు తిథుల సమాగమం మహా ఫలం. దీని వ్యతిరిక్తం మహా దోషము. ముందు సంపాదించిన పుణ్యాన్ని కూడా హరిస్తుంది అని. యుగ్మ అగ్ని.... రంధ్ర పీటికి ద్వితీయ, తృతీయ ... నవమి అని అర్థం. రుద్ర=ఏకాదశి ద్వితీయ తృతీయతో, తృతీయ ద్వితీయతో అని. ఇవి ఏడు జంటలు అని అర్థం. ఇవి శుక్ల పక్షంలో అని గ్రహించాలి,

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| ద్వితీయ + తృతీయ, తృతీ + ద్వితీ, | తృతీయ + చతుర్థి, చతు + తృతీ, | చతుర్థి + పంచమి, పంచ + చతు, | పంచ + షష్ఠి, షష్ఠి + పంచ, | షష్ఠి + సప్త, సప్త + షష్ఠి, | సప్త + అష్ట, అష్ట + సప్త, | అష్ట + నవ, నవ + అష్ట, | అమావాస్య + ప్రతివత్ ప్రతివత్ + అమావా |

ఈ రెండు పూర్ణిమ కూడా శుక్ల పక్షంలోనే ఉన్నాయి కనుక శుక్ల పక్షంలో అని కొందరన్నారు.

నిజానికైతే అమా + ప్రతి పదజంట కృష్ణపక్ష సూచకం. కనుక ఇవి రెండు పక్షములకు చెందినవి. ఆయా విశేష వాక్యాలతో, కృష్ణపక్షంలో తిథి విశేషంలో నిరూపించబడుతుంది అని.

మూ॥ **మంగళకార్యాల్లో తిథివిచారము.** దశమీతూక్తాపురాణ సముచ్చయే-

సంపూర్ణేదశమీకార్యా మిశ్రితా పూర్వయాఽథవా ఇతి సంపూర్ణేశుక్లపక్షే త్రయోదశీతుసుమంతునోక్తః - "త్రయోదశీతుకర్తవ్యా ద్వాదశీ సహితామునే" ఇతి. కృష్ణపక్షేత్వాపస్తంబః—

ప్రతిపత్సద్వితీయాస్యాత్, ద్వితీయాప్రతిపద్యుతా
చతుర్థీ సంయుతాయాచసా తృతీయా ఫలప్రదా॥
పంచమీచప్రకర్తవ్యా షష్ఠ్యాయుక్తాతునారద
కృష్ణపక్షేఽష్టమీచైవ కృష్ణపక్షే చతుర్దశీ॥
పూర్వవిద్ధాప్రకర్తవ్యా, పరవిద్ధాన కుత్రచిత్
దశమీ చప్రకర్తవ్యా, సదుర్గా ద్విజసత్తమ॥
షష్ట్యష్టమీ అమావాస్యా కృష్ణపక్షే త్రయోదశీ
ఏతాః పరయుతాః పూజ్యాః పరాః పూర్వేణ సంయుతాః॥ ఇతి.

పురాణసముచ్చయంలో దశమి గూర్చి - శుక్ల పక్షంలో పూర్వ తిథితో కూడిన దశమి మంచిది అని శుక్లపక్షంలో సుమంతుడు చెప్పాడు - ద్వాదశీసహిత త్రయోదశి చేయాలి అని. కృష్ణపక్షంలో ఆపస్తంబుని మాట- ద్వితీయతో

కూడిన ప్రతిపత్తు. ప్రతిపదతో కూడిన ద్వితీయ, చతుర్థితో కూడిన తృతీయ, షష్ఠితో కూడిన పంచమి, పూర్వవిద్ధఐన కృష్ణపక్ష అష్టమి, కృష్ణపక్ష చతుర్దశి (పూ.వి) మంచివి, పరవిద్ధ శుభకార్యములకు తగవు. నవమితో కూడిన దశమి మంచిది. షష్ఠి, అష్టమి అమావాస్య కృష్ణపక్ష త్రయోదశి- ఇవి పరయుతమైతే పూజ్యములు. పరములు పూర్వంతో కూడినవైనా పూజ్యములు అని.

మూ॥ యత్తువ్యాఘ్రః - ఖర్వోదర్పః తథాహింసాత్రివిధంతిథిలక్షణం

ఖర్వదర్పౌపరౌపూజ్యౌహింసాస్యాత్ పూర్వకాలికీ॥ ఇతి

ఖర్వః = సామ్యం, దర్పో = వృద్ధిః, తయోః పరాః హింసా = క్షయః తత్రపూర్వేత్యర్థః ఏతత్‌శ్రాద్ధాది విషయం.

ద్వితీయాదిక యుగ్మానాం పూజ్యతానియమాదిషు

ఏకోద్దిష్టాదివృద్ధ్యాదౌహ్రాస వృద్ధ్యాదిచోదనా॥ ఇతి.

వ్యాసోక్తేః నియమాదిషు వ్రతదానాదిదైవకర్మసు ఏకోదిష్టాదితిథిః వృద్ధ్యాదావిత్యర్థః కర్మకాలవ్యాప్త్య భావేతు కర్మోపక్రమకాలగైవగ్రాహ్యా కర్మోపక్రమకాలగాతు కృతిభిః గ్రాహ్యానయుగ్మాదరః ఇతి దీపికోక్తేః యానితు—

యాంతిథింసమను ప్రాప్య ఉదయంయాతి భాస్కరః

సాతిథిఃసకలాజ్ఞేయాదానాధ్యయన కర్మసు॥ఇత్యాదీనితాని త్రిముహూర్తాది స్తుతిరితి నిర్ణయశైలి

వ్యాఘ్రుడు - తిథి ఖర్వము, దర్పము, హింస అని మూడు విధములు, ఖర్వదర్పములు - వీటి పరములు (తిథులు) పూజ్యములు, హింస పూర్వకాలికం (తిథి) పూజ్యము అని చెప్పాడో అది శ్రాద్ధాదివిషయము. ఖర్వము=సామ్యము (సమము), దర్పము = వృద్ధి, హింస = క్షయము. ద్వితీయాదియుగ్మములకు వ్రతదానాదిదైవకర్మలందు పూజ్యత. ఏకోద్దిష్టాది (తిథి) వృద్ధ్యాది యందు హ్రాసవృద్ధ్యాదులు అని వ్యాసోక్తి కర్మకాలవ్యాప్తి లేకపోతే కర్మము ఆరంభించే కాలమందలి తిథి తీసుకోవాలి. కర్మము ఆరంభించే కాలమందలి దానిని (తిథిని) స్వీకరించాలి. యుగ్మాదరముకాదు అని దీపికోక్తి. సూర్యుడు ఉదయించే (కాల) తిథిని సంపూర్ణ తిథిగా గ్రహించాలి. దాన, అధ్యయనకర్మలందు అని అన్నారో అది మూడు ముహూర్తములు మొదలగువాని (తిథి) విషయకము అని నిర్ణయ (సింధు) శైలి.

మూ॥ ఏకభక్తము. తత్కాలః పాద్మే - మధ్యాహ్నవ్యాపినీగ్రాహ్యా ఏకభక్తేసదాతిథిః మధ్యాహ్నశ్చ పంచధావిభక్త దినతృతీయాంశః తేనయద్యపి ద్వాదశ దండానంతరం ప్రావ్యతేతథాపి-

దినార్ధసమయేఽతీతే భుజ్యతేనియమేనయత్.

ఏకభక్తమితిప్రోక్తం అతఃతత్ స్యాత్ దివైవహి॥ ఇతిస్కాందోక్తేః. షోడశసప్తదశాది దండ ముఖ్యకాలః దీపికాయాంతు-

మధ్యాహ్నాంత్యదలేత్రి భాగదివసే స్యాదేకభక్తం ఇతి, తతఃసూర్యాస్త పర్యన్తం గౌణః. 'దివైవహి' ఇత్యస్య వైయర్థ్యాపత్యా ఏతత్పరత్వాత్.

పాద్మంలో ఏకభక్త కాలవిషయం-ఏకభక్తమందు ఎప్పుడూ మధ్యాహ్న కాలవ్యాప్తిగల తిథిని గ్రహించాలి మధ్యాహ్నమంటే దినాన్ని ఐదు భాగాలు చేస్తే మూడవ భాగం అందువల్ల మధ్యాహ్నం 12 గడియల తర్వాతే వస్తుంది. ఐనా దిన, అర్ధసమయం గడిచాకే నియమంగా భోంచేస్తే దాన్ని ఏకభక్తమని అన్నారు. అందువల్ల ఏకభక్తము పగలే ఔతుంది అని స్కాందోక్తి. పదహారు, పదిహేడు మొదలగు గడియలకాలము, ముఖ్యకాలము. దీపిక యందు-మధ్యాహ్న అంత్యభాగంలో దివసపు మూడవ భాగంలో ఏకభక్తమౌతుందని చెప్పారు. అందువల్ల సూర్యాస్తమయ పర్యంతమనటం అప్రధానం. అట్లైతే "దివైవహి" (పగలే) అని చెప్పింది వ్యర్థమౌతుంది. కనుక ఆ మాట పగలు భక్తాన్ని సూచించేందుకే.

మూ॥ అత్రపూర్వేద్యుః వ్యాప్తిః, అపరేద్యుః, ఉభయేద్యుః వ్యాప్తిః తదభావః, అంశవ్యాప్తిః, తత్రాపిసామ్యం, వైషమ్యం చేతిషట్‌పక్షాః తత్రఆద్యయోర సందేహ ఏవ. తృతీయేతు పూర్వేఽహ్ని గౌణముఖ్యవ్యాప్తేః సత్వాత్ పూర్వా ఇతి మాధవః. యగ్మవాక్యా న్నిర్ణయ ఇతిహేమాద్రిః. చతుర్థపక్షే పూర్వైవ గౌణకాలవ్యాప్తేః సత్వాత్ వైషమ్యే భాంశవ్యాప్తౌ యాఽధికా సాగ్రాహ్యా. సామ్యేపూర్వా. అయంచ స్వతంత్ర ఏకభక్త నిర్ణయః. అన్యాంగే ఉపవాస ప్రతినిధౌచ తదనుసారేణ నిర్ణయః

దీనిలో ఆరు పక్షాలు (విధాలు) పూర్వదినవ్యాప్తి, పరదినవ్యాప్తి, ఉభయ దినవ్యాప్తి ఉండటం, లేకపోవటం, అంశవ్యాప్తి. సామ్యము (రెండు రోజుల్లో సమానం) వైషమ్యం (రెండు రోజుల్లో తక్కువ ఎక్కువ) అని ఆరు రకాలు.

మొదటి రెంటిలో సందేహం లేదు. మూడవదానిలో గౌణ ముఖ్యవ్యాప్తి మొదటి రోజు ఉన్నందువల్ల పూర్వదినమే చేయాలని మాధవుడు యుగ్మవాక్యాన్ననుసరించి నిర్ణయించాలని హేమాద్రి నాల్గవ విధంలో గౌణకాలవ్యాప్తి ఉన్నందువల్ల పూర్వ మంటే వైషమ్యంగా అంశవ్యాప్తియందు ఎక్కువగా ఉన్నదాన్ని గ్రహించాలి. సామ్యమందు పూర్వమే గ్రహించాలి. ఇది స్వతంత్ర ఏకభక్త విషయము. ఉప వాస ప్రతినిధిగా, ఏకభక్తమైతే (అంగంగా) దాన్ననుసరించి నిర్ణయించాలి.

మూ॥ నక్తము. దివానశనపూర్వం రాత్రి భోజనం. తత్రప్రదోషవ్యాపినీ గ్రాహ్యా "ప్రదోషవ్యాపినీగ్రాహ్యా తిథిఃనక్తవ్రతే సదా" ఇతివత్సోక్తేః ప్రదోషస్తు-

త్రిముహూర్తం ప్రదోషఃస్యాత్ భానావస్తంగతే సతి

నక్తం తత్రతు కర్తవ్యం ఇతిశాస్త్రవి నిశ్చయః॥ ఇతి మదనరత్నే వ్యాసోక్తేః తత్రాపి త్రిదండోత్తరంగ్రాహ్యం. "సాయంసంధ్యాత్రిఘటికా అస్తాదు పరిభాస్వతః" ఇతి స్కాందోక్తేః దండత్రయస్య సంధ్యాత్వాత్ తత్ర-

చత్వారిమాని కర్మాణి సంధ్యాయాం పరివర్జయేత్

ఆహారం మైథునం నిద్రాం స్వాధ్యాయంచ, చతుర్థకం॥ ఇతి మార్కండేయేన భోజన నిషేధాత్-

ముహూర్తోనం దినం నక్తం ప్రవదన్తి మనీషిణః

నక్షత్రదర్శనా న్నక్తమహం మన్యేగణాధిప॥ ఇతి మాధవీయే భవిష్యోక్తేశ్చ.

నక్తమనగా పగలు భోజనం చేయకుండా రాత్రి భోజనం చేయటం. అక్కడ ప్రదోషవ్యాపిని(తిథిని) గ్రహించాలి. నక్తవ్రతంలో ఎప్పుడూ ప్రదోష వ్యాపి తిథిని గ్రహించాలని వత్సోక్తి. ప్రదోషమనగా - సూర్యుడు అస్తమిం చాక మూడు ముహూర్తముల కాలము. అక్కడ నక్తాన్ని ఆచరించాలని శాస్త్ర నిశ్చయము అని మదనరత్నంలో వ్యాసోక్తి. అక్కడ కూడా మూడు గడియలు సాయంసంధ్య అని స్కాందోక్తి కనుక మూడు గడియలు సంధ్యా కాలం. ఆ సంధ్యాకాలంలో- ఆహారం, మైధునము, నిద్ర, స్వాధ్యాయము ఈ నాల్గింటిని చేయకూడదు అని మార్కండేయుడు భోజనాన్ని నిషేధించాడు. ముహూర్తకాలం తక్కువైన దినము నక్తము అని విద్వాంసులంటారు. నక్షత్ర దర్శనమైతే, నేను నక్తంగా భావిస్తాను అని మాధవీయంలో భవిష్య పురాణ వచనం.

మూ॥ గౌడాస్తు - "ప్రదోషోస్త మయాదూర్ధ్వం ఘటికాద్వయ మిష్యతే" ఇతి వత్సోక్తః ప్రదోష సంధ్యాచ దినరాత్ర్యోః సంధౌముహూర్తః

"అర్వాగస్త మయాత్ సంధ్యా వ్యక్తీభూతాన తారకాయావత్
తేజః పరిహానివశాత్ భానోః అర్ధోదయం యావత్॥" ఇతి.

వరాహోక్తేః ఇత్యాహుః తన్న అస్య సంధ్యావందన, అనధ్యాయాది పరత్వాత్ అత ఏవతత్ర ఖండ మండలస్య సంధ్యాత్వముక్తం విజ్ఞానేశ్వరేణ.

యచ్చమదనరత్నే - నక్తస్య వైధత్వాత్ రాగప్రాప్త భోజన గోచరో నిషేధ ఇత్యుక్తం, తన్న విధేః నిషేధా విరోధాత్ అన్యథా కపింజలా నిత్యత్ర త్రిభ్యో అధికానాం హింసనం స్యాత్. సాయంకాలే నక్తంతు దినద్వయే ప్రదోష స్పర్శే జ్ఞేయం. అతథాత్వే పరత్రస్యాత్ అస్తాదర్వాగ్ యతోహిసా. ఇది జాబాలి వచనాత్.

ప్రదోషవ్యాపినీ నస్యాద్దివా నక్తం విధీయతే
ఆత్మనో ద్విగుణాఛాయా మందీభవతి భాస్కరే॥
తన్నక్తం నక్త మిత్యాహుః ననక్తం నిశిభోజనం। ఇతి స్కాందాచ్చ.

యత్యా దీనామపి సాయాహ్నే నక్తం -

నక్తం నిశాయాం కుర్వీత గృహస్థో విధిసంయుతః
యతి శ్చవిధవాచైవ కుర్యాత్తత్ సదివాకరం॥ ఇతి తత్రైవస్మృత్యంత రాత్. ఇదమపుత్ర విధురోప లక్షణం. పుత్రవతస్తు రాత్రావేవ. "అనాశ్రమోఽ ప్యాశ్రమీస్యాత్ అపత్నీకోఽపి పుత్రవాన్॥ ఇతి సంగ్రహోక్తేః సౌరనక్తంతు దివైవత్రిముహూర్త స్పృగేవాహ్ని నిశిచైతావతీ తిథిః.

తస్యాం సౌరం, భవేన్నక్త మహన్యేవతు భోజనం। ఇతి సుమన్తూక్తేః.

గౌడులైతే - అస్తమయం తర్వాత రెండు ఘడియలు ప్రదోషము అని న్నారో ఈ వత్సోక్త ప్రదోష సంధ్య, దినము, రాత్రి ఈ రెంటి సంధికాలము. స్తమయం తర్వాత చుక్కలు కనిపించనంతవరకు సూర్యుడు తేజోహానివల్ల, ంత కన్పిస్తున్నంతవరకు సంధ్య అని వరాహోక్తి ఉందికదా అని అన్నారో అది తప్పు. ఈ మాట సంధ్యావందన, అనధ్యాయాది విషయకము. అందువల్లే అక్కడ ఖండమైన సూర్య మండలమునకు సంధ్యాకాలము అని విజ్ఞానేశ్వరుడు చెప్పాడు.

మదనరత్నంలో ఇట్లా - నక్తంను విధించారు కనుక నిషేధము రాగ ప్రాప్త భోజన విషయకము భోజనాన్ని ఇది నిషేధిస్తుంది అని అన్నారో అది తప్పు. ఈ విధి నిషేధనమునకు విరుద్ధం కాదు. లేనిపక్షంలో కపింజలాన్ అనే చోట మూటికన్నా ఎక్కువ వాటిని చంపవలసి వచ్చేది. రెండు రోజుల్లో ప్రదోషస్పర్శ ఉంటే సాయంకాల నక్తాన్ని గ్రహించాలి. లేనిపక్షంలో తర్వాత నక్తమౌతుంది. ఎందువల్లనంటే (సంధ్య) అది అస్తమయంకన్న ముందౌతుంది అని జాబాలి వచనము.

తిథి ప్రదోషవ్యాపిని కాని పక్షంలో దివస నక్తము విధిస్తాము. సూర్యుడు అల్పుడైనప్పుడు, ఛాయ రెట్టింపు ఔతుంది, ఆ నక్తాన్నే నక్త మంటారు. రాత్రి భోజనం నక్తం కాదు అని స్కాందవచనము. యత్యాదులకు గూడా సాయంకాలమే నక్తము. గృహస్థుడు విధిపూర్వకముగా రాత్రియందు నక్తాన్ని చేయాలి. యతి, విధవ - వీరు సూర్యుడుండగనే నక్తము చేయాలి అని అక్కడే మరొక స్మృతిలో చెప్పారు. ఇది పుత్రులు లేనివారికి విధురునికి సూచకము (భార్యావియోగి, దుఃఖితుడు) పుత్రవంతుడు రాత్రే నక్తం చేయాలి. ఆశ్రమ హీనుడైనా ఆశ్రమి ఔతాడు. అపత్నీకుడైనా పుత్రవంతుడౌతాడు అని సంగ్రహమైనమాట. సౌరనక్తమైతే పగటియందే పగలు మూడు ముహూర్తముల కాలస్పర్శ మాత్రమే. అట్లాగే రాత్రి కూడా తిథి మూడు ముహూర్తముల కాలస్పర్శమాత్రమే. ఆ తిథిలో సౌరనక్తమౌతుంది. భోజనము మాత్రం పగలే అని సుమంతూక్తి.

మూ॥ హరినక్త మందు విశేషము కాలాదర్శేస్కాందే -

ఉదయస్థాసదా పూజ్యా హరినక్తవ్రతేతిథిః ఇతి అన్యనక్తంతు సంక్రాంత్యాదావపి రాత్రావేవ నిషేధస్య రాగప్రాప్త భోజనగోచరత్వేన వేధాబాధకత్వాత్ దినద్వయ వ్యాప్తౌ పరా.

ఉభయోర్య దివాతిథ్యోః ప్రదోష వ్యాపినీ తిథిః

తత్రోత్త రత్రనక్తం స్యాత్ ఉభయత్రాఽపిసా, యతః॥ ఇతి కాలాదర్శే జాబాలి వచనాత్ అన్యపక్షేమ ఏకభక్తవన్నిర్ణయః అథాత్రవిశేషో మదనరత్నేగారుడే - హవిష్యభోజనం స్నానం సత్యమాహార లాఘవం.

అగ్నికార్య మధఃశయ్యా నక్త భోగీషడాచరేత్॥ అగ్నికార్యం- వ్యాహృతి హోమః, ఇతినక్తం, అయాచితేతు విశేషవచనాభావాత్ ఉపవాసవన్నిర్ణయః.

కాలాదర్శ మందు స్కాందవచనము - హరినక్త వ్రతమందు ఉదయ కాల మందలి తిథినే సదా గౌరవించాలి అని. ఇతర దేవతల నక్తములు, సంక్రాన్త్యాదులందలి నక్తము రాత్రి యందే. నిషేధము, రాగ ప్రాప్తభోజన విషయకంకాన విధిని బాధించదు. దినద్వయంలో వ్యాపించిన పరమందు ఒక వేళ రెండు తిథులుంటే ప్రదోష వ్యాపినియైన తిథిని గ్రహించాలి. రెండురోజులు ఒకే తిథి ఉంటే పరమందు నక్తము చేయాలి అని కాలాదర్శంలో జాబాలి వచనం. ఇతర వాదాలలో ఏకభక్తంవలె నిర్ణయం చేయాలి.

ఇక్కడ మదనరత్నంలో గారుడ వాక్యంలోని విశేషం ఇట్లా - హవిష్య భోజనము స్నానము, సత్యం, అల్ప ఆహారము, అగ్నికార్యము; భూమిపై పరుండుట-ఈ ఆరింటిని నక్తభోజి ఆచరించాలి అని చెప్పారు. అగ్నికార్యము= వ్యాహృతిహోమం (ఓం), భూర్, భువస్, స్వర్. ఇంతవరకు నక్తం అయాచిత మందు (అడక్కుండా లభించినవానిలో.) విశేషవచనాలు లేవు కాబట్టి ఉపవాసం వలెనే నిర్ణయము.

మూ॥ నక్షత్ర వ్రతకాలము. విష్ణుధర్మే -

ఉపోషితవ్యం నక్షత్రం యస్మిన్నస్తమియాద్రవిః
యుజ్యతే యత్రవాతారా నిశీథే శశినా సహ॥ ఇతి

మాధవీయేస్కాందే -

తత్త్రివోపవసే దృక్షే యస్మిశ్ఛాదధో భవేత్
ఉపవాసే యదృక్షం స్యాతద్ధి నక్తైక భుక్తయోః॥

విష్ణుధర్మమందు-సూర్యుడు ఏ నక్షత్రంలో అస్తమిస్తాడో, ఏ నక్షత్రము అర్ధరాత్రి యందు చంద్రునితో కూడుతుందో ఆ నక్షత్రమందు ఉపవసించాలి, అని. మాధవీయంలో స్కాందవచనం. ఇట్లా - ఏ నక్షత్రం అర్ధరాత్రికంటే ముందు (పూర్వం)వరకు ఉంటుందో ఆ నక్షత్రంలో ఉపవసించాలి. ఉపవాసంలో ఏ నక్షత్రం ఉంటుందో అదే నక్త ఏకభక్తములకు కూడా అని.

మూ॥ వ్రత పరిభాషా తత్రాధికారిణః మదనరత్నే భవిష్యే

అనగ్నయస్తు యేవిప్రాః తేషాం శ్రేయో విధీయతే
వ్రతోపవాసనియమైః నానాదానైః తథానృప॥

అనగ్నిగ్రహణం ఉపవాస విషయం. అత ఏవ దేవలః -

ఆహితాగ్నిరనడ్ వాంశ్చ బ్రహ్మచారీచ తేత్రయః
అశ్నన్త ఏవ సిద్ధ్యంతి నైషాం సిద్ధిః అనశ్నతాం॥

ఏకాదశ్యాదౌతు వచనాత్ భవతీతి వక్ష్యామః

శూద్రస్యాప్యధికారం -

శూద్రో వర్ణశ్చతుర్థోఽపివర్ణత్వాత్ ధర్మమర్హతి.
వేదమన్త్ర స్వధాస్వాహావషట్ కారాదిభిర్వినా॥ ఇతి వ్యాసోక్తేః

ప్రాచ్యాస్తు -

వైశ్యశూద్రయోః ద్విరాత్ర్యధిక ఉపవాస నిషేధః
వైశ్యాః శూద్రాశ్చయే మోహాత్ ఉపవాసం ప్రకుర్వతే
త్రిరాత్రం పంచరాత్రంవా తేషాం వ్యుష్టిః న విద్యతే॥
చతుర్థ భక్షణం వైశ్యే శూద్రే చాపి విధీయతె
త్రిరాత్రంతున ధర్మజ్ఞైః విహితం బ్రహ్మవాదిభిః॥ ఇతి

హేమాద్రావచనాదిత్యాహుః యావదుక్త నిషేధః ఇత్యేకే ప్రకరణాత్ మహాతపో విషయ ఇతి యుక్తం. ఏవం స్త్రీణామపి.

యత్తుస్కాందే -

నాస్తి స్త్రీణాం పృథక్ యజ్ఞః నవ్రతం నాప్యుపోషణం
భర్తుః శుశ్రూషయైవైతాన్ లోకాన్ ఇష్టాన్ వ్రజంతిహి॥
యద్దేవేభ్యో యచ్చపిత్రాదికేభ్యః
కుర్యాత్ భర్తాఽభ్యర్చనం సత్క్రియాంచ
తస్యార్థం వైసాఫలం నాన్యచిత్తా
నారీభుంక్తే భర్తృ శుశ్రూషయైవ॥

ఆదిత్య పురాణే -

నారీ ఖల్వననుజ్ఞాతా భర్త్రావాపి సుతేనవా
విఫలంతద్భవేత్త స్యాయత్కరోత్యౌర్ధ్వ దైహికం॥ ఇతి

ఔర్ధ్వదైహికం - పారలౌకికం తత్ భర్త్రననుజ్ఞా విషయం భార్యాపత్యుర్మతేనైవ వ్రతాదీనాచరేత్సదా ఇతి కాత్యాయనోక్తేః.

వ్రత అధికారుల గూర్చి మదనరత్నంలో భవిష్య పురాణ వచనము ఇట్లా - ఏ బ్రాహ్మణులు అగ్నిహోత్రులు కారో వారికి వ్రత, ఉపవాస, నియమములతో, దానముతో శ్రేయస్సు చూపబడుతోంది. అనగ్ని అని చెప్పటం ఉపవాస పరకము అని. దేవలుడు అందువల్లనే ఇట్లా అంటాడు - అహితాగ్ని, వృషభము, బ్రహ్మచారి ఈ ముగ్గురు వీరికి భుజించటంవల్లనే సిద్ధి వస్తుంది. వీరికి భోజనం చేయక పోవటంవల్ల సిద్ధిరాదు. ఏకాదశ్యాదులందు వచనంవల్లనే సిద్ధి వస్తుంది అనే దాన్ని చెప్పబోతున్నాము.

వ్యాసుని వాక్కు ననుసరించి శూద్రునికి గూడా అధికారం ఉంది. ఇట్లా అంటాడు - శూద్రుడు చతుర్థ వర్ణంవాడైనా వర్ణుడైనందువల్లనే ధర్మాచరణకు యోగ్యుడౌతాడు. వేదమంత్రములు స్వధా, స్వాహా, వషట్కారాదులు లేకుండా ధర్మం ఆచరించొచ్చు అని.

ప్రాచ్యులు ఇట్లా అంటారు - వైశ్య శూద్రులు రెండు రాత్రులకన్న ఎక్కువ రోజులు ఉపవాసం ఉండరాదు. వైశ్యులు, శూద్రులు మోహంవల్ల పొరపాటువల్ల మూడు రాత్రులు, ఐదు రాత్రులు ఉపవసిస్తే వారికి ఫలితం లేదు. వైశ్య శూద్రులు నాల్గవసారి భోంచేయవచ్చు. కాని, మూడవ రాత్రి ఉపవాసమును బ్రహ్మవాదులైన ధర్మజ్ఞులు విధించలేదు అని హేమాద్రియందలి వచనము అని అన్నారు. చెప్పిందంతా నిషేధం అని కొందరు సందర్భాన్ననుసరించి మహా తపో విషయము అని అనుట తగును. ఈ విధంగా స్త్రీలకు గూడా.

స్కాందమందు - స్త్రీలకు వేరే యజ్ఞము, వ్రతము, ఉపవాసము లేవు. భర్త శుశ్రూషవల్లనే వారు ఇష్టమైన లోకములను పొందగలరు. దేవతలకొరకు, పితాదుల కొరకు అభ్యర్చన, సత్కారము భర్త ఏదైతే చేస్తాడో అందలి సగం ఫలాన్ని ఆమె అనన్యచిత్తంతో భర్తకు శుశ్రూష చేయడంవల్లనే పొందుతుంది.

ఆదిత్య పురాణంలో ఇట్లా అంటారు - భర్తతో కాని, కొడుకుతో కాని అనుజ్ఞ పొందకుండా, ఔర్ధ్వదైహిక కర్మలను ఆచరించిన స్త్రీ కర్మలన్నీ విఫలమే. ఔర్ధ్వదైహికము=పరలోక క్రియలు. అననుజ్ఞ=భర్త ఆజ్ఞలేక. భార్య, భర్త బుద్ధి ననుసరించే వ్రతాదులను ఎల్లప్పుడు ఆచరించాలి అని కాత్యాయనుని ఉక్తి.

మూ॥ అత్రవిశేషః హరివంశే—

స్నానంచకార్యం శిరసః తతః ఫలమవాప్నుయాత్
స్నాత్వాస్త్రీప్రా తరుత్థాయ పతిం విజ్ఞాపయేత్సతీ॥
తథా - గృహీత్వోదుంబరంపాత్రం సకుశం సాక్షతంతథా
గోశృంగం, దక్షిణం సించ్య (సిక్త్వా) ప్రగృహ్ణీయాచ్చ తజ్జలం॥

ఔదుంబరం=తామ్రమయం—

తతోభర్తృః సతీదద్యాత్ స్నాతస్య ప్రయతస్య చ
ఆత్మనశ్చాభిషేక్తవ్యం తతః శిరసి తజ్జలం॥
ఉపవాసేషు కర్తవ్యమేతద్ధి వ్రతకేషు చ॥ ఇతి

ఇక్కడ హరివంశంలో విశేషము - శిరః స్నానము చేసిన ఫలితం లభిస్తుంది ఆమెకు. ప్రొద్దున్నే లేచి స్నానంచేసి ఆ స్త్రీ పతి అజ్ఞను పొందాలి. (ప్రార్థించాలి.) అట్లాగే రాగిపాత్రను తీసుకొని కుశలు, అక్షతలు తీసుకొని ఆవుయొక్క కుడికొమ్మును అభిషేకించి, ఆ జలాన్ని ఆమె తీసుకోవాలి. (ఔదుంబరం=తామ్రపాత్ర) పిదప స్నాతుడు, సన్నద్ధుడును ఐయున్న తన భర్తకు ఆ స్త్రీ ఆ జలాన్ని ఇవ్వాలి పిదప తన శిరస్సుపై ఆ జలాన్ని చల్లు కోవాలి. ఇది ఉపవాసాల్లో చేయాల్సిన విధానం. వ్రతాల్లో కూడా.

మూ॥ సర్వవ్రతేషు సంకల్ప విధిశ్చ భారతే—

గృహీత్వోదుంబరం పాత్రం వారిపూర్ణం ఉదఙ్ ముఖః
ఉపవాసంతుగృహ్ణీయాత్ యథా(ద్వా) సంకల్పయేత్ బుధః॥

హస్తేనైవేత్యర్థః. (యథేతిపాఠే యత్ఫలమిచ్ఛేదిత్యర్థః.)

అన్నివ్రతాల్లోను సంకల్పవిధిని భారతంలో ఇట్లా చెప్పారు: రాగిపాత్రను తీసుకొని, దానినిండా నీరుపోసి, తూర్పుముఖంగా నిలబడి ఉపవాసాన్ని స్వీక రించాలి. జ్ఞాని, తన కోరికను తెలుపుతూ తన చేతితో సంకల్పం చేయాలి.

మూ॥ వ్రతారంభకాలము మదనరత్నే గార్గ్యః—
అస్త గేచగురౌశుక్రే బాలేవృద్ధమలిమ్లు చే
ఉద్యాపనము పారంభం వ్రతానాం నైవకారయేత్॥

రత్నమాలాయాం—

సోమసౌమ్య గురు శుక్ర వాసరాః సర్వకర్మసుభవన్తి సిద్ధిదాః।
భానుభౌమ శనివాసరేషు చప్రోక్తమేవఖలుకర్మ సిద్ధ్యతి॥
తథా - విరుద్ధ సంజ్ఞా ఇహయేచయోగాః తేషాం అనిష్టః ఖలుపాద అద్యః
సవైధృతిస్తు వ్యతిపాతనామా సర్వోప్యరిష్టః పరిఘస్యచార్ధం॥
త్రిస్తుయోగే ప్రథమే, సవజ్రే వ్యాఘాత సంజ్ఞేనవ, పంచశూలే
గండేఽతిగండేచషడేవనాడ్యః శుభేషుకార్యేషు వివర్జనీయాః॥

మదనరత్నంలో గార్గ్యుడు - గురు శుక్రులు అస్తగులు, బాలురు, వృద్ధులుగా ఉన్నప్పుడు, మలమాసంలో, వ్రతముల ఆరంభము ఉద్యాపనము చేయ రాదు. రత్నమాలయందు - సోమ, బుధ, గురు, శుక్రవారములు అన్ని పనుల్లోను సిద్ధిని కల్గిస్తాయి. ఆది, మంగళ, శనివారాల్లో చెప్పబడిన కర్మలు మాత్రమే సిద్ధిస్తాయి. అట్లాగే - విరుద్ధ సంజ్ఞలుగల యోగముల పాదఆదులు అనిష్టం కల్గించేవి. వైధృతి వ్యతిపాతయోగములు పూర్తిగా అరిష్టకారకములు. పరిఘయోగం యొక్క సగభాగం అరిష్టకం. విష్కంభ, వజ్రయోగముల 3 గడియలు, వ్యాఘాతయోగంలో 9 గడియలు, శూలయోగంలో 5 గడియలు, అతిగండ, గండయోగములందు 6 గడియలు శుభకార్యములందు విడిచిపెట్టాలి.

మూ॥ భద్రా—సంగ్రహే—

కృష్ణే అగ్నిదిశయోరూర్ధ్వం సప్తమీభూతయో రథః
శుక్లేవేదేశయోరూర్ధ్వం భద్రాప్రాక్ వసుపూర్ణయోః॥

శ్రీపతిః—

నసిద్ధి మాయాతికృతంచవిష్ట్యాం విషాదిఘాతాదిక మత్రసిద్ధం

వ్యవహార సముచ్చయే—

దశమ్యామష్టమ్యాం ప్రథమ ఘటికా పంచకవరం
హరిద్యౌ సప్తమ్యాం ద్విదశఘటికాన్తే త్రిఘటికం
తృతీయారాకాయాం ఖయమఘటికాభ్యః పరభవం
శుభంవిష్టేః పుచ్ఛంశివ తిథి చతుర్థ్యోస్తువిరమే॥

తత్రైవ—

సర్పిణీతుసితేపక్షే కృష్ణే చైవతువృశ్చికీ
సర్పిణ్యాస్తు ముఖంత్యాజ్యం వృశ్చిక్యాః పుచ్ఛమేవచ॥

మాధవీయే—

విష్టిః యదాహని తిథేరపరార్థజాతా
పూర్వార్ధజా నిశితదా శుభదాచపుచ్ఛే

బ్రహ్మయామలే—

దినభద్రాయదా రాత్రౌరాత్రి భద్రాయదాదివా
నత్యాజ్యా శుభకార్యేషు ప్రాహురేవం పురాతనాః॥

శ్రీపతిః—

షట్ పౌష్ణతో ద్వాదశ, శాంకరాచ్చ
పౌరందరాత్ భాని నవక్రమేణ
పూర్వార్థ మధ్యా పరభాగయుంజి
చిరంతనైః జ్యోతిషికైః స్మృతాని॥

సంగ్రహమందు - కృష్ణపక్షంలో తృతీయ. దశమిల తరువాత, సప్తమీ, చతుర్థశులకు ముందు శుక్లపక్షంలో చతుర్థి ఏకాదశిల తరువాత అష్టమీ, పూర్ణిమలకు ముందు 30 ఘడియలు భద్రఔతుంది అని ఉంది. శ్రీపతి మాట - విష్టియందు చేయబడే విష, అరమూతాదికము సిద్ధించదు ఇది నిశ్చయము అని. వ్యవహార సముచ్చయంలో ఇట్లా ఉంది— దశమి, అష్టమియందు ఐదు గడియల తరువాతి (మూడు గడియలు), ఏకాదశి సప్తమియందు పన్నెండు గడియల, తరువాత 3 గడియలు, తదియ, పూర్ణిమయందు ఇరవై గడియల తరువాత (క్షయమ=20) మూడు గడియలు, చతుర్థశి, చతుర్థులందు చివరి మూడు గడియలు (భద్ర) విష్టియొక్క పుచ్ఛమ, శుభప్రదము. అక్కడే మరోమాట - భద్రాతిథి శుక్లపక్షంలో సర్పిణి, కృష్ణపక్షంలో వృశ్చికి ఔతుంది. సర్పిణి ముఖాన్ని వదలాలి, వృశ్చికి యొక్క పుచ్ఛము వదలాలి అని అన్నారు. మాధవీయంలో - తిథికి అపరార్థంలో వచ్చిన విష్టి, పగలు పూర్వార్ధంలో ఆరంభమై, రాత్రికూడా ఉంటే అప్పుడు పుచ్ఛంలో కూడా శుభకరమే అని ఉంది. బ్రహ్మయామలమందు ఇట్లా అన్నాడు - దినమందు ఆరంభమైన భద్ర రాత్రియందుంటే, రాత్రిభద్ర దినమందు ఉంటే శుభకార్యాల్లో దానిని వదలరాదు అని పెద్దలు చెప్పారు. శ్రీపతి ఇట్లా అంటాడు. రేవతికన్న ముందరి (పూర్వ) ఆరు నక్షత్రాలు, ఆర్ద్రనుండి పన్నెండు నక్షత్రాలు మధ్యలోవి, జేష్ఠనుండి తరువాతి నక్షత్రాలు తొమ్మిది శుభకరములని ప్రాచీన జ్యోతిష్యులు స్మరించారు.

మూ॥ వ్రతారంభేవిశేషః : మదనరత్నే సత్యవ్రతేనోక్తః—

ఉదయ స్థా తి థిర్యాహిన భవేద్దిన మధ్య భాక్

సాఖండాన వ్రతానాం స్యాదారం భశ్చసమాపనం॥ ఇతి.

దేవలః -

అభుక్త్వాప్రాత రాహారం స్నాత్వాచమ్య సమాహితః

సూర్యాయ దేవతా భ్యశ్చ నివేద్య వ్రతమాచరేత్॥

మదనరత్నే భవిష్యే -

క్షమా సత్యం దయా దానం శౌచమింద్రియ నిగ్రహః

దేవపూజాగ్ని హవనం సంతోషః స్తేయవర్జనం॥

సర్వ వ్రతేష్వయం ధర్మః సామాన్యో దశధాస్మృతః అగ్ని హోమః తద్దైవత్యోః వ్యాహృతి హోమోవేతివర్ధమానః

యత్తుతే నోక్తం - సర్వపదమేతత్ పురాణోక్త ప్రకృత వ్రతపరం వ్రతాంతరేతు విధ్యంతర సత్వే హోమః అన్యధాన. అతఏవ ఏకాదశ్యాం శిష్టానాం హోమ అనాచరణం ఇతి తన్న. జపోహోమశ్చ ఇతి వక్ష్యమాణ ఏక వాక్యత్వేన అస్యకామ్య వ్రత సమాప్తి పరత్వాత్. తత్వంతు సాప్తదశస్య పశుమిత్ర విందాది ప్రకరణ స్థైనైవ తత్తద్ వ్రత విశేష హోమవిధిభిః అస్య ఉపసంహార ఇతి.

వ్రతారంభమందు విశేషమును మదనరత్నంలో సత్యవ్రతుడు ఇట్లా చెప్పాడు- ఉదయమందున్న తిథి, దినమధ్యం వరకు ఉండని పక్షంలో అది ఖండతిథి. అక్కడ వ్రత అరంభ సమాపనములు చేయరాదు అని. దేవలుడు ఇట్లా అంటాడు- ప్రొద్దున్నే స్నాన ఆచమనములు చేసి, సన్నద్ధుడై ప్రొద్దుటి భోజనం తీసుకోకుండా సూర్యునకు, దేవతలకు నివేదించి వ్రతమారంభించాలి అని. మదన రత్నంలో భవిష్యపురాణోక్తి ఇట్లా క్షమ, సత్యము, దయ, దానము, శుచిత్వము, ఇంద్రియ నిగ్రహము, దేవపూజ, అగ్ని యందు హవనము, సంతోషము, దొంగతనం లేకుండుట- ఈ పది ధర్మములు అన్ని వ్రతములందు సామాన్యంగా ఆచరించాల్సినవి అని చెప్పారు. అగ్ని హోమము అంటే ఆయా దేవతలకు చెందిన అగ్ని యందు హోమము, లేదా వ్యాహృతి హోమమైనా చేయాలి అని వర్ధమానుని అభిప్రాయం. 'సర్వ వ్రతేషు' అన్న చోటి సర్వ పదము పురాణములందు చెప్పబడిన ప్రకృత వ్రత విషయకము, ఇతర

వ్రతముల విషయంలో మరొక విధి ఉన్న పక్షంలో హోమం చేయాలి. లేకున్న లేదు. అందువల్లనే శిష్టులు ఏకాదశియందు హోమాన్ని ఆచరించరు అని. ఏదైతే వర్ధమానుడన్నాడో అది తప్పు. జపము హోమము అని ఒకే వాక్యంలో చెప్ప బోతున్నందువల్ల ఇది కామ్య వ్రతసమాప్తి విషయకము. యథార్థమైతే ఎట్లా పశుమిత్రవిందాది ప్రకరణంలో ఉన్నదాని వల్లనే సప్తదశ సామిధేనీ హోమ విధి ఉపసంహారమౌతుందో అట్లాగే ఆయా వ్రత విశేషములలోని హోమ విధుల ద్వారా దీని (జపహోమ) ఉపసంహారము అని. (హవనం అనేది జపము. హోమము అనేదానిలో ఉపసంహృతమౌతుంది). ఏ హోమం ఎక్కడ చెప్ప బడితే అక్కడ ఆచరించాలి.

మూ॥ విష్ణుధర్మే -

తజ్జప్య జపనధ్యానే తత్కథాశ్రవణాదికం
తదర్చనంచతన్నామ కీర్తన శ్రవణాదయః
ఉపవాసకృతాయేతే గుణాః ప్రోక్తా మనీషిభిః॥

కౌర్మే -

బహిర్ గ్రామాన్త్యజాన్ సూతిం పతితంచ రజస్వలాం
నస్పృశేన్నాభి భాషేత నేక్షేత వ్రతవాసరే॥

పృథ్వీచంద్రోదయే అగ్నిపురాణే -

స్నాత్వా వ్రతవతా సర్వ వ్రతేషు వ్రతమూర్తయః
పూజ్యాః సువర్ణమప్యాద్యాః శక్త్యావై భూమిశాయినా॥
జపోహోమశ్చ సామాన్యం వ్రతాంతే దానమేవచ
చతుర్వింశత్ ద్వాదశ వాపంచ వాత్రయఏవవా
విప్రాభోజ్యా యథాశక్తి తేభోదద్యాచ్చ దక్షిణాం॥

అత్రవిప్రాః ఇతి పుంలింగ నిర్దేశాత్ పుమాంస ఏవభోజ్యాః నతుస్త్రియః ఏవం సహస్ర భోజనాదావపి విరూపైక శేషస్య ప్రమాణాంతరం వినా అయుక్త త్వాత్. అతఏవద్వయోః యజమానయోః ప్రతిపదం కుర్యాత్, బహుభ్యో యజమానేభ్యో ఇత్యాదౌ విరూప ఏకశేష అయోగాత్ పత్న్యభిప్రాయం ద్విత్వం బహుత్వంవాన సంభవతీత్యుక్త మాచార్యైః, పార్థసారథినాచ ఏతేనైకస్య బ్రాహ్మణస్యావృత్త్యా భోజనం పరాస్తం. బహుత్వ స్యైకవదశృత్యా బ్రాహ్మణాన్వి తత్వేన భోజనాన్వయా భావాత్ ఇత్యన్యత్ర విస్తరః

శూద్రస్య ప్రతిష్ఠావత్ విప్రద్వారా వ్యాహృతిహోమః ఇతివర్ధమానః వ్రతమూర్తయో - వ్రతదేవతా ప్రతిమాః

విష్ణుధర్మమందు ఇట్లా చెప్పారు - ఆ దేవత గురించి జపించతగిన మంత్రజప ధ్యానములు, ఆ దేవతకు చెందిన కథాశ్రవణాదులు, పూజనము, నామకీర్తనము, శ్రవణాదులు ఇవన్ని అయా దేవతల గూర్చి ఉపవాసం చేసేవారికి ఉండతగిన గుణాలని విద్వాంసులు చెప్పారు అని.

కూర్మ పురాణమందు ఇట్లా ఉంది - వ్రతదినమందు గ్రామందాటి వెళ్ళరాదు. అంత్యజాలను, సూతకుని, పతితుని, రజస్వలను - వీరిని తాకరాదు, చూడరాదు. వీరితో మాట్లాడరాదు అని. పృథ్వీ చంద్రోదయంలో అగ్నిపురాణ వాక్యం ఇట్లా ఉంది - వ్రతం కలవాడు, అన్ని వ్రతాలలోను స్నానం చేసి, సువర్ణాదివ్రతమూర్తులను యథాశక్తి పూజించాలి. భూమియందు శయనించాలి. జపహోమములు దానము వ్రతాంతమందు చేయాలి. 24 గురు, లేదా 12 మంది లేదా ఐదుగురు లేదా ముగ్గురు బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. పిదప యథాశక్తి వారికి దక్షిణ కూడా ఇవ్వాలి.

ఇక్కడ విప్రులు అని పుంలింగంలో చెప్పినందువల్ల మగవారికే భోజనం పెట్టాలి. ఆడవారికి కాదు. ఇట్లాగే సహస్ర భోజనాదులందు కూడా, విరూప ఏకశేషము మరొక ప్రమాణంలేని పక్షంలో కుదరదు. (భిన్నలింగముల ఏకశేషం). అందువల్ల ద్వయోః యజమానయోః (ఇద్దరు యజమానులకు) అనుచోట ప్రతిపదం చేయాలి. (ప్రతిపదశస్త్రనామక ఋక్కులనుండి మొదటిఋక్కు పఠించాలి.) బహు యజమానులకు ఇత్యాదులందు విరూప ఏకశేషం కుదరదు కాబట్టి శక్తి (అభిప్రాయమువల్ల) ద్విత్వమో బహుత్వమో కాదు అని ఆచార్యులన్నారు. పార్థసారథి కూడా అట్లాగే అన్నారు. ఇందువల్ల ఒకే బ్రాహ్మణునకు ప్రతిరోజు భోజనం అనేమాట వీగిపోయింది. ఆ పదంవల్లనే బహుత్వం తెలిసింది కాబట్టి అది బ్రాహ్మణులకే అన్వయము, భోజనానికి అన్వయంకాదు అని మరోచోట విస్తరంగా ఉంది. ప్రతిష్ఠవలె, వ్యాహృతి హోమాన్ని కూడా శూద్రుడు బ్రాహ్మణుని ద్వారానే చేయించాలి అని వర్ధమానుడు వ్రతమూర్తులు . వ్రతదేవతాప్రతిమలు.

మూ॥ **ప్రతిమా స్వరూపంచ** మదనరత్నే భవిష్యే -

అనుక్తద్రవ్య తత్సంఖ్యా దేవతా ప్రతిమాన్నప
సౌవర్ణీరాజతీతామ్రీ వృక్షజామా ద్రికీ తథా॥
చిత్రజాపిష్టలేఖోత్థా నిజవిత్తా నురూపతః
అమాషాత్ పలపర్యంతం కర్తవ్యాశాఠ్యవర్జితై॥

మదనరత్నంలో ప్రతిమా స్వరూపాన్ని గురించి భవిష్య పురాణ వచనము ఇట్లా ఉంది - దేవతా ప్రతిమల సంఖ్య, దేవతా ప్రతిమలకై వెచ్చించాల్సిన ద్రవ్యం చెప్పబడలేదు. దేవతా ప్రతిమలు బంగారువి, వెండివి, రాగివి, దారువి, మట్టివి, చిత్రరూపము, పిండితో చేసినవి- వారివారి ఆర్థిక స్తోమతకు తగిన విధంగా, విత్తశాఠ్యం లేకుండా మాసం నుండి నాలుగు తులములవరకు నిర్మించుకోవచ్చును. (శాఠ్యం = కపటము.)

మూ॥ **హోమ ద్రవ్య విధానము** : తత్రైవబ్రాహ్మే—

ఆజ్యంద్రవ్యమనాదేశే జుహోతిషు విధీయతే
మంత్రస్య దేవతాయాశ్చ ప్రజాపతి రితిస్థితిః

బ్రహ్మపురాణోక్తి ఇట్లా ఉంది- హోమద్రవ్య విధానంలేనిచోట ఆజ్యంతో హోమం చేయాలి. అట్లాగే మంత్ర, దేవతల విధానం కూడా లేకపోతే ప్రజాపతి దేవతగా గ్రహించాలి.

మూ॥ **మంత్రానుక్తౌ** - సమస్త వ్యాహృతిరూపోమంత్రః, ప్రజాపతిశ్చ దేవతేతి కల్పతరుః.

మంత్రం చెప్పకపోతే సమస్త వ్యాహృతిరూపం మంత్రము, ప్రజాపతి దేవత అని కల్పతరువుయందు కలదు.

మూ॥ **గ్రహాది హోమం** — వర్ధమాన ధృత దేవీ పురాణే—

హోమో్గ్రహాది పూజాయాంశత మష్టాధికంభవేత్
అష్టావింశతిరష్టౌవా యథా ప్రాప్తి విధీయతే॥

మదనరత్నే - అనుక్త సంఖ్యా యత్రస్యాత్ శతమష్టోత్తరం స్మృతం.

వర్ధమానుడు సేకరించిన దేవీ పురాణోక్తి - గ్రహాదిపూజయందు సమయానుకూలంగా హోమం 108 సార్లు, లేదా 28 సార్లు లేదా 8 సార్లయినా చేయొచ్చు అని చెప్పారు.

మదన రత్నమందు ఇట్లా అన్నారు- సంఖ్య చెప్పనిచోట 108 అని అన్నారు.

మూ॥ **బ్రాహ్మణాది ఉపవాసే** విచారః—

ఉపవాసం ద్విజఃకృత్వా తతో బ్రాహ్మణ భోజనం
కుర్యాత్తేనాస్య సగుణ ఉపవాసోఽభిజాయతే॥

వర్ధమానమందలి వృద్ధ శాతాతపుని మాట ఇట్లా - బ్రాహ్మణుడు ఉపవాసం చేసి పిదప బ్రాహ్మణులను భుజింప చేయాలి. అందువల్ల ఈతని ఉపవాసం ఫలవంతమౌతుంది.

మూ॥ **వ్రతోద్యాపనా** నుక్తౌతు పృధ్వీ చంద్రోదయే నంది పురాణే -

కుర్యా దుద్యాపనం తస్య సమాప్తౌ యదుదీరితం
ఉద్యాపనం వినాయత్తు తత్ఫలం నిష్ఫలం భవేత్॥
యది చోద్యాపనం నోక్తం వ్రతానుగుణ తచ్చరేత్
విత్తానుసారతో దద్యాత్ అనుక్తోద్యాపనే వ్రతే॥
గాశ్చైవ కాంచనం దద్యాత్ వ్రతస్య పరిపూర్తయే।

వ్రతోద్యాపన చెప్పనిపక్షంలో పృథ్వీచంద్రోదయంలో నందిపురాణవచనం ఇట్లా ఉంది - వ్రతసమాప్తియందు చెప్పిన విధంగా ఉద్యాపన చేయాలి. ఉద్యాపన లేని వ్రతము నిష్ఫలము. ఒకవేళ ఉద్యాపన చెప్పనిపక్షంలో వ్రతానుగుణంగా జపంచేసి విత్తాన్ననుసరించి దానం ఇవ్వాలి. వ్రతపరిపూర్తికొరకు గోవులు, సువర్ణము దానం చేయాలి.

మూ॥ **అశక్తౌనారదీయే** -

సర్వేషామప్యలాభేతు యథోక్త కరణంవినా
విప్రవాక్యం స్మృతంశుద్ధం వ్రతస్యపరిపూర్తయే॥
వృధావిప్రవచోయస్తు గృహ్ణాతి మనుజః శుభం
అదత్వా దక్షిణాంపాపః సయాతినరకం ధ్రువం॥

ఉద్యాపనలో అశక్తుడైతే నారదీయపురాణవచనం ఇట్లా ఉంది. - వ్రత సమాప్తికి చెప్పింది చేయటం తప్ప ఏమీలేనిపక్షంలో శుద్ధబ్రాహ్మణ వాక్యమును వ్రత పరిపూర్తికై ప్రమాణంగా స్వీకరించాలి. దక్షిణ ఇవ్వకుండా ఎవడు బ్రాహ్మణుని శుభవచనాన్ని గ్రహిస్తాడో ఆ పాపి నరకానికే వెళ్తాడు నిశ్చయము.

మూ॥ సర్వకర్మను దక్షిణావిచారము. భారతే—

వేదోపనిషదేచైవ సర్వకర్మసుదక్షిణా
సర్వక్రతుమమోద్దిష్టాభూమిఃగావోఽథకాంచనం॥

భారతమందు - వేదములు ఉపనిషత్తులందు అన్నికర్మలందు, అంతట నేను ఉద్దేశించిన దక్షిణ భూమి, గోవులు, సువర్ణము.

మూ॥ దేవకార్యాల్లో రజతదానం వైజవాపః -

శివనేత్రోద్భవంయస్మాత్ రజతం పితృవల్లభం
అమంగలం తత్ యత్నేనదేవకార్యేషువర్జయేత్॥

వైజవాపుడు ఇట్లా అంటాడు - రజతము (వెండి) శివనేత్రము నుండి ఉద్భవించింది. పితరులకు ఇష్టమైంది. అమంగళమైంది కనుక దేవకార్యములందు ప్రయత్నపూర్వకంగా దానిని విడువాలి.

మూ॥ పరాన్నభోజనఫలం. తోదరానందే దేవీపురాణే -

వ్రతేచతీర్థేఽధ్యయనే శ్రాద్ధేపిచవిశేషతః
పరాన్నభోజనాద్దేవియస్యాన్నం తస్యతత్ఫలం

తోదరానందమందు దేవీపురాణ వచనం ఇట్లా - వ్రతమందు, తీర్థమందు, అధ్యయనమందు, శ్రాద్ధమందు పరాన్నభోజనం చేస్తే, ఆ అన్నమెవనిదో వానికి ఆ ఫలం లభిస్తుంది అని.

మూ॥ పృథ్వీచంద్రోదయే అగ్నిపురాణే -

నిత్యస్నాయమితాహారో గురుదేవద్విజార్చకః
క్షారం క్షౌద్రంచలవణం మధుమాంసానివర్జయేత్॥

పృథ్వీచంద్రోదయంలో అగ్నిపురాణవచనం - రోజు స్నానంచేసేవాడు గురుదేవద్విజపూజకుడు, మితాహారుడై కారము, తేనె, ఉప్పు, మదుమాంసములు వదలాలి అని.

మూ॥ క్షారాస్తుతత్రైవోక్తాః -

తిల ముద్గాదృతేశింబ్యం సస్యేగోధూమకోద్రవౌ
ధాన్యకం, దేవధాన్యంచ శమీధాన్యంతథైక్షవం
స్విన్నధాన్యంతథాపణ్యం మూలం క్షారగణఃస్మృతః॥

క్షారములు అక్కడే చెప్పబడ్డాయి అవి - నువ్వులు, పెసలు వదలి మిగిలిన పొట్టు గల (కాయ) ధాన్యములు గోధుమలు, ఆళ్ళు (కోద్రవం) (పైరు ధాన్యములు), ధనియాలు, సెనగలు, కందులు మొదలగునవి (ధాన్యకం) దేవధాన్యముహవనాన్నం (వర్షపునీటిచే పండే పంట) శమీధాన్యము (పొట్టుగల ఇక్షుధాన్యము (చెరుకుసంబంధి) స్విన్నధాన్యము (తడి) ఉడకబెట్టినది దుంపలు, కొన్నధాన్యము - ఇవి క్షారగణములు.

మూ॥ గోధూమానాంతుతత్రైవప్రతిప్రసవః -
ప్రీహిషష్టికముద్గాశ్చకలామాః సతిలంపయః
శ్యామాకాశ్చైవనీవారాఃగోధూమాద్యాః వ్రతేహితాః॥
కూష్మాండాలాబువార్తాక పాలంకీజ్యోత్స్నికాఃత్యజేత్
చరుక్షైక్షంసక్తుకణాః శాకందధిఘృతంమధు॥
శ్యామాకాః శాలినీవారాః యావకం మూలతండులం
హవిష్యవ్రతనక్తా దావగ్నికార్యాదికే హితం॥
మధుమాంసం విహాయాన్యత్ వ్రతేచహితమీరితం॥ ఇతి శమీధాన్యం మాషాది పాలంకీ - మధ్యదేశే 'పోఈ' ఇతి ప్రసిద్ధా. జ్యోత్స్నికా - పటోలికా (కోశాతకీ), మితాక్షరాయాం గౌతమః-చారుఃభైక్ష-సక్తుకణ-యావక-శాక-పయో-దధి-ఘృత-మూల-ఫలోదకాని-హవీంషి-ఉత్తరోత్తర ప్రశస్తాని పయోదధి ఘృతం చగవ్యం ఇతి అన్యేచ విశేషాః ఏకాదశీ చాతుర్మాస్యాది ప్రకరణే వక్ష్యంతే.

గోధుమలైతే అక్కడే తిరిగి విధింపబడ్డాయి (ప్రతిప్రసవ=నిషేధానికి నిషేధం), వడ్లు (ఎర్రబియ్యం) (అరవై రోజుల్లో పండే పంట) షష్టికం, పెసలు, శనగలు, తిలలు, పాలు, చామలు, దూసరబియ్యం, గోధుమలు మొదలగునవి వ్రతమందు హితమైనవి. గుమ్మడికాయ, సొరకాయ, వంకాయ, పాలంకి, పొట్లకాయలను వదలాలి హవ్యము (చరువు), భిక్షాన్నము, పేలపిండి, శాకము (ఆకు, పువ్వు, కాయ మొ॥నవి), దధి, ఘృతము, తేనె, చామలు, వడ్లు, దూస బియ్యం, అలచంతలు, దుంపబియ్యం, హవిష్యము ఇవి వ్రతనక్తాదులందు అగ్నికార్యాదికంలోను హితమైనవి. మధుమాంసములను వదలి ఇతరము వ్రతమందు హితమైనదని చెప్పారు అని. శమీధాన్యము-మినుములు మొ॥నవి. పాలంకి మధ్యదేశంలో 'పోఈ' అని ప్రసిద్ధమైంది జ్యోత్స్నిక-పొట్లకాయ.

మితాక్షరమందు గౌతముని మాట ఇట్లా ఉంది: చరువు, భిక్షాన్నం, పేలపిండి, అలచందలు, శాకము, పాలు, పెరుగు, నేయి, మూలము (గడ్డలు) పండ్లు, నీరు, హవిస్సు, ఇవి ఉత్తరోత్తరము ప్రశస్తమైనవి. పాలు, పెరుగు, నేయి- ఇవి గోసంబంధమైనవి అని. ఇతర విశేషములు, ఏకాదశి, చాతుర్మాస్యం మొదలగు ప్రకరణంలో చెప్తాము.

మూ॥ **గృహీతవ్రతత్యాగేతు** మదనరత్నే—

పూర్వంవ్రతంగృహీత్వాయో నాచరేత్ కామమోహితః
జీవన్భవతి చండాలోమృతః శ్వాచాభిజాయతే॥

వ్రతం స్వీకరించి వదిత్తే మదన రత్నమందు ఇట్లా చెప్పారు - మొదలు వ్రతం స్వీకరించి, కామమోహితుడై తర్వాత ఎవడు ఆచరించడో వాడు బ్రతికి నవ్వుడు చండాలుడౌతాడు. చస్తే కుక్కై పుడ్తాడు.

మూ॥ **వ్రతకాలంలో కోపమొస్తే**—

తత్రప్రాయశ్చిత్తముక్తం పృథ్వీ చంద్రోదయే అగ్నిగరుడ-

పురాణయోః—

క్రోధాత్ ప్రమాదాత్లో భాద్వావ్రతభంగో భవేద్యపి
దినత్రయంన భుంజీత ముండనం శిరసోఽథవా॥ ఇతి ప్రాయశ్చిత్త అమ్నానాత్ అతిక్రాంత వ్రతానుష్ఠానం నాస్తీతి గమ్యతే. యత్తు-

ప్రాయశ్చిత్తం తతఃకృత్వా పునరేవవ్రతీ భవేత్ - ఇతి వచనాత్ అతిక్రాన్తమపివ్రతం కార్యమేవేతి శూలపాణిః, తత్మధ్యే వ్రతలోపే వ్రతశేషసత్వేజ్ఞేయం, ఏతచ్ఛక్త విషయం.

వ్రతకాలంలో కోపాదులు వస్తే ప్రాయశ్చిత్తము పృథ్వీ చంద్రోదయమందు - అగ్నిగరుడ పురాణవాక్యాలు ఇట్లా చెప్పబడ్డాయి: కోపంవల్ల, ప్రమాదంవల్ల, లోభంవల్ల వ్రతభంగమైతే మూడు రోజులు భోజనం చేయకూడదు లేదా శిరస్సును ముండనం చేసుకోవాలి అనే ప్రాయశ్చిత్త ఉపదేశంవల్ల అతిక్రాంత వ్రతాన్ని అనుష్ఠించటం లేదు అని తెలుస్తోంది.

ప్రాయశ్చిత్తం చేసుకొని తిరిగి వ్రతవంతుడు కావాలి అనే వాక్యంవల్ల అతిక్రాంత వ్రతాన్ని కూడా తిరిగి చేయాలి అని శూలపాణి ఏదన్నాడో అది

మధ్యలో వ్రతలోపమైతే, వ్రతం మిగిలి ఉంటే అనిమాత్రమే గ్రహించాలి. ఇది శక్తుని విషయము.

మూ॥ **అశక్తౌ ఉపవాసవిచారః—**

అశక్తౌతు కాలహేమాద్రౌ పురాణాంతరే-

ఉపవాసా సమర్థశ్చేదేకం విప్రంతు భోజయేత్.

తావద్ధనాది వాదద్యాత్ భుక్తశ్చేత్ ద్విగుణం తథా॥ భుక్తః- కృత భోజనః, బ్రాహ్మణ భోజనం వినా ఇతి శేషః. సహస్ర సంమితాం దేవీం జపేద్వా ప్రాణసంయమాన్.

కుర్యాత్ ద్వాదశసంఖ్యా కాన్ యథా శక్త్యాతురోనరః॥ ఇతి

శుద్ధితత్వేమాత్స్యే - ఉపవాసేష్వశక్తానాం నక్తం భోజనమిష్యతే

మదనరత్నే వాయవీయే -

ద్రవ్యదాతోపవాసస్య ఫలం ప్రాప్నోత్య సంశయం.

అశక్తుడైతే ఉపవాస విచారం కాలహేమాద్రియందు మరో పురాణమందు ఇట్లా చెప్పబడింది - ఉపవాసం చేయటానికి అసమర్థుడైతే ఒక బ్రాహ్మణునకు భోజనం పెట్టాలి. లేదా అంతమాత్రం దానమైనా ఇవ్వాలి. భుజించినట్లైతే (భోజనం పెట్టని పక్షంలో) రెట్టింపుదానం చేయాలి. ఆతురుడైన నరుడు (రోగిష్టి) వేయిమారులు దేవిని (గాయత్రిని) జపించాలి లేదా 12 సార్లు ప్రాణాయామం చేయాలి. యథాశక్తి ఆచరించాలి అని.

శుద్ధి తత్వమందు మత్స్య పురాణోక్తి ఇట్లా ఉంది - ఉపవాసం చేయటానికి అశక్తుడైతే రాత్రి భోజనము చెప్పబడింది అని.

మదనరత్నంలో వాయు పురాణం వాక్యం ఇట్లా ఉంది - ద్రవ్యం ఇచ్చే వ్యక్తి ఉపవాసఫలాన్ని తప్పకుండా పొందుతాడు.

మూ॥ **వ్రతవిచారము.** తథాఽపరార్కే- దేవలః—

బ్రహ్మచర్యం తథాశౌచం సత్యమామిషవర్జనం

వ్రతేష్వేతానిచత్వారి, వరిష్ఠాని నీతి నిశ్చయః॥

మాత్స్యే - తస్మాత్ కృతోపవాసేన స్నానమభ్యంగ పూర్వకం

వర్జనీయం ప్రయత్నేన రూపఘ్నం తత్పరం నృప॥ అన్యేచనియమాః తత్ర తత్ర అన్వేషణీయాః.

వ్రత విచారంలో, అపరార్కంలో, దేవలుని వచనం ఇట్లా ఉంది - బ్రహ్మచర్యము, పవిత్రత, సత్యం, మాంసం తినకపోవటం- ఈ నాల్గు, వ్రతాలన్నిటిలో శ్రేష్ఠములు అనేది నిశ్చయం. మాత్స్యమందు ఇట్లా - అందువల్ల ఉపవాసం చేసేవాడు అభ్యంగపూర్వక స్నానాన్ని ప్రయత్న పూర్వకంగా వదలాలి. అది తర్వాత రూపమును నశింపచేసేది అని ఇతర నియమములను అక్కడక్కడ చూచుకోవాలి.

మూ॥ **అథస్త్రీవ్రతేషు విశేష ఉచ్యతే—**

తత్ర హేమాద్రౌ వ్రతకాండే, గారుడే -

గంధాలంకారతాంబూల పుష్పమాలానులేపనం

ఉపవాసేన దుష్యన్తి దన్తధావన మఞ్జనం॥ ఇతి, ఇదంచస భర్తృక ఉపవాస విషయం.

అంజనంచసు తాంబూలం కుంకుమా రక్తవాససీ

ధారయేత్ సోపవాసాఽపి అవైధవ్యకరం యతః

విధవా యతిమార్గేణ, కుమారీ వాయదృచ్ఛయా॥ ఇతి తత్రైవ భవిష్యోక్తేః.

స్త్రీ వ్రతములలో విశేషం చెప్తున్నాడు. హేమాద్రియందు వ్రతకాండంలో గారుడవాక్యం ఇట్లా ఉంది - గంధ, అలంకార, తాంబూల, పుష్పమాల, అనులేపనములు, దన్తధావన, మఞ్జనములు ఉపవాసమందు దోషాన్ని కల్గించవు అని. ఇది సుమంగళిచేసే ఉపవాస విషయము. కాటుక, మంచితాంబూలము, కుంకుమ, ఎర్ర వస్త్రములు- వీటిని ఉపవాసంతో ఉన్నా ధరించాలి. ఎందువల్లంటే సౌభాగ్యాన్ని (అవైధవ్యాన్ని) కల్గించేవి. విధవ, యతి మార్గాన్ననుసరించి, కుమారి తన ఇచ్ఛారీతిగా ఉపవాసం చేయొచ్చు అని, అక్కడే భవిష్య పురాణోక్తి.

మూ॥ **ఉపవాసాల్లో రక్త వస్త్రధారణ తచ్చవిష్ణు ధర్మే-**

సర్వేష్వతూప వాసేషు పుమాన్ వాఽథ సువాసినీ

ధారయేద్రక్త వస్త్రాణి కుసుమాని సితానిచ॥

విష్ణు ధర్మంలో - అన్ని ఉపవాసాల్లోనూ పురుషుడు కానీ, సుమంగళి కాని రక్త వస్త్రములు, తెల్లని పూలు ధరించాలి

మూ॥ **విధవా శుక్లవసనం ఏకమేవహి ధారయేత్**
విధవ ఒక్కటే తెలుపు వస్త్రాన్ని ధరించాలి.

మూ॥ **ఉపవాసంలో దన్త ధావనాదులు** - మనురపి-
పుష్పాలంకార వస్త్రాణి గంధధూపానులేపనం
ఉపవాసేన దుష్యంతి దంత ధావన మఞ్జనం॥

మదన రత్నే వ్యాసః - దంత ధావన పుష్పాది వ్రతేప్యస్యానదుష్యతి॥ ఇతి యద్యపీదం సర్వోపవాస విషయం ప్రతీయతే, తథాపి, శిష్టాచారాత్ సౌభాగ్యార్థం క్రియమాణ నవరాత్ర త్రిరాత్రాద్యుపవాస విషయమేవ, నతు ఏకాదశ్యాది విషయం.

ఆసకృజ్జల పానాచ్చ సకృత్ తాంబూలచర్వణాత్
ఉపవాసః ప్రణశ్యేత దివాస్వాపాచ్చమైథునాత్॥ ఇత్యపరార్కే దేవలేన తన్నిషేధాత్. నచాస్యపుం విషయత్వేన సావకాశత్వాత్ స్త్రీణాంతాంబూలాది ప్రాప్నోతీతి వాచ్యం. తాంబూలాది ప్రాపకస్యైవ ఏకాదశీతర విషయత్వేన వైపరీత్యస్యాపి సువచత్వాత్.

యత్తు హరివంశే -
అంజనం రోచనం చైవ గంధాన్ సుమన సస్తథా
వ్రతే చైవోపవాసేచ నిత్యమేవ వివర్జయేత్॥
శిరసోఽభ్యం జనం సౌమ్యే నైవమేతత్ ప్రశస్యతే
నపాదయోఃన గాత్రస్య స్నేహేనేతి స్థితిః స్మృతా॥

ఇతి, తత్ర త్రైవోక్త పుణ్యక వ్రత విషయం నతు సర్వత్ర, పూర్వోక్తి విరోధాదితి.

మదన రత్నే ఉక్తం తత్రైవ -
అశ్రుప్రపాతోరోషశ్చ కలహస్య కృతిస్తథా
ఉపవాసాత్ వ్రతాద్వాపి సద్యోభ్రంశయతి శ్రియం॥
శ్రియమిత్యుపలక్షణం. మదన రత్నే శివధర్మే -
దానం వ్రతాని నియమాః జ్ఞానం ధ్యానం హుతం జపః
యత్నే నాపికృతం సర్వం క్రోధి తస్య వృథాభవేత్॥

మనువు ఇట్లా - పుష్ప, అలంకార, వస్త్రాలు, గంధ, ధూప, అను లేపనము, దంత ధావనం, అంజనము- ఇవన్ని ఉపవాసంలో దోషం కాదు అని అన్నాడు. మదన రత్నంలో వ్యాసుడు ఇట్లా అంటాడు: స్త్రీకి వ్రతంలో దన్త ధావన పుష్పాదులు దోషాన్ని కల్గించవు అని. ఇది సర్వ ఉపవాసముల విషయకము అనిపించినా, శిష్టాచారాన్ననుసరించి, సౌభాగ్యాదులకొరకు చేయబడే నవ రాత్ర, త్రిరాత్రాది ఉపవాస విషయకమే. కాని, ఏకాదశ్యాది విషయకము కాదు. మాటి మాటికి నీరు త్రాగటంవల్ల, ఒక్కసారి తాంబూల చర్వణం చేయటంవల్ల, పగలు నిద్రించటంవల్ల మైధునంవల్ల, ఉపవాస ఫలం నశిస్తుంది అని అపరార్కంలో దేవలుడు దాన్ని నిషేధించాడు. ఇది పురుష విషయకంలో చరితార్థమైంది. కనుక స్త్రీలు తాంబూలాదులు సేవించవచ్చు అని చెప్పరాదు. తాంబూలాది సేవనమే, ఏకాదశి ఇతర విషయకం (ఆ మాట ఏకాదశికి చెందదు) అని విపరీతంగాకూడా సులభంగా చెప్పొచ్చు.

హరివంశమందు - కాటుక, గోరోచనం, గంధము, పూలు- వీటిని వ్రతంలో ఉపవాసంలో ఎల్లప్పుడు కూడా వదలాలి. సౌమ్యురాలా! శిరస్సునుండి అభ్యంజన స్నానము, పాదములకు శరీరమునకు నూనె రాచుకొని స్నానం చేయటం- ఇవి మంచివికావు. ఇది ఆచారమని భావించాలి అని ఏది చెప్పబడిందో అది అక్కడే చెప్పబడ్డ పుణ్యకవ్రతసంబంధ విషయకము. అంతేకాని, అంతట (అన్ని వ్రతాల్లో) కాదు. ఎందువల్లనంటే, అది ముందు చెప్పినదానికి విరుద్ధమౌతుంది అని మదనరత్నంలో చెప్పబడింది. అక్కడే - కన్నీరుకార్చటం, కోపము, కలహము- ఇవి ఉపవాసం నుండి వ్రతం నుండి, వెంటనే స్త్రీని పతితురాలిని చేస్తాయి అని చెప్పారు. ప్రియం అనే మాట (స్త్రీలందరిని సూచించే) సాధారణ లక్షణము. మదనరత్నమందు శివధర్మ మందలి మాట ఇట్లా ఉంది - దానము. వ్రతములు, నియమములు, జ్ఞానము, ధ్యానము, హోమము, జపము ఇవన్నీ ప్రయత్న పూర్వాకంగా ఆచరించినా కోపిష్ఠికి (కోపగించిన వానికి) ఇవన్నీ వ్యర్థమౌతాయి.

**మూ॥ సూతకాదులందు నిర్ణయం :** తత్రశావ సూత్యాశౌచయోః సర్వస్మార్త కర్మ నివృత్తిః నిబంధేషు స్పష్టైవ గౌడాస్తు క్షతాశౌచాదావపి తామహుః-

జానూర్ధ్వం క్షతజేజాతే నిత్యకర్మన చాచరేత్
నైమిత్తికం చతదధః ప్రసవద్రక్తోన చాచరేత్॥
లోతకేచ సముత్పన్నే జ్వరకర్మణి మైథునే
ధూమోద్గారే తథావాంతౌ నిత్యకర్మణి సంత్యజేత్॥

ద్రవ్యైభుక్తే త్వజీర్ణేచనైవ భుక్త్వాపికించన
కర్మకుర్యాన్నరో నిత్యం సూతకేమృతకే తథా॥ ఇతి కాలికా పురాణాత్.

మృతాశౌచ, జాతాశౌచాదులందు అన్ని స్మార్తకర్మలను చేయరాదు అని గ్రంథములందు స్పష్టంగా ఉంది. గౌడులు మాత్రం - క్షత (దెబ్బ) ఆశౌచములందు కూడ దాన్ని చెప్పారు. మోకాళ్ళకు పైన దెబ్బతగిలితే (రక్తంవస్తే) నిత్యకర్మ చేయరాదు. మోకాళ్ళకిందికి దెబ్బ తగిలితే (రక్తంవస్తే) నైమిత్తికకర్మ చేయరాదు. బల్లి ఉచ్చవంటి వాటితో పుండైతే, జ్వరంవస్తే, మైథునమందు, త్రేన్పుయందు, వాంతియందు నిత్యకర్మలు వదలాలి. ఏదైనా ఆహారం తినటంవల్ల అజీర్ణమైతే, భోజనం చేసిన పిదప సూతక (జాత) మందు మృతాశౌచమందు ఏ నిత్యకర్మ చేయరాదు అని కాలికాపురాణ వాక్యం చెప్తారు.

మూ॥ **కమలాకరునిమతం** వస్తుతస్తు : పూర్వందేవీ పూజోపక్రమాత్ తన్మాత్ర విషయత్వమస్యేతియుక్తం ప్రతీమః. తథాహేమాద్రౌపాద్మే—

గర్భిణీసూతి కాదిశ్చకుమారీ వాఽథరోగిణీ
యదాఽశుద్ధా తదాన్యేనకారయేత్ప్రయతాస్వయం॥ ఇతి

పుంసో ప్యేషవిధిః లింగస్య అవివక్షితత్వాత్ తేన యస్మిన్వ్రతేయత్ పూజాద్యుక్తం తదన్యేనకారయేత్, శరీరనియమాన్ స్వయంకుర్యాత్. ఇతి హేమాద్రిఃవ్యాచఖ్యౌ. నవ్రతినాంవ్రతే ఇతి విష్ణూక్తేశ్చ. ఆరంభశ్చనభవత్యేవ.

కమలాకరుని అభిప్రాయం - యథార్థానికైతే దీనికి ముందు దేవిపూజ గూర్చి ఆరంభించబడింది కనుక ఇది దానికి మాత్రమే సంబంధించింది అని యుక్తంగా తోస్తోంది అట్లాగే హేమాద్రి యందు పాద్మవచనము - గర్భిణీ, సూతకాదులు గల స్త్రీలు, కుమారి, రోగిణి- వీరు అశుద్ధులుగా ఉంటే ఇతరులతో కర్మ, ప్రయత్నపూర్వకంగా చేయించాలి అని. ఈ విధి పురుషులకు గూడా. లింగవివక్ష లేదు కాబట్టి. అందువల్ల - ఏ వ్రతమందు ఏ పూజాదులు చెప్ప

బద్ధాయో వానిని ఇతరులతో చేయించాలి. శరీర నియమములను స్వయంగా పాటించాలి అని హేమాద్రి వ్యాఖ్యానించాడు. 'స్వ్రతినాంవ్రతే' అని విష్ణువు కూడా ఇదే చెప్పాడు. సూతకాదుల్లో వ్రతారంభము జరగనే జరగదు కదా!

మూ॥ బహుకాలిక సంకల్ప విచారం - శుద్ధితత్వే విష్ణుః -

బహుకాలిక సంకల్పో గృహీతశ్చ పురాయది

సూతకేమృతకే చైవవ్రతం తన్నైవ దుష్యతి॥ ఏతత్కామ్యపరం నిత్యంతు అనారబ్ధమపి కార్యమితిగౌడాః.

మదనరత్నే -

పూర్వసంకల్పితం యచ్చవ్రతం సునియతవ్రతైః

తత్కర్తవ్యం నరైఃశుద్ధం దానార్జన వివర్జితం॥

మాధవీయేకౌర్మే -

కామ్యోపవాసేప్రక్రాన్తే త్వన్తరామృతసూతకే,

తత్రకామ్యవ్రతం కుర్యాత్ దానార్జన వివర్జితం॥

ఇతి - ఏతేన సాంగేఽధికారాత్తత్ వ్రతాంగ దేవపూజాదికార్య మితివర్ధమానోక్తిః పరాస్తా ప్రారబ్ధం పూజాది కార్యమేవ నవరాత్రేతుతత్రైవ విశేషం వక్ష్యామః ఏవంరజ స్వలాపి. యత్తు సత్యవ్రతః-

ప్రారబ్ధ దీర్ఘతపసాంనారీణాం యద్రజోభవేత్

నతత్రాపివ్రతస్యస్యాదుపరోధః కదాచన॥

ఇతి - తత్ప్రతినిధినా కారయేదిత్యే తత్పరం. తదుక్తం మదనరత్నే మాత్స్యే - అంతరాతురజోయోగే పూజామన్యేన కారయేత్ ఇతి.

శుద్ధితత్వంలో విష్ణువు ఇట్లా అంటాడు - ఇంతకుముందే దీర్ఘకాలిక వ్రత సంకల్పాన్ని చేపట్టి ఉంటే అది మధ్యలో వచ్చే సూతక (జాతం) మృతక అశౌచంవల్ల ఆ వ్రతం చెడిపోదు అని. ఇది కామ్యవ్రతపరము. నిత్యకర్మనైతే ఆరంభించకపోయినప్పటికి, చేయాలి అని గౌడుల అభిప్రాయం. మదన రత్నంలో - ఇంతకుముందే సంకల్పించిన వ్రతాన్ని, వ్రతనిష్ఠకల నరులు దాన, అర్చనలు లేకుండా ఆచరించాలి (అశౌచంలో). మాధవీయంలో కూడ పురాణం లోని వచనం ఇట్లా - కామ్యోపవాసం మొదలుపెట్టాక, మధ్యలో జాత, మృత అశౌచాలు వస్తే అక్కడ దాన, అర్చనలు వదలి ఆ కామ్యవ్రతం చేయాలి అని అంటాడు దీనివల్ల అంగములతోకూడిన (వ్రతం చేయటానికి) అధికారం ఉంది

కాబట్టి, ఆ వ్రతాంగమైన దేవపూజాదులు కూడా చేయాలి అనిన వర్ధమానోక్తి తొలగి(పీగి)పోయింది. ఆరంభించిన పూజాదులు చేయాల్సిందే. నవరాత్రులలో ఐతే విశేషాన్ని అక్కడే చెప్తాము. ఇట్లాగే రజస్వలకూడా వ్రతం చేయాలి. సత్యవ్రతుడు, దీర్ఘ కాలిక వ్రతాన్ని ఆరంభించిన స్త్రీలు, బయట ఉంటే (ముట్టైతే) అక్కడ కూడా ఎప్పుడూ వ్రతభంగం కాదు అని అన్నాడో దాని అర్థం తన ప్రతినిధితో వ్రతాన్ని ఆచరింప చేయాలి అని. అదే విషయం మదన రత్నంలోని మత్స్య పురాణ వచనంలో ఇట్లా ఉంది: మధ్యలో రజో యోగం (ముట్టు) వస్తే పూజను ఇతరులతో చేయించాలి అని.

మూ॥ ప్రతినిధయశ్చ నిర్ణయామృతే పైఠీనసిః -

భార్యాపత్యుః వ్రతం కుర్యాత్ భార్యా యాశ్చపతిః వ్రతం
అసామర్థ్యే పరస్తాభ్యాం వ్రత భంగోన జాయతే॥

స్కాందేఽపి -

పుత్రం వావినయోపేతం భగినీంభ్రాతరం తథా
ఏషామభావ ఏవాన్యం బ్రాహ్మణంవా నియోజయేత్॥

కాత్యాయనః -

పితృమాతృ భ్రాతృపతి గుర్వర్థేచ విశేషతః
ఉపవాసం ప్రకుర్వాణా పుణ్యంశతగుణం లభేత్॥
మాతామహాదీనుద్దిశ్య ఏకాదశ్యాము పోషణే
కృతే, తేతుఫలం విప్రాః సమగ్రం సమవాప్నుయుః॥

మదన రత్నే ప్రభాసఖండే -

భర్తాపుత్రః పురోధాశ్చ భ్రాతాపత్నీ సఖాపిచ
యాత్రాయాం ధర్మకార్యేషుజాయ న్తే ప్రతిహ స్తకాః॥

ఏభిఃకృతం మహాదేవి స్వయమేవకృతం భవేత్।

తత్తైత్రివవాయవీయే - "స్వయం కర్తుమశక్తశ్చేత్ కారయీత పురోధసా."
ఇదంచ సర్వవర్ణ సాధారణం. అవిశేషాత్. యత్తు కశ్చిన్మహోక్ష ఆహ - శూద్రస్య బ్రాహ్మణాదిరేవ ప్రతినిధిర్యుక్తః, నశూద్రః-

జపస్తపః తీర్థసేవా ప్రవ్రజ్యా మంత్రసాధనం.

విప్రైః సంపాదితం యస్య సంపన్నంతస్య తత్ఫలం॥ ఇతి మరీచివ చనాత్ ఇతి తత్తుచ్ఛం. ప్రవ్రజ్యాదీనాం శూద్రే అసంభవాత్, 'విషయే ప్రాయ దర్శనా'దితి న్యాయేన - అస్య బ్రాహ్మణాది గోచరత్వాత్. యదాపి - 'ఉప వాసో వ్రతం హోమ తీర్థస్నాన జపాదికం' ఇతి పూర్వార్థః తదాపిన ఏవదోషః 'స్త్రీ శూద్ర పతనానిషట్' ఇతి మానవీయే జపనిషేధాత్.

బ్రాహ్మణో హీనవర్ణస్యయః కుర్యాత్ కర్మకించన
సతాం జాతి మవాప్నోతి ఇహలోకే పరత్రచ॥ ఇతి కాలహేమాద్రౌ మరీచి నిషేధాచ్చ. వస్తు తస్తు సంపూర్ణతావచన మాత్రం అత్రోచ్యతే ఇతి ప్రతి నిధేః కావార్తా ఇత్యలం॥

ప్రతినిధుల గూర్చి నిర్ణయామృతంలో పైఠీనసివచనం ఇట్లా ఉంది - భార్య, భర్త వ్రతాన్ని చేయాలి. భర్త, భార్య వ్రతాన్ని చేయాలి వీరిద్దరు అసమర్థులైతే ఇతరులు చేయాలి. వ్రతభంగం కాదు.

స్కాందంలో కూడా - వినయవంతుడైన పుత్రుని, చెల్లెలును, అన్నను లేదా తమ్ముని నియోగించాలి. వీరెవరూ లేనిపక్షంలో ఇతర బ్రాహ్మణునో నియ మించాలి. కాత్యాయనుడు ఇట్లా అంటాడు - తండ్రి, తల్లి, అన్నదమ్ములు, భర్త, విశేషంగా - గురువు వీరికొరకు ఉపవసించేవారు నూరురెట్లు పుణ్యాన్ని పొందుతారు. మాతామహాదుల నుద్దేశించి (తల్లియొక్క తలి దండ్రులు) ఏకా దశి రోజున ఉపవాసంచేస్తే ఆ బ్రాహ్మణులు సమగ్రఫలాన్ని పొందుతారు అని. మదనరత్నంలో ప్రభాసఖండంలో ఇట్లా ఉంది - భర్త, పుత్రుడు, పురోహితుడు, అన్నతమ్ములు, భార్య, స్నేహితుడు - వీరు యాత్రయందు, ధర్మకార్యాలందు ప్రతినిధులు ఔతారు. వీరు చేసిన కార్యము స్వయంగా తాను చేసినట్లే. అక్కడే వాయుపురాణ వాక్యం ఇట్లా ఉంది - స్వయంగా తాను చేయడానికి అశక్తుడైతే, పురోహితునితో చేయించాలి. ఇది అన్ని వర్ణములవారికి సాధారణమైన విషయం. ఇందులో విశేషం లేదు.

ఒక మూర్ఖుడు (మహోక్ష=ఎద్దు, పశువు) - శూద్రునకు బ్రాహ్మణాదులే ప్రతినిధులుగా తగుదురు, శూద్రుడు కాదు. జపము, తపము, తీర్థ సేవ, సన్యా సము, మంత్రసాధనము- వీటిని ఎవడు బ్రాహ్మణులద్వారా సంపాదిస్తాడో, వానికి ఆ ఫలం లభిస్తుంది అని మరీచి వచనం ఉంది కాబట్టి, అని (ఒక మూర్ఖుడు)

అన్న మాట నీచమైంది. శూద్రునకు సన్యాసము సంభవించదు గదా! "విషయ మందు ప్రాయదర్శనము" అనే న్యాయాన్ననుసరించి సన్యాసము బ్రాహ్మణాదు లందే గోచరిస్తోంది. (సంశయం వచ్చిన చోట, ప్రసంగవశంవల్ల ఏది ఎక్కువగా ఎక్కడ కన్పిస్తుందో దాన్ని తీసుకోవాలి అని న్యాయం. దీన్ననుసరించి సన్యాసాధి కారము బ్రాహ్మణాది వర్ణాల్లోనే గోచరిస్తోంది శూద్రునకు లేదు. పై వాక్యం బ్రాహ్మణాది విషయకం). ఉపవాసము, వ్రతము, హోమము, తీర్థము, స్నానము, జపము మొదలగునవి అని పూర్వార్థ శ్లోకము ఉందో అక్కడ కూడా అదే దోషము మనువు, స్త్రీ, శూద్రుల పతనకారకాలుగా ఆరింటిని చెప్పాడు. అందులో జపాన్ని నిషేధించాడు. కాల హేమాద్రియందు మరీచి ఇట్లా నిషేధించాడు - బ్రాహ్మణుడు హీనవర్ణుని కర్మను చేస్తే వాడు ఈ లోకంలో, పరలోకంలోను ఆ జాతిని పొందుతాడు అని, యధార్థానికి సంపూర్ణతను సూచించే మాటలే ఇక్కడ చెప్తున్నారు కాబట్టి ప్రతినిధి విషయమెక్కడుంది? ఇక ఈ విషయం చాలు.

మూ॥ అత్రవిశేషమాహ త్రికాండమండనః-

కామ్యే ప్రతినిధిర్నాస్తి నిత్యే నైమిత్తికేచసః
కామ్యేఽప్యువక్రమా దూర్ధ్వంకేచిత్ ప్రతినిధిం విదుః॥
నస్యాత్ ప్రతినిధిః, మంత్రస్వామి దేవాగ్ని కర్మసు
నదేశ కాలయోర్నాస్తి నారణే రగ్ని రేవసా॥
నాతి ప్రతినిధాతవ్యం నిషిద్ధం వస్తు కుత్రచిత్।

హిరణ్యకేశి సూత్రేఽపి - 'నస్వామి త్వస్యభార్యాయాః, పుత్రస్య, దేశస్య, కాలస్య, అగ్నేర్దేవతాయాః కర్మణ శబ్దస్యచ ప్రతినిధిర్విద్యతే.' ఇతి.

ఇక్కడ త్రికాండ మండనుడు విశేషం చెప్పాడు. కామ్య కర్మలలో ప్రతినిధి ఉండదు. నిత్య, నైమిత్తిక కర్మలలో ఉంటాడు. కామ్య కర్మలలో కూడా ఆరంభించిన తరువాత ప్రతినిధి ఉంటాడని కొందరంటారు. మంత్రము, స్వామి, దేవత, అగ్నికర్మ దేశము, కాలము, అరణి . వీటికి ప్రతినిధి ఉండదు (అరణి అగ్నియే). నిషిద్ధ వస్తువులకును ఎక్కడ కూడా ప్రతినిధులను చేయ (ఉంచ) రాదు. హిరణ్యకేశి సూత్రమందు కూడా ఇట్లా ఉంది: స్వామిత్వము (యజమానిత్వము), భార్య, పుత్రుడు, దేశము, కాలము, అగ్ని, దేవత, కర్మ, శబ్దము - వీటన్నిటికి ప్రతినిధి లేదు అని.

మూ॥ తత్ర తిథిద్వయసన్నిపాతే తత్రోక్తం దానహోమాది క్రమేణ అనుష్ఠేయం, అవిరోధాత్. ఇదం పూర్వారబ్ధేష్వేవ. ఏకమధ్యే అన్యకామ్య కర్మారంభస్తు నభవత్యేవ గుణఫలాదృతే. యస్యయజ్ఞే ప్రతతేఽన్తరా యజ్ఞ స్త్రాయతే యజ్ఞనిర్ఋతిః గృహ్ణాతి ఇతిరాణక ధృతశ్రుతేః యజ్ఞం - వ్రతాది కర్మమాత్రం. అనంగేన, వ్యవధాన దోషస్య సర్వత్ర సామ్యాత్. శిష్టాస్తు మాఘ కార్తిక స్నానాదిమధ్యే లక్ష హోమ, తులా, భారత శ్రవణాద్యా చరంతి, తన్నిత్య మధ్యేఽస్తు. కామ్య మధ్యేతు చింత్యం.

యత్రతు నక్తైక భక్తాదౌ విరోధః తత్రప్రాథమ్యాత్ ఏకభక్తం కార్యం. నక్తంతు పరేద్యుః తత్తిథౌ గౌణకాలే కార్యం. సమకాలీన విరుద్ధ వ్రతాదౌతు ఏకం స్వయంకృత్వా అన్యత్ భార్యాదినా కారయేత్, ఇతి మాధవః. యత్రతు శివరాత్ర్యాదౌ తిథిమధ్యే పారణయా అహ్నిభోజనం ప్రాప్తం.

భూతాష్టమ్యోః దివాభుక్త్వా రాత్రౌభుక్త్వా చపర్వణి
ఏకాదశ్యాం దివారాత్రౌ భుక్త్వా చాంద్రాయణం చరేత్, ఇతి తన్నిషేధశ్చ.

తత్ర పారణాయాః వైధత్వాత్ దివైవ భోజనం. నిషేధస్తు రాగప్రాప్త భోజన విషయః. ఏవం అష్టమ్యా దినక్తవ్రతే సంక్రాంత్యా దౌరవౌ సంకష్ట చతుర్థ్యాం చ రాత్రౌ భోజనం. యత్రతు అష్టమ్యా దౌదివా భుజినిషేధః, సంక్రమేచ రాత్రావితి నిషేధద్వయం తత్ర ఉపవాస ఏవకార్యః. యద్యపి పుత్రిణః ఉపవాసోఽపి నిషిద్ధః తథాపి—

ఉపవాస నిషేదేతు భక్ష్యం కించిత్ ప్రకల్పయేత్, ఇతి వచనాత్ కించిత్ భక్షయిత్వా ఉపవాసః కార్యః. చాంద్రాయణ మధ్యే ఏకాదశ్యాదౌతు గ్రాససంఖ్యా నియమేన భోజనం కార్యమేవ. చాంద్రాయణస్య కామ్యత్వేన నిత్య బాధకత్వాత్. అబాదేనగత్య సంభవాచ్చ. ఏకాదశ్యాం ఏకాంతరోపవాసాది పారణాయాం జల పారణం కృత్వా ఉపవసేత్. "అపోవా అశితమన శితంచ" ఇతిశ్రుతేః. ఏవం ద్వాదశ్యాం మాసోపవాస శ్రాద్ధ ప్రదోషా దిష్వజ్ఞేయం. ఏవం కామ్యనైమిత్తిక నిత్యత్వాదికృతం బలాబలం స్వయమూహ్యామితి దిక్.

వ్రతాదులు ఒకేసారి వస్తే నిర్ణయము: ఒక వ్రతమందు, రెండు తిథులు కలిస్తే (సన్నిపాత) అక్కడ చేయాల్సిన దాన హోమాదులు క్రమంగా చేయాలి, విరోధం లేదు కాబట్టి. ఇది ఇంతకుముందే ఆరంభించిన వాని విషయము. గుణ,

ఫలములు లేకుండా ఒక వ్రతం మధ్యలో మరొక కామ్య కర్మ ఆరంభము కానే కాదు. ఒక యజ్ఞం ఆచరింపబడుతుండగా మధ్యలో మరో యజ్ఞం విస్తరింపచేస్తే ఆ యజ్ఞాన్ని నిర్‌ఋతి గ్రహిస్తాడు అని రాణకధృతుని శృతి వాక్యం. యజ్ఞ మనగా వ్రతాదికర్మ మాత్రమే (రెండవ యజ్ఞం మొదటి యజ్ఞానికి) అంగం కాదు కాబట్టి వ్యవధాన దోషం. ఇది (దోషం) అంతటా సమానమే. శిష్టులు, మాఘ కార్తిక స్నానాదుల మధ్యలో లక్ష హోమ, తులాదాన, భారత శ్రవణాదులు ఆచరిస్తారు. అవి నిత్య కర్మల మధ్యలో జరగని కాని కామ్యకర్మల మధ్య ఐతే, విచారించాలి. నక్త ఏకభక్తాదుల మధ్య విరోధం వస్తే ప్రాథమ్యాన్నిబట్టి (మొదటిది కాబట్టి) ఏకభక్తం చేయాలి. నక్తాన్ని తరువాతి రోజున అతిథి గౌణ కాలంలో చేయాలి. ఏకకాలంలో విరుద్ధ వ్రతాదులు వస్తే ఒకదాన్ని తానుచేసి, ఇంకొకదాన్ని భార్యాదులతో చేయించాలి అని మాధవుడు. శివరాత్రి మొదలగు వాటియందు తిథి మధ్యలో పారణవల్ల పగలు భోజనం ప్రాప్తమైతే, "చతుర్ధశి, అష్టములయందు పగలు భోంచేయాలి. పర్వమందు రాత్రి భోజనం చేయాలి. ఏకాదశియందు దివారాత్రములు భుజించి చాంద్రాయణ మాచరించాలి" అనే వాక్యంలో దానికి నిషేధమువస్తే అక్కడ పారణ విధించబడింది కనుక పగలే భోజనం చేయాలి. నిషేధము ఇచ్ఛాప్రాప్త భోజన విషయకము. ఈ విధంగా అష్టమ్యాది నక్త వ్రతమందు, సంక్రాంత్యాదులందు, రవివారమందు, సంకష్ట చతుర్థియందు రాత్రి భోజనము ఉంటుంది. అష్టమ్యాదులందు పగటి భోజనం నిషిద్ధము, సంక్రమణమందు రాత్రి భోజనం నిషేధము అని రెండు నిషేధాలు ఉంటే మాత్రం అక్కడ ఉపవాసమే చేయాలి.

పుత్రవంతునకు ఉపవాసం కూడా నిషిద్ధమైంది. ఐనప్పటికి - ఉపవాస నిషేధం జరిగితే తినేందుకు కొంచం భోజనం కల్పించుకోవాలి అనే మాట ననుస ంచి కొంచం తిని ఉపవాసం ఉండాలి.

చాంద్రాయణం మధ్యలో ఏకాదశివస్తే, గ్రాస సంఖ్యా నియమం ప్రకారం భోజనం చేయాలి. చాంద్రాయణం కామ్యకర్మ కాబట్టి నిత్య కర్మకు బాధక మైనట్టిది. బాధకం కాకపోతే గతి లేదు (మార్గాంతరం లేదు, కాబట్టి బాధకం ఔతుంది). ఏకాదశియందు ఏకాంతర (ఒకపూట) ఉపవాసాదుల పారణ సంభ విస్తే జలపారణచేసి ఉపవసించాలి. నీరు త్రాగటం తిన్నట్లు తిననట్లు అని శ్రుతి

వాక్యం. ఈ రకంగా ద్వాదశి రోజు, మాసోపవాసము, శ్రాద్ధము, ప్రదోషము మొదలగు రోజుల్లోను అని గ్రహించాలి. ఈ రకంగా కామ్య, నైమిత్తిక, నిత్యాది వ్రతాలలో బలాబలములను స్వయంగా ఊహించుకోవాలి. ఇది ఇక చాలు.

మూ॥ ప్రతి పత్ నిర్ణయము - శుక్లా ప్రతిపత్ అపరాహ్ణవ్యాపిత్వే పూర్వాగ్రాహ్యా, యుగ్మ వాక్యాత్ ప్రతిపత్ సంముఖీకార్యా యాభవేదపరాహ్ణికీ, ఇతి స్కాందోక్తేః "శుక్లా స్యాత్ప్రతిపత్తిథిః ప్రథమతశ్చేత్ సాపరాహ్ణేభవేత్" ఇతి దీపికోక్తేశ్చ అపరాహ్ణశ్చపంచధా భక్తేదినే చతుర్థోభాగః తదభావేతు సాయాహ్న వ్యాపినీ గ్రాహ్యా "తదభావేతు సాయాహ్నవ్యాపినీ పరిగృహ్యతాం" ఇతి మాధవోక్తేః కృష్ణాతుపరా 'కష్ణాతూత్తరతోఽఖిలా' ఇతి దీపికోక్తేః కృష్ణాఽపిపూర్వైవేత్యనంతభట్టాః.

తిథుల నిర్ణయము - ప్రతి పద నిర్ణయము : శుక్ల ప్రతిపద అపరాహ్ణ వ్యాపినియైతే పూర్వముది గ్రహించాలి, యుగ్మ వాక్యం నుండి అమావాస్యా ప్రతిపత్. స్కాందంలో - ప్రతిపద అపరాహ్ణ వ్యాపిని ఐతే మొదటిది (సంముఖీ) గ్రహించాలని ఉంది, దీపికలో - ప్రతిపత్తు అపరాహ్ణంలో ఉంటే శుక్ల ప్రతి పద తిథి ప్రథమంది ఔతుంది అని. అపరాహ్ణమనగా ఐదు భాగములు చేయబడ్డ దినంలో నాల్గవ భాగము. అది లేనప్పుడు సాయాహ్నవ్యాపినిని గ్రహించాలి అని. ఇది మాధవుని వచనము. కృష్ణ పక్ష ప్రతిపదను పరంది గ్రహించాలి. ప్రతిపత్ + ద్వితీయ. దీపికలో - కృష్ణ పక్షంరైతే సర్వమూ ఉత్తరం గ్రహించాలి అని చెప్పబడింది. కృష్ణ ప్రతిపద కూడా పూర్వముదే అని అనంతభట్టు. (పూర్వ - అమావాస్య + ప్రతిపద పర-ప్రతిపద + ద్వితీయ )

మూ॥ అన్ని తిథులలో విడువతగినవి : ముహూర్త దీపికాయాం.

కూష్మాండం బృహతీ ఫలానిలవణం వర్జ్యం తిలామ్లంతథా
తైలంచామలకం దివంప్ర వసతాశీర్షం కపాలాంత్రకం
నిష్పావాంశ్చ మసూరికాన్ ఫలమదో వృంతాకసంజ్ఞం మధు
ద్యూతంస్త్రీ గమనంక్రమాత్ ప్రతిపదాదిష్వేవమాషోడశ॥ శీర్షం-నారికేలం, కపాలం-అలాబు, అంత్యం-పటోలం.

భూపాలః -

కూష్మాండం బృహతీక్షారం మూలకంపన సంఫలం
ధాత్రీశిరః కపాలాంత్రం నఖచర్మ తిలానిచ॥
క్షురకర్మాంగనా సేవాం ప్రతిపత్ ప్రభృతి త్యజేత్.

గుమ్మడికాయ, ములకపండ్లు (బృహతీ), ఉప్పు, నువ్వులు, చింతపండు, నూనె, వుసిరికాయ, నారికేళము, సొరకాయ, పొట్లకాయ, అనుములు, చిరుసెనగలు, వంకాయ, మద్యము, ద్యూతము, స్త్రీగమనము- వీనిని 16 ను క్రమంగా ప్రతిపదాది తిథులలో వదలాలి అని ముహూర్త దీపికలో ఉంది.

భూపాలుడు ఇట్లా అంటాడు - గుమ్మడికాయ, ములక, ఉప్పు, ముల్లంగి, పనసపండు, వుసిరి, కొబ్బరికాయ, సొరకాయ, పొట్లకాయ, నల్లపెసలు, చిరుసెనగలు, నువ్వులు, క్షురకర్మ, స్త్రీసేవ - వీనిని ప్రతిపదాదితిథులలో వదల వలెను అని.

మూ॥ ద్వితీయాతు కృష్ణాపూర్వా శుక్లోత్తరా ఇతి హేమాద్రిః కృష్ణాద్వితీయా ఆదిమా 'పూర్వాహ్ణేయదిసా సితాతుపరతఃసర్వా' ఇతిదీపికోక్తేః మాధవానంత భట్టమతేతు సర్వాపి ద్వితీయాపరా తథాచమాధవః -

పూర్వేద్యుర సతిప్రాతః పరేద్యుః త్రిముహూర్తగా
సాద్వితీయా పరోపోష్యా పూర్వవిద్ధాతతోఽన్యథా॥ ఇతి.

ద్వితీయను కృష్ణపక్షంలో పూర్వమును, శుక్లపక్షంలో ఉత్తరను గ్రహించాలి అని హేమాద్రి. కృష్ణద్వితీయ, తొలిది, అది శుక్లపక్షంలో పూర్వాహ్ణంలో ఉంటే అది అంతాపరముదే అని దీపికోక్తి. మాధవ అనంతభట్టుల మతంలో ఐతే అన్నిచోట్ల ద్వితీయ పరముదే. ముందురోజు ప్రొద్దున లేకుండా తర్వాతిరోజు మూడుముహూర్తములకాలం ఉన్నట్టయితే ఆ ద్వితీయలో (పరంలో) ఉపవాసం చేయాలి. అట్లాలేని పక్షంలో పూర్వవిద్ధను గ్రహించాలి అని మాధవుని వచనం. (పూర్వ - ప్రతిపదీ + విదియ ఉత్తర - విదియ + తృతీయ.)

మూ॥ తృతీయాతు సర్వమతేరంభా వ్యతిరిక్తా పరైవ. తేనయుగ్మ వాక్యం రంభావ్రతవిషయం - రంభాఖ్యాం వర్జయిత్వాతు తృతీయాం ద్విజసత్తమ

అన్యేషు సర్వకార్యేషు గణయుక్తా ప్రశస్యతే॥ ఇతి గౌరీవ్రతేతు - విశేష మాహ మాధవః -

ముహూర్తమాత్ర సత్వేపిదినే గౌరీవ్రతం పరే
శుద్ధాధికాయామప్యేవం గణయోగ ప్రశంసనాత్॥ ఇతి.

రంభతదియ తప్ప ఇతర తదియలు అందరి మతాలలో పరమే గ్రహిం చాలి. అందువల్ల యుగ్మవాక్యము రంభావ్రత విషయకమని తేలింది. రంభా తృతీయను వదలి, ఇతర అన్ని కార్యముల యందు చతుర్థీయుక్తమైన తృతీయ ప్రశస్తమైనది గౌరీవ్రతంలో విశేషాన్ని మాధవుడు ఇట్లా చెప్పాడు: పరదినమందు ముహూర్తకాల మాత్రం ఉన్నా గౌరీవ్రతం పరదినంలో చేయాలి. శుద్ధతృతీయ, వృద్ధి చెందినప్పటికి పరమందే (ఇట్లాగే) చేయాలి. చతుర్థి యోగమును ప్రశంసించారు కాబట్టి అని. (తదియ + చవితి - పరం విదియ + తదియ - పూర్వం.)

మూ॥ చతుర్థ్యపి సర్వమతే గణేశ వ్రతాతిరిక్తా పరైవ యుగ్మవాక్యాత్ -

ఏకాదశీ తథాషష్ఠీ అమావాస్యా చతుర్థికా

ఉపోష్యాః పర సంయుక్తాః పరాఃపూర్వేణ సంయుతాః॥ ఇతి మాధవీయే వృద్ధ వసిష్ఠోక్తేశ్చ. నాగచతుర్థీ మధ్యాహ్నవ్యాపినీ పంచమీయుతాచ గ్రాహ్యా, ఇతి నిర్ణయామృతే మాధవీయేచోక్తం .

యుగం మధ్యందినేయత్ర తత్రోపోష్యఫణీశ్వరాన్

క్షీరేణాప్యాయ్య పంచమ్యాం పూజయేత్ ప్రయతోనరః॥

విషాణితస్య నశ్యంతి నతాన్ హింసంతి పన్నగాః॥ ఇతి మాధవీయే దేవలోక్తేః. యుగం - చతుర్థీ పూర్వత్ర మధ్యాహ్నవ్యాప్తౌ పూర్వా, అన్యవశేషు పరైవ పంచమ్యాం పూజోక్తేః.

గణేశవ్రతేతు తృతీయాయుతైవ-

చతుర్థీతు తృతీయాయాం మహాపుణ్యా ఫలప్రదా

కర్తవ్యా వ్రతిభిర్ వత్స గణనాథసు తోషిణీ॥ ఇతి హేమాద్రౌ బ్రహ్మ వైవర్తాత్ మాధవీయేతు గణేశవ్రతే మధ్యాహ్న వ్యాపినీ ముఖ్యా-

చతుర్థీ గణనాథస్య మాతృ విద్ధా ప్రశస్యతే

మధ్యాహ్న వ్యాపినీచేత్ స్యాత్ పరతశ్చేత్ పరేఽహని॥ ఇతి బృహస్పతి వచనాత్. ప్రాతః శుక్లతిలైః స్నాత్వామధ్యాహ్నేపూజ యేన్నృప. ఇతి తత్ కల్పే అభిధానాచ్చ తేన పరదినే సత్వేపరా, అన్యథాపూర్వా ఇత్యుక్తం. వస్తుతస్తు, యత్ర భాద్రశుక్ల చతుర్థ్యాదౌ గణేశవ్రత విశేషే మధ్యాహ్న పూజోక్తా తద్విష యాణ్యేవ ప్రాగుక్త వచనాని, నతుసార్వత్రికాణి. సంకష్ట చతుర్థ్యాదౌ బహూనాం

కర్మకాలానాం బాధాపత్తేః. తేన సర్వత్ర గణేశవ్రతే పూర్వైవ వేతి సిద్ధం
సంకష్ట చతుర్థీతు చంద్రోదయ వ్యాపినీ గ్రాహ్యా. దినద్వయేసత్వే మాత
యోగస్య సత్వాత్ పూర్వేతి కేచిత్ అన్యేతుదినే ముహూర్త త్రయాది రూపస
తృతీయా యోగస్యా భావాత్, పరదినే మాధవోక్త మధ్యాహ్న వ్యాపిసత్వాత్
సంపూర్ణత్వాచ్చ పరేత్యాచక్షతే. దినద్వయే తదభావేతు పరైవ. గౌరీవ్రతేః
పూర్వైవ.

గణేశ గౌరీబహులా వ్యతిరిక్తాః ప్రకీర్తితాః
చతుర్థ్యః పంచమీవిద్ధా దేవతాంతర యోగతః॥ ఇతి మదనరత్నే బ్రహ్మ
వైవర్తాత్. (పూర్వ - తదియ + చవితి పర - చవితి + పంచమి )

చతుర్థికూడా అన్ని మతాల ననుసరించి, గణేశ చతుర్థికి వేరైనవన్నీ
పరమందే యుగ్మ వాక్యాన్ననుసరించి. ఏకాదశి, షష్ఠి, అమావాస్య, చవితి
ఈ తిథులలో పరసంయుక్త తిథిలో, పరం పూర్వంతో సంయుక్తమైనప్పుడ
(చతుర్థి పంచమి) ఉపవసించాలి అని మాధవీయంలో వృద్ధ వసిష్ఠోక్తివల్ల కూడ
తెలుస్తోంది. నాగచతుర్థి. మధ్యాహ్ననికి వ్యాపించి ఉండి, పంచమీయుతవై
తేనే గ్రహించాలి అని నిర్ణయామృతంలో, మాధవీయంలోనూ చెప్పబడింది
మధ్యాహ్న కాలమందు చతుర్థి ఉన్న రోజున ఉపవసించి, పంచమి రోజు
నాగులను పాలతో సంతృప్తి పరచి, పూజించిన, నరునకు విషములు నశిస్తాయి
అతనిని పాములు హింసించవు అని మాధవీయంలో దేవలుని వచనముంది
యుగం- చవితి మొదటి దానిలో మధ్యాహ్న వ్యాప్తి ఉంటే పూర్వమే గ్రహిం
చాలి. ఇతర పక్షాల్లో ఐతే పరమే. పంచమియందు పూజ అని చెప్పారు కాబట్టి

గణేశవ్రతమందు తృతీయయుతమైతేనే శ్రేష్ఠం. తృతీయయందు చతుర్థి
ఉంటే మహాపుణ్య ఫలమునిస్తుంది కనుక గణ నాథుని సంతోషపరచే వ్రతాన్ని
చేసేవారు, తృతీయ సహిత చతుర్థిలో చేయాలి అని హేమాద్రియందు బ్రహ్మ
వైవర్తోక్తి. మాధవీయంలో ఇట్లా ఉంది - గణేశ వ్రతంలో మధ్యాహ్న వ్యాపిత్వం
ముఖ్యం. గణనాథునకు తృతీయ సహిత చతుర్థి శ్రేష్ఠము. అది మధ్యాహ్న
వ్యాపిత్వం, పరంలో ఉంటే పరదినమందే ఔతుంది అని బృహస్పతి వచనం.
మాధవీయంలో గణేశ కల్పంలో ఇట్లా చెప్పారు: ప్రొద్దున తెల్లటి నువ్వులతో
స్నానం చేసి మధ్యాహ్నమందు గణేశుని పూజించాలి అని. అందువల్ల పరదినంలో

ఉంటే పరమందు, లేదా పూర్వమందు అని చెప్పారు. యథార్థానికి, భాద్రపద శుక్ల చతుర్థ్యాదులందు, గణేశ వ్రతవిశేషమందు మధ్యాహ్న పూజ చెప్పబడింది. గణేశ విషయాలే ముందు చెప్పిన మాటలు. అంతటికి వర్తించేవి కావు. సంకష్ట చతుర్థి మొదలగు వాటియందు అనేక కర్మకాలాలకు బాధ కల్గుతుంది. అందువల్ల గణేశ వ్రతమందు అంతటా పూర్వముదే అని సిద్ధించింది. సంకష్ట చతుర్థి మాత్రం చంద్రోదయ వ్యాపినిని గ్రహించాలి. రెండు రోజుల్లో ఉంటే మాతృ (తృతీయ) యోగం ఉంటుంది కాబట్టి పూర్వమందే అని కొందరన్నారు. ఇంకొందరు - మొదటి దినమందు మూడు ముహూర్తములు మొదలగు రూపంగా తృతీయ యోగం లేని పక్షంలో, పర దినమందు మాధవుడు చెప్పినట్లుగా మధ్యాహ్న వ్యాపిత్వం ఉన్నందువల్ల, సంపూర్ణంగా చతుర్థి ఉన్నందువల్ల పరమే తీసుకోవాలి అని అన్నారు. రెండు రోజుల్లో అది లేనిపక్షంలో మధ్యాహ్న వ్యాపి పరమే గ్రహించాలి. గౌరీ వ్రతమందు పూర్వమే గ్రహించాలి. మదన రత్నంలో బ్రహ్మవైవర్తవచనం ఇట్లా ఉంది - గణేశ, గౌరీ బహులా వ్యతిరిక్తములైన చతుర్థులు దేవతాంతర యోగంవల్ల పంచమీవిద్ధలైతే శ్రేష్ఠములు అని.

మూ॥ పంచమీతు మాధవమతె సర్వాఽపిపూర్వా—
చతుర్థీ సంయుతాకార్యా పంచమీ పరయా, నతు
దైవే కర్మాణి పిత్ర్యేచ శుక్లపక్షే తథాఽసితే॥

ఇతిహారీతోక్తేః. హేమాద్రిమతేతు కృష్ణా పూర్వా, సితాపరా. కృష్ణా పూర్వయుతా, సితాపరయుతా స్యాత్పంచమీ'', ఇతి దీపికోక్తేః. వస్తుతస్తు హారీతోక్తిరుపవాసవిషయా'' ప్రతిపత్పంచమీ చైవ సావిత్రీ భూతపూర్ణిమా.

నవమీ దశమీ చైవనో పోష్యాః పరసంయుతాః॥ ఇతి బ్రహ్మవైవర్తాత్. యత్తు, పంచమీతు ప్రకర్తవ్యా షష్ఠ్యా యుక్తాతునారద, ఇత్యాపస్తంబీయం తత్ స్కందవ్రతపరం. స్కందోపవాసే స్వీకార్యా పంచమీ పరసంయుతా, ఇతి వాక్య శేషాదితి మాధవః. నాగపూజా విషయ మిత్యనంత భట్ట, నిర్ణయామృతాదయః. చమత్కార చింతా మణౌచ - పంచమీ నాగపూజాయాం కార్యాషష్ఠీసమన్వితా.

తస్యాంతు తుషితానాగాః ఇతరాసు చతుర్థికా॥ ఇతి. తేన నాగపూజా ద్యోపరైవ. యత్తు మదనరత్న దివోదాసీయయోః - శ్రావణ పంచమ్యా తిరిక్తా పూర్వేత్యుక్తం. శ్రావణే పంచమీ శుక్లా సంప్రోక్తా నాగపంచమీ

తాంపరిత్యజ్య పంచమ్యః చతుర్థీ సహితాః హితాః॥ ఇతి సంగ్రహోక్తేః గణేశస్కంద యోగాభ్యాం క్రమాన్నాగః శుభాశుభః

మిత్రా మిత్రేతయోః పత్రే నాగానా మాఖుబర్హిణౌ॥ ఇతి షట్ త్రింశన్మ తాచ్చ శ్రావణ పంచమ్య తిరక్తాయాః నాగపంచమ్యాః చతుర్థీయుతత్వముక్తం, తత్ ఉపవాసాది విషయం. పత్రే - వాహనే. పూర్వ - చవితి + పంచమి పర- పంచమి + షష్ఠి.

మాధవమతంలో పంచమి అంతటా పూర్వమే అని. చతుర్థితో కూడిన పంచమిని ఆచరించాలి కాని, పరంతోకూడిన దాన్ని కాదు, దైవకర్మల్లో, పితృకర్మల్లోను, శుక్లపక్షంలో, కృష్ణపక్షంలోను అని హారీతుని వచనం. హేమాద్రి మతంలో కృష్ణపక్షంలో పూర్వము శుక్లపక్షంలో పరము. కృష్ణపక్షంలో పూర్వయుతము (చతుర్థి) శుక్లపక్షంలో పరయుతమైన పంచమిని స్వీకరించాలి అని దీపికావచనము యధార్థానికి హారీతోక్తి ఉపవాసవిషయకము. బ్రహ్మవైవర్తంలో ఇట్లా ఉంది-ప్రతిపత్తు, పంచమి, వట ఆమావాస్య, చతుర్దశీ, వటపూర్ణిమ, నవమి, దశమి- ఇవన్ని పర సంయుతమైనప్పుడు వీనిలో ఉపవసించరాదు అని. పంచమిని, షష్ఠితో కూడినప్పుడు ఆచరించాలి అని అపస్తంబీయంలో అన్నారో అది స్కందవ్రతపరకము. స్కందవ్రత ఉపవాసంలో పరసంయుతమైన పంచమిని స్వీకరించాలి అనే వాక్య శేషంవల్ల అని మాధవుని వచనం. ఇది నాగపూజా విషయము అని అనంతభట్ట, నిర్ణయామృతాదులు అన్నారు. చమత్కార చింతామణి యందు కూడా ఇట్లా చెప్పారు- నాగపూజను షష్ఠితో కూడిన పంచమియందు చేయాలి. ఆ రోజుయందు నాగులు సంతోషిస్తారు. ఇతర కర్మలు చతుర్థియుక్త పంచమియందు చేయాలి అని. అందువల్ల నాగపూజయందు పరమే శ్రేష్ఠము. మదరత్నదివోదాసీయములందు శ్రావణ పంచమ్యతిరిక్తమైనచోట్ల పూర్వము గ్రహించాలి అని అన్నారో దాని సంగ్రహం ఇది- శ్రావణశుక్ల పంచమి నాగపంచమి, దాన్ని వదలి, ఇతర పంచములు, చతుర్థి సహితములైనవి ఉత్తమము. గణేశ, స్కందముల యోగముచే నాగము శుభము, అశుభము ఔతుంది. వారి వాహనములు ఎలుక, నెమళ్ళు పాములకు మిత్ర, అమిత్రములౌతాయి అని షట్ త్రింషన్మతము వల్ల కూడా, శ్రావణ పంచమ్యతిరిక్త నాగపంచమి, చతుర్థితో కూడింది, ఆచరించాలి అని అన్నారో, అది ఉపవాసాది విషయకము. పత్రకము=వాహనము.

మూ॥ షష్ఠీసర్వమతే స్కందవ్రతాతిరిక్తా పరైవ యుగ్మవాక్యాత్ నాగవిద్ధాన కర్తవ్యా షష్ఠీచైవ కదాచన ఇతి స్కాందాచ్చ (పూర్వ - పంచమి + షష్ఠి; పర - షష్ఠి + సప్తమి.)

అందరి మతాల్లో స్కందవ్రత అతిరిక్తమైన అన్నిచోట్ల షష్ఠి పరమైనదే. యుగ్మవాక్యాన్ననుసరించి, షష్ఠిని ఎప్పుడైనా నాగవిద్ధమైనదాన్ని చేయరాదు అని స్కాందోక్తి కూడా.

మూ॥ సప్తమీపూర్వైవ యుగ్మవాక్యాత్-షష్ఠ్యాయుతా సప్తమీచకర్తవ్యా తాత సర్వదా, ఇతిస్కాందాచ్చ నిర్ణయామృతే-

షష్ఠీచ సప్తమీచైవ వారశ్చేదంశు మాలినః

యోగోఽయం పద్మకోనామ సూర్యకోటిగ్రహైః సమః॥

యుగ్మవాక్యంవల్ల సప్తమిని పూర్వమందే గ్రహించాలి. షష్ఠితో కూడిన సప్తమిని సర్వదా పరిగ్రహించాలి అని స్కాందోక్తికూడా నిర్ణయామృతమందు- షష్ఠియుక్త సప్తమి యందు ఆదివారం కూడా వస్తే ఈ కూడికను పద్మకం అని అంటారు. ఇది సూర్యుని కోటి గ్రహణములతో సమానము. (పూర్వ - షష్టి + సప్త, పర - సప్త + అష్ట.)

మూ॥ అష్టమీతు సర్వమతే కృష్ణా పూర్వాసితాపరా. వ్రతమాత్రేఽష్టమీ కృష్ణా పూర్వాశుక్లాష్టమీ పరా ఇతిమాధవోక్తేః పరయుక్ శుక్లాష్టమీ, పూర్వయుక్ కృష్ణా ఇతి దీపికోక్తేశ్చ శివశక్త్యుత్సవేతు కృష్ణాప్యుత్తరా, పక్షద్వయేప్యుత్తరైవ శివశక్తి మహోత్సవే ఇతిమాధవోక్తేః దివోదాసీయేభవిష్యే—

యదాయదాసితాష్టమ్యాం బుధవారో భవేత్క్వచిత్

తదాతదాహిసాగ్రాహ్యా ఏకభక్తాశనేన్నృప॥

సన్ధ్యాకాలే తథా చైత్రే ప్రసుప్తేచజనార్దనే

బుధాష్టమీనకర్తవ్యాహన్తి పుణ్యంపురాకృతం॥ అన్త్య పద్యం హేమాద్రౌన ధృతం.

అష్టమి అందరి మతంలో కృష్ణ పక్షంలో పూర్వయుతం, శుక్ల పక్షంలో పరయుతం అని వ్రతంలో మాత్రమే అష్టమీ తిథి కృష్ణ పక్షంలో పూర్వయుతం శుక్ల అష్టమీ పరయుతం అని మాధవోక్తి, దీపికోక్తికూడా.

శివశక్త్యుత్సవంలో కృష్ణఅష్టమీ కూడా ఉత్తరయుతం కావాలి. రెండు పక్షాల్లో గూడా ఉత్తరయుతమే శివశక్త్యుత్సవంలో అని మాధవోక్తి. దివోదాసీయంలో భవిష్యపురాణవచనం - శుక్ల అష్టమి బుధవారం వస్తే ఏకభక్తాశనం కొరకు దాన్ని స్వీకరించాలి. సంధ్యాకాలమందు, చైత్రమాసంలో విష్ణువు శయ

నించినపుడు బుధాష్టమి ఆచరించరాదు. ఆచరిస్తే ఇంతకుముందున్న పుణ్యాన్ని కూడా హరిస్తుంది. చివరి ఈ పద్యాన్ని హేమాద్రి గ్రహించలేదు.

మూ॥ నవమీతు సర్వమతేపూర్వా, యుగ్మవాక్యాత్, నకుర్యాత్‌నవమీం తాతదశమ్యాతు కదాచన, ఇతిస్కాందాచ్చ.

అందరి మతమందు నవమి పూర్వయుతం ఆచరించాలి. యుగ్మవాక్యాన్ననుసరించి నవమిని దశమియుతాన్ని ఎప్పుడూ ఆచరించరాదు అని స్కాందోక్తి కూడా.

దశమీతు పూర్వాపరావేతి హేమాద్రిః కృష్ణాపూర్వోత్తరా శుక్లాదశమ్యేవం, వ్యవస్థితా, ఇతి మాధవః. వస్తుతస్తు ముఖ్యానవమీయుతైవ గ్రాహ్యా. దశమీతు ప్రకర్తవ్యా సదుర్గాద్విజసత్తమ, ఇత్యాపస్తంబోక్తేః. యత్తు సంపూర్ణా దశమీ కార్యా పూర్వయా పరయాఽథవా, ఇత్యంగిరసోక్తం, తన్నవమీయుక్తాలాభే ఔదయికీ గ్రాహ్యేత్యేవం జ్ఞేయం.

దశమిని పూర్వయుతమైనా గ్రహించాలని హేమాద్రి. కృష్ణ పక్షంలో పూర్వయుతం, శుక్లపక్షంలో పరయుతం అని దశమిని ఇట్లా గ్రహించాలని మాధవోక్తి. యథార్థానికైతే నవమియుతమైందే ముఖ్యం. దాన్నే గ్రహించాలి. దశమిని, దుర్గతో కూడిన దాన్ని స్వీకరించాలి అని ఆపస్తంబోక్తి. పూర్వం లేదా పరంతో కూడిన సంపూర్ణ దశమిని చేయాలి అనిన అంగిరసోక్తి ఏదుందో అది నవమీ యుక్తం లభించని పక్షంలో ఔదయికిని గ్రహించాలి అని తెలుసుకోవాలి.

మూ॥ తత్ర ఏకాదశ్యుపవాసో ద్వేధానిషేధ పరిపాలనాత్మకో, వ్రతరూపశ్చ.

తత్రాద్యః—

నశం ఖేనపిబేత్‌తోయం, నఖాదేత్ కూర్మకూ కరౌ
ఏకాదశ్యాం నభుంజీత పక్షయోరు భయోరపి॥ ఇతి కౌర్మదేవలాద్యుక్తేః.

అగ్నిపురాణేఽపి—

గృహస్థో బ్రహ్మచారీచ ఆహితాగ్ని స్తథైవచ
ఏకాదశ్యాం నభుంజీత పక్షయోరుభయోరపి॥ ఇతి నచాత్ర పర్యుదాసేన, వ్రతవిధిః. తద్ధేతువ్రతాది శబ్దాభావాత్.

ఏకాదశ్యుపవాసము, రెండు రకములు నిషేధమును ఆచరించుట, వ్రత మాచరించుట అని. అందు మొదటిది - శంఖముతో నీరు త్రాగరాదు. కూర్మ శూకరములను తినరాదు. ఏకాదశిరోజు, ఉభయ పక్షములందు (కృష్ణ, శుక్ల), భోజనం చేయరాదు అని కూర్మ పురాణ, దేవలాదుల వచనము. అగ్ని పురాణ మందు కూడా ఇట్లా ఉంది - గృహస్థు, బ్రహ్మచారీ, ఆహితాగ్ని వీరు రెండు పక్షములందు, ఏకాదశిరోజు భోజనం చేయరాదు అని ఇక్కడ పర్యుదాసంవల్ల వ్రతవిధి జరుగుతుంది అని అనరాదు. వ్రతాన్ని విధించే వ్రతాది శబ్దములు లేవు కాబట్టి.

మూ॥ వ్రతరూపస్తు బ్రహ్మవైవర్తే—

ప్రాప్తేహరిదినే సమ్యక్ విధాయ, నియమంనిశి

దశమ్యాముపవాసస్య ప్రకుర్యాత్ వైష్ణవం వ్రతం॥ ఇతి.

ఇదంచ, శివభక్తాది భిరపికార్యం వైష్ణవోఽవాథశైవోవా సారోఽప్యేత త్సమాచరేత్, ఇతిసౌరపురాణాచ్చ. సోఽపిద్వేధా - నిత్యః, కామ్యశ్చ. ఉపోష్యై కాదశం నిత్యం, పక్షయోరుభయోరపి, ఇతి గారుడోక్తేః - పక్షేపక్షేచ కర్తవ్యం ఏకాదశ్యాము పోషణం, ఇతి నారదోక్తేశ్చ నిత్యతా.

యదిచ్ఛే ద్విష్ణు సాయుజ్యం శ్రియం సంతతి మాత్మనః

ఏకాదశ్యాం నభుంజీత పక్ష యోరుభయోరపి॥ ఇతి కౌర్మాదిషు ఫలశ్రు తేశ్చ కామ్యతా, ఉభయైకాదశీవ్రతం గృహస్థాతి రిక్తానామేవ నిత్యం. గృహస్థ స్యతు శుక్లాయామేవ, వ్రతం నిత్యం, నకృష్ణాయాం.

'ఏకాదశ్యాం నభుంజీత పక్షయోరు భయోరపి,

వనస్థయతి ధర్మోఽయం, శుక్లామేవ సదాగృహీ॥ ఇతి దేవలోక్తేః.

బ్రహ్మవైవర్తమందు వ్రతస్వరూపము ఇట్లా చెప్పారు: హరి దినం వచ్చిన యెడల, అంతకు ముందు రాత్రి, నియమాన్ని బాగా ఆచరించాలి. దశమి రాత్రియందు ఉపవాస, నియమాన్ని ఆచరించాలి. ఇది వైష్ణవ వ్రతము అని. దీనిని శివభక్తాదులు గూడా ఆచరించాలి. వైష్ణవుడైనా, శైవుడైనా, సౌరుడైనా దీన్ని ఆచరించాలి అని సౌరపురాణోక్తి.

అది రెండు విధములు- నిత్యము, కామ్యము. రెండు పక్షములందు, ఏకాదశిరోజు ఎప్పుడూ ఉపవసించాలి అని గారుడోక్తి. ప్రతిపక్షంలో, ఏకాదశిరోజు ఉపవసించాలి, అనే నారదోక్తి వల్లకూడా నిత్యమని తేలింది. విష్ణుసాయుజ్యాన్ని కోరేవారు, సంపదను, తనకు సంతానాన్ని కోరేవారు ఉభయ పక్షములందు ఏకాదశిరోజు భుజించరాదు అని కౌర్మాది పురాణాల్లో ఫలశ్రుతి చెప్పారు కాబట్టి. ఇందులో కామ్యవ్రత లక్షణం ఉంది. ఉభయ ఏకాదశి వ్రతము, గృహస్థ అతిరిక్తులకు నిత్యము, గృహస్థునకైతే శుక్లపక్షమందే వ్రతం - నిత్యము, కృష్ణపక్షంలో కాదు. ఏకాదశిరోజు, ఉభయపక్షాల్లో భోజనం చేయరాదు. ఇది వానప్రస్థ, యతుల ధర్మము, గృహస్థుడు మాత్రం నిత్యం, శుక్లపక్షమందే ఆచరించాలి అని దేవలోక్తి.

మూ॥ నచానేన నిషేధపాలనమేవ, వనస్థయతి విషయే ఉపసంహ్రియతే, నతువ్రతమితి వాచ్యం. అస్యపర్యు దాసేన వ్రతవిధి పరత్వాత్. అన్యథా పూర్వోక్తాగ్ని పురాణ వచనే నిషేధపాలనే గృహస్థస్యాధికారో విరోధఃస్యాత్. నిషేధస్య నివృత్తిమాత్ర ఫలత్వేన, విశేషానపేక్షణా దుపసంహారా యోగాత్. అభావస్య ధర్మత్వా భావాచ్చ. తస్మాదనేన సర్వేషామేకాదశీ వ్రతవిధాయినాం సామాన్య వాక్యానాం వనస్థయతి విషయే ఉపసంహారా న్నగృహస్థస్య కృష్ణాయాం నిత్య వ్రతప్రాప్తిః. కథంతర్హి —

సంక్రాంత్యా ముపవాసంచ కృష్ణైకాదశి వాసరే

చంద్ర సూర్యగ్రహే చైవన కుర్యాత్ పుత్రవాన్ గృహీ॥ ఇతి నారదాది వచనేమ కృష్ణానిషేధః. ప్రాప్త్య భావాదితిచేత్ శ్రూయతాం-

శయనీ బోధినీమధ్యే యాకృష్ణైకాదశీ భవేత్

సైవోపోష్యా గృహస్థేన నాన్యాకృష్ణా కదాచన॥ ఇతి పాద్మే గృహస్థస్య ఆషాఢీ కార్తికీ మధ్యస్థాయా కృష్ణావిహితా, సాపుత్రవతో నిషిధ్యతే అన్య కృష్ణాయాంతు, నవిధిః. సర్వవిధీనాం వనస్థయతిషూప సంహారాత్. ననిషేధః, ప్రాప్త్యభావాత్. శయన్యాదివాక్యం త్వపుత్రగృహి గోచర మిత్యనంత భట్ట హేమాద్ర్యాది గ్రంథాః.

దీనితో, నిషేధపాలనమే వనస్థ, యతుల విషయంలో ఉపసంహరింపబడుతోంది, కాని వ్రతంకాదు అని అనరాదు. ఇది పర్యుదాసము (exception)

కనుక వ్రతవిధి పరకము లేనిపక్షంలో ముందు చెప్పిన అగ్ని పురాణ వచనా న్ననుసరించి నిషేధ పాలనంలో గృహస్థునకు చెప్పిన అధికారం విరుద్ధ మౌతుంది. నిషేధము, నివృత్తి మాత్రఫలము, విశేషాపేక్ష లేదు కాబట్టి ఉప సంహారం కుదరదు. అభావం ధర్మంకాదు కాబట్టి(నిషేధం కాని, అభావం కాని వ్రత ఉద్దేశ్యం కాదు కాని వ్రతవిధి ఉద్దేశ్యం). అందువల్ల అన్ని ఏకాదశీ వ్రతవిధాయక సామాన్య వాక్యాలు వనస్థ, యతి విషయంలో ఉపసంహరిస్తాయి (అగిపోతాయి). కనుక గృహస్థునకు కృష్ణపక్షంలో నిత్య వ్రతప్రాప్తి రాదు. అట్లైతే- సంక్రాంతి యందు, కృష్ణ ఏకాదశిరోజు, చంద్ర సూర్యుల గ్రహణంరోజు పుత్రవంతుడైన గృహస్థు ఉపవాసం చేయరాదు అని నారదాది వచనాల్లో కృష్ణ ఏకాదశి నిషే ధించబడింది కదా! ప్రాప్తే లేదుకదా అని అంటే వినండి. శయనైకాదశి, ఉత్థానైకాదశి వీటిమధ్య కృష్ణైకాదశివస్తే, ఆ ఏకాదశికి గృహస్థు ఉపవసించాలి. ఇతర కృష్ణైకాదశి ఎప్పుడూ కాదు అని పాద్మమందు చెప్పబడింది. దీనివల్ల గృహస్థునకు అషాఢ కార్తికాలమధ్య యందలి కృష్ణైకాదశి విధించబడుతూ పుత్రవంతుడైన గృహస్థునకు ఉపవసించరాదని, నిషేధింపబడుతోంది. ఇతర కృష్ణపక్షాలలో విధికాదు. అన్నివిధులు వానప్రస్థ, యతుల విషయంలోనే వర్తించి, ముగుస్తున్నాయి. నిషేధం లేదు, ప్రాప్తిలేదు కాబట్టి. శయన్యాది వాక్యము పుత్రులులేని గృహస్థు విషయం అని అనంతభట్ట హేమాద్ర్యాది గ్రంథాలు చెప్తున్నాయి.

మూ॥ దీపికాఽపి - అసితాతు శయనీ బోధాన్తర స్థాఽప్యధోనస్యాత్ సాఽత్మ వతోఽపిచ, ఇతి. మదనరత్నే భవిష్యే-

యథా శుక్లా తథా కృష్ణా ద్వాదశీమే సదాప్రియా
శుక్లా గృహస్థైః కర్తవ్యా భోగ సంతానవర్ధినీ॥

ముముక్షుభిః తథాకృష్ణా నతే తేనో పదర్శితా। ఇతి. నిషేధపాలనం కామ్య వ్రతంచ సర్వకృష్ణాయాం సర్వగృహిణాం సంభవత్యేవ.

పుత్రవాంశ్చ సభార్యశ్చ బంధుయుక్తస్తథైవచ
ఉభయోః పక్షయోః కామ్యవ్రతం కుర్యాత్తు వైష్ణవం॥ ఇతి నారదోక్తేః ఏతచ్చ సర్వం కాలాదర్శే ఉక్తం.

విధవాయా, వనస్థస్య యతేశ్చైకాదశీద్వయే
ఉపవాసో గృహస్థస్య, శుక్లాయామేవ పుత్రిణః॥

భుజే నిషేధః కృష్ణాయాం సిద్ధిస్తస్య తతోవ్రతే, ఇతి. ప్రాచ్యాస్తు - వైష్ణవ గృహస్థానాం కృష్ణాఽపినిత్యా.

నిత్యం భక్తిసమాయుక్తైః నరైర్విష్ణు పరాయణైః
పక్షే, పక్షేచ, కర్తవ్యం ఏకాదశ్యాము పోషణం॥
సపుత్రశ్చ, సభార్యశ్చ సజనోభక్తి సంయుతః
ఏకాదశ్యా ముపవసే పక్షయోరు భయోరపి॥ ఇతి నారదోక్తే రిత్యాహుః పుత్రశబ్దశ్చాపత్య మాత్రవచనః.

నారాయణవృత్తౌ - ''పుమాంస ఏవమే పుత్రా జాయేరన్'' ఇత్యత్రాపత్య మాత్రవాచిత్వోక్తేః. "జనయేత్ బహుపుత్రాణి" ఇతి లింగాత్. "పౌత్రీమాతా మహస్తేన" ఇతి మనూక్తేః. పుత్ర్యా అపత్యమిత్యర్థేతు"స్త్రీభ్యోఢక్"ఇతి పౌత్రేయ ఇత్యాపత్తేః. పుమాన్ పుత్రోజాయతే ఇతి చ.

దీపికయందు - (ఆషాఢ శుక్ల ఏకాదశి) శయని, (కార్తీక శుక్ల ఏకాదశి) బోధినీల మధ్య ఉన్న కృష్ణపక్ష ఏకాదశిని పుత్రవంతులు కూడా ఆచరించాలి, తర్వాతది కాదు అని ఉంది. మదనరత్నమందు భవిష్యపురాణవచనం - నాకు శుక్ల కృష్ణ ద్వాదశులు రెండు ఎల్లప్పుడు ఇష్టం. శుక్ల పక్షాన్ని గృహస్థులు భోగ, సంతాన, అభివృద్ధికొరకు ఆచరించాలి. ముముక్షులు కృష్ణపక్షాన్ని ఆచరించాలి అని ఉంది. నిషేధపాలనము, కామ్యవ్రతము, అన్ని కృష్ణపక్షాల్లో అందరు గృహస్థులు చేయవలసిందే. నారదుడిట్లా అంటాడు - పుత్రవంతుడు, భార్యగలవాడు, బంధువులతోకూడి రెండు పక్షములందు వైష్ణవమైన కామ్య వ్రతాన్ని చేయాలి అని ఇదంతా కాలాదర్శంలో చెప్పారు. విధవ, వానప్రస్థుడు యతి- వీరు ఉభయ ఏకాదశుల్లో ఉపవసించాలి. పుత్రవంతుడైన గృహస్థుడు శుక్లపక్షంలో ఉపవసించాలి. కృష్ణపక్షంలో భోజన నిషేధము. ఆ తరువాతే అతనికి వ్రతసిద్ధి అని.

ప్రాచ్యులైతే.వైష్ణవగృహస్థులకు కృష్ణపక్ష ఏకాదశి కూడా నిత్యమే. ఎప్పుడూ విష్ణుపరాయణులై, భక్తిగలవారై నరులు ప్రతిపక్షంలో ఏకాదశి యందు ఉపవసించాలి. అతడు భార్యాపుత్రులతో కలిసి భక్తితో ఉభయపక్ష

ఏకాదశులలో ఉపవసించాలి అని నారదోక్తి ఉంది కనుక అని అంటారు. పుత్ర శబ్దము సంతానాన్ని మాత్రమే బోధిస్తుంది. నారాయణవృత్తియందు-నాకు మగ సంతానమే కలుగని అనేచోట అపత్యమాత్రంగా (సంతానమాత్రంగా) చెప్పారు. 'బహుపుత్రాణి జనయేత్' అనే సూచన ననుసరించి అపత్యమాత్రమే. మనువు ఇట్లా అంటాడు-బిడ్డయొక్క కొడుకువల్ల మాతామహుడు ఆ అమ్మాయి తండ్రి పౌత్రి ఔతాడు. ఇక్కడ పౌత్రిశబ్దముంది. కొడుకు, కొడుకునుకూడా పౌత్రుడు అని అంటారు. పౌత్రశబ్దం బిడ్డద్వారా, మరి కొడుకుద్వారా కలిగిన సంతానాన్ని ఇద్దరిని సూచిస్తుంది. నిజంగా బిడ్డ కొడుకు అనే అర్థంలో ఐతే వ్యాకరణం ప్రకారం "పౌత్రేయ" అని కావాలి. కాని పౌత్ర అనే వాడతాం. కనుక అపత్య సామాన్యార్థం. "పుమాన్ పుత్రః" అని కూడా వాడుక ఉంది. (మగ సంతానము.)

మూ॥ ఉపవాసనిషేధే విశేషః వాయవీయే ఉక్తః-
ఉపవాస నిషేధేతు కించిత్ భక్ష్యం ప్రకల్పయేత్
నదుష్యత్యుపవాసేన ఉపవాసఫలం లభేత్॥

భక్ష్యంచ తత్రైవోక్తం -
నక్తం హవిష్యాన్న మనోదనంవాఫలం తిలాః క్షీరమథాంబుచాజ్యం
యత్ పంచగవ్యం యదివాఽపివాయుః ప్రశస్తమత్రోత్తర ముత్తరంచ॥
ఇత్యలం

ఉపవాస నిషేధమందు విశేషము వాయుపురాణ వచనం ఇట్లా ఉంది: ఉపవాసం నిషేధింపబడితే కొద్దిగా తినటానికి కల్పించాలి. ఉపవాసం దూషితం కాదు. ఉపవాసఫలం లభిస్తుంది అని. అక్కడే భక్ష్యమంటే చెప్పారు. నక్తము, హవిష్యాన్నము, అన్నం తినకపోవటం, పండ్లు, నువ్వులు, పాలు, నీరు, నేయి, పంచగవ్యము, వాయువు- వీటిలో దేనితోనైనా గడపటం, వీనిలో ఉత్తరోత్తరము శ్రేష్ఠము (గాలితో గడపటం అన్నిటికన్న శ్రేష్ఠము). ఇక ఈ విషయం చాలు.

మూ॥ తత్ర దశమీవేధో ద్వేధా-అరుణోదయవేధః సూర్యోదయవేధశ్చేతి.
ఆద్యోగారుడే - దశమీశేష సంయుక్తో యదిస్యాదరుణోదయః
నైవో పోష్యం వైష్ణవేన తద్దినై కాదశీవ్రతం॥ ఇతి.

ఏకాదశి విషయంలో దశమి వేధ రెండు రకాలు. అరుణోదయవేధ, సూర్యోదయవేధ. ఏకాదశి అరుణోదయం, దశమిశేషంతో కూడి ఉంటే వైష్ణ

వుడు ఉపవసించరాదు. ఆ రోజు ఏకాదశీ వ్రతం కాదు అని గరుడ పురాణ వచనం అని.

మూ॥ అరుణోదయ స్వరూపం చ మాధవీయేస్కాందే-

ఉదయాత్ప్రాక్ చతస్రస్తుఘటికా అరుణోదయః॥ ఇతి యదపి - ఉదయాత్ ప్రాక్ యదా విప్ర ముహూర్తద్వయ సంయుతా.

సంపూర్ణైకాదశీ నామ తత్రైవోపవసేత్ గృహీ॥ ఇతి గారుడ సౌరధర్మాది వచనం, యచ్ఛవిష్యే -

ఆదిత్యోదయ వేలాయాః ప్రాజ్ ముహూర్త ద్వయాన్వితా,

ఏకాదశీతు సంపూర్ణా విద్ధాన్యా పరికీర్తితా॥ ఇతి, తదప్యుప సంహారన్యాయేన దండ చతుష్టయ పరమేవ హేమాద్రావప్యేవం. యత్తు బ్రహ్మవైవర్తే-

చతస్రో ఘటికాః ప్రాతరరుణోదయ నిశ్చయః
చతుష్టయ విభాగోఽత్రవేధాదీనాం కిలోదితః॥
అరుణోదయవేధః స్యాత్ సార్ధంతు ఘటికాత్రయం
అతివేధో ద్విఘటికః ప్రభా సందర్శనాద్రవేః॥
మహా వేధో పి తత్రైవ దృశ్యతేఽర్కోనదృశ్యతే
తురీయస్తత్ర విహితో యోగః సూర్యోదయే బుధైః॥ ఇతి తదపి అవయవ ద్వారా అరుణోదయ వేధ విశేష పరమేవేతి మాధవీయే, మదనరత్నేచ, అన్యస్తూదయవేధః.

అరుణోదయమనగా మాధవీయంలో స్కాందోక్తి - ఉదయం కన్న ముందు, నాల్గు గడియలు అరుణోదయము అని ఉంది. గారుడ, సౌరధర్మాది వచనంలో - ఉదయంకన్న ముందు 2 గడియల కాలం ఏకాదశి ఉంటే అది సంపూర్ణ ఏకాదశి. అక్కడే గృహస్థు ఉపవసించాలి, అని ఉందో, భవిష్య పురాణంలో - సూర్యోదయంకన్న ముందు రెండు ముహూర్తముల కాలం ఉన్న ఏకాదశి సంపూర్ణ అని అనబడుతుంది. ఇతరమైంది విద్ధ అని అన్నారో- ఈ రెండు ఉపసంహారన్యాయాన్ననుసరించి 4 గడియల పరకమే హేమాద్రియందు కూడా ఇట్లే చెప్పబడింది. బ్రహ్మవైవర్తంలో - ప్రొద్దున నాల్గు గడియలు అరుణోదయము అని నిశ్చయము. ఇక్కడ వేధ నాల్గు రకములు. $3\frac{1}{2}$ గడియలు, అరుణోదయ వేధ, 2 గడియలు అతివేధ. సూర్యుడు కన్పించని, కన్పించకపోసీ

అక్కడే మహావేధ. సూర్యోదయమందు దశమియోగముంటే అది నాల్గవ వేధ అని చెప్పారు. అది కూడా అవయవముద్వారా, అరుణోదయ వేధ విశేష పరకము అని మాధవీయంలో, మదనరత్నంలో చెప్పారు ఇతరము ఉదయవేధ అని గ్రహించాలి.

మూ॥ తథా అన్యేఽపివేధాః హేమాద్రౌ మాధవీయే గారుడే-

ఉదయాత్ప్రాక్ త్రిఘటికా వ్యాపిన్యే కాదశీయదా

సందిగ్ధైకాదశీ నామ వర్జ్యేయం ధర్మ కాంక్షిభిః॥

ఉదయాత్ప్రాక్ ముహూర్తేన వ్యాపిన్యే కాదశీయదా

సంయుక్తైకాదశీనామ వర్జ్యేయం ధర్మ వృద్ధయే॥

హేమాద్రౌ - రాత్రేరంత్యోఽష్టమో భాగోఽప్యరుణోదయ ఉక్తః-

నిశః ప్రాంతేతు యామార్ధే దేవవాదిత్రవాదనే

సారస్వతా నధ్యయనే చారుణోదయ ఉచ్యతె॥ ఇతి స్మృతేః అత్రై9కే - ఏషాం సర్వ పక్షాణాం ముహూర్తద్వయేన క్రోడీకారాత్ 'నిశఃప్రాన్తే' ఇతి వచనాచ్చ, రాత్రి మానవశాత్సార్ధత్రి దండాదయో అనేకే అరుణోదయాః. తదాహ హేమాద్రిః - సార్ధఘటికాత్రయో క్తి రష్టావింశతి ఘటీమితరాత్రి విషయా మహత్తరాస్తు రాత్రీరపేక్ష్యచతస్రో, ఘటికా ఇత్యుక్తమితి ఇత్యాహుః తన్న, అరుణోదయశబ్దస్యానే కార్ధత్వాపత్తేః, నచ ముహూర్తద్వయమర్ధః. దండద్వ యైక ముహూర్తాదివేధానాం తథాప్యనుపపత్తేః నహితేషాం యామార్ధత్వ మరుణో దయత్వంచాస్తి. ముహూర్తద్వయస్యయామార్ధస్యచ 'చతస్రోఘటికాః' ఇత్యనే నోపసంహారాచ్చ నతదర్థః. నచ 'సార్ధంతు ఘటికాత్రయం' ఇత్యనేనాపి తదా పత్తిః శంక్యా తేన చతుర్థండ వేదస్యైవోక్తేః. చతుర్దండే అర్థఘటీ దశమీసత్వే హివేధస్తదర్థః ద్విఘటికాదౌ తదయోగాచ్చయత్తు మతంకియతా అరుణోదయ వేధ ఇత్యపేక్షాయాం సార్ధఘటికాత్రయ నియమాదరుణోదయే అర్ధఘటికా తోన్యూన దశమీసత్వే నదోషః, ఇతి. తత్తుచ్ఛం. ద్విదండాదావపితదాపత్తేః.

దశమీశేష సంయుక్తో యదిస్యాదరుణోదయః

నైవోపోష్యం వైష్ణవేన తద్దినైకాదశీవ్రతం॥ ఇతి గారుడే, భవిష్యేచ యోగమాత్రేనిషేధాత్ నారదీయేఽపి -

లవవేధేఽపి విప్రేంద్ర, దశమ్యై కాదశీంత్యజేత్

సురాయాబిందునా స్పృష్టం గంగాంభ ఇవనిర్మలం॥

స్కాందేఽపి -

కలాకాష్ఠాదిగత్త్యైవ దృశ్యతే దశమీవిభో

ఏకాదశ్యాంన కర్తవ్యం వ్రతం రాజన్ కదాచన॥ ఇతి.

మాధవోప్యాహ - సోఽయం కలాధివేధో అరుణోదయవేధే సూర్యోదయ వేధేచ సమానః, ఇతి. నిగమేఽపి సర్వప్రకార వేధోఽయ ముపవాసస్య దూషకః ఇతి.

ఇతర వేధలు కూడా హేమాద్రియందు, మాధవీయమందు, గారుడ మందు ఇట్లా చెప్పారు : ఉదయంకన్న ముందు మూడుగడియలు ఏకాదశి వ్యాప్తి ఉంటే అది సందిగ్ధైకాదశి. ధర్మం కాంక్షించేవారు దాన్ని వదలాలి. ఉదయం కన్న ముందు ఏకాదశి ముహూర్తకాలం వ్యాపించి ఉంటే, అది సంయుక్తైకాదశి. దీన్నికూడా ధర్మవృద్ధికొరకు వదలాలి. హేమాద్రియందు, రాత్రియొక్క చివరి ఎనిమిదవభాగం కూడా అరుణోదయం అని చెప్పబడింది. రాత్రి చివరి అర్ధ యామము, దేవపూజకై వాద్యవాదనము, విద్యకు అనధ్యయనం ఈ రెంటికి ఏది కాలమో అది అరుణోదయం అని స్మృతి వచనము. ఇక్కడ కొందరు ఇట్లా అన్నారు: ఈ సర్వపక్షములు రెండు ముహూర్తములని ఏకవాక్యత ఐనందున, 'రాత్రిప్రాంతమందు' అనే వాక్యాన్ననుసరించి, రాత్రిమానానుసారము $3\frac{1}{2}$ ఘడియలు మొదలుగా అనేక అరుణోదయాలు ఔతాయి. అందువల్లనే హేమాద్రి ఇట్లా అన్నాడు: $3\frac{1}{2}$ గడియలు అనేమాట 28 గడియలు గల రాత్రి విషయకము. ఎక్కువ రాత్రికాలమంటే నాల్గుగడియలు అని అన్నాడు అని కొందరిట్లా అన్నారో అది తప్పు. దానివల్ల అరుణోదయ శబ్దానికే అనేకార్థాలు వచ్చే ప్రమాదం ఉంది. ముహూర్తద్వయము కూడా అర్థంకాదు. రెండు గడియలు ఒక ముహూర్తము మొదలగు వేధలకు కూడా అనుపపత్తి వస్తుంది. ఎందుకంటే వాటికి యామార్ధత్వము, అరుణోదయత్వం లేదు. ముహూర్త ద్వయము, యామార్ధము అనువానికి కూడా, నాల్గుగడియలు అనేదానితో ఉప వ్యాప్తి కల్గినందున, వానికి ఆ అర్థం లేకుండా పోతుంది. వాటికి అది అర్థం కాదు. $3\frac{1}{2}$ గడియలు అనేదానితో కూడా ఆ ఆపత్తి ఉందని భావించరాదు. దానితో నాల్గుగడియలవేధే చెప్పబడింది. నాల్గుగడియలలో మొదట అరగడియ దశమి ఉంటేనే వేధ అని దానర్థం. రెండుగడియలు అరుణోదయం అను మొదలగు వానిలో అది కుదరదు కూడా.

అరుణోదయవేధ ఎంత అని అన్నప్పుడు 3½ గడియలు అని నియమం కాబట్టి అరుణోదయంలో అరగడియకన్న తక్కువగా దశమి ఉంటే దోషం లేదు అని ఎవరో ఒకరు అన్నారు. అది తప్పు. రెండు గడియలు మొ॥ వానియందు కూడా ఆ దోషం వస్తుంది. అరుణోదయం, దశమిశేషంతోకూడి ఉంటే వైష్ణవుడు ఆ రోజు ఉపవసించరాదు. అది ఏకాదశీవ్రతం కాదు. అని గారుడంలో భవిష్యంలో యోగమాత్రం చేతనే నిషేధించారు కనుక (దోషం అని). నారదీయంలో కూడా ఏకాదశికి దశమితో లవమాత్రం వేధవున్నా దాన్ని వదలాలి. సురబిందువుతోకూడిన నిర్మలగంగాజలాన్ని విడిచినట్లు అట్లాగే అని ఉంది. స్కాందమందు కూడా ఇట్లా ఉంది - దశమి, కల, కాష్ఠ మొదలగు విధంగా అల్పంగా ఉన్నా ఏకాదశియందు, ఆ ఏకాదశిని అచరించరాదు. వ్రతం చేయరాదు, అని. మాధవుడు కూడా ఇట్లా అన్నాడు: ఈ కలాదివేధ, అరుణోదయవేధలో, సూర్యోదయవేధలో కూడా సమానమే అని. నిగమమందు కూడా- అన్ని రకముల వేధ ఉపవాసాన్ని దూషిస్తుంది అని చెప్పబడింది.

మూ॥ **సంపృక్తాది భేదములు**- అత ఏవ మాధవేన-అరుణోదయాద్యదండే అల్పదశమీ స్పర్శే సంపృక్తా. కృత్స్న ఘటీయోగే సందిగ్ధా, ముహూర్తవ్యాప్తౌ సంయుక్తా, ఉదయేసంకీర్ణా, - ఇత్యుక్త్వా,

అరుణోదయవేలాయాం దశమీ యది సంగతా

సంపృక్తైకాదశీ తాంతుమోహిన్యై దత్తవాన్ ప్రభుః ఇతి గోభిలాద్యుక్తేః, పూర్వోక్త గారుడాదేశ్చ సామాన్యతో విశేషతశ్చారుణోదయ వేధోనిషిద్ధః యత్తు - అష్టమభాగో అరుణోదయః ఇతి హేమాద్రిణోక్తం 'యచ్చమహత్తరా రాత్రీః' ఇతిస్తు తత్పరమతం స్వయమేవ దూషితం. అన్తేప్యుక్తం, వేధ తారతమ్యంచ దోషతారతమ్యాదుప పద్యతే' ఇతి. దోష తారతమ్యంచ ప్రాయశ్చిత్త తారతమ్యా దవగమ్యతే.

అందువల్లనే మాధవుడు, అరుణోదయం మొదటి భాగంలో కొద్ది దశమీ స్పర్శ ఉంటే అది సంపృక్త అని, పూర్తి గడియలలో యోగముంటే సందిగ్ధా అని, ముహూర్తవ్యాప్తి ఉంటే సంయుక్తా అని, ఉదయవ్యాప్తి ఉంటే సంకీర్ణ అని చెప్పి, అరుణోదయవేళయందు దశమితో కూడి ఉంటే, దాన్ని సంపృక్తైకాదశి అని అంటారు, దాన్ని ప్రభువు మోహినికి ఇచ్చాడు అని గోభిలాదుల వచనం

ఉన్నందువల్ల, ముందు చెప్పిన గారుడాదుల వచనంవల్ల సామాన్యంగా కాని, విశేషంగాకాని అరుణోదయవేధనిషిద్ధము. 'అష్టమ భాగము అరుణోదయము' అని హేమాద్రి చెప్పిన మాట, మహత్తర రాత్రి అని చెప్పినమాటకు వర్తిస్తుంది. ఆ మతము (మహత్తరాత్రి) స్వయంగానే దూషితమైంది. చివరగా ఇట్లా చెప్పారు. వేధతారతమ్యాన్ని దోషతారతమ్యంబట్టి, దోషతారతమ్యాన్ని ప్రాయశ్చిత తారతమ్యంబట్టి గ్రహించాలి.

**మూ॥ దశమియుత ఏకాదశికరణంలో ప్రాయశ్చిత్తం—**

తచ్చోక్తం హేమాద్రౌస్మృత్యంతరే.

అజ్ఞానాద్య దివామోహాత్ కుర్వన్నేకాదశీం నరః

దశమీ శేషసం యుక్తాం ప్రాయశ్చిత్తమిదం చరేత్॥

కృచ్ఛ్ర పాదం నరశ్చీర్త్వాగాంచదద్యాత్ సవత్సికాం

సువర్ణ స్యార్ధకందేయం తిలద్రోణ సమన్వితం॥

విధానాంతరం తత్రైవ—

బ్రాహ్మణాన్ భోజయేత్ త్రింశత్ గాంచదద్యాత్ సవత్సకాం

ధరణస్యార్థకం దేయం తిలద్రోణమథాపివా॥ ఇతి, (5 పలములు) అత్ర వేధ తారతమ్యాత్ వ్యవస్థాఇతి హేమాద్రి. 'నిశఃప్రాంతే' ఇత్యపి దోషాధిక్యార్థమేవ. తస్మాచ్చతుర్ఘటికాత్మక ఏవ అరుణోదయ ఇతిసిద్ధం. తేన షట్ పంచాశద్దం డానంతరం దశమీ ప్రవేశే అరుణోదయ వేధ ఉక్తోభవతి. అన్యోఽపితత్రైవ కణ్వేనోక్తః—

ఉదయోపరివిద్ధాతు దశమ్యైకాదశీయది

దానవేభ్యః ప్రీణనార్థం దత్తవాన్ పాకశాసనః॥ ఇతి

స్మృత్యంతరేఽపి—

దశమ్యాః ప్రాంతమాదాయ యదోదేతి దివాకరః

తేనస్పృష్టం హరి దినం దత్తం జం భాసురాయతత్॥ ఇతి తత్ర అరుణోదయ వేధో వైష్ణవ విషయః తద్వాక్యేషు వైష్ణవ గ్రహణాత్.

తత్స్వరూపంతు మాధవీయేస్కాందే—

పరమాపదమాపన్నో హర్షేవాసముపస్థితే

నైకాదశీంత్యజేద్యస్తుయస్య దీక్షాఽస్తి వైష్ణవీ॥

విష్ణ్వర్పితాఖిలాచారః సహివైష్ణవ ఉచ్యతే॥ ఇతి

యద్యపి పిత్రాదే రాగమదీక్షాయాంతన్మాత్రస్య వైష్ణవత్వం, నతుపుత్రాదేః, తథాపి స్వపారంపర్య ప్రసిద్ధమేవ వైష్ణవత్వం, స్మార్తత్వం చ మన్యంతే వృద్ధాః.

తత్వసాగరేభవిష్యే –

యథాశుక్లా తథాకృష్ణా, యథాకృష్ణా తథేతరా
తుల్యేతే మన్యతే యస్తు సవై వైష్ణవ ఉచ్యతె॥

కేచిత్తు దశమ్యాం నవమీ వేధమపి త్యజంతి తత్రమూలం మృగ్యం ఉదయవేధస్తు పరిశేషాత్స్మార్త గోచరం.

తదాహ మాధవః–

అరుణోధయవేదోఽత్రవేధః సూర్యోదయే తథా
ఉక్తాద్వ్యాదశమీవేధౌ వైష్ణవస్మార్తయోః క్రమాత్॥

హేమాద్రియందు స్మృత్యంతర వచనం ఇట్లా చెప్పబడింది - అజ్ఞానం వల్ల లేదా మోహం వల్ల దశమీశేషంతో కూడిన ఏకాదశిని చేసిన నరుడు ఈ ప్రాయశ్చిత్తాన్ని ఆచరించాలి. ఆ నరుడు కృచ్ఛ్రపాద వ్రతాన్ని ఆచరించి, దూడతో కూడిన ఆవును దానం చేయాలి. అర తులం బంగారం దానం చేయాలి, దొ ప్పెడు నువ్వులు కూడా కలిపి అక్కడే మరొక విధి ఉంది. 30 మంది బ్రాహ్మలకు భోజనం పెట్టాలి. దూడతో కలిపి గోదానం చేయాలి. 5 పలముల బంగారం లేదా నువ్వులదొప్పెనా ఇవ్వాలి అని ఇక్కడ వేధ తారతమ్యాన్నను సరించి ప్రాయశ్చిత్త తారతమ్యం అని హేమాద్రి మతం. 'రాత్రిప్రాంతము' అనే మాట కూడా దోషాధిక్యం కొరకే ఉంది. అందువల్ల అరుణోదయం అంటే నాల్గు గడియల కాలమే అని సిద్ధించింది. అందువల్ల 56 ఘడియల తర్వాత దశమి ప్రవేశిస్తే అరుణోదయవేధ చెప్పినట్లైంది. అంత్యవేధ కూడా అక్కడే

కణ్వుడు చెప్పాడు ఇట్లా– ఉదయం తర్వాత దశమి విద్ధ ఏకాదశి ఉంటే రాక్షసుల ప్రీతి కొరకు ఇంద్రుడు దాన్ని ఇచ్చాడు, అని స్మృత్యంతరంలో ఇట్లా ఉంది - దశమి ప్రాంతాన్ని స్వీకరించి సూర్యుడు ఉదయిస్తే, దానితో కూడిన ఏకాదశిని జంభాసురుని కొరకు ఇచ్చాడు అని. ఇక్కడ అరుణోదయ వేధ వైష్ణవుల విషయం. ఆ వాక్యాల్లో వైష్ణవపదాన్ని గ్రహించాడు కనుక వైష్ణవ స్వరూపం మాధవీయంలో స్కాందోక్తిగా ఇట్లా ఉంది: గొప్ప ఆపద

వచ్చినా, గొప్ప ఆనందం కల్గినా, వైష్ణవ దీక్ష ఉన్నవాడు ఏకాదశిని వదల కూడదు. విష్ణువున కర్పించిన సకల ఆచారములు కలవాడే వైష్ణవుడు అని. ఒకవేళ తండ్రి మొదలగువారు ఆగమదీక్ష యందుంటే వారికి మాత్రమే వైష్ణవత్వము. కొడుకు మొదలగువారికి కాదు. ఐనా పెద్దలు, తమ కులపరంపరగా ప్రసిద్ధమైన వైష్ణవత్వాన్ని స్మార్తత్వాన్ని అంగీకరిస్తారు. తత్వసాగరంలో భవిష్యోక్తి ఇట్లా ఉంది. శుక్ల, కృష్ణపక్షాలకు సమానంగా తలచేవారే వైష్ణవులు అని పిలువబడుతారు అని. కొందరు దశమిరోజు, నవమివిద్ధ ఉంటే వదులుతారు. దానికి శాస్త్రాధారము లేదు, వెదకాలి. ఉదయవేధ మాత్రం, పరిశేషాన్ననుసరించి (నిషేధాన్నిబట్టి) స్మార్తపరమైనదే. దానినే మాధవుడు ఇట్లా అన్నాడు: అరుణోదయ వేధ, సూర్యోదయ వేధ- ఈ రెండు దశమీవేధలు క్రమంగా వైష్ణవ స్మార్తులకు వర్తిస్తాయి అని.

మూ॥ దశమీవేధ:

హేమాద్రిస్తుకేషాంచిదర్ధరాత్రేఽపి దశమీవేధమాహ

అర్ధరాత్రేతుకేషాంచిత్ దశమ్యావేధఉచ్యతే

కపాలవేధఇత్యాహుః ఆచార్యాయేహరి ప్రియాః॥ నతన్మమ మతం, యస్మాత్ త్రియామా రాత్రిరిష్యతే, ఇతిబ్రహ్మవైవర్తాత్, అస్యార్థః 'అనద్యతనే లఙ్' ఇత్యత్ర అతీతాయాః రాత్రేః పశ్చిమ యామద్వయ మాగామిన్యాః రాత్రేః పూర్వయా మద్వయం దివసశ్చసకలః ఏషోఽద్యతనః కాలః ఇత్యుక్తం మహాభాష్యే. సఏష వర్తమానః కాలః ఏకాదశ్యహోరాత్ర ఉపోష్యః. తన్మధ్యే దశమీ ప్రవేశే విద్ధా సాత్యాజ్యా అత ఏవ హేమాద్రౌ—

దశమ్యాః సంగదోషేణ అర్ధరాత్రాత్ పరేణతు

వర్జయే చ్చతురోయామాన్ సంకల్పార్చనయోః సదా॥ ఇతిదోష ఉక్తః. చతురోయామాన్ దివస స్యేత్యర్థః. స్వమతేతు రాత్రేః త్రియామత్వాత్ ప్రహరత్రయం పూర్వశేషః. తేన చతుర్థ ప్రహర ఏవ వేధోయుక్తః. సోఽప్యరుణోదయ ఏవ. సూర్యోదయం వినానైవ స్నానదానాదికః క్రమః ఇతి మార్కండేయ పురాణాత్ ప్రత్యూషోఽహర్ముఖం కల్యం. ఇతి కోశాదరుణోదయమారభ్య సూర్యాంశ ప్రవృత్తేః తత్రైవ నిషేధః. తేనమత భేదాత్ వ్యవస్థేతి కేచిత్. కైముతికన్యాయేన అరుణోదయవేధ స్యైవేయం స్తుతిరితితు మాధవః. యస్తుదిక్ ఫంచదశభిస్తథా। ఇతి వేధః, సఉపవాసాతిరిక్త విషయ ఇతి మాధవః.

"కొందరు అర్ధరాత్రమందు దశమి వేధ చెప్పారు. హరిప్రియులైన వారు దాన్ని కపాల వేధ అని అన్నారు అది నా మతం కాదు. ఎందువల్లనంటే, రాత్రి అంటే మూడుజాములు కలది అనే నా అభిప్రాయం'' అని బ్రహ్మ వైవర్త మతాన్ని హేమాద్రి దశమి వేధ యందు ఉట్టంకించాడు. దీని అర్థమేమంటే - 'అనద్యత నేఙ్ అనుచోట అద్యతన శబ్దానికి మహాభాష్యకారులు ఇట్లు అర్థం చెప్పారు: గడచిన రాత్రియొక్క చివరి రెండు జాములు రాబోయే రాత్రియొక్క మొదటి రెండు యామములు, పగలు ఇదంతా కలిపి అద్యతనకాలము అని, అదే వర్తమానకాలము, ఏకాదశిన ఆ అహోరాత్రములందు ఉపవసించాలి. దానిమధ్య దశమి ప్రవేశిస్తే ఆ ఏకాదశి విద్ధ, దానిని వదలాలి. అందువల్లనే హేమాద్రి ఇట్లా అన్నాడు - అర్ధరాత్రి తర్వాత దశమీ సంగదోషం ఉంటే సంకల్ప అర్చనలకై నాల్గు గడియలను వదలాలి (ఆచరించరాదు) అని దోషం చెప్పాడు. ఆ నాల్గు గడియలు దివస సంబంధమైనవి. మా మతంలో అయితే రాత్రి 3 జాములకాలము, 3 జాములు పూర్వదిన శేషము. అందువల్ల నాల్గవ ప్రహర లోనే వేధయుక్తము. అది కూడా అరుణోదయమందే. సూర్యోదయం జరగ కుండా స్నానదానాదిక్రమము లేదు అని మార్కండేయ పురాణ వచనం. 'ప్రత్యూషమనగా అహస్సుయొక్క ముఖభాగము కల్యము' అని నిఘంటువాక్యా న్ననుసరించి, అరుణోదం నుండే సూర్యకిరణ ప్రసారం జరుగుతుంది. ఆ కాల మందే నిషేధము. దీనివల్ల మతభేదాలు ఏర్పడి వ్యవస్థా భేదము కూడా అని కొందరు. మాధవుని అభిప్రాయం ఇట్లా ఉంది—కైముతిక న్యాయాన్ననుసరించి, ఇది అరుణోదయ వేధస్తుతి పరకమే అని. 10 మరియు 15 ఘడియలకు వేధ అని చెప్పింది ఉపవాన, అతిరిక్త విషయకము అని మాధవుని వచనం.

మూ॥ సర్వప్రకారవేధోఽయము పవాసస్య దూషకః,
సార్ధసప్త ముహూర్త స్తుయోగోఽయం బాధ తేవ్రతం॥ ఇతి నిగ మాదిత్యలం.

ఈ అన్నిరకముల వేధ ఉపవాసాన్ని దూషిస్తుంది $7\frac{1}{2}$ ముహూర్తముల కాలం ఈ యోగము వ్రతాన్ని బాధిస్తుంది అని (వేధ) నియమము. ఇక ఈ విషయం చాలు.

మూ॥ తత్ర మాధవమతే వైష్ణవైరరుణోదయ విద్ధాత్యాజ్యాయదాతు ఏకాదశ్యేవ శుద్ధా సతీవర్ధతే, ద్వాదశీవా ఉభయంవా తదా పరోపోష్యా.

ఏకాదశీ ద్వాదశీవా అధికాచేత్ త్యజ్యతాం దినం

పూర్వం గ్రాహ్యం తూత్తరం స్యాత్ ఇతివైష్ణవ నిర్ణయః॥ ఇతి మాధవోక్తేః. స్మార్తైస్తు సూర్యోదయ విద్ధాత్యాజ్యా యదాత్వేకాదశీ శుద్ధా సతీవర్ధతే, ద్వాదశీ - చ సమాన్యా నావా తదా గృహస్థైః పూర్వా యతి భిరుత్తరా కార్యా.

ప్రథమేఽహని సంపూర్ణా వ్యాప్యాహోరాత్రసంయుతా
ద్వాదశ్యాంచ తథాతాత దృశ్యతే పునరేవచ॥

పూర్వాకార్యా గృహస్థైశ్చ యతిభిశ్చోత్తరావిభో, ఇతి స్కాందోక్తేః వర్ధమానోఽప్యేవమాహ -

ఉభయవృద్ధౌతు శుద్ధావిద్ధావా సర్వేషాంపరైవ
సంపూర్ణైకాదశీయత్ర ప్రభాతే పునరేవసా
సర్వైరేవోత్తరాకార్యాపరతో ద్వాదశీ యది॥ ఇతినారదోక్తేః.
ద్వాదశీ మాత్రవృద్ధౌతు శుద్ధాయాం పూర్వైవ
న చేదేకాదశీ విష్ణోః ద్వాదశీ పరతః స్థితా
ఉపోష్యైకాదశీ తత్ర యదీచ్ఛేత్ పరమం పదం॥ ఇతినారదోక్తేః.
ద్వాదశీ మాత్ర వృద్ధౌతు శుద్ధావిద్ధే వ్యవస్థితే
శుద్ధా పూర్వోత్తరావిద్ధా స్మార్త నిర్ణయ ఈదృశః॥ ఇతి మాధవోక్తేశ్చ
మదనరత్నేఽప్యేవం:
విద్ధాఽప్య విద్ధావిజ్ఞేయా పరతోద్వాదశీనచేత్
అవిద్ధాఽపిచ విద్ధాస్యాత్పరతో ద్వాదశీయవి॥ ఇతి హేమాద్రౌ పద్మపురాణవచనం, తదేకాదశ్యాః వృద్ధౌ జ్ఞేయం. తదుక్తం మాధవేన.

ఏకాదశీ ద్వాదశీ చేత్యుభయం వర్ధతే యదా
తదా పూర్వదినం త్యాజ్యం స్మార్తైర్గ్రాహ్యం పరందినం. ఇతి - విద్ధైకాదశ్యాం ద్వాదశీ మాత్ర వృద్ధౌచ సర్వేషాం పరైవ. తత్ర చైకాదశీ మాత్ర వృద్ధౌ గృహిణః పూర్వా, యతేరుత్తరా. పూర్వోక్త పాద్మోక్తేః.

మాధవమతంలో, వైష్ణవులు అరుణోదయ విద్ధను ఆచరించరాదు. ఒక వేళ ఏకాదశి శుద్ధమై వృద్ధి చెందితే, ద్వాదశి వృద్ధి చెందితే, లేదా రెండూ వృద్ధి చెందితే అప్పుడు పరంలో ఉపవసించాలి. ఏకాదశి, లేదా, ద్వాదశి అధికంగా ఉంటే ఆ రోజును వదలి, ఉత్తర దినాన్ని గ్రహించాలి అని వైష్ణవ నిర్ణయమని, మాధవ, వచనము. స్మార్తులైతే సూర్యోదయ విద్ధను వదలాలి. ఒకవేళ ఏకాదశి, శుద్ధమై వృద్ధి చెందితే, ద్వాదశి కూడా దానితో సమానంగా లేదా తక్కువగా ఉంటే గృహస్థులు అప్పుడు పూర్వదినముందే ఆచరించాలి, యతులు ఉత్తర దినంలో ఆచరించాలి స్కాందంలో ఇలా ఉంది - మొదటిరోజు, అహోరాత్ర వ్యాపియై సంపూర్ణంగా ఏకాదశి ఉంటే, ద్వాదశిరోజున మళ్ళీ ఏకాదశి ఉంటే గృహస్థులు పూర్వదినం ఆచరించాలి. యతులు ఉత్తరదినంలో ఆచరించాలి అని. వర్ధమానుడు కూడా ఇట్లాగే చెప్పాడు: శుద్ధకాని విద్ధకాని ఏకాదశి ఉభయవృద్ధి యందు పరమే ఆచరించాలి అందరూను. ఎక్కడైతే సంపూర్ణ ఏకాదశి ఉండి, తిరిగి ఉదయమందు అదే ఉంటే, అందరూ పరదినమందు ఆచరించాలి, పరదిన మందు ద్వాదశి ఉన్న పక్షంలో అని నారదవచనము. ద్వాదశి మాత్రమే వృద్ధి చెందే పక్షంలో శుద్ధమైన పూర్వదినము గ్రహించాలి. ద్వాదశి పరంగా ఉన్న ఏకాదశియందు, పరమపదం కోరేవారు విష్ణు ఏకాదశిగా ఉపవసించరాదు అని కూడా నారదవచనం. ద్వాదశి మాత్రం వృద్ధి చెందేట్టయితే శుద్ధ విద్ధలు విడిగా ఉంటే శుద్ధకు పూర్వమందు, విద్ధను ఉత్తరమందు ఆచరించాలి. ఇది స్మార్త నిర్ణయము అని మాధవ వచనము. మదనరత్నంలో కూడా ఇట్లాగే ఉంది. హేమాద్రి యందు పద్మ పురాణవచనం ఇట్లా ఉంది - పరమందు ద్వాదశి లేని పక్షంలో విద్ధకూడా అవిద్ధ అని గ్రహించాలి. పరమందు ద్వాదశి ఉన్నపక్షంలో అవిద్ధకూడా విద్ధ అని గ్రహించాలి అని. ఇది ఏకాదశి వృద్ధి యందు అని గ్రహించాలి. (అందువల్ల స్మార్తులు అవిద్ధ ఏకాదశిని వదలకూడదు.) దానిని మాధవుడు ఇట్లా చెప్పాడు - ఏకాదశి, ద్వాదశి - ఈ రెండు వృద్ధి చెందే పక్షంలో స్మార్తులు పూర్వదినాన్ని వదలాలి, పరదినాన్ని గ్రహించాలి. అని. విద్ధ ఏకాదశియందు, ద్వాదశి మాత్రం వృద్ధి చెందే పక్షంలోను అందరూ పరదినాన్నే గ్రహించాలి. అక్కడ ఏకాదశి మాత్రం వృద్ధి చెందే పక్షంలో గృహస్థులు పూర్వదినాన్ని, యతులు ఉత్తర దినాన్ని గ్రహించాలి. ముందు చెప్పిన పద్మ పురాణవచనం ప్రకారం—

మూ॥ ఏకాదశీవివృ ద్ధావేచ్ఛుక్లే కృష్ణే విశేషతః
ఉత్తరాం తుయతిం కుర్యాత్ పూర్వాముపవసేత్ గృహీ॥ ఇతి ప్రచేత సోక్తేః ఏతచ్ఛుద్ధా విద్ధాతుల్యా మితి మాధవః.

త్రయో దశ్యాం నలభ్యేత ద్వాదశీయది కించన
ఉపోష్యై కాదశీ తత్ర దశమీ మిశ్రితాఽపిచ॥ ఇతి స్కాందాత్.
అవిద్ధాని నిషిద్ధైశ్చ నలభ్యంతే దినానితు
ముహూర్తైః పంచభిర్విద్ధా గ్రాహ్యా వైకాదశీ తిథిః॥ ఇతి ఋష్యశృంగోక్తేశ్చ. ముహూర్త పంచ మరుణోదయ మారభ్యజ్ఞేయం. అన్యథోత్తరేఽహ్ని ఏకాదశ్యా భావా సంభవాత్ తథాచ సఏవ

సర్వత్రైకాదశీ కార్యా ద్వాదశీ మిశ్రితానరైః
ప్రాతర్భవతు వామాభూద్యస్మాన్నిత్య ముపోషణం॥ ఇతి యదపి హేమాద్రిణా, "శుద్ధ సమా, శుద్ధ 'న్యూ' నావా అధిక ద్వాదశికాచేత్ సర్వేషాం పరైవ" ఇత్యుక్తం తదపి వైష్ణవ విషయం స్మార్తానాంతు పూర్వై వేత్య విరోధః.

శుక్ల పక్షంలో, విశేషించి కృష్ణపక్షంలో ఏకాదశి వృద్ధి చెందితే, యతి ఉత్తర దినం ఆచరించాలి. గృహస్థు పూర్వదినమందు ఉపవసించాలి అని ప్రచేత సోక్తి. ఇది శుద్ధా, విద్ధతుల్యమని మాధవుని వచనం. త్రయోదశి రోజు, ద్వాదశి కించిత్తుకూడా లేని పక్షంలో, దశమితో కూడిన ఏకాదశిలోకూడా ఉపవసించాలి అని స్కాందోక్తి. నిషిద్ధము(లతో విద్ధంకాని) లేని రోజులు లభించవు. కనుక ఐదు ముహూర్తముల కాలంతో విద్ధయైన ఏకాదశి తిథిని గ్రహించాల్సిందే అని ఋష్యశృంగోక్తి. ఐదు ముహూర్తముల కాలము, అరుణోదయం నుంచి అని తెలుసుకోవాలి. లేని పక్షంలో, తరువాతి రోజు ఏకాదశి అభావం అనేది సంభవించదు. అందువల్ల అతడే ఇట్లా అంటాడు - ద్వాదశి మిశ్రితమైన ఏకాదశిని అంతట ఆచరించాలి, ప్రొద్దుటి పూట ఉండనీ, ఉండకపోనీ. ఎందువల్ల అంటే ఉపవాసం నిత్యం అని. శుద్ధంతో సమానంగా లేదా శుద్ధం కంటే తక్కువగానైనా అధిక ద్వాదశి గల ఏకాదశి ఉంటే, అందరి మతంలో పరదినమే అని హేమాద్రి చెప్పినా అదికూడా వైష్ణవ విషయమే. స్మార్తులకు మాత్రం పూర్వ దినమే. ఇందులో ఎవరికి విరుద్ధ భావం లేదు.

మూ॥ **అష్టాదశ ఏకాదశీ భేదాః** హేమాద్రిమతే తూచ్యతే తత్ర -
శుద్ధా విద్ధాద్వయీనందా, త్రేదాన్యూనసమాధికైః (ఏకాదశి)
షట్ ప్రకారా పునస్త్రేధా ద్వాదశ్యూన సమాధికై॥ **ఇత్యష్టాదశైకాదశీ భేదాః**

ఏకాదశి, శుద్ధ, విద్ధ అని రెండు విధాలు. అది తిరిగి ఒక్కొక్కటి న్యూనసమ, అధిక భేదంవల్ల (శుద్ధ 3 విద్ధ 3) ఆరు రకాలు. ఈ ఆరు, ఒక్కొక్కటి ద్వాదశి ఊన సమ, అధిక భేదాలవల్ల 3 రకాలై (6 × 3) పద్దెనిమిది రకాలౌతుంది.

1) ఏకాదశి, ద్వాదశి రెండు న్యూనము (సర్వే)
2) ఏకాదశి న్యూనం, ద్వాదశి సమం
3) ఏకాదశి న్యూనం, ద్వాదశి అధికం
4) ఏకాదశి సమం ద్వాదశి న్యూనం (సర్వే)
5) ఏకాదశి సమం ద్వాదశి సమం
6) ఏకాదశి సమం ద్వాదశి అధికం (వైష్ణ - ద్వాదశి స్మార్త - ఏకా.)
7) ఏకాదశి అధికం ద్వాదశి న్యూనం (వైష్ణ - ద్వాద)
8) ఏకాదశి అధికం ద్వాదశి సమం
9) ఏకాదశి అధికం ద్వాదశి అధికం (సర్వే ఏకాద).

ఈ రకంగా వైష్ణవులకు అరుణోదయమందు శుద్ధ ఏకాదశి 9 విధాలు.

1) ఏకాదశి న్యూనం ద్వాదశి న్యూనం
2) ఏకాదశి న్యూనం ద్వాదశి సమం
3) ఏకాదశి నూన్యం ద్వాదశి అధికం (సర్వే-ద్వాద)
4) ఏకాదశి సమం ద్వాదశి న్యూనం (వై-ద్వా)
5) ఏకాదశి సమం ద్వాదశి సమం
6) ఏకాదశి సమం ద్వాదశి అధికం వై-ద్వా
7) ఏకాదశి అధికం ద్వాదశి న్యూనం స్మార్త-ఏకా; (వైష్ణ-ద్వాద)
8) ఏకాదశి అధికం ద్వాదశి సమం
9) ఏకాదశి అధికం ద్వాదశి అధికం (సర్వే-ఏకా)

ఈ రకంగా వైష్ణవులకు అరుణోదయ మందు దశమి విద్ధ ఏకాదశి తిథి 9 రకాలు.

మూ॥ తత్ర శుద్ధా అధికా న్యూన ద్వాదశిక, శుద్ధా అధికా సమ ద్వాదశికా చ సకామైః పూర్వా నిష్కామైరుత్తరా కార్యా "ప్రథమేఽహని సంపూర్ణా" ఇతి పూర్వోక్త స్కాందాత్. ఈన ద్వాదశి కాయాంతు విష్ణుప్రీతికామైః ఉపవాస ద్వయంకార్యం.

సంపూర్ణైకాదశీ యత్రప్రభాతే పునరేవసా

లుప్యతే ద్వాదశీ తస్మిన్నుపవాసః కథం భవేత్॥

ఉపోష్యేద్వేతిథీతత్ర విష్ణుప్రీణన తత్పరైః॥ ఇతివృద్ధ వసిష్ఠోక్తేః.

వానిలో శుద్ధ అధికం, ద్వాదశిన్యూనం, శుద్ధ అధికం, ద్వాదశి సమం. ఈ రెంటిని సకాములు పూర్వదినమందు, నిష్కాములు ఉత్తర దినమందు ఆచరించాలి. 'మొదటిరోజు సంపూర్ణము' అనిన పూర్వస్కాందోక్త వచన ప్రకారం. ఈనద్వాదశియందు విష్ణుప్రీతికాములు ఉపవాసద్వయం ఆచరించాలి. (ఇద్దరు గృహీ, యతి ఉపవసించాలి). వృద్ధవసిష్ఠుడు ఇట్లా అంటాడు: సంపూర్ణైకాదశి ప్రాతఃకాలమందు తిరిగి ఏకాదశి. అప్పుడు ద్వాదశి లోపిస్తే ఉపవాసం ఎట్లా చేయాలి అంటే విష్ణు ప్రీతియందు ఆసక్తి కలవారు అక్కడ రెండు తిథుల్లోనూ ఉపవసించాలి అని వృద్ధవసిష్ఠోక్తి.

మూ॥ శుద్ధాన్యూనా, శుద్ధాధికా శుద్ధాసమా, విద్ధన్యూనా, విద్ధసమా వాఽధిక ద్వాదశికాచేత్ సర్వేషాంపరైవేతి హేమాద్రిః. మదనరత్నేతు శుద్ధాధికాపరా. "సంపూర్ణైకాదశీయత్ర" ఇతిపూర్వోక్తేః. అన్యాపూర్వా

శుద్ధాయదా సమాహీనా సమాహీనాఽధికోత్తరా

ఏకాదశీ ముపవసేన్న శుద్ధాం వైష్ణవీమపి॥ ఇతి స్కాందాత్.

శుద్ధా- ఏకాదశీ, ఉత్తరా-ద్వాదశీ "నచేదేకాదశీ విష్ణోః" ఇతి నారదోక్తేశ్చ. యత్తు - 'అవిద్ధాఽపిచ విద్ధాస్యాత్' ఇతి పాద్మం తచ్ఛుద్ధాధికాపరం. యత్తు-

సంపూర్ణైకాదశీ త్యాజ్యాపరతో ద్వాదశీ యది

ఉపోష్యా, ద్వాదశీ శుద్ధా ద్వాదశ్యా మేవ పారణం,

ఇత్యాది తద్వైష్ణవపరం. స్మార్తానాంతు పూర్వైవేత్యుక్తం. విద్ధన్యూనా సమద్వాదశికాతు ముముక్షూణాం పుత్రవతాంచపరా. అన్యేషాం పూర్వా. పుత్రవతోఽపి పూర్వేతి మదనరత్నే. విద్ధన్యూనా న్యూనద్వాదశికాచ సైవ సర్వైః కార్యేతి హేమాద్రిః. ముముక్షూణాం వరాఽన్యేషాం పూర్వేతి మదనరత్నే.

శుద్ధ (ఏకాదశి) న్యూనం, సమం, అధికం-అట్లాగే విద్ధ ఏకాదశి న్యూనం, సమం. వీటన్నిటిలో అధిక ద్వాదశి ఉంటే అందరికి లేదా అన్నింటికి పరమైందే ఆచరించాలి అని హేమాద్రి వచనం. మదనరత్నంలో ఇట్లా ఉంది - శుద్ధ అధిక మైతే పరం ఆచరించాలి. 'సంపూర్ణ ఏకాదశి ఉన్నచోట' అని ముందు చెప్పాం కదా? శుద్ధన్యూన, సమాలు అధిక ద్వాదశిక మైతే పూర్వం ఆచరించాలి. శుద్ధ సమ, న్యూనాలు ద్వాదశి సమ, హీన, అధికాలు ఉన్న పక్షంలో ఏకాదశియందే ఉపవసించాలి- వైష్ణవీయమైనా (ద్వాదశిలో కాదు) అని స్కాందోక్తి. శుద్ధ= ఏకాదశి, ఉత్తర=ద్వాదశి "ఏకాదశి లేనిపక్షంలో" అని ఇంతకుముందే చెప్పిన నారదోక్తి ఉంది. "అవిద్ధ కూడా విద్ధ ఔతుంది" అని చెప్పిన పద్మపురాణ వచనం శుద్ధ అధిక విషయకము. పరంలో ద్వాదశి ఉంటే సంపూర్ణైకాదశిని వదలాలి. శుద్ధ ద్వాదశియందే ఉపవసించి, ద్వాదశినాడే పారణ చేయాలి అని మొదలుగా అన్నారో అది వైష్ణవపరము. స్మార్తులకైతే పూర్వమే అని చెప్పాము. విద్ధన్యూన సమద్వాదశిక ఐతే ముముక్షులకు, పుత్రవంతులకు పరమందే (పుత్రవత్ భిన్నగృహిణాం, ఇతరులకు పూర్వమందు. పుత్రవంతులకు గూడా పూర్వమందే అని మదనరత్నం. విద్ధన్యూన, న్యూన ద్వాదశిక అందరు ఆ రోజే చేయాలి అని హేమాద్రి. ముముక్షులకు పరమైంది, ఇతరులకు పూర్వముది అని మదనరత్నంలో ఉంది.

మూ॥ విద్ధసమా, సమద్వాదశి కోసద్వాదశికాచ ముముక్షుభిః పరా అన్యైః పూర్వాకార్యా. దశమీమిశ్రితా పూర్వాద్వాదశీ యదిలుప్యతే.

శుద్ధైవ ద్వాదశీ రాజన్ ఉపోష్యా మోక్షకాంక్షిభిః॥ ఇతి వ్యాసోక్తేః. మోక్షకాంక్షి గ్రహణాదన్యేషాంపూర్వైవ.

సర్వత్రైకాదశీ కార్యా ద్వాదశీమిశ్రితానరైః
ప్రాతర్భవతు వామావా యతోనిత్యము పోషణం॥ ఇతి

పాద్మోక్తేః-విద్ధాధికాసమ ద్వాదశికా సర్వేషాం పూర్వైవ.

పారణా హేనలభ్యేత ద్వాదశీకల యాపిచేత్
తదానీందశమీ విద్ధాఽప్యుపోష్యైకాదశీ తిథిః॥ ఇతి ఋష్యశృంగోక్తేశ్చ. మాధవమతేతు అత్రగృహిణాం పూర్వా, యతేరుత్తరా. విద్ధాధికా న్యూన ద్వాదశికా మోక్షపాపక్షయ విష్ణుప్రీతికామైః పరాకార్యా. గృహస్థేనతు నక్తం కార్యం.

ఏకాదశీ ద్వాదశీచ రాత్రిశేషే త్రయోదశీ
ఉపవాసం నకుర్వీత పుత్రపౌత్ర సమన్వితః॥ ఇతి కౌర్మే దినక్షయే ఉపవాస నిషేధాత్.

దశమ్యైకాదశీవిద్ధా ద్వాదశీచక్షయంగతా
క్షీణాసాద్వాదశీజ్ఞేయా నక్తంతుగృహిణఃస్మృతం॥ ఇతి వృద్ధగాతా తపోక్తేశ్చ గృహిణః పూర్వత్రోపవాసః

విద్ధసమ, సమద్వాదశీక ఊనద్వాశీకలలో ముముక్షులు పరమందు ఉపవసించాలి. ఇతరులు పూర్వమం దాచరించాలి. ద్వాదశిలోపించిన పక్షంలో దశమి మిశ్రిత (ఏకాదశి) యందు పూర్వమందు ఉపవసించాలి. మోక్షకాంక్షగల వారు శుద్ధద్వాదశియందు (పరమందు) ఉపవసిందాలి అని వ్యాసోక్తి. మోక్షకాంక్షి అన్నందువల్ల ఇతరులు పూర్వమందే అచరిందాలి. అంతటా నరులు ద్వాదశి మిశ్రిత ఏకాదశిని ఆచరించాలి. ఎందువల్లనంటే,ఉదయానికి ఉండనీ ఉండకపోనీ ఆరోజు ఉపవాసము నిత్యం కనుక అని పద్మపురాణోక్తి. విద్ధ అధిక సమ ద్వాదశీక అందరికి పూర్వమందే. పారణరోజు ద్వాదశి కలామాత్రం కూడా లేని పక్షంలో, అప్పుడు దశమివిద్ధయైన ఏకాదశి తిథియందు ఉపవసించాలి అని ఋష్యశృంగోక్తి మాధవమతమంద్రైతే ఇక్కడ గృహస్థులు పూర్వమందు, యతులుపరమందు ఉపవసించాలి అని. విద్ధ అధికన్యూనద్వాదశీకను, మోక్ష, పాపక్షయ, విష్ణుప్రీతికాములు పరమందే అచరిందాలి. గృహస్థుడు నక్తం ఆచరించాలి. ఏకాదశి, ద్వాదశి ఉండి రాత్రి శేషమందు త్రయోదశి కూడా ఉంటే పుత్రపౌత్రులతోకూడి, ఆరోజు ఉపవసించరాదు అని కూర్మ పురాణమందు, దినక్షయమందు ఉపవాసం నిషేధించారు. దశమి, ఏకాదశితో విద్ధమై, ద్వాదశి లోపించినట్లైతే ఆ ద్వాదశిని క్షీణ అని గ్రహించాలి. అక్కడ గృహస్థు నక్తం ఆచరించాలి అని వృద్ధగాతా తపోక్తి కూడా. గృహస్థులు పూర్వమందు ఉపవసించాలి.

మూ॥ ఏకాదశ్యాః శుద్ధన్యూనత్వే, శుద్ధసమత్వేవా ద్వాదశ్యాఃన్యూన సమత్వయోః ఏకాదశ్యాముపవాసః యానితు—

దశమ్యనుగతాహన్తి ద్వాదశం ద్వాదశీఫలం
ధర్మాపత్య ధనాయూంషి త్రయోదశ్యాంతు పారణం॥ ఇతి కౌర్మాదీని దశమీవేధ త్రయోదశీ పారణయోః నిషేధకాని తానివిహిత భిన్నపరాణి. అత్ర

మూల వచనానితద్వ్యవస్థాచ ఆకరేజ్ఞేయా యత్తుకాలహేమాద్రౌ -

బహువాక్య విరోధేన సందేహో జాయతేయదా/

ద్వాదశీతుతదాగ్రాహ్యా త్రయోదశ్యాంతు పారణం,

ఇతి మార్కండేయోక్తేః సందిగ్ధేషుచ వాక్యేషు ద్వాదశీంసముపోషయేత్. తథా - వివాదేషుచ సర్వేషు ద్వాదశ్యాం సముపోషణం

పారణంచ త్రయోదశ్యాం ఆజ్ఞేయం మామకీమునే॥ ఇతి పాద్మోక్తేశ్చ వేధసందేహో, జ్యోతిర్విదాంవి ప్రతిపత్తౌ వావదాకార్యేత్యుక్తం తద్వైష్ణవ విషయ మిత్యలంబహునా.

ఏకాదశి(శుద్ధ) న్యూన, సమత్వములు ద్వాదశిన్యూన, సమత్వములు (రెండు) వీటియందు ఏకాదశియందే ఉపవాసము. దశమితోకూడిన ఏకాదశి, త్రయోదశియందు పారణము 12 ద్వాదశీ ఫలితములను నశింపచేస్తుంది. ధర్మ, అపత్య, ధన, ఆయుస్సులను కూడా హరింపచేస్తుంది అని కూర్మ పురాణంలోని దశమివేధ, త్రయోదశిపారణకు చెందిన నిషేధవాక్యాలున్నాయో అవి, విహిత మైన వచనములకన్న భిన్నవచనములు ఇక్కడ మూల వచనాలు వాని వ్యవస్థ ఆకరమందు తెలుసుకోవాలి. కాలహేమాద్రియందు 'మార్కండేయ వచనం'గా ఏది అన్నారో - అనేక విరుద్ధ వాక్యములవల్ల సందేహం కల్గినప్పుడు ద్వాదశిని గ్రహించాలి, త్రయోదశియందు పారణ చేయాలి అని అన్నారో వాక్యములు సందిగ్ధంగా ఉంటే ద్వాదశియందు ఉపవసించాలి అని అన్నారో అట్లాగే - వివాదాలన్నింటిలోను ద్వాదశియందు ఉపవసించి, త్రయోదశియందు పారణ చేయాలి, ఇది నాయొక్క ఆజ్ఞ అని పాద్మ (పురాణ) వచనము ఉంది కనుక వేధ సందేహమందు, జ్యోతిర్వేత్తలకు వైరుద్ధ్యం ఏర్పడితే పరము ఆచరించాలి అని అన్నారో ఇవన్నీ వైష్ణవ విషయకములు. ఇది ఇంక చాలు.

మూ॥ అథఅత్రకించి దుపయుక్తం కించిదుచ్యతే తత్రదశమ్యామేకాదశీ యోగే, దశమీమధ్యేఏవ భోజనం కార్యం "ఏకాదశ్యాంన భుంజీత" ఇతితస్యా ఏవనిమిత్తత్వాత్ నిషేధస్తు నివృత్త్యాత్మా కాలమాత్రమపేక్షతే, ఇతిదేవలోక్తేశ్చ. కేచిత్తు ఏకాదశీ వ్రతాంగత్వేన పూర్వేద్యురేకభక్త విధానాద్విధి స్పృష్టేచ నిషేధా నవకాశాన్న కామ్యవ్రతాంగే భోజన నిషేధః ప్రవర్తతే. తేనైకాదశీమధ్యేఽపి పూర్వ దినే భోజన మిత్యాహుః.

ఇక్కడ ఉపయుక్తమైన దాన్ని కొంచెం చెప్తున్నాము. 'దశమియందు ఏకాదశి యోగం సంభవిస్తే, దశమి మధ్యలోనే భోజనం చేయాలి, ఏకాదశి

యందు భోం చేయరాదు' అనేది అందుకోసమే ఏర్పడింది కాబట్టి (ద్వితీయ భోజన నివృత్తి, పూర్తి భోజన నివృత్తి కాదు). నిషేధము నివృత్తి పరమైంది, కాల మాత్రాన్ని అపేక్షిస్తుంది అని దేవలోక్తి కూడా కొందరు ఇట్లా అన్నారు- ఏకాదశీవ్రతాంగముగా ముందు రోజు ఏకభక్తం విధించినందువల్ల, విధి స్పర్శయందు నిషేధానికి అవకాశం లేనందువల్ల, కామ్యవ్రతాంగమందు భోజన నిషేధం ప్రవర్తించదు. అందువల్ల ఏకాదశి మధ్యలో కూడా పూర్వదిన మందు భోజనం చేయొచ్చును అని.

మూ॥ **అధికారి విచారము** అత్రాధికారీ మాధవీయే కాత్యాయనే నోక్తః
అష్టవర్షాధికో మర్త్యోహ్యశీతి న్యూన వత్సరః
ఏకాదశ్యాముపవసే త్పక్షయోరుభయోరపి॥ ఇతి.
భవిష్యే - బ్రహ్మచారీచనారీచ శుక్లామేవసదాగృహీ॥ ఇతి.
యత్తువిష్ణుః - పత్యౌజీవతియానారీ ఉపోష్య వ్రతమాచరేత్
ఆయుష్యం హరతే భర్తుర్నరకం చైవ గచ్ఛతి॥ ఇతి తద్భర్త్రననుజ్ఞా విషయమితి ప్రాగుక్తం.

ఇక్కడ (ఉపవాసంలో) అధికారి గూర్చి మాధవీయమందు కాత్యాయనోక్తి ఇట్లా ఉంది: 8 సంవత్సరాలకు పైబడి, 80 సంవత్సరాలకు తక్కువగా వయస్సు కలిగిన వ్యక్తులు ఉభయ పక్షములలోని ఏకాదశియందు ఉపవసించాలి అని-భవిష్య పురాణమందు - బ్రహ్మచారి, విధవ స్త్రీ, గృహస్థుడు వీరు ఎప్పుడూ శుక్లపక్షమందే ఉపవసించాలి అని ఉంది.

విష్ణువు - భర్త బ్రతికి ఉండగా ఉపవసించి వ్రత మాచరించే స్త్రీ భర్త ఆయుష్యాన్ని హరిస్తోంది. నరకానికి కూడా పోతుంది అని అన్నాడో అది భర్త అనుజ్ఞ లేకుండా చేసే స్త్రీ విషయము అని ముందే చెప్పాము.

మూ॥ **ఉపవాసాసామర్థ్యేతు** మార్కండేయ కౌర్మయోః-
ఏకభక్తేన నక్తేన తథైవాయాచితేన చ
ఉపవాసేన దానేన, ననిర్ద్వాదశికో భవేత్॥

అత్ర, ఏకభక్తేన, యోమర్త్యః ఉపవాస వ్రతంచరేత్, ఇత్యేక భక్తాది మూపవాస శబ్దస్తద్ధర్మాతిదేశార్థః. తేన తత్ప్రయుక్తాః సర్వేధర్మాః తత్స్థానాపన్నేఽపి భవంతి. సంకల్పమంత్రే చైక భక్తాది పదేనోహః కార్య ఇతిమదన రత్నే. తథాఽసామర్థ్యే ప్రతినిధినాకారయే దితి ప్రాగుక్తం.

ఉపవాసం చేయటానికి శక్తి లేని పక్షంలో మార్కండేయ, కూర్మపురాణ వచనాలు ఇట్లా ఉన్నాయి (నక్తం=హవిష్యాన్నము) నక్తంతో పగలు ఒకపూట భోజనము, అయాచితాన్నము, ఉపవాసము, దానము వీనితో ఏకాదశీవ్రతం ఔతుంది అని. ఇక్కడ - ఏక భక్తంతో ఉపవసించే మనిషి అని ఏక భక్తాదు లందు ఉపవాస శబ్దం ఉపయోగించారో. అది ఉపవాస ధర్మాల అతిదేశం(ఆరోపణ) కొరకు. అందువల్ల ఉపవాసం దాన్ననుసరించి వచ్చే అన్ని ధర్మాలు దాని స్థానంలో వచ్చిన దాని యందూ వస్తాయి. సంకల్ప మంత్ర మందు ఏకభక్తాది పదంతో ఊహించుకోవాలి అని మదనరత్నంలో చెప్పారు. అట్లా సామర్థ్యం లేక పోతే ప్రతినిధితో చేయించాలని ముందే చెప్పాము.

మూ॥ వ్రతాకరణే ప్రాయశ్చిత్తమాహ మాధవీయే కాత్యాయనః -
అర్కేపర్వద్వయే రాత్రౌ చతుర్దశ్యష్టమీదివా
ఏకాదశ్యామహోరాత్రం భుక్త్వాచాంద్రాయణం చరేత్॥ ఇతి.

వ్రతంచేయని పక్షంలో ప్రాయశ్చిత్తాన్ని మాధవీయంలో కాత్యాయనుడు ఇట్లా చెప్పాడు: ఆదివారం, పూర్ణిమ, అమావాస్య (ఈ పర్వములందు) వీటిలో రాత్రియందు, చతుర్దశి, అష్టమి వీటిలో పగటియందు, ఏకాదశియందు అహో రాత్రములు భుజించిన చాంద్రాయణ మాచరించాలి అని.

మూ॥ అథకామ్యవ్రత విధిః లఘునారదీయే—
దశమ్యాది మహీపాల త్రిదినం పరివర్జయేత్।
గంధ తాంబూలపుష్పాదిస్త్రీ సంభోగం మహాయశాః॥

కామ్యవ్రత విధి లఘు నారదీయంలో ఇట్లా ఉంది—గంధ, తాంబూల పుష్పాదులు, స్త్రీ సంభోగం - వీనిని దశమినుండి మూడు దినములు వదలి పెట్టాలి.

మూ॥ తత్ర దశమ్యాం విధిః కౌర్మే —
కాంస్యం మాంసం మసూరాంశ్చ చణకాన్ కోరదూషకాన్
శాకం మధు పరాన్నంచ త్యజే దుపవసన్ స్త్రియం॥

తథా—
శాకం మాంసం మసూరాంశ్చ పునర్భోజన మైథునే
ద్యూత మత్యంబుపానంచ దశమ్యాం వైష్ణవస్త్యజేత్॥

మదనరత్నే నారదీయే—

అక్షార లవణాః సర్వే హవిష్యాన్న నిషేవిణః।
అవనీతల్పశయనాః ప్రియాసంగమ వర్జితాః॥

దశమియందు విధిని కూర్మపురాణం ఇట్లా చెప్పుచున్నది - కాంస్యపాత్ర భోజనము, మాంసము, చిరుసెనగలు, శనగలు, అళ్ళు, శాకమ్మ (ఆకు, పువ్వు, కాయ మొ॥ పది విధము), మధువు, పరాన్నము, స్త్రీ - వీనిని ఉపవసించువారు వదలవలెను. అట్లాగే శాకం, మాంసం, చిరుసెనగలు భోజన, మైథునములు, ద్యూతము, అధికంగా నీరు త్రాగటం - వీనిని దశమియందు వైష్ణవుడు వదల వలెను. మదనరత్నంలో నారదీయమైన వచనం ఇట్లా ఉంది: అన్ని క్షార, లవణ ములు వదలి హవిష్యాన్నం భుజిస్తూ, భూమిపై పడుకొని, ప్రియాసమాగమం లేకుండా చరించాలి అని.

మూ॥ వ్రతఘ్నాని హేమాద్రౌ దేవలః—

అసకృజ్జల పానాచ్చస కృత్తాంబూల చర్వణాత్।
ఉపవాసః ప్రణశ్యేత దివాస్వాపాచ్చ మైథునాత్॥

వ్రతాన్ని చెరిచేవాటిని హేమాద్రియందు దేవలుడు ఇట్లా చెప్పాడు: మాటిమాటికి నీరు త్రాగటం. ఒక్కసారి తాంబూలం వేసుకోవటం, పగలు నిద్రించటం, మైథునం-వీటివల్ల ఉపవాసము నశిస్తుంది.

మూ॥ అశక్తౌతు మదనరత్నే దేవలః - అత్యయే చాంబుపానేన నోప వాసః ప్రణశ్యతి॥ అత్యయే కష్టే విష్ణు రహస్యే—

గాత్రాభ్యంగం. శిరోభ్యంగం తాంబూలంచాను లేపనం।
వ్రతస్థో వర్జయేత్సర్వం యచ్చాన్యత్ర నిరాకృతం॥

అ శక్తియందు మదనరత్నంలో దేవలుడు ఇట్లా చెప్పాడు - కష్టమందు ) త్రాగినట్లైతే ఉపవాసము నశించదు అని. విష్ణు రహస్యమందు ఇట్లా ప్పారు - శరీరమునకు అభ్యంగం, తలకు అభ్యంగం, తాంబూలము, అను లేపనము ఇతరచోట్ల వద్దని చెప్పినవానిని ఈ సర్వాన్ని వ్రతస్థుడు వదలాలి అని.

మూ॥ ఏషు ప్రాయశ్చిత్త ముక్తం నిర్ణయామృతే సంగ్రహే - స్తైనహింసకయోః సఖ్యంకృత్వా స్తైన్యంచ హింసనం

ప్రాయశ్చిత్తం ప్రతికుర్యాత్ జపేన్నామ శతత్రయం
మిథ్యావాదే దివాస్వాపే బహుశోఽంబు నిషేవణే
అష్టాక్షరం ప్రతి జప్త్వా శతమష్టోత్తరం శుచిః
ప్రణవం పూర్వముద్చార్య నమోనారాయణః పదం
చతుర్థ్యంతం వదేత్ప్రశ్చాన్మనురష్టాక్షరో మతః.
ఓం నమో నారాయణాయే త్యష్టాక్షరః. తత్రైవ పైఠీనసిః—
తాంబూలచర్వణే స్త్రీ సంభోగే మాంస నిషేవణే
వ్రతలోపోనచేత్కుర్యా త్కృష్ణావత్ భుజివర్జనం॥ ఇతి.

కృష్ణైకాదశీవ ద్భోజన నిషేధమాత్ర పరిపాలనేతు తాంబూల చర్వణాదావపినదోష ఇత్యర్థః. సంభోగే ఋతుకాలా దన్యత్రరేతః సేకాత్మ సంభోగమ్మృతేఽన్యత్ర క్షయః స్మృతః। ఇతి కాత్యాయనోక్తేః

హేమాద్రావనిష్ఠః-
ఉపవాసే తథా శ్రాద్ధేన కుర్యాద్దంతధావనం
దంతానాం కాష్ఠ సంయోగోదహత్యా సప్తమంకులం
కాష్ఠగ్రహణాత్ మృల్లోష్టాద్య నిషేధః ఇతి హేమాద్రిః. విష్ణురహస్యే-
శ్రాద్ధోపవాసదివసే ఖాదిత్వా దంతధావనం
గాయత్ర్యా శత సంపూతమంబు ప్రాశ్య విశుద్ధ్యతి॥

నిర్ణయామృతేవ్యాసః-
వర్జయేత్పారణే మాంసంవ్రతా హేఽప్యౌషధం సదా॥ ఇతి.

నిర్ణయామృతంలో, సంగ్రహమందు ప్రాయశ్చిత్తం ఇట్లా చెప్పబడింది- దొంగతో, హింసకునితో స్నేహం చేసి దొంగతనము హింస చేసినట్లైతే నియమంతో విష్ణు నామమును మూడు వందలసార్లు జపం చేయటమే ప్రాయశ్చిత్తము. అబద్ధమాడితే, పగలు నిద్రిస్తే, ఎక్కువ నీరు త్రాగితే ఆ పాపం అష్టాక్షరిని, 108 మార్లు జపించిన పక్షంలో పోతుంది, శుచి ఔతాడు. మొదలు ప్రణవము పిదప నమో, నారాయణ పదాలు నారాయణకు చతుర్థి విభక్తి చివర పలకాలి. ఇది అష్టాక్షరమంత్రము. ఓం నమో నారాయణాయ అని అష్టాక్షరి. అక్కడ పైఠీనసివచనం - తాంబూలచర్వణం స్త్రీ సంభోగం, మాంస నిషేవణం పీటివల్ల

వ్రతలోపం లేని పక్షంలో కృష్ణ పక్షంలోవలె భోజనము మాత్రం వదలాలి అని. కృష్ణైకాదశిలోవలె భోజన నిషేధం మాత్రమే ఆచరించే పక్షంలో తాంబూల చర్వణాదులకు కూడా దోషంలేదు అని అర్థం ఋతు కాలంకన్న ఇతరమైన సంభోగం నిషిద్ధము. కాత్యాయనుని వచనం ఇట్లా ఉంది-రేతః పతన రూప ఆత్మ సంభోగంలో తప్ప (ఋతు కాలం) ఇతరత్ర సంభోగము వ్రతక్షయ కారకము, అని. హేమాద్రియందు వసిష్ఠుని వచనం ఇట్లా ఉంది - ఉపవాసంలో శ్రాద్ధమందు దంతధావనము చేయరాదు. దంతములకు కట్టెను తగిలించటం ఏడు తరములవరకు కులాన్ని దహిస్తుంది అని. కాష్ఠ అన్నాడు కాబట్టి మట్టి కంకర పెల్లలు మొదలగు వాటి నిషేధం కాదు అని హేమాద్రి. విష్ణు రహస్యంలో ఇట్లా ఉంది - శ్రాద్ధ ఉపవాసం రోజు తిని దంతధావనం చేస్తే, నూరుమార్లు గాయత్రితో పవిత్రమైన నీరు త్రాగితే శుద్ధుడౌతాడు, అని. నిర్ణయామృతంలో వ్యాస వచనం ఇట్లా ఉంది - పారణయందు మాంసాన్ని వదలాలి. వ్రతదిన మందు ఔషధ సేవనం మానాలి అని.

మూ॥ ఏకాదశ్యాం శ్రాద్ధ ప్రాప్తౌ మాధవీయే కాత్యాయన ఆహ-
ఉపవాసో యదానిత్యః శ్రాద్ధం నైమిత్తికంభవేత్
ఉపవాసంతదా కుర్యాత్ ఆఘ్రాయపి తృసేవితం
మాతాపిత్రోఃక్షయే ప్రాప్తే భవేదేకాదశీయది
అభ్యర్చ్య పితృ దేవాంశ్చ ఆజిఘ్రేత్పితృ సేవితం॥ ఇతి.

హేమాద్ర్యాది సర్వ నిబంధేష్వప్యేవం. ఏతేనైకాదశీ నిమిత్తకం శ్రాద్ధం ద్వాదశ్యాం కార్యమితి వదన్తః పరాస్తాః-కించమహాలయే సపక్షః సకలః పూజ్యః శ్రాద్ధషోడశకం ప్రతి ఇతి శ్రుతం షోడశత్వం పౌష్టైకాదశ్యాంచ మన్వాదిశ్రాద్ధం, క్షయాహ పరిజ్ఞానేచ తత్పక్షైకాదశ్యాం విహితం శ్రాద్ధం బాధితమేవస్యాత్. యదపి స్మృతి చంద్రికాస్థం పఠంతి -
అన్నాశ్రితాని పాపాని తద్భోక్తుర్దాతు రేవసా.

మజ్జన్తి పితరస్తస్య నరకే శాశ్వతీః సమాః॥ ఇతి. తస్యాపి రాగప్రాప్తి భుజిగోచరస్య వైధం శ్రాద్ధం గోచరయతాం మహత్సాహసమిత్యలం. యోఽపి- అకృత శ్రాద్ధనిచతా, జలపిండం వినాకృతాః, ఇతి లఘునారదీయే ఏకాదశ్యాం శ్రాద్ధాది నిషేధః సమాతా పితృభిన్న విషయః. పూర్వవాక్యేతద్ గ్రహణాత్. యద్వాశ్రాద్ధనిచయః=శ్రాద్ధేప్రతి గ్రహః.

ఏకాదశియందు శ్రాద్ధం వస్తే మాధవీయంలో కాత్యాయనుని వచనం ఇట్లా ఉంది: ఉపవాసం నిత్యమై, శ్రాద్ధం నైమిత్తికమైతే, పితృదేవతలకివ్వబడ్డ పదార్థాన్ని ఆఘ్రాణించి, అప్పుడు ఉపసించాలి అని. మాతాపితరుల క్షయతిథి యందు ఏకాదశి వస్తే, పితృదేవతల నర్చించి, పితరులు సేవించినదాన్ని ఆఘ్రాణించాలి అని హేమాద్రి మొదలగు సర్వ గ్రంథములందు కూడా ఇట్లాగే ఉంది. ఇందువల్ల ఏకాదశినిమిత్తక శ్రాద్ధాన్ని ద్వాదశియందు ఆచరించాలనే వారివాదం తొలగిపోయింది. ఇంకను మహాలయమందు ఇట్లా అన్నారు: షోడశశ్రాద్ధాన్ని గూర్చి అపూర్తి పక్షము పూజ్యమే అని. అట్టి షోడశత్వము, పుష్య ఏకాదశి యందు మన్వాదిశ్రాద్ధము. క్షయదినము తెలియనిపక్షంలో, ఆ పక్ష ఏకాదశియందు విహిత శ్రాద్ధము బాధితమౌతాయి. స్మృతిచంద్రికలో ఇట్లా ఉందని చెప్తారు - పాపాలన్ని అన్నాన్ని ఆశ్రయించి ఉంటాయి. అవి తినేవానివి, పెట్టేవానివి. వ్రతమందు అన్నంతించే వాని పితరులు చాలా సంవత్సరాలు నరకమందు మునిగిపోతారు అని. ఈ మాటల అర్థం రాగ ప్రాప్త భోజన నిషేధము కాని విధింపబడ్డ శ్రాద్ధ విషయము కాదు. వైధశ్రాద్ధవిషయకంగా చెప్పటం వారి దుస్సాహసం. ఇక ఈ విషయం చాలు. జలపిండం లేకుండా శ్రాద్ధనిషేధం చేయబడిందో అని లఘునారదీయంలో చెప్పబడ్డ ఏకాదశీ శ్రాద్ధాదులనిషేధము ఏదుందో అది మాతాపితృభిన్న విషయము ముందు వాక్యంలో వాటిని (మాతా పితరుల) గ్రహించాడు కాబట్టి. శ్రాద్ధనిచత = శ్రాద్ధనిచయ = శ్రాద్ధమందు గ్రహము. ఈ నిషేధము శ్రాద్ధం స్వీకరించేవారికి చెందింది కావచ్చు. (చేసే వారికి కాదు.)

మూ॥ వ్రతాన్ని నష్టపరచనివి - మదనరత్నే దేవలః -
సర్వభూత భయం వ్యాధిః, ప్రమాదో, గురుశాసనం
అవ్రతఘ్నానిపఠ్యంతే సకృదేతానిశాస్త్రతః॥
స్కాందేఽపి - అష్టౌతాన్యవ్రతఘ్నాని ఆపోమూలం ఫలంపయః
హవిర్ బ్రాహ్మణకామ్యాచ గురోర్వచనమౌషధం॥ ఇదం చాతి సంకష్ట
విషయం. నారదీయే - అనుకల్పోన్నృణాం ప్రోక్తః క్షీణానాంవరవర్ణినీ
మూలంఫలం పయస్తోయముప భోగ్యం భవేచ్ఛుభే॥
నత్వేవభోజనం కైశ్చిత్ ఏకాదశ్యాంబుధైః స్మృతం॥ ఇతి
(అస్యాపవాదః) - శయనేచమదుత్థానేమత్పార్శ్వపరివర్తనే.

నరోమూలఫలాహారీ హ్యాదిశల్యం మమార్పయేత్॥ ఇదంచాతిసంకట విషయం. ఏతేదావిరోధినీ నిర్ణయాః సర్వవ్రతేష్వజ్ఞేయాః

మదనరత్నంలో దేవలవచనం ఇట్లా ఉంది: సర్పాదులనుండి భయం, వ్యాధి, ప్రమాదము, గురుశాసనము ఇవన్నీ ఒకసారి శాస్త్రప్రకారం వ్రతఘ్న ములు కావు అని. స్కాందమందు కూడా - నీరు, మూలము, ఫలము, పాలు, హవిస్సు, బ్రాహ్మణేచ్ఛ, గురువచనం - ఔషధం ఈ ఎనిమిది వ్రతఘ్నములు కావు అని చెప్పబడింది. ఇది అతిసంకష్ట విషయకము. నారదీయమందు - క్షీణమనుష్యులకు వ్రతమందు ఈ అనుకల్పము (substitute) చెప్పబడ్డది. మూలము, ఫలము, పాలు, నీరు అనుభవించతగ్గవి. ఏకాదశియందు పండితు లెవ్వరూ భోజనం చెప్పలేదు అని. దీనికి అపవాదము - నాశయనమందు (శయ నైకాదశి) నా ఉత్థానమందు (ఉత్థానైకాదశి), నేను పక్కకు ఒరిగినపుడు మను ష్యుడు మూలఫలముల భుజించినచో అది నా గుండెలో బాణం కుచ్చినట్టే. ఇది అతిసంకటవిషయము. ఇవి అన్ని వ్రతాలలో విరుద్ధములు కాని, నిర్ణయములు అని గ్రహించాలి.

మూ॥ **తత్రైకాదశ్యాంసంకల్పః** -

గృహీత్వోదుంబరం పాత్రం వారిపూర్ణముదఙ్ముఖః

ఉపవాసంతు గృహ్ణీయాత్ యద్వావార్యేవధారయేత్॥ ఇతి మాధవీయే వారాహోక్తేః

ఏకాదశియందు సంకల్పము ఇట్లా - నీళ్ళతో నింపిన రాగి పాత్రను తీసు కొని, తూర్పుముఖంగా నిలబడి ఉపవాసాన్ని స్వీకరించాలి లేదా నీరు మాత్రమే గ్రహించాలి అని మాధవీయమందు వారాహోక్తి.

మూ॥ మంత్రస్తు విష్ణుః -

ఏకాదశ్యాంనిరాహారః స్థిత్వాఽహమపరేఽహని

భోక్ష్యామిపుండరీకాక్ష శరణంమేభవాచ్యుత॥ ఇతి.

విష్ణుమంత్రము ఇట్లా - నేను ఏకాదశియందు నిరాహారుడనై ఉండి, తర్వాతి రోజు భోజనం చేస్తాను. పుండరీకాక్ష! అచ్యుత! నీవు నాకు శరణము (రక్షణము), అని.

మూ॥ **శైవాదీనాంతు హేమాద్రౌ సౌరపురాణే** - సావిత్ర్యాప్యథవానామ్నా సంకల్పంతు సమాచరేత్ శివాదిగాయత్ర్యో యజుర్వేదే ప్రసిద్ధాః.

శైవాదులకు హేమాద్రియందు సౌరపురాణ వచనం. గాయత్రితో గాని పేరుతో గాని సంకల్ప మాచరించాలి. శివాది గాయత్రులు యజుర్వేదమందు ప్రసిద్ధములు.

మూ॥ **పుష్పాంజలి విచారము** - వారాహే - ఇత్యుద్చార్యతతో విద్వాన్ పుష్పాంజలి మథార్పయేత్ తతఃతజ్జలంపిబేత్.

వరాహపురాణమందు ఇట్లా - అని ఉచ్చరించి పిదప విద్వాంసుడు పాత్రయందు సంకల్ప వాక్యాలతో కూడిన జలాన్ని (పుష్పాంజలి) అర్పించాలి. పిదప ఆ జలం పానం చేయాలి.

మూ॥ **అష్టాక్షరేణ** మంత్రేణ త్రిర్జప్తేనాభి మంత్రితం
ఉపవాస ఫలంప్రేప్సుఃపిబేత్ పాత్రగతంజలం॥ ఇతి కాత్యాయనోక్తేః.

మూడుసార్లు జపించబడిన అష్టాక్షర మంత్రంతో అభిమంత్రితమైన పాత్రగత జలమును, ఉపవాస ఫలమును పొందగోరు వ్యక్తి తాగవలెను. అని కాత్యాయనోక్తి.

మూ॥ **మాధవమతంలో** సంకల్పం - మధ్యరాత్రే, ఉదయేవా దశమీవేధే రాత్రౌ సంకల్పః ఇతి.

మాధవః-

దశమ్యాః సంగదోషేణ అర్ధరాత్రాత్ పరేణతు
వర్జయేచ్చతురోయామాన్ సంకల్పార్చనయోః సదా॥
విద్ధోపవాసేఽ నశ్నంస్తు దినంత్యక్త్వా సమాహితః
రాత్రౌ సంపూజయే ద్విష్ణుం సంకల్పంచత దాఽచరేత్॥

ఇతి నారదీయోక్తేః.

తత్రైవ పూజామభిధాయ - దేవస్యపురతః కుర్యాత్ జాగరంనియతో వ్రతీ॥

మధ్యరాత్రిగాని ఉదయంగాని దశమీవేధ ఉంటే రాత్రే సంకల్పము అని మాధవుడు. అర్ధరాత్రికి తర్వాత దశమీసంగదోషం ఉన్న పక్షంలో, సంకల్ప అర్చనలకైతే నాలుగు యామముల (గడియల) కాలాన్ని విసర్జించాలి. విద్ధ

ఉపవాసమందు భుజింపకుండ పగలు గడిపి, రాత్రియందు, సావధాన మనస్కుడై విష్ణువును పూజించాలి. అప్పుడే సంకల్పాన్ని ఆచరించాలి అని నారదీయవచనం అక్కడే, పూజను చెప్పి వ్రతుడు, నియమం కలవాడై దేవుని ఎదుట జాగరం చేయాలి అని చెప్పారు.

మూ॥ ద్వాదశ్యాం నివేదనమంత్ర ఉక్తః కాత్యాయనేన -
అజ్ఞానతిమి రాంధస్య వ్రతేనానేన కేశవ
ప్రసీదసుముఖోనాథ జ్ఞానదృష్టి ప్రదోభవ॥ ఇతి.

కాత్యాయనుడు ద్వాదశియందు నివేదన మంత్రాన్ని ఇట్లా చెప్పాడు— అజ్ఞానపు చీకటితో గుడ్డివాడినైన నన్ను ఈ వ్రతంతో అనుగ్రహించు ఓ కేశవా! నాథా! జ్ఞానమనే దృష్టిని నాకివ్వు అని.

మూ॥ బ్రాహ్మణాన్ భోజయేచ్ఛక్త్యా దద్యాద్వై దక్షిణాంతతః.

శక్తికొలది బ్రాహ్మణునకు భోజనం పెట్టి, తర్వాత దక్షిణ ఇవ్వాలి.

మూ॥ కృత్వాచైవోపవాసంతు యోఽశ్నాతి ద్వాదశీదినే
నైవేద్యంతులసీ మిశ్రం హత్యాకోటి వినాశనం॥

స్కాందమందు ఇట్లా- ఏకాదశి ఉపవాసం చేసి ద్వాదశి దినమందు తులసీ మిశ్రిత నైవేద్యాన్ని తిన్నవాడి కోటి హత్యల పాపము నష్టమౌతుంది.

మూ॥ ద్వాదశ్యాంచవర్జ్యాన్యాహ బృహస్పతిః-
దివానిద్రాం పరాన్నంచపునర్భోజనమైథునే
క్షౌద్రం కాంస్యామిషం తైలం ద్వాదశ్యామష్టవర్జయేత్॥
హేమాద్రౌ బ్రహ్మాండ పురాణే—
పునర్భోజన మధ్యాయోభార ఆయాసమైథునే
ఉపవాస ఫలం హన్యుః దివానిద్రాచ పంచమీ॥

స్కాందే-

పరాన్నం కాంస్య తాంబూలే లోభం వితథభాషణం, వర్జయేదితి శేషః.

బృహస్పతి ద్వాదశిలో విడువతగినవానిని ఇట్లా చెప్పాడు - పగటి నిద్ర, పరుల అన్నము, మళ్ళీ భోజనము, మైథునము, తేనె, కాంస్యపాత్రమందలి భోజనం, మాంసము, నూనె- ఈ ఎనిమిదిటిని ద్వాదశియందు విసర్జించాలి అని. హేమాద్రియందు బ్రహ్మాండపురాణోక్తి - మళ్ళీ భోజనం, అధ్యయనము, బరు

వెత్తటం (పరిశ్రమించుట), మైదునము, పగటినిద్ర- ఈ ఐదింటిని వదలాలి. ఇవి ఉపవాస ఫలితాన్ని నశింపచేస్తాయి అని పరాన్నము, కాంస్యపాత్ర, తాంబూలము, లోభము, వ్యర్థభాషణము - వీనిని వదలాలి అని స్కాందోక్తి (ద్వాదశిలో వదలాలి).

మూ॥ విష్ణుధర్మే—

**అసంభాష్యాన్ హిసంభాష్య** తులస్యతసికాదలం
ఆమలక్యాః ఫలంవాఽపిపారణే ప్రాశ్యశుద్ధ్యతి

మాటాడతగని వారితో మాట్లాడినచో తులసి, అవిశెఆకులు, వుసిరిపండు వీటితో పారణచేస్తే శుద్ధుడౌతాడు అని విష్ణు ధర్మంలో ఉంది.

మూ॥ బృహన్నారదీయే—

**రజస్వలాంచ**, చాండాలం, మహాపాతకినం తథా
సూతికాంపతితంచైవ ఉచ్ఛిష్టం రజకాదికం॥
వ్రతాదిమధ్యే **శృణుయాత్** యద్యేషాం ధ్వనిముత్తమం
అష్టోత్తర సహస్రంతు జపేద్వైవేద మాతరం॥

బృహన్నారదీయంలో ఇట్లా ఉంది - రజస్వల, చండాలుడు, మహాపాతకి, సూతిక, పతితుడు, ఉచ్ఛిష్టుడు, రజకుడు మొదలగువారి ధ్వనిని వ్రతాదిమధ్యయందువిన్న పక్షంలో, గాయత్రిని 1008 మార్లు జపించాలి అని.

మూ॥ ఏతద్వ్రతం సూతకేఽపికార్యం సూతకేమృతకే వాపినత్యాజ్యం ద్వాదశీవ్రతం. ఇతి విష్ణూక్తేః

ఈ వ్రతాన్ని సూతకమందూ చేయాలి సూతకమందు, మృతాశౌచమందును ద్వాదశీవ్రతాన్ని వదలరాదు అని విష్ణూక్తి.

మూ॥ తత్రత్యక్తం దానాది సూతకాన్తే కార్యం—

సూతకాంతేనరః స్నాత్వాపూజ యిత్వాజనార్దనం
దానందత్వావిధానే నవ్రతస్య ఫలమశ్నుతే॥ ఇతి మాత్స్యోక్తేః

సూతకంలో వదలిన దానాలను సూతకం తర్వాత చేయాలి. సూతకం తర్వాత స్నానంచేసి, జనార్దనుని పూజించి, దానంచేస్తే వ్రతఫలితాన్ని పొందుతాడు అని మాత్స్యోక్తి.

మూ॥ రజోదర్శనేఽపి కార్యం ఏకాదశ్యాంన భుంజీత నారీదృష్టేరజస్యపి ఇతిపులస్త్యోక్తేఃయద్వా, ద్వాదశ్యాంశ్రవణర్క్షం తదాశుద్ధామప్యేకాదశీం త్యక్త్వా తత్రైవోపవాసఃకార్యః

శుక్లావాయదివాకృష్ణా ద్వాదశీశ్రవణాన్వితా
తయోరేవోపవా సశ్చత్రయోదశ్యాంచ పారణం

ఇతినారదీయోక్తేః - ఏతేచనియమాః కామ్యవ్రతేనియతాః నిత్యవ్రతేసతి సంభవేకార్యాః శక్తిమాంస్తు పునఃకుర్యాన్నియమంస విశేషణం, ఇతి కాత్యాయనోక్తేః.

రజోదర్శనమైనా, చేయాలి. రజోదర్శనం కలిగినా స్త్రీ ఏకాదశియందు భుజించకూడదు అని పులస్త్యోక్తి, ద్వాదశియందు శ్రవణానక్షత్రం వస్తే శుద్ధైకాదశిని వదలి, ద్వాదశియందే ఉపవసించాలి. శుక్లపక్షం లేదా కృష్ణపక్షంకాని ద్వాదశి, శ్రవణానక్షత్ర యుక్తమైతే అక్కడే ఉపవసించాలి త్రయోదశియందు పారణము అని నారదీయోక్తి. ఈ నియమాలు కామ్యవ్రతమందు తప్పనిసరి. నిత్యవ్రతం లోనైతే వీలైతే ఆచరించాలి. శక్తివంతుడైతే మాత్రం శేషనియమాన్ని ఆచరించాలి, అని కాత్యాయనోక్తి.

మూ॥ అశక్తౌతుమాధవీయే బ్రహ్మవైవర్తే -
ఇతి విజ్ఞాయకుర్వీతావశ్యమేకాదశీవ్రతం
విశేషనియమాశక్తోఽహోరాత్రం భుజివర్జితః॥ ఇతి

శక్తిలేనిపక్షంలో మాధవీయంలో బ్రహ్మవైవర్తోక్తి ఇట్లావుంది - అని తెలుసుకొని, తప్పకుండా ఏకాదశివ్రతాన్ని ఆచరించాలి. విశేష నియమాలు ఆచరించలేని పక్షంలో, అహోరాత్రములు భోజనం వదలాలి, అని.

మూ॥ మహాద్వాదశులు 8 -
తత్ర శుద్ధాధికైకాదశీయుతా ద్వాదశీ ఉన్మీలనీసంజ్ఞా
ద్వాదశ్యేవశుద్ధాధికావర్ధతే చేత్‌సావంజులీ
వాసరత్రయ స్పర్శినీ త్రిస్పృశా
అగ్రే పర్వణః సంపూర్ణాధికత్వే పక్షవర్ధినీ
పుష్యర్క్షయుతా జయా
శ్రవణయుతా విజయా

పునర్వసుయుతా జయ న్తీ

రోహిణీయుతా పాపనాశినీ అత్రమూలం హేమాద్రౌజ్ఞేయం ఏతాః పాపక్షయ ముక్తికామ ఉపవసేత్, ఏకాదశీ ద్వాదశ్యోః ఏకత్వేతంత్రేణోపవాసః పార్థక్యేతుశక్తస్యోపవాసద్వయం. ఏకాదశీముపోష్యైవ ద్వాదశీం సముపోషయేత్ ఇతి విష్ణురహస్యాత్ అశక్తౌతు ద్వాదశ్యామేవ.

ఏవమేకాదశీం భుక్త్వా ద్వాదశీంసముపోషయేత్

పూర్వవాసరజం పుణ్యం సర్వంప్రాప్నోత్యసంశయం. ఇతి తత్రైవోక్తేః.

యదాత్వల్పా ద్వాదశీతదోక్తం మాత్స్యే -

యదాభవతి అల్పాఽపి ద్వాదశీపారణాదినే

ఉషఃకాలేద్వయంకుర్యాత్ ప్రాతర్మాధ్యాహ్నికం తదా॥

నారదీయేఽపి - అల్పాయామథ విప్రేన్ద్ర ద్వాదశ్యామరుణోదయే

స్నానార్చనక్రియాఃకార్యాదానహోమాదిసంయుతాః॥ ఇతి.

సంకటేతు మాధవీయే దేవలః -

సంకటేవిషమేప్రాప్తే ద్వాదశ్యాం పారయేత్కథం

అద్భిస్తు పారణాంకుర్యాత్పునర్భుక్తం నదోషకృత్॥ ఇతి

సంకటే = త్రయోదశీ శ్రాద్ధప్రదోషాదౌ. అత్రకేచిదాహుః - అపకర్ష వాక్యాని అనాహితాగ్ని విషయాణి. అగ్నిహోత్రాదీనాంశ్రౌతత్వేన అపకర్షాయోగాత్ ఇతి. ద్వాదశ్యాంచ ప్రథమ పాదమతిక్రమ్య పారణం కార్యం.

ద్వాదశ్యాః ప్రథమః పాదోహరివాసర సంజ్ఞితః

తమతిక్రమ్య కుర్వీత పారణం విష్ణుతత్పరైః. ఇతి నిర్ణయామృతేమదనరత్నేచ విష్ణుధర్మోక్తేః.

మహాద్వాదశులు ఎనిమిది—

1. శుద్ధఅధికఏకాదశితో కూడిన ద్వాదశి ఉన్మీలినీ అని పిలువబడుతుంది. (శుద్ధసంపూర్ణము ద్వాదశి అధికము)
2. శుద్ధ అధిక వృద్ధి ద్వాదశిలోనే ఐతే అది వంజులీ (ఉపవాస పారణలు ద్వాదశిలోనే.)
3. వాసరత్రయ (ఉదయం ఏకాదశి రోజంతా ద్వాదశి చివర త్రయోదశి) స్పర్శగలది త్రిస్పృశ.

4. పూర్ణిమ, సంపూర్ణాధిక్యాన్ని చెందేట్లైతే అది పక్షవర్ధినీ(అక్కడ ద్వాదశిలో ఉపవసించాలి.)
5. పుష్యమితో కూడినది జయ (ద్వాదశి)
6. శ్రవణతో కూడినది విజయ.
7. పునర్వసుతో కూడినది జయంతి.
8. రోహిణితో కూడినది పాపనాశినీ.

వీనికి మూలం హేమాద్రిలో చూడాలి. వీటిని, పాపనాశనం, ముక్తి కావాలి అనుకునేవారు ఉపవసించాలి. ఏకాదశి ద్వాదశులు ఒకటైతే ప్రాధాన్యాన్ని బట్టి (తంత్రేణ) ఉపవాసము విడివిడిగా ఉంటే శక్తుడైనవాడు రెండు రోజులు ఉపసించాలి. విష్ణురహస్యంలో ఇలా ఉంది - ఏకాదశియందు ఉపవసించి, ద్వాదశిలో కూడా ఉపవసించాలి అని. శక్తిలేనివక్షంలో ద్వాదశియందే ఉపవాసం. ఈరకంగా ఏకాదశిన (అల్పాహారం) భుజించి ద్వాదశిన ఉపవసించాలి. అతనికి ముందురోజున రావాల్సిన పుణ్యము అంతా లభిస్తుంది. సంశయం లేదు అని అక్కడే చెప్పారు. ద్వాదశి అల్పంగా ఉన్న పక్షంలో, మాత్స్యంలో ఇట్లా చెప్పారు - పారణదినమందు ద్వాదశి అల్పంగా ఉంటే, ప్రొద్దున, మధ్యాహ్నం చేయాల్సిన వాటిని రెంటిని ఉషఃకాలమందే చేయాలి అని. నారదీయమందు కూడా ఇట్లా ఉంది- అరుణోదయమందు ద్వాదశి అల్పంగా ఉన్నా, దానహోమాదులతోపాటు, స్నానార్చనక్రియలు చేయాలి అని. విషమ సంకటంవస్తే ద్వాదశిలో ఎట్లా ఉపవసించాలి? నీరుతాగి పారణ చేయాలి. తర్వాత భోజనము చేస్తే దోషం లేదు అని మాధవీయంలో దేవలవచనం. సంకటమనగా త్రయోదశీ శ్రాద్ధం, ప్రదోషం మొదలగునవి. అపకర్షవాక్యములు, ఔపాసనహోమ, వైశ్వదేవాది విషయకములు అగ్నిహోత్రాదులు శ్రౌతము (శ్రుతి విహితము) కనుక అపకర్ష సంభవించదు అనికొందరన్నారు. (పైన పారణ లోపంకాదు శ్రాద్ధావకర్షకాదు అనుదానికి పైవాక్యం సహకారి) ద్వాదశియందు ప్రథమపాదం దాటాక పారణ చేయాలి. ద్వాదశియొక్క ప్రథమపాదము హరివాసరమని పేరుగలది. దాన్ని వదలి, విష్ణుతత్పరులు, పారణ చేయాలి అని, నిర్ణయామృతంలో, మదరత్నమందునూ విష్ణుధర్మోక్తి ఉంది.

మూ॥ పారణ విచారము అత్ర కేచిత్ సంగిరంతే-యదాభూయసీ, ద్వాదశీ తదాఽపి ప్రాతర్ముహూర్తత్రయే పారణం కార్యం, సర్వేషా ముపవాసానాం

ప్రాతరేవహిపారణం, ఇతివచనాత్, ఇతి అస్మద్గురవస్తు - బహూనాం కర్మ కాలానాం వినాకారణం బాధాపత్తేః ప్రాగుక్త వచనైశ్చ అల్పద్వాదశ్యామేవ అపకర్ష విధానాత్, అపరాహ్ణేఏవకార్యం ప్రాతః శబ్దస్తు - సాయంప్రాతర్ ద్విజాతీనాం అశనంశ్రుతి చోదితం. ఇతివద పరాహ్ణవాచిత్వేఽప్యుపపన్నః నచవాక్యవైయర్థ్యం, పునర్భోజనసాయం పారణనివృత్త్యర్థత్వాత్తస్య - ఇత్యాహుః. ప్రమాదేన ఏకాదశ్యుపవాసాతిక్రమే అపరార్కే, వారాహే—

ఏకాదశీ విప్లుతాచేత్ ద్వాదశీపరతఃస్థితా
ఉపోష్యా ద్వాదశీతత్ర యదీచ్ఛేత్ పరమంపదం॥ ఇతి

కైశ్చిత్తు విఘ్ననా చేదితి పఠితం. అత్రావిరోధినో నియమాః సర్వవ్రతేషు బోద్ధవ్యాః అన్యేచ నవరాత్రే వక్ష్యంతే ఇతిదిక్ ఇతి ఏకాదశీ నిర్ణయః.

ద్వాదశి అధికంగా ఉన్నా ప్రొద్దుటి మూడుముహూర్తములందే పారణ చేయాలి. "ఉపవాసములన్నింటికి ప్రొద్దున్నే పారణము" అని ఉన్నందువల్ల అని కొందరంటారు. మా గురువులైతే అనేక కర్మకాలములకు, కారణం లేకుండానే బాధ సంభవిస్తుంది. ఇంతేకాక, ముందు చెప్పిన మాటలతో అల్ప ద్వాదశియందే, అపకర్ష విధానము కనుక, అపరాహ్ణమందే పారణ చేయాలి. ప్రాతఃశబ్దమైతే - బ్రాహ్మణులకు సాయంకాలము ప్రాతఃకాలములందు భోజనము శ్రుతి విహితము అనుదానివలె, అపరాహ్ణవాచి కూడా కాగలదు. వాక్య వైయర్థ్యము లేదు - అది పునర్భోజన, సాయంపారణ నివృత్తి కొరకు అని అన్నారు. ప్రమాదంవల్ల ఏకాదశీ ఉపవాసం అతిక్రమిస్తే అపరార్కమందు వారాహోక్తి ఇట్లా ఉంది - ఏకాదశి (నిమరిస్తే) లోపించి, ద్వాదశిపక్కగా ఉన్న పక్షంలో పరమపదం కోరుకొనేవారు ఆ ద్వాదశియందు ఉపవసించాలి అని కొందరు "ఏకాదశీ విఘ్ననా" అని పఠిస్తారు. ఇక్కడ విరోధించని నియమములను అన్ని వ్రతాల్లో గ్రహించాలి. మిగిలినవాటిని నవరాత్రమందు చెప్తాము అని చాలు అని ఏకాదశీ నిర్ణయము.

మూ॥ ద్వాదశీతు పూర్వైవ యుగ్మవాక్యం - ద్వాదశీతు ప్రకర్తవ్యా ఏకాదశ్యాయుతాప్రభో ఇతిస్కాందాచ్చ.

యుగ్మ వాక్యాన్ననుసరించి ద్వాదశి పూర్వముదే. ఏకాదశితోకూడిన ద్వాదశినే ఆచరించాలి అని స్కాందోక్తి.

మూ॥ త్రయోదశీతు సర్వమతే శుక్లాపూర్వా కృష్ణా ఉత్తరా త్రయోదశ తిథిః పూర్వః సితోఽథాఽసితఃపశ్చాత్ ఇతిదీపికోక్తేః శుక్లా త్రయోదశీపూర్వా, పరాకృష్ణా త్రయోదశీ, ఇతిమాధవాచ్చ.

త్రయోదశి మాత్రం అందరి మతంలోను శుక్లం పూర్వము, కృష్ణ ఉత్తరం, త్రయోదశి తిథి సితము పూర్వము. అసితం పరము అని దీపికోక్తి. శుక్లత్రయోదశి పూర్వం, కృష్ణత్రయోదశి పరం అని మాధవ వచనం కూడా (ద్వాదశి + త్రయోదశి (పూర్వ) త్రయో + చతుర్దశి (పరం) )

మూ॥ చతుర్దశీతు సర్వమతే కృష్ణా పూర్వా, శుక్లోత్తరా ఉపవాసేతు ద్వయమపిపరేతి మదనరత్నే.

చతుర్దశి అందరి మతంలోను కృష్ణ పూర్వము శుక్లము ఉత్తరము ఉపవాసమందు రెండు కూడా పరమే అని మదనరత్నంలో (పూర్వ-త్రయో + చతు పర - చతు + పూర్ణిమ).

మూ॥ పౌర్ణమాస్యమా వాస్యేతు సావిత్రీ వ్రతం వినా పరేగ్రాహ్యే -
భూతవిద్ధే నకర్తవ్యే దర్శపూర్ణేకదాచన
వర్జయిత్వా మునిశ్రేష్ఠ సావిత్రీ వ్రతముత్తమం॥ ఇతి బ్రహ్మ వైవర్తాత్.

సావిత్రి వ్రతంలో తప్ప మిగిలిన చోట పూర్ణిమ, అమావాస్యలు పరమే గ్రహించాలి. బ్రహ్మవైవర్తంలో ఇట్లా ఉంది - ఉత్తమమైన సావిత్రి వ్రతాన్ని వదలి, చతుర్దశితో కూడిన పూర్ణిమ, అమావాస్యలు ఎప్పుడూ చేయరాదు.

మూ॥ అమాయాం యోగ విశేష మాహాఽపరార్కేశాతాతపః-
అమావాస్యాం భవేద్వారో యదాభూమి సుతస్యవై
జాహ్నవీస్నాన మంత్రేణ గోసహస్ర ఫలం లభేత్
అమావాసోమవారేణ రవివారేణ సప్తమీ
చతుర్థీ భౌమవారేణ, విషువత్ సదృశంఫలం॥

తత్రైవవ్యాసః -
సినీవాలీ కుహూర్వాపి యది సోమదినేభవేత్
గోసహస్ర ఫలం దద్యాత్ స్నానంచే న్మౌనినాకృతం॥

అమావాస్యయందు విశేషయోగమును అపరార్క మందు శాతాతపుడు ఇట్లా చెప్పాడు - అమావాస్యనాడు మంగళవారమైతే, ఆ రోజు గంగా స్నానం

చేస్తే సహస్ర గోదాన ఫలం లభిస్తుంది అని. అమావాస్య సోమవారంతో, సప్తమి ఆదివారంతో చతుర్థి మంగళవారంతో కలిస్తే విషువత్తుతో సమానమైన ఫలితాన్ని స్తాయి. అక్కడే వ్యాసుడు ఇట్లా - పూర్ణిమ, అమావాస్య ఈ రెండు సోమవారం పగలు వస్తే, మౌనంగా స్నానం చేస్తే సహస్ర గోదాన ఫలం లభిస్తుంది అని అన్నాడు.

మూ॥ **వ్యతీపాత నిర్ణయము** - హేమాద్రౌ బృహన్మనుః-

శ్రవణాశ్విధనిష్ఠార్ద్రానాగ దైవత మస్తకైః

యద్యమార విహారేణ వ్యతీపాతః స ఉచ్యతే॥

నాగదైవతం=అశ్లేషా, మస్తకః=మృగశిరః, ప్రథమపాదః ఇత్యన్యే సచసర్వేషాం.

హేమాద్రి యందు బృహన్మనువు వచనం వ్యతీపాతమును గూర్చి ఇట్లా ఉంది - శ్రవణం, అశ్విని, ధనిష్ఠ, ఆర్ద్ర, ఆశ్లేష, మృగశిర నక్షత్రములు, ఆదివారం, అమావాస్యతో కలిస్తే దాన్ని వ్యతీపాతం అంటారు అని. ఒకరిట్లా అన్నారు, మృగశిర ప్రథమ పాదాన్ని గ్రహించాలి అని. అన్ని నక్షత్రముల ప్రథమ పాదాన్ని గ్రహించాలి.

మూ॥ **అథఇష్టికాలః** గోభిలః - పక్షాంతా ఉపవస్తవ్యా, పక్షాదయోఽభియ-ష్టవ్యాః, ఇతి. ఉపవాసో అన్వాధానం. తత్ర మధ్యాహ్నే తత్పూర్వంవా పర్వప్రతిపత్సన్ధౌతద్దినే యాగః.

పూర్వాహ్నే వాథమధ్యాహ్నే యది పర్వ సమీప్యతే

ఉపోష్య తత్ర పూర్వేద్యుః తదహర్యాగ ఇష్యతే॥ ఇతి, లౌగాక్షివచనాత్. అత్రద్వేధావిభాగః -

ఆవర్తనాత్తు పూర్వాహ్ణోహ్యపరాహ్ణః తతః పరః.

మధ్యాహ్నస్తు తయోస్సంధిః యదావర్తన ముచ్యతే॥ ఇతి మదనరత్నే వచనాత్.

ఇష్టికాలము - గోభిలుని వచనం - అమావాస్య, పూర్ణిమ తిథులందు (పక్షాంత) అన్వాధానము (ఉపవాసము) చేయాలి. పక్ష ఆదితిథి, ప్రతిపదలందు యజ్ఞం చేయాలి అని ఉంది. మధ్యాహ్నమందు లేదా దానికన్నా ముందు, ప్రతిపదపర్వముల సంధికాలమందు, ఆ రోజు యాగం చేయాలి. లౌగాక్షి ఇట్లా

అంటాడు - పూర్వాహ్ణమందు, లేదా మధ్యాహ్నమందు పర్వం సమాప్తి చెందే పక్షంలో, పూర్వదినమందు ఉపవాసం చేసి, ఆ రోజు యాగం చేయాలి అని. ఇక్కడ రెండు రకముల విభాగము అని మదరత్నవచనము. ఆ వర్తనమువల్ల మొదలు పూర్వాహ్ణము తర్వాత అపరాహ్ణము వస్తుంది. పూర్వాహ్ణ, అపరాహ్ణ కాలముల సంధికాలాన్ని మధ్యాహ్నకాలమంటారు. దీన్ని అవర్తన మంటారు; అని.

మూ॥ మధ్యాహ్నదూర్ధ్వం సంధౌ మాధవమతేపరేహ్ని యాగః-

అపరాహ్ణేఽథ వారాత్రౌ యది పర్వసమాప్యతే
ఉపోష్యతస్మిన్నహని శ్వోభూతే యాగ ఇష్యతే॥ ఇతిలౌగాక్షిణో క్తేః.

మధ్యాహ్నము తర్వాత సంధివస్తే మాధవ మతమందు రెండవరోజు యాగమౌతుంది అపరాహ్ణమందు, లేదా రాత్రియందు పర్వం సమాప్తి చెందితే ఆ రోజు ఉపవాసం చేసి తర్వాతి రోజు యాగం చేయాలి అని లౌగాక్షి వచనం.

మూ॥ హేమాద్రిస్తు అపరాహ్ణ సంధావపి పరదినే ప్రతిపచ్చతుర్థాంశే, చంద్రోదయేచ సతి ద్వితీయా దిష్వత్యంత క్షయేసతి పూర్వేద్యుర్యాగః.

హేమాద్రి మతం ప్రకారం - అపరాహ్ణ సంధియందైనా, తర్వాతి రోజున ప్రతి పద చతుర్థాంశ మందు చంద్రోదయం ఉండి ద్వితీయ మొదలగునవి మిక్కిలి క్షీణదశయందున్న పూర్వదినమందే యాగం చేయాలి అని అన్నారు.

మూ॥ పర్వణోంఽశే ద్వితీయేతు యష్టవ్యంతు ద్విజాతిభిః

ద్వితీయా సహితం యస్మాత్ దూషయ న్త్యాశ్వలాయనాః॥ ఇతి.

ద్వితీయేత్వితి కైముతికన్యాయేన తుర్యాంశపరం. తురీయేత్వితి శూలపాణి పాఠః స్పష్టార్థ ఏవ.

పర్వము యొక్క ద్వితీయాంశయందు బ్రాహ్మణులు యాగం చేయాలి. ఆశ్వలాయనులు ద్వితీయాసహిత యజ్ఞమును దూషిస్తారు. ఇక్కడ ద్వితీయ అనే - శబ్దం కైముతిక న్యాయంవల్ల నాల్గవభాగ పరకము. తురీయమందు అని చెప్పిన శూలపాణి పాఠము స్పష్టంగానే ఉంది.

మూ॥ తథా - భూతా పంచదశీపూర్ణా ద్వితీయా క్షయగామినీ

చరురిష్టి రమాయాం స్యాత్ భూతే కవ్యాదికి క్రియా॥ ఇతి బోధాయన వచనాచ్చేత్యూచివాన్.

బోధాయనుని వచనం ప్రకారం ఇట్లా - చతుదర్శి మరియు అమావాస్య పూర్ణతిథి మరియు ద్వితీయ క్షయగామిని ఐతే చరువుఇష్టి అమావాస్యయందు చేయాలి. చతుర్దశియందు కవ్యాదిక్రియ (పిండపితృయజ్ఞం) చేయాలి అని ఉంది.

మూ॥ మదనరత్నేఽపి—
చతుర్దశీ చతుర్యామా అమావాస్యా నదృశ్యతే
శ్వోభూతే ప్రతిపచ్చేత్స్యాత్ పూర్వాంత త్రైవకారయేత్॥ ఇతి.

మదనరత్నమందు కూడా ఇట్లా - చతుర్దశి నాల్గు యామములు ఉండి, అమావాస్య (నాల్గు యామములు) కన్పించని పక్షంలో తర్వాతి రోజు ప్రతిపద తిథియైన పక్షంలో మొదటిరోజు ఆచరించాలి. (అదే ప్రధాన కాలము. చతుర్దశి లోనే అన్వాధానం చేయాలి) అని ఉంది.

మూ॥ యత్తుమాధవః—
యస్తువాజసనేయీస్యాత్ తస్యసంధిదినాత్పురా
నక్వాప్యన్వాహితిః కింతు సదాసంధి దినేహిసా॥ ఇత్యాహ.

యచ్చకాలాదర్శేప్యుక్తం—
ఆవర్తనాదధః సంధిః యద్యన్వాధాయతద్దినే
పరేద్యు రిష్టిరిత్యాహుః విప్రావాజసనేయినః॥ ఇతి.

యచ్చమదనరత్నే—
మధ్యం దినాత్స్యాత్ అహనీహయస్మిన్
ప్రాక్పర్వణః సంధిరియం తృతీయా
సాఖర్వికా వాజస నేయిమత్యా
తస్యా ముపోష్యాఽథ పరేద్యురిష్టిః॥ ఇతి

ఏతత్ పౌర్ణమాసీ పరమితి తత్రైవ. ఆవర్తనోర్ధ్వమర్వాక్ అస్తాత్ రాత్రౌవా సమాప్తాద్వే మధ్యాహ్నాదర్వాక్ సమాప్తౌ తృతీయేత్యర్థః. తత్కర్క భాష్యదేవజానీ, శ్రీ అనంతభాష్యాది సకల తచ్ఛాఖీయగ్రంథవిరోధాత్ వృద్ధానాద రాచ్చ ఉపేక్ష్యం.

వాజసనేయి ఎవడున్నాడో వానికి సంధిదినంకన్న ముందు అన్వాహితి ఎక్కడా లేదు. కాని, సంధిదినమందే ఎప్పుడు వానికి అన్వాధానము అని మాధ

వుడు అన్నాడో, వాజసనేయులు ఇట్లా అంటారు. ఏమంటే, ఆవర్తనంకం టేముందు సంధి ఉంటే ఆ రోజే అన్వాధానం చేసి, తర్వాతి రోజు ఇష్టి చేయాలి అని, ఏది కాలాదర్శకారుడు చెప్పాడో, మధ్యాహ్నకాలంకన్న ముందు పర్వసంధి ఉంటే ఆ రోజు, మూడవది, వాజసనేయ మతమందు ఖర్విక అనబడుతుంది. ఆ రోజు ఉపవాసంచేసి తర్వాత రోజు ఇష్టి చేయాలి అని మదనరత్నంలో ఉందో ఇవన్నీ పౌర్ణమాసి పరకములు అని అక్కడే చెప్పారు. ఆవర్తనం తర్వాత, అస్త మయంకన్న ముందు (పౌర్ణమి సమాప్తి ఐతే మొదటిది) లేదా రాత్రి సమాప్తి యందు రెండు, మధ్యాహ్నంకన్న ముందు సమాప్తిచెందితే తృతీయ ప్రకారం ఈ అర్థము. కర్కభాష్య, దేవజాని, అనంతభాష్యములు మొదలగు ఆ శాఖీయ గ్రంథాలకు అన్నిటికి విరుద్ధమైనందువల్ల, పెద్దలు ఆదరించనందువల్ల ఉపేక్షించాలి.

మూ॥ పౌర్ణమాస్యాం విశేషమాహ కాత్యాయనః—
సంధిశ్చేత్సంగవాదూర్ధ్వం ప్రాక్ పర్యావర్తనాద్రవేః
సాపౌర్ణమాసీ విజ్ఞేయా సద్యస్కాల విధౌనరైః॥

కాత్యాయనుడు పౌర్ణమాసియందు విశేషాన్ని ఇట్లా చెప్పాడు - సంగవం తర్వాత, సూర్యుని పర్యావర్తన కన్న ముందు ఒకవేళ సంధి ఉంటే, అది పౌర్ణమాసి. సద్యస్ కాల విధిలో మనుష్యులకు అదే పూర్ణిమ అని తెలుసు కోవాలి. (సంగవం=ఒక ప్రత్యేక కాలం) అని.

మూ॥ **అమాయాం విశేష మాహబౌ ధాయనః**—
ద్వితీయాత్రి ముహూర్తాచేత్ ప్రతిపద్యావరాహ్ణికీ
అన్వాధానం చతుర్దశ్యాం పరతఃసోమ దర్శనాత్॥

కాత్యాయనశ్చ - యజనీయేఽహ్ని సోమశ్చేత్ వారుణ్యాం దిశిదృశ్యతే.
తత్రవ్యాహృతిభిర్ హుత్వాదండం దద్యాత్ ద్విజాతయే॥ ఇతి ఏతచ్చ బౌధాయన వాజసనేయి విషయం. తైత్తిరీయ శ్రుతౌతుచంద్ర దర్శనేఽపియాగః ఉక్తః - ఏషోవై సుమనానామేష్టిః యమద్యే ఊానం పశ్చాచ్చంద్రమా అభ్యుదే - త్యస్మిన్నేవాస్మై లోకేర్ధుకం భవతి, ఇతి. శ్రుత్యన్తరేఽపి - యదహః పశ్చాత్ చంద్రమా అభ్యుదేతి, తదహర్ యజన్నిమాన్ లోకాన్ అభ్యుదేతి ఇతి. ఇదం బహ్వృచాపస్తంబ విషయం మదనరత్నేఽప్యేవం. ఆపస్తంబ భాష్యార్థ సంగ్రహేఽప్యేవం. అతఃపక్ష ద్వయస్య స్వసూత్రా ద్వ్యవస్థేతి తత్వం. దూష యత్యాశ్వ లాయనాః, ఇతితు పూర్వాహ్ణ సంధి విషయమితి మాధవః.

బౌధాయనుడు అమావాస్య యందు విశేషాన్ని ఇట్లా చెప్పాడు- ద్వితీయ తిథి మూడు ముహూర్తములు ఉంది, ప్రతిపద అపరాహ్ణ వ్యాపినియై ఉంటే, అన్వాధానమును చతుర్దశి యందు చేయాలి. తర్వాతిరోజు చంద్ర దర్శనం ఔతుంది కాబట్టి అని. కాత్యాయనుడు ఇట్లా అంటాడు- యజ్ఞం చేయాల్సిన రోజు, పశ్చిమ దిక్కులో చంద్రుడు కన్పిస్తే, అప్పుడు వ్యాహృతులతో హోమం చేసి బ్రాహ్మణులకు దండమును ఇవ్వాలి. (దండం = బెత్తం), అని. ఇది బౌధాయన, వాజసనేయి శాఖల విషయకము.

తైత్తిరీయ శ్రుతిలో మాత్రం చంద్ర దర్శనమైనా యాగం చెప్పబడింది. ఇది సుమన అను పేరుగల ఇష్టి. ఈ ఇష్టి చేస్తున్నప్పుడు పశ్చిమంలో అప్పుడే చంద్రుడు ఉదయిస్తే యజమానికి ఈ లోకంలోనే కల్యాణం జరుగుతుంది అని. మరొక శ్రుతిలో కూడా ఇట్లా ఏ రోజు పశ్చిమ దిక్కులో చంద్రుడు ఉదయిస్తాడో, ఆ రోజే యజ్ఞం చేసినవాడు ఈ లోకములను పొందుతాడు అని ఉంది. ఇది బహ్వృచ అపస్తంబ విషయకము. మదనరత్నంలోను ఇట్లాగే ఉంది. ఆపస్తంబ భాష్యార్థ సంగ్రహంలోను ఇదే ఉంది. అందువల్ల రెండుపక్షాల వారికి వారి వారి సూత్రాన్ననుసరించి వ్యవస్థ అని సారము. ఆశ్వలాయనులు దూషిస్తున్నారు అనేదైతే పూర్వాహ్ణ సంధి విషయకము అని మాధవ మతము.

మూ॥ శేషపర్వణి ష్టావిశేషమాహ మాధవీయే గార్గ్యః—
ప్రతిపద్య ప్రవిష్టాయాం యది చేష్టిః సమాప్యతే
పునః ప్రణీయకృత్స్నేష్టిః కర్తవ్యాయాగ విత్తమైః॥

గృహ్యాగ్నేర్నాయం నియమ ఇతి మదనరత్న పారిజాతః. ఏవం పర్వాంత్యాంశః. ప్రతిపదశ్చ త్రయోంఽశాః యాగకాలః ఉక్తః. క్వచిత్ప్రతిపత్తుర్యాంశేఽపియాగః.

సంధిర్యద్యపరాహ్ణేస్యాత్ యాగం ప్రాతఃపరేఽహని
కుర్వాణః ప్రతిపద్భాగే చతుర్థేఽపినదుష్యతి॥ ఇతి వృద్ధ శాతాతపోక్తేః ఏతత్పూర్ణిమా పరమితి మదనరత్నే. పర్వణిప్రతిపదః క్షయస్య వృద్ధేశ్చార్థం ప్రక్షిప్య సంధిర్జ్ఞేయః తదాహమాధవః -

వృద్ధిః ప్రతిపదో యాఽ స్తితదర్ధం పర్వణిక్షిపేత్
క్షయస్యార్థం తథాక్షిప్త్వా సంధిర్నిర్ణీయతాం సదా॥ ఇతి
కాత్యాయనోఽపి -
పరేహ్ని ఘటికాన్యూనాః తద్రైవాభ్యధి కాశ్చయాః
తదర్థ క్లుప్త్వా పూర్వస్మిన్ హ్రాసవృద్ధీ ప్రకల్పయేత్॥ ఇతి ఏవం స్మార్త స్థాలీ పాకేఽపిజ్ఞేయం. తత్రేష్టిస్థాలీ పాకావాధాన గృహప్రవేశనీయ హోమానంతర భావిన్యాం పౌర్ణమాస్యాం ప్రారంభణీయానతుదర్శే యద్యారం భేమలమాస పౌషమాస గురుశుక్రాస్తాది భవతి తదాప్యారంభః కార్యః. యానితు -
ఉపరాగోఽధి మాసశ్చ యది ప్రథమ పర్వణి
తథామలిమ్లుచే పౌషే నాన్వారంభణమిష్యతే॥
గురుభార్గవయోర్మౌఢ్యే చంద్రసూర్యగ్రహే తథా - ఇతి సంగ్రహ వచనాని, తాని ఆలస్యాదినా అతిక్రాంత శుద్ధకాల ప్రారంభ విషయాణి.
నామకర్మచ దర్శేష్టిం యథా కాలం సమాచరేత్
అతిపాతే సతి తయోః ప్రశస్తే మాసి పుణ్యభే॥ ఇత్య పరార్కే గర్గవచనాదితి ప్రయోగ పారిజాతే. ఉక్తంబైతత్ ప్రయోగ రత్నే భట్టైః. కాలాదర్శేతు నామకర్మచ జాతేష్టిం' ఇతి పాఠః.

పర్వం యొక్క శేషకాలంలో యాగమైతే విశేషమును మాధవీయంలో గార్గ్యుడు ఇట్లా అంటాడు - ప్రతిపద ప్రవేశించకుండానే ఒకవేళ ఇష్టి సమాప్తమైతే, యాగవిత్తములైనవారి ద్వారా తిరిగి ప్రణయనం చేసి సంపూర్ణ ఇష్టిని చేయాలి. (ప్రణీయ్య - అగ్ని పుట్టించి) అని. గృహ్యాగ్నికి ఈ నియమం లేదు అని మదనరత్న పారిజాతవచనము. ఈ రకంగా పర్వ అంత్యాంశము ప్రతిపద యొక్క మూడు అంశములు యాగకాలము అని చెప్పబడింది. ఒక్కొకచో ప్రతిపదయొక్క నాల్గవ భాగంలో కూడా యాగము చెప్పబడింది. అపరాహ్ణంలో సంధి ఉంటే, యాగము తర్వాతిరోజు ఉదయమున ప్రతిపదలో యజ్ఞమాచరించాలి. నాల్గవ భాగంలో యజ్ఞం దోషంకాదు అని వృద్ధశాతాతపుని వచనము. ఇది పూర్ణిమాపరకము అని మదన రత్నంలో ఉంది. పర్వమందు ప్రతిపద యొక్క క్షయం అట్లాగే వృద్ధియొక్క అర్ధాన్ని (సగం) కలిపి సంధి అని తెలుసుకోవాలి. దీనినే మాధవుడు ఇట్లా అన్నాడు - ప్రతిపదతిథి వృద్ధిలో ఉంటే, దాని అర్ధ తిథిని పర్వంలో కలపాలి. అట్లాగే క్షయ తిథియొక్క అర్ధ

భాగాన్ని కలిపి, సంధిని ఎప్పుడూ నిర్ణయించాలి అని. కాత్యాయనుడు కూడా ఇట్లా అన్నాడు - తరువాతి రోజు గడియలు తక్కువ లేదా ఎక్కువ అయిన పక్షంలో, వాని అర్ధభాగాన్ని ఊహించి, పర్వంలో క్షయ, వృద్ధులు కల్పించాలి అని. అట్లాగే స్మార్తస్థాలీపాకమందును గ్రహించాలి. అచట ఇష్టిస్థాలీపాకము లను అధాన, గృహప్రవేశనీయ హోమము తర్వాత రాబోయే పూర్ణిమయందు ప్రారంభించాలి, అమావాస్య యందు కాదు అని. అరంభ మందు మలమాస, పౌషమాస గురు శుక్ర అస్తాదులు ఉంటే, అప్పుడు కూడా అరంభము చేయాలి. ఏద్రైతే - ప్రథమ పర్వంలో గ్రహణ, అధిమాసములు ఉంటే, పౌష మాసంలో మల మాసం ఉంటే దానియందు, గురు శుక్రుల మూఢమందు, చంద్ర సూర్యుల గ్రహణమందు అన్వారంభణము ఇష్టంకాదు అనే సంగ్రహ వచనాలున్నాయో అవి అలస్యాదులవల్ల గడచిన శుద్ధకాల ప్రారంభ విషయ పరకములు. అపరార్కంలో గర్గుడు ఇట్లా అంటాడు- నామకర్మ, దర్శేష్టి వీటిని యథా సమయంలో చేయాలి. సకాలంలో చేయకపోతే వాటిని పరిశుద్ధ మాసంలో, పుణ్యమైన నక్షత్రంలో ఆచరించాలి అని, ప్రయోగ పారిజాత వచనము. దీనిసే ప్రయోగరత్నంలో భట్టులు చెప్పారు.

కాలాదర్శంలో మాత్రం - "నామకర్మ మరిజాతేష్టి" అని పాఠము ఉంది.

మూ॥ **యాజ్ఞికాస్తు -**

అధానానంతరా పౌర్ణమాసీ చేన్మలమాసగా

తస్యామారంభణీయాదీన్నకుర్వీత కదాచన॥ ఇతి త్రికాండ మండన వచనాత్ శుద్ధ కాల ఏవ బిభ్రష్టేష్టింకృత్వా ఆరంభం కుర్యాదిత్యాహుః.

కాలాదర్శేస్మృతి సంగ్రహేఽపి-

అరంభం దర్శపూర్ణేష్ట్యోః అగ్నిహోత్రస్యదాదిమం

ప్రతిష్ఠాపంచకూర్మాద్యాః మలమాసేవివర్జయేత్॥

యాజ్ఞికులు ఇట్లా అంటారు- అధానం తర్వాతి పౌర్ణమాసం మలమాసంలో వస్తే అందులో అరంభించాల్సిన ఇష్టి మొ॥ వాటిని ఎప్పుడూ అరంభించొద్దు అని త్రికాండ మండన వచనం ఉంది కాబట్టి శుద్ధకాలమందే(వి) బిభ్రష్టేష్టిని చేసి, అరంభించాలి అని అన్నారు. కాలాదర్శమందు, స్మృతి సంగ్రహంలోను ఇట్లా ఉంది- దర్శపూర్ణ ఇష్టిని అగ్నిహోత్ర అరంభమును, పంచకూర్మాదుల ప్రతిష్ఠను, మలమాసంలో విసర్జించాలి అని.

మూ॥అథవికృతీష్టిః తత్రాపస్తంబః-యదీష్ట్యాయదిపశునా యదిసోమేనయ జేత సోఽమావాస్యాయాం పౌర్ణమాస్యాంచ ఇతి. అత్ర ప్రకృతితఃకాలే సిద్ధేఽపి సద్యస్కాలతా విధేయా. తృతీయా సాంగత్వేనోక్తేః అత్ర పౌర్ణమాస్యమా వాస్యాశబ్దాభ్యాం తదంత్యక్షణో గృహ్యతే తేనతద్వత్యహోరాత్ర ఇత్యర్థమాహ రామాండారః మాధవోఽపి - ఇష్ట్యాది వికృతిః సర్వాపర్వణ్యేవేతి నిర్ణయః, ఇతి అత్ర విశేషమాహ త్రికాండ మండనః; కాత్యాయనశ్చ—

అవర్తనాత్ప్రాక్ యది పర్వసంధిః కృత్వాతుతస్మిన్ ప్రకృతిం వికృత్యాః
తద్దైవయాగః, పరతోయదిస్యాత్, తస్మిన్ వికృత్యాః ప్రకృతేః పరేద్యుః॥

ఇతి॥ ధూర్తస్వామ్యాదయోఽప్యేవమాహుః - యదీష్ట్యా ఇతి సాంగాయాః వికృతేః పర్వకాలత్వాదావర్తనాత్ ప్రాక్‌సంధౌ "సంధిమభితోయజేత్" ఇతి ప్రకృతేః ప్రతిపది సమాప్తి నియమాత్. ప్రకృత్యనంతరం, ప్రతిపది వికృత్య యోగాత్ పూర్వేద్యుః వికృతిరిత్యుక్తం తంత్రరత్నే పార్థసారథినా. యద్యపి, ప్రకృతేః పూర్వత్వాత్ అపూర్వమంతేస్యాత్, ఇత్యాపస్తంబేనోక్తం, తథాఽపి హేతువాదేన శ్రుతిమూలత్వాభావాదంగంవా సమభివ్యాహారాదితివద ప్రామాణ్యమితి తదాశయః. ఆగ్రయణేతు విశేషం వక్ష్యామః, అన్వారంభణీయాతు చతుర్దశ్యాం కార్యా, ఇతి హిరణ్య కేశివృత్తౌ మాతృదత్తీయే. అన్యేషాం పర్వణ్యేవ.

ఇక వికృతీష్టి, అక్కడ అపస్తంబ వచనం - ఇష్టితో, పశువుతో, సోమంతో యజ్ఞం చేయాలి అని అనుకుంటే దానిని అమావాస్యయందు, పౌర్ణమాసి యందు చేయాలి అని. ఇక్కడ ప్రకృతివల్ల కాలం సిద్ధమైనా, సద్యస్కాలత విధించాలి. ఇక్కడ తృతీయ విభక్తివల్ల, సాంగముగా అని చెప్పబడింది. ఇక్కడ పౌర్ణమాసి, అమావాస్య శబ్దాలవల్ల వాని అంత్యక్షణం గ్రహించాలి. దానివల్ల అంతిమక్షణంతో కూడిన అహోరాత్రములు అనే అర్థాన్ని రామాండా రులు చెప్పారు. మాధవుడు కూడా ఇష్టాదివికృతి అంతా పర్వమందే ఔతుంది అని నిర్ణయము అని అన్నాడు. త్రికాండమండనుడు, కాత్యాయనుడు ఇక్కడ విశేషం చెప్పారు. ఆవర్తనకంటే ముందే పర్వసంధి ఐతే అప్పుడు ప్రకృతిని చేసి, తర్వాత వికృతి (యాగం) ఔతుంది. అదే యాగం పరదినమందైతే ఆ రోజు వికృతిని ఆచరించి, ఆ తర్వాతి రోజు ప్రకృతిని ఆచరించాలి, అని చెప్పారు. ధూర్తస్వామి మొదలగువారు ఇదే చెప్పారు - యదీష్ట్యా, అనే వాక్యంతో సాంగ వికృతి పర్వకాలానికి చెందింది కనుక, ఆవర్తనంకన్న ముందు సంధి యందు

'సంధిమభితో యజేత్' అని ప్రకృతిని ప్రతిపదయందు పూర్తి చేయాలనే నియమం ఉంది. ప్రకృతి తర్వాత ప్రతిపదయందు వికృతియోగం లేదు కనుక ముందురోజే వికృతిని ఆచరించాలి అని తంత్రరత్నంలో పార్థసారథి చెప్పారు. ప్రకృతి పూర్వం కనుక, అపూర్వం అంతమందు, అని అపస్తంబులు చెప్పినా హేతువాదంతో, శ్రుతిమూలం లేదు కాబట్టి 'అంగంవాసమభివ్యాహారాత్' అనుదానివలె అప్రామాణ్యము అని దాని అభిప్రాయం. అగ్రయణంలో విశేషాన్ని చెపుతాము. ఆన్వారంభణీయాన్ని చతుర్దశిలో చేయాలి అని హిరణ్యకేశి వృత్తియందు, మాతృదత్తీయమందు ఉంది. ఇతరుల మతంలోనైతే పర్వంలోనే చేయాలి.

మూ॥ పశౌసోమేచకాలాంతరమప్యాహబౌధాయనః - అమావాస్యేనవాహ విశేష్ట్వానక్షత్రేవా, ఇతి శుక్లపక్షేకృత్తికాది విశాఖాన్తేషు దేవనక్షత్రేష్వితి కేశవస్వామీ వ్యాచఖ్యౌ. చాతుర్మాస్యేష్వపి ద్వాదశాహ యథాప్రయోగపక్షయోః నక్షత్రేష్వప్యారంభః. యావజ్జీవసాంవత్సర ప్రయోగయోస్తు ఫాల్గున్యాం చైత్ర్యాంవా ఆరంభః.

పశౌతువిశేషమాహకాత్యాయనః -

అర్ధాదహ్నో భవతినియతం పర్వసంధిః పరస్తాత్
కృత్వాతస్మిన్నహనితు పశుంసద్యఏవద్వ్యహంవా
ఆరభ్యాఽథప్రకృతిరథ చేత్ పర్వసంధిః పురస్తాత్
కృత్వాతస్మిన్ ప్రకృతి మథతు స్యాత్పశుఃసద్యఏవ॥

అధికారపశుస్త్వగ్నీషోమీయేన సవనీయేనవా సమానతంత్రకార్యః, ఇతిత్రికాండమండనః. సోమేత్వాహాఽపస్తంబః - అమావాస్యాయాం దీక్షాయజనీయేవా అమావాస్యాయాం, యజనీయోవాస్తుత్యమహః, పౌర్ణమాస్యాం దీక్షాయజనీయే పౌర్ణమాస్యాం యజనీయేవాస్తుత్యమహః ఇతి. లాట్యాయన సూత్రేఽపి - పూర్వపక్షస్య ప్రథమేఽహని దీక్షేత దృష్ట్వావా నక్షత్రయోగం ఇతి. పూర్వపక్షః శుక్లపక్షః నక్షత్రయోగేచేతి. అయమర్థః - చైత్ర్యాది పూర్ణిమాయాః చిత్రాది నక్షత్రయోగేదీక్షేతేతి. ఆధానంతు పర్వణి నక్షత్రేషుచోక్తం. తత్రపర్వ, 'నక్తంగార్హపత్యమాదధాతి' ఇత్యాది కర్మకాల వ్యాపి గ్రాహ్యం. దినద్వయే తత్వేపరం గ్రాహ్యం. సంకల్పస్య పర్వణి లాభాత్ పూర్వనక్షత్రయోగే తదేవ గ్రాహ్యం. యత్రత్రీణిసన్నిపతితాని ఋతుర్నక్షత్రం పర్వచ, తత్సమృద్ధం విప్రతిషేధే ఋతునక్షత్రంచ బలీయః' ఇతి హిరణ్యకేశిసూత్రాత్ ఋతుః 'వసంతే బ్రాహ్మ

ణోఽగ్నిమాదధీత' ఇత్యాదిః రేణుకకారికాయాంతు -

మాఘాది పంచమాసేషు శ్రావణేచాశ్వినే తథా.

మార్గశీర్షే శుక్లపక్షే ఆధానమథకారయేత్॥ ఇత్యుక్తం. అత్రమూలం మృగ్యం.

పశుయాగ, సోమయాగములందు, బోధాయనుడు కాలాంతరాన్ని కూడా చెప్పాడు- అమావాస్య హవిస్సు ద్వారా యాగం చేసి, నక్షత్రమందు కాని అని. శుక్లపక్షమందు కృత్తికాది విశాఖాంతదేవ నక్షత్రములందు చేయాలి అని కేశవ స్వామి అన్నాడు. చాతుర్మాస్యమందు కూడా ద్వాదశాహ యథా ప్రయోగపక్షము లను నక్షత్రములందు కూడా ఆరంభించవచ్చును. (ద్వాదశాహ, మొదటిరోజు వైశ్వదేవం పర్వము, నాల్గవరోజు వరుణప్రఘాసం, ఎనిమిది తొమ్మిదిరోజులలో సాకమేధము, ద్వాదశమందు శునాసీయము అని ఒక పక్షము. క్రమంగా పర్వ చతుష్టయమని రెండోపక్షము, ఫాల్గుణపౌర్ణమిన ఆరంభించి నాల్గు మాసములలో క్రమంగా ఒక్కొక్క పర్వము ఈ రకంగా యావజ్జీవితము అని తృతీయ పక్షము. ఒక సంవత్సరం అట్లాచేసి సవనయాగ, పశు, సోమయాగములలో ఒకదానితో యాగం చేయాలి అని నాల్గవ పక్షం, ఏకాహచాతుర్మాస్య ప్రయోగ మును కూడా శాంకాయనుడు చెప్పాడు, అపివాఽప్యేక పర్వణి అని.) యావజ్జీవ, సాంవత్సర ప్రయోగములలో ఫాల్గుణమందో చైత్రమందో ఆరంభిం చాలి. పశుయాగ మందు విశేషాన్ని కాత్యాయనుడు ఇట్లా చెప్పాడు - సగందినం తర్వాత పర్వసంధి నియతమైతే, ఆ రోజే లేదా రెండు రోజులు పశుయాగం చేసి ప్రకృతిని చేయాలి. పర్వసంధి ముందే ఐన పక్షంలో మొదలు ప్రకృతిని చేసి, ఆ రోజే పశుయాగంచేసి వెంటనే అనుష్ఠానం చేయాలి అని. త్రికాండ మండనుడైతే ఇట్లా అన్నాడు- అధికారపశువు (ఐంద్రాగ్నపశుయాగ) అగ్ని షోమీయ పశువుతో లేదా సవనీయ పశువుతో కూడా సమానక్రియతో చేయాలి అని. సోమయజ్ఞంలో ఆపస్తంబుడు ఇట్లా అంటాడు- అమావాస్యలో దీక్షా యజనీయమందు లేదా అమావాస్యలో యజనీయముకాని, ఆరోజే (పగలే) మంచి రోజు. పౌర్ణమాసీయందు దీక్షాయజనీయంలో లేదా యజనీయమందు కాని పౌర్ణమాసియే స్తుత్యము అని. లాటాయన సూత్రమందు కూడా ఇట్లా ఉంది. శుక్లపక్షపు ప్రథమ రోజున దీక్ష స్వీకరించాలి, లేదా (పుణ్య) నక్షత్రయోగం చూసి ఐనా దీక్ష వహించాలి అని. పూర్వపక్షము శుక్లపక్షము, నక్షత్రయోగ

మందుకూడా అని అనగా చైత్రాది పూర్ణిమకు చిత్రాదినక్షత్రయోగంలో దీక్ష వహించాలి అని. ఆధానమైతే పర్వమందు, నక్షత్రములందు చెప్పబడింది. అక్కడ పర్వమనగా, 'రాత్రియందు గార్హపత్యమును ఆధానం చేయాలి' అని మొదలుగా కర్మకాల వ్యాప్తియైన దాన్ని గ్రహించాలి. రెండు రోజులుంటే పరదినం గ్రహించాలి. సంకల్పము, పర్వమందే లాభిస్తుంది. పూర్వం నక్షత్ర యోగమైతే దాన్నే గ్రహించాలి. ఎక్కడ మూడు సంక్రమిస్తాయో, ఋతు, నక్షత్ర, పర్వములు ఉంటాయో అది సమృద్ధము. విరోధమందు ఋతు, నక్షత్రములు బలవంతమౌతాయి అని హిరణ్యకేశి సూత్రమందు ఉంది. ఋతువు అనగా వసంతమందు బ్రాహ్మణుడు అగ్నిని ఆధానం చేయాలి అని మొదలగునది. రేణుకకారికయందు ఇట్లా ఉంది - మాఘాది పంచమాసాలలో శ్రావణ, ఆశ్వయుజములు, మార్గశీర్ష శుక్లపక్షములలో ఆధానం చేయాలి అని చెప్పారు. దీనికి మూలాధారము కన్పించుట లేదు.

మూ॥ ఆధాన నక్షత్రాణితు ఆపస్తంబ సూత్రే - కృత్తికా, రోహిణీ, మృగశీర్ష, పునర్వసు పూర్వోత్తరా ఫాల్గునీ, హస్త, చిత్రా, విశాఖా, అనూరాధా, శ్రవణోత్తరా భాద్రపదా, ఇతి (కృత్తికా, రోహిణీ, మృగశీర్ష, పునర్వసు, (పుష్య) పూర్వోత్తరా, పూర్వాషాఢో - త్తరా, హస్త, చిత్రా, విశాఖా, అనూరాధా, శ్రవణోత్తరా భాద్రపదా. సోమపూర్వాధానే విశేషమహాఽపస్తంబః- 'సోమేన యక్ష్యమాణ అదధానోనర్తూ న్సూర్ క్షేన్న నక్షత్రం' ఇతి. అత్రప్రకరణాదాధాన కాలబాధః. తేనసోమస్య వసంతకాలతాన బాధ్యతే, ఇతి రుద్రదత్త వృత్తౌనారాయణా వృత్తౌచోక్తం. తంత్రరత్నే వార్తికేచ - తేవా ఏతే ఉభయే అపహత పాప్మానో ఋతవః. ఏషావా ఉద్యన్నాదిత్య ఏషాంపాప్మనో అవహన్తా. యద్రైవైవం కదాచన యజ్ఞ ఉపనమేద థాదధీత, ఇత్యత్ర ఉత్తరాయణరూపం దైవం, దక్షిణాయనరూపంచ పిత్ర్యం ఇత్యుభయం ఋతుత్రయం సోమాధానే శతపథే విశిష్య విహితం. తదేక వాక్యతయాశాఖాంతరేఽపి నర్తూన్ సూర్ క్షేత్ ఇత్యత్ర సోమకాల బాధ ఏవ. ఆధానకాలబాధస్య, యద్రైవైనం శ్రద్ధోపనమేత్త దాదధీత, ఇతితస్యాం శాఖాయాం వాక్యాన్తరేణ సిద్ధత్వాత్ సోమకాల బాధార్థమేవేదమిత్యుక్తం. ధూర్తస్వామీతు - సోమస్యాపియఋతుస్తస్యాపి, నసూర్ క్షేత్ ఇతి లిఖనాత్ ఉభయ కాల బాధం మన్యతే. శ్రీరామాండా రస్తుకాలాంతర విధానం వాసర్వకాలానాదరోవేతి పక్షద్వయముక్తవాన్. తాత్రాద్యేకృత్తికాది కాలానంతరస్యయథా ఆధానే వసన్తాద్య బాధేన విధానం, తథా, సోమేప్యుదగయన

పూర్వ పక్ష పుణ్యాహసన్నిపాతే యజ్ఞకాలోనా దేశః, ఇతి ఛందోగ సూత్రోక్తో దగయనా బాదేన సోమాభి సంధి రూపకాలాంతర విధానాదుదగయనం త్వపేక్ష్యత ఇత్యుక్తం. ద్వితీయపక్షేతు యదైవైనం (కాలాంతరే) యజ్ఞ ఉపన మేత్ ఇతి సర్వకాలానాదర ఉక్త ఇతి భారద్వాజ సూత్రాత్ సర్వ శబ్దస్య విశ్వ జిత్ సర్వ పృష్ఠ ఇతి వత్ద్వయోరప్రయోగాత్సర్వకాల బాధ ఇతి తేన దక్షిణా యనేఽపి భవతీత్యుక్తం. షడ్గురుభాష్యే దేవత్రాతభాష్యే తంత్ర రత్నేచ షట్ స్వపి ఋతుషు భవతీత్యుక్త మితిదిక్.

ఆధాన నక్షత్రములు, ఆపస్తంబ సూత్రంలో ఇట్లా ఉన్నాయి- కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, విశాఖ, అనూ రాధ, శ్రవణం, ఉత్తరాభాద్ర అని. సోమ పూర్వక ఆధానమందు విశేషాన్ని ఆపస్తంబుడు ఇలా చెప్పాడు - సోమయజ్ఞంచేసేవాడు ఆధానంలో ఋతు, నక్షత్ర విషయమై శ్రద్ధ వహించరాదు. అని ఇక్కడ ప్రకరణాన్ననుసరించి ఆధాన కాలానికి బాధఔతుంది. అందువల్ల సోమమునకు వసంతకాలత్వం బాధ కాదు అని రుద్రదత్త వృత్తియందు, నారాయణ వృత్తియందు చెప్పబడింది. తంత్ర రత్నమందు, వార్తికమందు ఇట్లా చెప్పారు - ఈ రెండుప్రకారాల ఋతువులు దోషరహితమైనవి. ఇవి సూర్యోదయం ఔతూనే, ఈ ఋతువుల పాపాన్ని నశింపచేస్తాయి. ఎప్పుడైనా యజ్ఞం మీద శ్రద్ధ కల్గితే అప్పుడే ఆధానం చేయాలి. అనే చోట ఉత్తరాయణము దైవ కార్యాలకు, దక్షిణాయనం పితృ కార్యాలకు, అని. ఈ రెండు ఋతుత్రయము సోమాధానమందు, శతపథ బ్రాహ్మణంలో విశేషంగా చెప్పారు. అందువల్ల ఏకవాక్యత చే శాఖాంతరమందు కూడా, ఋతువు లను ఆదరించరాదు అనేచోట సోమకాల బాధయే. ఎప్పుడైతే శ్రద్ధ కలిగితే అప్పుడే ఆధానం చేయాలి, అని ఆ శాఖయందు మరో వాక్యంవల్ల ఆధానకాల బాధ సిద్ధించినందువల్ల సోమకాల బాధ కొరకే ఇది అని ఇన్నారు. ధూర్తస్వామి మాత్రం - సోమానికి ఏ ఋతువుందో దాన్ని పరీక్షించరాదు, అని వ్రాయటం వల్ల, ఉభయ కాల బాధను అంగీకరిస్తున్నారు. శ్రీరామాండారులైతే - కాలాంత రాన్ని విధించటమో లేదా అన్ని కాలముల అనాదరమో అని రెండు పక్షములను చెప్పాడు. మొదటి పక్షంలో కృత్తికాది కాలాంతరము, ఆధానమందు వసంతా దుల బాధ లేనందువల్ల విధానమో అట్లాగే సోమమందు, ఉత్తరాయణ, పూర్వ పక్ష, పుణ్య దినము సంప్రాప్తమైతే యజ్ఞకాలము ఆదేశింపబడలేదు అని చందోగ సూత్రంలో చెప్పబడ్డ, ఉత్తరాయణానికి బాధ లేనందువల్ల సోమాభి సంధి రూపకాలాంతర విధానము ఉత్తరాయణాన్ని అపేక్షిస్తుంది అని చెప్పారు.

రెండవ పక్షంలో, యద్రైవైనం యజ్ఞ ఉపనమేత్ అని, అన్ని కాలము లకు అనాదరం చెప్పారు అనే భారద్వాజ సూత్రంవల్ల సర్వ శబ్దానికి, విశ్వజిత్ సర్వపృష్ఠే' అనేదానివలె రెండింటి అప్రయోగంవల్ల సర్వకాల బాధ అని. అందువల్ల, దక్షిణాయనంలో కూడా ఔతుంది అని చెప్పారు. షడ్ గురు భాష్య మందు, దేవత్రాత భాష్యమందు, తంత్రరత్నమందు ఆరు ఋతువులందు కూడా ఔతుంది, అని చెప్పారు అని ఇక చాలు.

మూ॥ శ్రాద్ధేతు అమావాస్యా త్రేధా విభక్త దిన తృతీయాంశేయో అపరాహ్ణ భాగః తద్భాగ వ్యాపినీ సాగ్నికైః గ్రాహ్యా.

పిండాన్వాహార్యకం శ్రాద్ధం క్షీణేరజని శస్యతే
వాసరస్య తృతీయాంశే నాతి సంధ్యాసమీపతః. ఇతి కాత్యాయనోక్తేః....

దర్శశ్రాద్ధంతు యత్ప్రోక్తం పార్వణం తత్ప్రకీర్తితం
అపరాహ్ణేపితౄణాంచ తత్రదానం ప్రశస్యతే॥ ఇతి శాతాత ప్రోక్తేశ్చ, దినద్వయేతత్ర సత్వేసర్వాపరాహ్ణవ్యాపీదర్శో గ్రాహ్యః. యద్వ్యేయేద్యు రేష విహితః సర్వాపరాహ్ణ స్థితః, ఇతిదీపకోక్తేః. యత్తుకార్ష్ణాజినిః—

భూత విద్ధామ మావాస్యాం మోహా దజ్ఞానతోఽపివా
శ్రాద్ధకర్మణియే కుర్యుః తేషామాయుః ప్రహీయతే॥ ఇతి.

తదపరాహ్ణే చతుర్దశీ వేధపరమితి శ్రాద్ధ హేమాద్రిః. అపరాహ్ణేఽవ్యాప్తి పరమితి మాధవః. దినద్వయే అపరాహ్ణ వ్యాప్త్యభావే అంశతో వ్యాప్తౌచ తిథిక్షయే పూర్వేతి హేమాద్రిః—

యదా చతుర్దశీయామా తురీయమను పూరయేత్
అమావాస్యా క్షీయమాణా తదైవ శ్రాద్ధమిష్యతే॥ ఇతి కాత్యాయనోక్తేః. చతుర్దశ్యాః చతుర్థం యామం దర్శః పూరయేత్. చతుర్దశీయామత్రయం స్యాదిత్యర్థః. క్షీయమాణా పరదినే అపరాహ్ణ వ్యాపినీ నేత్యర్థః.

శ్రాద్ధమందు, అమావాస్యను మూడు భాగాలుగా విభజింపబడ్డ దినము యొక్క మూడవ భాగమందు ఏ అపరాహ్ణ భాగముందో అక్కడ వ్యాపించిన అమావాస్యను గ్రహించాలి. దానిని సాగ్నికులు గ్రహించాలి. కాత్యాయనుడు

"పితరుల నుద్దేశించి చేసే దర్శశ్రాద్ధాన్ని (పిండ పితృయజ్ఞోత్తర దర్శశ్రాద్ధాన్ని) చంద్రుడు క్షీణించి నప్పుడు చేయాలి. దినము యొక్క తృతీయ భాగమందు శ్రేష్ఠము. సంధ్యకు మిక్కిలి దగ్గరగా చేయరాదు" అని అంటాడు. శాతాతపుడు ఇట్లా అంటాడు - అమావాస్యయందు చేసే శ్రాద్ధాన్ని పార్వణం అని అంటారు. దాని అపరాహ్ణ కాలమందు పితరుల నుద్దేశించి దానం చేయటం శ్రేష్ఠం అని. అమావాస్య, రెండు రోజుల్లోనూ అపరాహ్ణ వ్యాపిని ఐతే, సంపూర్ణ అపరాహ్ణ వ్యాపినియైన రోజును గ్రహించాలి. దీపికయందిట్లా ఉంది - రెండు రోజుల్లో ఇది ఉంటే, సర్వ అపరాహ్ణ వ్యాపినిని గ్రహించాలి అని. కార్ష్ణాజిని ఇట్లా అన్నాడు - చతుర్దశితో కూడిన అమావాస్య యందు మోహంవల్ల లేదా అజ్ఞానం వల్ల యెవరు శ్రాద్ధకర్మలు చేస్తారో, వారి ఆయుస్సు నశిస్తుంది అని అది అపరాహ్ణమందు చతుర్దశి వేధ ఉంటే వర్తిస్తుంది అని శ్రాద్ధమందు హేమాద్రి అన్నాడు. అది అపరాహ్ణ అవ్యాప్తి పరమని మాధవుడు అన్నాడు. రెండు రోజుల్లోను అపరాహ్ణ వ్యాప్తి లేని పక్షంలో, అంశంగా ఒక భాగంలో వ్యాప్తి ఉంటే, లేదా తిథిక్షయ మందు పూర్వాన్ని గ్రహించాలి అని హేమాద్రి. కాత్యాయనుడు ఇట్లా అంటాడు - అమావాస్య, చతుర్దశి నాల్గవ యామాన్ని పూరిస్తుందో అనగా చతుర్దశి 3 యామాలు ఉండి అమావాస్య క్షీణమై రెండవరోజు అపరాహ్ణంలో లేనప్పుడు చతుర్దశి యందే శ్రాద్ధం చేయాలి అని.

మూ॥ **వ్యతిరేకమాహ**—

వర్ధమానాం అమావాస్యాం లక్షయేదపరేఽహని
యామాన్ త్రీనధికాన్ వాపి పితృయజ్ఞస్తతో భవేత్॥

తతః శ్రాద్ధంచ—

దినద్వయే అపరాహ్ణ వ్యాప్త్యాదౌచ తిథివృద్ధౌహారీతః
త్రిముహూర్తాచకర్తవ్యా పూర్వా సర్వాచ బహ్వృచైః.

కుహూరధ్వర్యుభిః కార్యాయదేష్టం సామగీతిభిః త్రిముహూర్తాభావేతు పూర్వానేత్యర్థః

దీనికి విరుద్ధాన్ని చెప్తున్నాడు - తర్వాతిరోజు, మూడు అంతకన్న ఎక్కువ గడియలు వృద్ధి చెందుతున్న అమావాస్య ఉంటే పితృయజ్ఞం చేయాలి, తర్వాత శ్రాద్ధం చేయాలి అని. రెండురోజులు అపరాహ్ణవ్యాప్తి ఉంటే, తిథి

వృద్ధియైతే ఖర్వ అమావాస్య (చంద్రకళ గలది) మూడుముహూర్తములున్నా బహ్వృచశాఖవారు తొలిరోజు చేయాలి. కుహూను (చంద్రకళలేని అమాను) అధ్వర్యులు ఆచరించాలి. సామవేదులు తమ ఇష్టానుసారం చేయొచ్చు అని హారీతోక్తి. త్రిముహూర్తములు లేనిపక్షంలో తొలిరోజు చేయరాదు అని అర్థము.
మూ॥ పిండపితృయజ్ఞస్తు, కాత్యాయనైః యాగదినాత్ పూర్వేద్యుఃకార్యః, పూర్వోవాఽంగత్వాత్ పిండపితృయజ్ఞః, ఇతితత్సూత్రాత్ వ్యాఖ్యాతం చైతత్ కర్కాచార్యైః - పూర్వ ఏవదర్శాత్ పిండపితృయజ్ఞః, నపశ్చాత్, కుతః, అంగత్వాత్ తథాచశ్రుతిః - తస్మాత్ పూర్వేద్యుః పితృభ్యఃక్రియత ఉత్తర మహర్దేవాన్‌యజంతే, ఇతి పూర్వేద్యుః పితృభ్యోయజ్ఞం నిపృణీయ ప్రాతర్దేవేభ్యః ప్రతనుతే, ఇతిచ. తేన తన్మతే అంగమేవాసౌ. తదుక్తం - అంగం వాసమభివ్యాహారాత్, ఇతి తేనకర్కమతే చతుర్దశీయుక్తదర్శే పిండపితృయజ్ఞ ఇతి. శ్రీ అనంతభాష్యేతు పరేద్యురిత్యుక్తం. అత్రద్వేధాప్యాచారోదృశ్యతే. ఆపస్తంబానాంతు పరదినే ముహూర్తమపి దర్శసత్వే తత్రైవ పితృయజ్ఞః తదాహ ఆపస్తంబః - అమావాస్యాయాం యదహశ్చంద్రమసం నపశ్యతి, తదహః పిండపితృయజ్ఞం కురుతే, ఇతి అస్యరుద్ర దత్తీయావ్యాఖ్యా - పిండైర్యుక్తః పితృయజ్ఞః పిండపితృయజ్ఞః సచకర్మాంతరం నతుదర్శశేషః యథావక్ష్యతి - పితృయజ్ఞః స్వకాలవిధానాదనంగం స్యాత్, ఇతి తంచయదహశ్చంద్రమసం నపశ్యతి పంచదశ్యాం ప్రతిపదివా తదహఃకురుతే యదహస్తయోః సంధిస్తదహరిత్యర్థః, ఇతి. శ్రీ రామాండారోఽప్యాహ - పిండపితృయజ్ఞస్తు పర్వసంధిమ దహోరాత్రాపరాహ్ణే ఇతి. అతః పర్వసంధిదినేహి పితృయజ్ఞః శతపథశ్రుతిరపి - యదైవైషన పురస్తాత్ నపశ్చాత్ దదృశేఽథ పితృభ్యోదదాతి, ఇతి. పర్వ సంధి దినేహి పూర్వతః పశ్చాద్వాచంద్రో నదృశ్యత ఏవేత్యర్థః సత్యాషాఢోఽపి పితృయజ్ఞం ప్రక్రమ్య - దృశ్యమానేతూ పోష్యశ్వోభూతేయజతే, ఇత్యాహ. హేమాద్రిస్తు - అమావాస్యాశబ్దస్తిథివచన ఏవ. పూర్వోక్తాపస్తంబసూత్రే యదుక్తం 'నపశ్యతి' ఇతి, తత్రక్షయోభిప్రేతః అతశ్చతుర్దశ్యాం చంద్రస్య క్షీణత్వాత్తద్యుక్తదర్శే పితృయజ్ఞః. పితృయజ్ఞంతు నిర్వర్త్య విప్రశ్చంద్రక్షయేఽగ్నిమాన్, ఇతి మనూక్తేః. యదుక్తం - యదహస్త్వేవ దదృశంనైతి చంద్రమాః, తత్‌క్షయాపేక్షయాజ్ఞేయం, క్షీణేరాజనిచేత్యపి, ఇతి, యదుక్తం దృశ్యమానేఽపి తచ్చతుర్దశ్యపేక్షయా ఇతిచ కాత్యాయనోక్తేః దృశ్యమానేప్యేకే, ఇతిగోభిలోక్తేశ్చ.

యస్యాంసంధ్యాగతఃసోమో మృణాళమివదృశ్యతే
అపరాహ్ణేఽయస్తస్యాం పిండానాంకరణం ధృవం॥ ఇతి హారీతోక్తేశ్చ.

పింధ పితృ యజ్ఞమైతే, యాగ దినానికి ముందు రోజే చేయాలి అని కాత్యాయనోక్తి. పిండపితృయజ్ఞం ముందే చేయాలి, అంగమైనందువల్ల అని కాత్యాయనుని సూత్రం. దీనిని కర్కాచార్యులు ఇట్లా వ్యాఖ్యానించారు-అమావాస్య కంటె ముందే పిండపితృయజ్ఞం చేయాలి, తర్వాతకాదు. ఎందువల్లనంటే - అంగం కాబట్టి అందుకు శ్రుతి - "దానికి ముందు రోజు పితరులకై ఆచరించాలి. తర్వాతి రోజు దేవతలను పూజించాలి'' అని "ముందురోజు పితరులకై యజ్ఞం ఆచరించాలి తరువాతి ఉదయంలో దేవతల గూర్చి యజ్ఞాన్ని విస్తరించి చేయాలి'' అని కూడా అందువల్ల ఆయన మతంలో ఇది అంగమే అని. అది ఇట్లా చెప్పబడింది - అంగం కూడా అని చెప్పబడింది అని. అందువల్ల కర్క మతంలో, చతుర్దశీయుక్త అమావాస్యరోజున పిండపితృ యజ్ఞము అని.

శ్రీ అనంత భాష్యంలోనైతే తరువాతి రోజు అని చెప్పబడింది. ఇక్కడ రెండు విధాల ఆచారము కన్పిస్తోంది. ఆపస్తంబులకైతే, పరదిన ముందు ముహూర్త మాత్రమైనా అమావాస్య ఉంటే అక్కడే పితృయజ్ఞం ఆచరించాలి. అది ఇట్లా చెప్పారు ఆపస్తంబులు - అమావాస్యయందు ఏ రోజు చంద్రుడు కన్పించడో, ఆ రోజు పింద పితృయజ్ఞం ఆచారించాలి అని. దీనికి రుద్రదత్తీయ వ్యాఖ్య ఇట్లా ఉంది - పిండములతో కూడిన పితృయజ్ఞము, పిండపితృయజ్ఞము. అది మరొక కర్మ. దర్శమునకు శేషము కాదు. ఎట్లాగంటే - పితృయజ్ఞం, తన కాలంలో విధించబడుతోంది కనుక అంగం కాదు, అని. దానిని, ఏ రోజు చంద్రుణ్ణి చూడరో (కన్పించడో) పూర్ణిమయందో, ప్రతి పదయందో ఆ రోజు చేయాలి. ఏరోజు ఆ రెంటికి సంధియో ఆ రోజు చేయాలి అని అర్థము అని. శ్రీరామాండారుడు కూడా ఇట్లా చెప్పాడు - పింద పితృయజ్ఞమైతే, పర్వసంధి గల్గిన అహోరాత్రములలోని అపరాహ్ణకాలమందు చేయాలి అని. అందువల్ల పర్వసంధి దినమందే పితృయజ్ఞము. శతపథ శ్రుతికూడా ఇట్లా చెప్తోంది - ఎప్పుడైతే ఇది పూర్వసంధి దినమందు, లేదా పరదినమందు చంద్రుడు కన్పించడో అప్పుడు పితరులకై ఇస్తాడు అని. పర్వసంధి దినమందు, ముందుకాని తర్వాతకాని చంద్రుడు కన్పించని రోజే అని అర్థము.

సత్యాషాఢుడు కూడా పితృయజ్ఞ ప్రసంగం ఆరంభించి, చంద్రుడు కన్పించిన రోజు చతుర్దశిలో ఉపవసించి, తెల్లవారి యజ్ఞం చేస్తారు అని అన్నాడు. హేమాద్రి మాత్రం అమావాస్య శబ్దము తిథి బోధకము. ముందు చెప్పిన ఆపస్తంబ సూత్రంలో కన్పించనిరోజు అని ఏది చెప్పారో, అక్కడ (చంద్ర) క్షయము అభిప్రేతము. అందువల్ల చతుర్దశి రోజు చంద్రుడు క్షీణించినందువల్ల, చతుర్దశీయుక్త అమావాస్య యందు పితృయజ్ఞము చేయాలి. అగ్ని కలిగిన బ్రాహ్మణుడు చంద్రుడు క్షీణించినప్పుడు పితృయజ్ఞాన్ని నిర్వర్తించి మిగిలిన కర్మ చేయాలి అని మను వచనము. ఏ రోజైతే చంద్రుడు కన్పించడో అని ఏ మాట చెప్పాడో, అది క్షయ విషయకమని గ్రహించాలి. చంద్రుడు క్షీణించాక కూడా అని కూడా అని, చంద్రుడు కన్పించినా అని ఏది చెప్పారో అది చతుర్దశి విషయకమని గ్రహించాలి అని కాత్యాయనుని వచనం. చంద్రుడు కన్పించినా పితృయజ్ఞం చేయొచ్చు అని కొందరు అన్నారు అని గోభిలవచనం కూడా. ఏ రోజు చంద్రుడు, సాయం సంధ్యయందు తామర తంతువువలె (దారం) కన్పిస్తాడో ఆతడు అపరాహ్ణమందు క్షయిస్తాడు కనుక ఆ రోజు పిండదానం తప్పకుండా చేయాలి అని హారీతోక్తి కూడా.

మూ॥ చంద్రక్షయకాలశ్చోక్తః కాత్యాయనేన -

అష్టమేంశే చతుర్దశ్యాః క్షీణోభవతి చంద్రమాః
అమావాస్యాష్టమేంశేతు పునఃకిలభవేదణుః॥

ఇతి. తేనపూర్వేద్యురేవ పితృయజ్ఞ ఇత్యూచివాన్. కర్కాచార్యైరపి - "అపరాహ్ణేపిండ పితృయజ్ఞః చంద్రా దర్శనే అమావాస్యాయాం" ఇతి కాత్యాయన సూత్రే అదర్శనేన క్షయఏవోక్తః 'తస్మిన్‌క్షీణేదదాతి 'ఇతిశ్రుతేః. అతస్తన్మతే చరుర్దశీయుక్తదర్శే పితృయజ్ఞేసతిపరదినే యాగోర్థాత్‌సిద్ధః తదేతత్సర్వోత్కృష్టమపిహేమాద్రి కర్కాది వ్యాఖ్యానం ఆపస్తంబైరనభ్యుపగమాత్ కాతీయ బౌధాయనాది విషయం. ఆశ్వలాయనానామపిశేషపర్వణి పిండపితృయజ్ఞః తథాప సూత్రం - అమావాస్యాయామపరాహ్ణే పిండపితృయజ్ఞః 'ఇతి అత్రనారాయణవృత్తిః - అమావాస్యాశబ్దః ప్రతిపత్పంచదశ్యోః సంధివచనోప్యత్ర అపరాహ్ణశబ్దసమన్వయాత్ తద్వత్యహోరాత్రేవర్తతే - తస్యాపరాహ్ణే చతుర్థేభాగే పిండపితృయజ్ఞః కార్యః ఔపవసధ్యేయ జనీయేవాఽహని. యదా త్వహోరాత్ర సంధౌ తిథిసంధిః స్యాత్తదౌపవసథ్యే ఏవాహనిక్రియతే ఇతి. అత ఏవ ముహూర్తమప్యమావాస్యా ప్రతిపద్యపిచేద్భవేత్

తద్దత్ర మక్షయం పర్వజ్ఞేయం శేషంతు పర్వవత్॥ ఇతి హేమాద్రౌవచనం పిండపితృయజ్ఞపరముక్తం ప్రయోగపారిజాతే. అయంచ స్మార్తాగ్నిమతా సంపూర్ణదర్శే శ్రాద్ధవ్యతిషంగేణ కార్యః వ్యతిషంగోనామ ఉభయోఃసహానుష్ఠానం. ఏతచ్చస్థాలీ పాకేనసహపిండార్థముద్ధృత్య, ఇతి సూత్రే వృత్తి కృతోక్తం

చంద్రక్షయకాలాన్ని కాత్యాయనుడు ఇట్లా చెప్పాడు - చతుర్దశియొక్క ఎనిమిదవ భాగంలో చంద్రుడు క్షీణిస్తాడు. అమావాస్య యొక్క ఎనిమిదవ భాగమందు అణువౌతాడు అని. అందువల్ల ముందు రోజే పితృయజ్ఞం చేయాలి అని చెప్పాడు. కర్కాచార్యులు కూడా ఇట్లా చెప్పారు- చంద్రుడు కన్పించని పక్షంలో అమావాస్య యొక్క అపరాహ్ణకాలమందు పిండ పితృయజ్ఞం చేయాలి అని. కాత్యాయన సూత్రంలో చంద్రుడు కన్పించకపోతే క్షయమనే చెప్పబడింది. 'చంద్రుడు క్షీణిస్తే ఇవ్వాలి' అని శ్రుతి వాక్యం కూడా ఇందువల్ల పై హేమాద్రి మతంలో చతుర్దశీయుక్త అమావాస్య యందు పితృ యజ్ఞం చేయాలి, తరువాతి రోజు యాగము అని సిద్ధమైంది. హేమాద్రి కర్కాదుల ఈ సర్వోత్కృష్ట వాఖ్యానాన్ని ఆపస్తంబులు అంగీకరించలేదు, కనుక కాత్యాయన, బోధాయనాదుల విషయం అని గ్రహించాలి. ఆశ్వలాయనులకు గూడా పర్వశేషభాగంలో పిండపితృయజ్ఞము. అందుకు సూత్రము - అమావాస్య, అపరాహ్ణమందు పిండ పితృయజ్ఞము అని. ఇక్కడ నారాయణవృత్తిలో ఇట్లా ఉంది - అమావాస్య శబ్దము ప్రతిపద, అమావాస్యల సంధివాచకము. ఐనా, ఇక్కడ అపరాహ్ణ శబ్ద సమన్వయంవల్ల సంధి గల అహోరాత్రములకు వర్తిస్తుంది. దాని (అహోరాత్రముల) అపరాహ్ణ చతుర్థభాగమందు పిండపితృ యజ్ఞం చేయాలి లేదా యజ్ఞం చేయటానికి యోగ్యమైన ఉపవాసం చేయతగ్గ రోజున చేయాలి అహోరాత్ర సంధిలో తిథి సంధివస్తే, అప్పుడు ఉపవాసం చేయతగ్గ రోజుననే చేయబడుతుంది అని. అందువల్లనే హేమాద్రి ఇట్లా అంటారు - ప్రతిపద యందు ముహూర్తకాలమైనా అమావాస్య ఉన్నట్లైతే, ఆ రోజు ఇవ్వబడింది అక్షయమౌతుంద. పర్వశేషం కూడా పర్వంలాగే భావించాలి అని అంటారు. ఈ మాట పిండపితృ యజ్ఞపరమని పారిజాతంలో చెప్పబడింది. దీనిని స్మార్తులు, అగ్నిమంతులు, సంపూర్ణ అమావాస్యయందు శ్రాద్ధ వ్యతిషంగంగా చేయాలి. వ్యతిషంగమంటే రెంటిని ఒకేసారి ఆచరించటం. దీనిని వృత్తికారుడు ఇట్లా చెప్పాడు - స్థాలీపాకంతోపాటు, పిండముల కొరకు తీసి అని సూత్రంలో అన్నాడు

మూ॥ ఖండపర్వణితు కేచిదాహుః - పూర్వేహ్ని పిండ పితృయజ్ఞ వ్యతి షంగేణ శ్రాద్ధం కృత్వా పరేఽహ్ని కేవలః పిండ పితృయజ్ఞః కార్యః వృత్తి కృతాతు—

అన్వష్టక్యంచ పూర్వేద్యుర్మాసి మాస్యథ పార్వణం

కామ్యమాభ్యుదయేఽష్టమ్యా మేకొద్దిష్ట మథాష్టమం. ఇత్యుదాహృత్య పూర్వేషు చతుర్షు స్థాలీపాకాదు ద్ధృత్యాగ్నౌ కరణ మిత్యుక్తేః దర్శశ్రాద్ధేస్థాలీ పాకోనియత ఇతి గమ్యతే స్థాలీ పాకశ్చ పితృయజ్ఞ ఏవేతి పూర్వదినే వ్యతి షంగః సిద్ధః. ప్రయోగ పారిజాతేతు వార్షిక శ్రాద్ధా దేరపి వ్యతిషంగః ఉక్తః, కిముత దర్శశ్రాద్ధస్య. న్యాయవిదస్త్వాహుః సూత్రస్య వృత్తేశ్చ సంపూర్ణ దర్శ విషయత్వాత్ ఖండపర్వణి పూర్వదినే కేవలం శ్రాద్ధం, పరదినేచ కేవలః పితృ యజ్ఞః కార్యః. అతఏవోక్తం వృత్తికృతా - నాత్రాపూర్వ స్థాలీపాకశ్చోచ్యతే, సర్వశ్రాద్ధేషు ప్రసంగాత్, ఇతి ప్రయోగ పారిజాతోక్తి రప్యేత ద్విషయైవ, పూర్వదినేచ శ్రాద్ధే అగ్నికరణమేవ న పాణిహోమః.

చతుర్ష్వాద్యేషు సాగ్నీనాం వహ్నౌహోమో విధీయతే
పిత్ర్యా బ్రాహ్మణహస్తే స్యాదుత్తరేషు చతుర్ష్వపి॥ ఇతి.

పరిశిష్టే నియమాత్. నచలౌకికాగ్నీ పక్వస్యకథం గృహ్యాగ్నౌహోమః "నాన్యాగ్నౌ పక్వమాన్యాగ్నౌ జుహుయాత్" ఇతి నిషేధాత్ మైవం శ్రాద్ధస్య గృహ్యత్వేన స్మార్తాగ్నౌ పచనాగ్నౌవా కర్తవ్యత్వాత్ తస్మాత్పూర్వేద్యుః కేవలం శ్రాద్ధం, నవ్యతిషంగః ఇదమేవ చయుక్తం. ఆహితాగ్నినాతు సర్వాధానినా, అర్ధాధానినావా సంపూర్ణే ఖండేవా దర్శే శ్రౌతాగ్నౌ పృథ గేవ పితృయజ్ఞః కార్యో నతు దర్శశ్రాద్ధ వ్యతిషంగేణేతి విస్తరభీతేర్విరరామః.

ఖండ పర్వమందు కొందరిట్లా అంటారు - పూర్వదినమందు, పిండ పితృ యజ్ఞంతోపాటు శ్రాద్ధం చేసి తర్వాతి రోజు కేవలం పిండ పితృయజ్ఞం చేయాలి అని.

వృత్తికారుడైతే - పూర్వదినమందు అన్వష్టకశ్రాద్ధము, ప్రతి మాస మందు పార్వణము. అభ్యుదయమందు కామ్యశ్రాద్ధము, అష్టమియందు అష్టమ ఏకోద్దిష్టము అని ఉదాహరించి పైనాల్గింటియందు స్థాలీపాకంనుండి తీసి, అగ్ని యందు చేయాలి అని చెప్పినందువల్ల అమావాస్య శ్రాద్ధమందు స్థాలీపాకము తప్పక చేయాలి అని తెలుస్తోంది స్థాలీపాకం అంటే పితృయజ్ఞమే అని

అని చెందువల్ల పూర్వదినమందు వ్యతిషంగం సిద్ధిస్తుంది, (సహానుష్ఠానం) ప్రయోగ పారిజాతమందు మాత్రం వార్షిక శ్రాద్ధాదులకు కూడా వ్యతిషంగం చెప్పబడింది కనుక దర్శశ్రాద్ధం గురించి చెప్పేదేముంది? (సహానుష్ఠానం ఉంది.)

న్యాయవిదుడు మాత్రం ఇట్లా అంటారు - సూత్రము వృత్తి రెండు సంపూర్ణ దర్శవిషయాలు కనుక ఖండ పర్వమందు పూర్వదినమందు కేవల శ్రాద్ధం (మాత్రమే) పరదినమందు కేవలం పితృ యజ్ఞం చేయాలి. అందువల్లనే వృత్తికారుడు ఇట్లా అన్నాడు ఇక్కడ అపూర్వ (ముందు చెప్పని) స్థాలీపాకం చెప్పలేదు (పూర్వందే అని) అన్ని శ్రాద్ధాలలోను స్థాలీపాక ప్రసంగం ఉన్నందు వల్ల అని. ప్రయోగ పారిజాతపు వచనం కూడా ఈ విషయమే. పూర్వదిన మందు శ్రాద్ధమైతే అగ్నియందే చేయాలి, పాణి హోమం కాదు. పరి శిష్టంలో ఇట్లా నియమం ఉంది - మొదటి నాల్గు శ్రాద్ధాల్లో అగ్నిహోత్రులు, అగ్నియందు హోమం చేయాలి. తరువాతి నాల్గు శ్రాద్ధాల్లో పితృ బ్రాహ్మణ హస్తములో చేయాలి అని. కొందరు ఇట్లా అంటారు - లౌకికాగ్నియందు పక్వమైనదాన్ని గృహ్యాగ్ని యందు హోమం చేయటమెట్లా అన్య అగ్నియందు పక్వమైన, దాన్ని (అన్నం), అన్యాగ్నిలో హోమం చేయరాదు అని నిషేధించారు కదా అని శంకిస్తారు. అలాకాదు, శ్రాద్ధం కూడా గృహ్య కార్యం కాబట్టి స్మార్తాగ్నియందో, పచనాగ్ని యందో చేయాలిగదా? అందువల్ల ముందు రోజు కేవలం శ్రాద్ధం, వ్యతిషంగం కాదు. ఇదే తగినది. ఆహితాగ్నిమాత్రం సర్వా(అగ్ని)ధాని కాని, అర్ధాధానికాని (స్మార్తకుండం కలవాడు) సంపూర్ణము, గాని లేదా ఖండం ఐన అమావాస్య యందు శ్రౌతాగ్ని (దక్షిణాగ్ని) యందు వేరుగానే, పితృయజ్ఞం చేయాలి, దర్శ శ్రాద్ధంను వ్యతిషంగంతో చేయరాదు అని. ఇక ఈ విషయాన్ని విస్తర భయం చేత విరమిస్తున్నాము.

మూ॥ సంపూర్ణేదర్శేచ విశేషమాహతౌగాక్షిః.
పక్షాంతం కర్మ నిర్వర్త్య వైశ్వదేవంచ సాగ్నికః
పిండ యజ్ఞం తతః కుర్యాత్ తతోఽన్వాహార్యకం బుధః॥ ఇతి.

పక్షాంతం కర్మ=అన్వాధానం అన్వాహార్యకం=దర్శశ్రాద్ధం అయమేవ సాగ్నేః జీవత్పితృకస్య పిండపితృ యజ్ఞకాలోజ్ఞేయః. తస్యాపి కాత్యాయనేన, హోమాంత మనారంభోవా ఇత్యామ్నానాత్.

సంపూర్ణ అమావాస్యయందు విశేషమును లౌగాక్షి ఇలా చెప్పాడు-పక్షాంత కర్మను నిర్వర్తించి, అగ్నిహోత్రి వైశ్వదేవాన్ని నిర్వర్తించి, తర్వాత పిండ యజ్ఞాన్ని చేయాలి. ఆ తర్వాత విద్వాంసుడు అన్వాహార్యకం చేయాలి అని. పక్షాంత కర్మ అంటే అన్వాధానం (సమిదాధానం అగ్నిలో). అన్వాహార్యకం అంటే దర్శశ్రాద్ధం దీన్నే తండ్రి జీవించి ఉన్న అగ్నిహోత్రికి పిండపితృ యజ్ఞ కాలం అని గ్రహించాలి. దాన్నికూడా హోమాంతంవరకు ఆరంభించరాదు అని కాత్యాయనుడు చెప్పాడు.

మూ॥ పిండ పితృ యజ్ఞాకరణే ప్రాయశ్చిత్తమాహ పరాశరమాధవీయే కాత్యాయనః-

పితృ యజ్ఞాత్యయేచైవ వైశ్వదేవాత్యయేఽపిచ
భోజనేపతితాన్నస్యచరుః వైశ్వానరో భవేత్॥
(అభిష్ట్వానవయజ్ఞేన, నవాన్నప్రాశనేతథా) ఇత్యలం॥

పిండ పితృ యజ్ఞం చేయని పక్షంలో ప్రాయశ్చిత్తాన్ని, పరాశరమాధవీయంలో కాత్యాయనుడు ఇట్లా చెప్పాడు - పితృ యజ్ఞం కాని లేదా వైశ్వదేవం కాని చేయని పక్షంలో, పతితుని అన్నం తిన్న పక్షంలో వైశ్వానరచరు హోమం చేయాలి అని. ఇక ఈ విషయం చాలు.

మూ॥ ప్రకృతమనుసరామః - నిరగ్నికాదిభిస్తు అమావాస్యాఽపరాహ్ణ వ్యాప్త్యలాభే కుతపకాల వ్యాపినీః గ్రాహ్యా.

భూతవిద్ధాఽప్యమావాస్యా ప్రతిపన్మిశ్రితాపివా
పిత్ర్యేకర్మణి విద్వద్భిః గ్రాహ్యాకుతపకాలికీ॥ ఇతి హారీతోక్తేః. ఇదంచ నిరగ్నికాది విషయం.

సినీవాలీ ద్విజైఃకార్యా సాగ్నికైః పితృకర్మణి
స్త్రీభిః శూద్రైః కుహూః కార్యాతథాచానగ్నికైః ద్విజైః॥

ఇతి లౌగాక్షివచనాత్ అత్రసాగ్నిః ఔపాసనాగ్ని రపీతి మదనపారిజాతే ఉక్తం. కుతపశ్చ అవరాహ్ణ వ్యాప్త్యలాభే అనుకల్పః.

అపరాహ్ణే ద్వయా వ్యాపీయది దర్శః తిథిక్షయే
ఆహితాగ్నేః సినీవాలీనిరగ్న్యాదేః కుహూర్మతా॥ ఇతి జాబాలినా విధానాత్. తేన సాగ్నీనాం నిరగ్నీనాం చాపరాహ్ణ వ్యాపిన్యేవ ముఖ్యా.తిథి సామ్యవృద్ధిక్షయైః.

సమవ్యాప్తౌఖర్వాదినా, నిర్ణయః వైషమ్యే అధికా. దినద్వయే అపరాహ్ణ స్పర్శే కుతప వ్యాపినీతి మాధవః. ఇదమేవచ యుక్తం హేమాద్రిమతే కుతపవ్యాపిన్యేవ నిరగ్న్యాదేః ముఖ్యా. సినీవాలీ=దృష్టచంద్రా తథాచవ్యాసః - దృష్టచంద్రా సినీవాలీ, నష్టచంద్రా కుహూః స్మృతా ఇతి. పూర్వదినే పరదినే ఏవవా తద్వ్యాపిత్వే నైవగ్రాహ్యా అంశ వ్యాపిత్వే వైషమ్యే అధిక కాలవ్యాపినీ గ్రాహ్యా దినద్వయేంశతః సమవ్యాప్తౌ తిథిక్షయే పూర్వా. వృద్ధౌ సామ్యేచపరా.

తిథిక్షయే సినీవాలీ, తిథివృద్ధౌకుహూః స్మృతా

సామ్యేఒపిచకుహూః జ్ఞేయా వేదవేదాంగ వేదిభిః॥ ఇతి ప్రచేతో వచనాత్. దినద్వయే సంపూర్ణా కుతప వ్యాప్తిస్తు తిథి వృద్ధావేవ భవతీ త్యనంతర వచనాత్ పరైవేతి. కుతపస్తు—

అహ్నోముహూర్తా విజ్ఞేయా దశపంచ, చసర్వదా

తత్రాష్టమో ముహూర్తోయః సకాలః కుతపః స్మృతః॥ ఇతి మాత్స్యోక్తేః తులాదాన పితృదేవ ప్రీత్యర్థోవవాసాదౌతుపరా గ్రాహ్యేత్యన్యత్ర విస్తరః.

ప్రస్తుతాంశము - అమావాస్య, అపరాహ్ణ వ్యాపిని లభించని పక్షంలో అగ్నిహోత్రి కానివారు కుతపకాల వ్యాపినిని గ్రహించాలి. అమావాస్య, చతుర్దశి మిశ్రితమైనా లేదా ప్రతిపన్మిశ్రితమైనా బుద్ధిమంతులు పితృకర్మలందు కుతప కాల వ్యాపినిని గ్రహించాలి అని హారీతవచనం. ఇది నిరగ్నికాదుల విషయము లౌగాక్షి ఇట్లా అంటాడు - అగ్నిహోత్రులైన ద్విజులు పితృ కార్యములందు సినీవాలిని గ్రహించాలి. స్త్రీలు, శూద్రులు, అనగ్నికులైన ద్విజులు కుహూను గ్రహించాలి అని. ఇక్కడ సాగ్ని అంటే ఔపాసనాగ్ని కూడా అని మదన పారిజాతంలో చెప్పారు. కుతపకాలము, అపరాహ్ణ వ్యాప్తిలేని పక్షంలో, కుతప పకాలం యొక్క గౌణాన్ని గ్రహించాలి. ఎందువల్లనంటే- జాబాలి ఇట్లా చెప్పాడు- తిథిక్షయమైనందువల్ల, అమావాస్య రెండు రోజుల్లో అపరాహ్ణ వ్యాపి కాని పక్షంలో, ఆహితాగ్ని సినీవాలిని గ్రహించాలి నిరగ్న్యాదులు కుహూను గ్రహించాలి అని. అందువల్ల సాగ్నులకు, నిరగ్నులకు (ఇద్దరికీ) అపరాహ్ణ వ్యాపిత్వమే ముఖ్యం ఔతుంది. తిథి, సామ్యవృద్ధిక్షయములతో సమవ్యాప్తి కలదైతే ఖర్వాదులతో నిర్ణయం చేయాలి. వైషమ్యమందు అధికం గ్రహించాలి. రెండు రోజులూ అపరాహ్ణ స్పర్శ ఉంటే కుతపవ్యాపినిని గ్రహించాలి. అని మాధవ వచనం. ఇదే యుక్తమనిపిస్తోంది. హేమాద్రి మతంలో కుతపవ్యాపినియే నిరగ్న్యాదులకు ముఖ్యం. సినీవాలి అంటే చంద్రుడు కన్పించటం. అందుకు

వ్యాసుని వచనం-చంద్రుడు కన్పిస్తే సినీవాలి, చంద్రుడు కన్పించకపోతే కుహూ అంటారు అని. మొదటిరోజూ, లేదా పరరోజునందు కాని కుతపకాలం వ్యాపించి ఉంటే దాన్నే గ్రహించాలి. అంశంగా వ్యాపించి ఉంటే వైషమ్యమందు, అధిక కాల వ్యాపినిని గ్రహించాలి. ఒకవేళ రెండు రోజులు అంశంగా, సమంగా వ్యాపించి ఉంటే తిథిక్షయమందు పూర్వం గ్రహించాలి. వృద్ధియందు లేదా సామ్యమైనా రెండవది గ్రహించాలి. తిథిక్షయమందు సినీవాలి, తిథివృద్ధియందు సామ్యమందు కుహూనే గ్రహించాలి అని వేదవేదాంగ విదులు చెప్పారు అని ప్రచేతుని వచనం దినద్వయమందు, సంపూర్ణ కుతపకాల వ్యాప్తి మాత్రం తిథి వృద్ధిలోనే ఔతుంది అనే తరువాత చెప్పబోయేమాటవల్ల పరమే గ్రహించాలి అని.

కుతపమంటే - పగటియందు ఎప్పుడూ 15 ముహూర్తాలు ఉంటాయి. అందులో 8వ ముహూర్తం కుతపకాలమంటారు అని మాత్స్యోక్తి. తులాదానము, పితృదేవ ప్రీతికొరకు చేసే ఉపవాసాదులందు రెండవది గ్రహించాలి అని మరో చోట వివరంగా ఉంది.

(రౌద్రము (1), శ్వేతము (2), మైత్రము (3), సారభటము (4), సావిత్రము (5), వైశ్వదేవము (6), గాంధర్వము (7), కుతపము (8), రోహిణము (9), తిలకము (10), విభవము (11), నిరుఋతి (12), జయము (13), శంబరము (14), విజయము (15), అని 15 ముహూర్తాలు. కుతపం, రోహిణం, తిలకం- ఈ మూటిలో సూర్యుడు తిరిగేకాలాన్ని గౌణకుతపకాలం అంటారు).

మూ॥ దర్శేచ మాసికవార్షికాది శ్రాద్ధప్రాప్తౌ కాలాదర్శేవిశేష ఉక్తః-

దర్శస్య చోదకుంభస్య దర్శ మాసికయోరపి
నిత్యస్యచాబ్దికస్యాపి దార్శికాబ్దికయోరపి ॥ఇత్యుక్త్వా
సంపాతేదేవతాభేదాత్ శ్రాద్ధయుగ్మంసమాచరేత్
నిమిత్తా, నియతిశ్చాత9 పూర్వానుష్ఠానకారణం ॥ఇతి

నిర్ణయదీపేఽపి—
నష్టచంద్రే యదాకాలే క్షయాహదివసో భవేత్
వైశ్వదేవం క్షయశ్రాద్ధం కుర్యాత్ ప్రాక్ దర్శకర్మణః

అమా|శ్రాద్ధంచ అనుపనీతోఽపికుర్యాత్ |శ్రాద్ధశూలపాణౌ-అమావాస్యాష్టకా కృష్ణపక్ష పంచదశీషుచ, ఇత్యుపక్రమ్య ఏతచ్చానుపనీతోఽపి కుర్యాత్సర్వేషు పర్వసు-శ్రాద్ధం సాధారణం నామ సర్వకామ ఫలప్రదం

భార్యా విరహితోఽప్యేతత్ ప్రవాసస్థోఽపినిత్యశః
శూద్రోఽప్య మంత్రవత్కుర్యాత్ అనేన విధినా బుధః॥ ఇతి మాత్స్యోక్తేః

అమావాస్యయందు మాసికం లేదా వార్షికాది శ్రాద్ధములు ప్రాప్తమైన పక్షంలో కాలాదర్శంలో ఇట్లా చెప్పబడింది - అమావాస్యనాటి ఉదకుంభము (దానము); నాటి దర్శమునాటి మాసికము; నిత్యశ్రాద్ధమైన వార్షిక శ్రాద్ధము; దర్శము, నాటి వార్షిక శ్రాద్ధము అని చెప్పి, అవి అన్నీ ఒకేరోజు సంభవిస్తే దేవతాభేదంతో రెండు శ్రాద్ధములు ఆచరించాలి. నిమిత్తము, నియతి (విధి) ఇవే మొదలు ఆచరించటానికి కారణాలు అని. నిర్ణయదీపమందు కూడా ఇట్లా చెప్పారు - అమావాస్యరోజు చనిపోయినరోజైన పక్షంలో దర్శశ్రాద్ధంకన్న ముందు బలివైశ్వదేవము, అట్లాగే క్షయాహశ్రాద్ధము చేయాలి. అమావాస్య శ్రాద్ధాన్ని అనుపనీతుడు కూడా చేయాలి అని. శ్రాద్ధశూల పాణియందు మత్స్య పురాణ వచనం ఇట్లా ఉంది - అమావాస్య, అష్టక, కృష్ణపక్ష పంచదశి-వీనియందు అని ఆరంభించి వీనిని అనుపనీతుడు కూడా అన్ని పర్వములందు ఆచరించాలి. అన్ని కోరికల ఫలితాన్నిచ్చే సాధారణ శ్రాద్ధమును భార్యా విరహితుడు, అట్లాగే ప్రవాసమందున్నవాడు నిత్యమాచరించాలి. బుద్ధిమంతుడైన శూద్రుడు కూడా దీనిని మంత్రం లేకుండా శాస్త్రప్రకారం చేయాలి అని.

మూ॥ **అమా|శ్రాద్ధాతిక్రమే ప్రాయశ్చిత్తముక్తం బుగ్విధానే—**

న్యూమవాచం జపేన్మంత్రం శతవారం దినేదినే
అమా|శ్రాద్ధం యదానాస్తితదా సంపూర్ణమేతి తత్॥ అత్ర పూర్వోక్త సాగ్నిక పదేనాఽహితాగ్నిః స్మార్తాగ్ని మాంశ్చగృహ్యతే విచ్ఛిన్నాగ్నికాదిశ్చ నిరగ్నికః. తథాచ హేమాద్రిరగ్నౌకరణ ప్రకరణే—

సాగ్నిరగ్నావనగ్నిస్తు ద్విజపాణావథాప్సువా
కుర్యాదగ్నౌ క్రియాంనిత్యం లౌకికేనేతి నిశ్చితం॥ ఇతి స్మృతివాక్యముదా హృత్య యస్త్వస్మిన్ కృతౌపాసనతయా సముచ్ఛిన్నాగ్నితయా భార్యా విధురతయా వాఽగ్ని రహితస్తస్య ద్విజపాణౌ జలాదౌవాహోమః ఇతి వ్యాచచక్షే. మదన పారిజాతేఽప్యేవం. ఇదమేవసాగ్ని కానగ్నిక స్వరూపం సర్వత్రజ్ఞేయం.

అమావాస్యాశ్రాద్ధాన్ని చేయనిపక్షంలో, ఋగ్విధానంలో ప్రాయశ్చిత్తం ఇట్లా చెప్పబడింది - న్యూమవాచం అనే మంత్రాన్ని ప్రతిరోజూ నూరుసార్లు జపించాలి. అట్లాచేస్తే అమాశ్రాద్ధం చేయని పక్షంలో, అది పూర్ణమౌతుంది. ఇక్కడ, ముందు చెప్పిన సాగ్నిక అనే పదంవల్ల స్మార్తాగ్ని, ఆహితాగ్ని, నిరగ్నిక పదంవల్ల విచ్ఛిన్నాగ్నికాదులు గ్రహించబడతారు.

హేమాద్రి అగ్నియందలి కరణప్రకరణంలో ఇట్లా అంటాడు - అగ్నిగలవాడు అగ్నిలో, అగ్నిలేనివాడు బ్రాహ్మణునిచేతిలో లేదా నీటియందు లేదా లౌకికాగ్నిలో ఎల్లప్పుడూ అగ్నికరణ కర్మలు చేయాలి అని. స్మృతి వాక్యాన్ని ఉదాహరించి ఇట్లా చెప్పాడు - ఔపాసన స్వీకరించనివాడు, అగ్ని నాశంకలవాడు, భార్య మరణించినవాడు ఈ కారణాలవల్ల అగ్ని లేనివానికి బ్రాహ్మణుని చేతియందో నీటియందో హోమము అని. మదన పారిజాతంలో కూడా ఇట్లాగే ఉంది. ఇట్లాగే సాగ్నిక, అనగ్నిక విషయాన్ని అంతటా గ్రహించాలి.

మూ॥ **అథగ్రహణం నిర్ణీయతే** తత్రచంద్ర గ్రహణే యస్మిన్ యామే గ్రహణం తస్మాత్పూర్వం ప్రహరత్రయం నభుంజీత. సూర్యగ్రహేతు ప్రహర చతుష్టయం నభుంజీత.

సూర్యగ్రహేతు నాశ్నీయాత్ పూర్వం యామచతుష్టయం

చంద్రగ్రహేతు యామాంస్త్రీన్ బాలవృద్ధాతురైర్వినా॥ ఇతి మాధవీయే వృద్ధగౌతమోక్తేః

గ్రహణంతు భవేదిందోః ప్రథమాదధియామతః

భుంజీతావర్తనాత్పూర్వం ప్రథమే ప్రథమాదధః॥ ఇతి - మార్కండేయోక్తేశ్చ అధి=ఊర్ధ్వం. ననుచంద్రగ్రహేయామ చతుష్టయ నిషేధ ఉచితో నతు సూర్యగ్రహే సూర్యోదయాత్ప్రాక్ భోజనాప్రాప్తేః. మైవం వచనస్య ప్రథమయామే సూర్యగ్రహేసతి పూర్వేద్యుః పూర్వరాత్రే భోజన నిషేధ పరత్వాత్.

చంద్రగ్రహేవిశేషమాహ మాధవీయే వృద్ధవసిష్ఠః -

గ్రస్తోదయే విధోః పూర్వం నాహర్భోజన మాచరేత్ ఇతి.

ద్వయోః గ్రస్తాస్తేతు మాధవీయే వ్యాసః - అముక్తయోరస్తగయోరద్యాత్ దృష్ట్వాఽపరేహని. ఇతి. విష్ణుధర్మేఽపి -

అహో రాత్రం నభోక్తవ్యం చంద్రసూర్యగ్రహోయదా
ముక్తిం దృష్ట్వాతు భోక్తవ్యం స్నానం కృత్వాతతః పరం॥ అహోరాత్ర నిషేధః సూర్యగ్రస్తాస్తే. మదనరత్నే గార్గ్యః -

సంధ్యాకాలేయదారాహుః గ్రసతే శశిభాస్కరౌ
తదహర్నైవభుంజీత రాత్రావపికదాచన॥

సాయం సంధ్యాయాం సూర్యగ్రస్తాస్తేపూర్వేఽహ్ని రాత్రౌచన భోక్తవ్యం ప్రాతః సంధ్యాయాం చంద్రస్యగ్రస్తాస్తే పూర్వరాత్రావుత్తరేఽహ్నిచ నభోక్తవ్య మిత్యర్థః. చంద్రగ్రస్తాస్తే ఉత్తరదినే సంధ్యాహోమాదౌనదోషః

తదాహోశనాః -

గ్రస్తేచాస్తంగతేత్విందౌ జ్ఞాత్వాముక్త్యవ ధారణం
స్నానహోమాదికం కార్యం భుంజీతేందూదయేపునః॥ ఏ తదనాహితాగ్ని విషయం. అపరాహ్ణేవ్రతో పాయసీయ మశ్నీత, ఇతి కాత్యాయనోక్తేః వ్రతస్యశ్రౌతత్వేన విహితత్వేనచ ప్రబలత్వాత్. అద్భిర్వ్రతం కుర్యాత్, ఇతి నిర్ణయదీపః. రాగప్రాప్త భోజనే కాలనియమోఽయం. తేనజ్వరాదావివ, నభోజన మితి కరాన్నుసారిణః. బాలవృద్ధాతురాణాం తు గ్రహణ యామాత్పూర్వమేక యామో నిషిద్ధః- సాయాహ్నేగ్రహణంచేత్ స్యాత్ అపరాహ్ణే నభోజనం-

అపరాహ్ణే నమధ్యాహ్నే మధ్యాహ్నే నతుసంగవే
భుంజీత సంగవేచేత్ స్యాత్న పూర్వం భోజనక్రియా॥

ఇతి మార్కండే యోక్తేః ఇదంచ బాలాది విషయం. బాలవృద్ధాతురైర్వినా, ఇతిపూర్వోక్తేః. వేధకాలే గ్రహణేనా పక్వమన్నం త్యాజ్యం.

సర్వేషామేవ వర్ణానాం సూతకం రాహుదర్శనే,
స్నాత్వాకర్మాణి కుర్వీత శృతమన్నం వివర్జయేత్॥ ఇతి హేమాద్రౌ షట్త్రింశన్మతాత్. శృతమితి తదంతరితస్యోప లక్షణం. నవశ్రాద్ధేషు చ్ఛిష్టం గ్రహపర్యుషితం చయత్ ఇతి. మితాక్షరాయాం వచనాత్.

ఇప్పుడు గ్రహణం నిర్ణయించబడుతుంది. చంద్రగ్రహణమందు, గ్రహణంకన్న ముందు మూడు ప్రహరలలో భోజనం చేయరాదు. సూర్యగ్రహణ మందు నాల్గు ప్రహరలలో భోజనం చేయరాదు. మాధవీయంలో వృద్ధగౌతమోక్తి ఇట్లా ఉంది—సూర్యగ్రహణమందు నాల్గు గడియలు భుజించరాదు. చంద్ర

గ్రహణమైతే ముందు మూడు యామములు భుజించరాదు. బాలవృద్ధ ఆతురులకిది వర్తించదు (రోగి) అని. చంద్రగ్రహణము, రాత్రి రెండవ యామంలో జరిగితే మధ్యాహ్నంకన్న ముందే భుజించాలి. రాత్రి ప్రథమ యామంలో గ్రహణమైతే, ప్రథమ యామంలో భుజించాలి అని మార్కండేయోక్తి. (అధి = తర్వాత) చంద్రగ్రహణంలో ముందు యామ చతుష్టయంలో భోజన నిషేధం తగును కాని సూర్యగ్రహణంలో కాదు. సూర్యోదయంకన్న ముందు భోజనమే ఉండదు కదా? అంటే అట్లా కాదు. దాని ఉద్దేశ్యం ప్రథమయామంలో సూర్యగ్రహణమైతే ముందురోజు పూర్వరాత్రమందు భోజన నిషేధం దాని అభిప్రాయం. చంద్ర గ్రహణ సమయంలో విశేషాన్ని మాధవీయంలో వృద్ధ వసిష్ఠుడు ఇట్లా చెప్పాడు. చంద్రుడుగ్రహణంతో ఉదయించిన పక్షంలో పూర్వదినమందు(పగటిపూట)భోజనం చేయరాదు అని. సూర్యచంద్రులిద్దరూ గ్రహణంలోనే అస్తమించే పక్షంలో మాధవీయంలో వ్యాసుని వాక్కు ఇలా ఉంది — గ్రహణం విడువబడక అస్త మించిన సూర్యచంద్రులను తర్వాతి రోజు చూశాక భుజించాలి అని.

విష్ణుధర్మమందు కూడా ఇట్లా ఉంది - చంద్రసూర్యుల గ్రహణమైతే అహోరాత్రములు భుజించరాదు. గ్రహణం విడిచాక (ముక్తిని చూసి) స్నానం చేసి భుజించాలి. ఇక్కడ అహోరాత్ర నిషేధము గ్రహణమందే సూర్యాస్తమయ మైనప్పుడు అని గ్రహించాలి అని. మదనరత్నంలో గార్గ్యుడు ఇట్లా అంటాడు: సంధ్యాకాలమందు రాహువు చంద్ర సూర్యులను గ్రసిస్తే ఆ పగలు భుజించ రాదు. ఒక్కొక్కప్పుడు రాత్రి కూడా అని. సాయం సంధ్యయందు సూర్యుడు గ్రహణమందే అస్తమించే పక్షంలో పూర్వపు దినమందు, రాత్రికి తినగూడదు. ప్రాతఃకాల సంధ్యయందు చంద్రుడు గ్రహణంలో అస్తమించే పక్షంలో పూర్వ రాత్రియందు, తరువాతి రోజు పగలు తినగూడదు అని అర్థం. చంద్రుడు గ్రహణంలో అస్తమిస్తే తర్వాతిరోజు సంధ్యా హోమాదులు చేస్తే దోషం లేదు. దాన్నే ఉషనుడు ఇట్లా అంటాడు - చంద్రుడు గ్రహణంతోపాటు అస్తమిస్తే చంద్రుని ముక్తిని నిశ్చయించుకున్నాకే స్నాన హోమాదులు ఆచరించాలి. తిరిగి చంద్రోదయమయ్యాక భుజించాలి అని. ఇది అనాహితాగ్ని విషయము. కాత్యాయనుడు ఇట్లా అంటాడు - వ్రత భోజనం ఏ అన్నంతో (మాషాది) చేయ బడుతుందో దాన్ని వ్రతోపాయనీయ మంటారు, అపరాహ్ణమందు (పగలు) వ్రత ఉపాయనీయంను భుజించాలి అని అన్నందువల్ల వ్రతం శ్రుతి విహితం కనుక

ప్రబలమైంది కూడా. జలంతో వ్రతం చేయాలి అని నిర్ణయ దీపం వచనము. రాగప్రాప్త భోజన విషయంలో ఇది కాల నియమము అందువల్ల జ్వరాదులందువలె గ్రహణంలో భోజన నిషేధము అని కర్కానుసారుల అభిప్రాయము. బాలవృద్ధ ఆతురులకైతే గ్రహణ యామంకన్న ముందు ఒక యామం మాత్రమే నిషిద్ధము. సాయాహ్నం గ్రహణమైతే అపరాహ్ణమందు, అపరాహ్ణ గ్రహణమైతే మధ్యాహ్నమందు, మధ్యాహ్నమందు గ్రహణమైతే సంగవమందు, సంగవంలో గ్రహణమైతే అంతకన్న ముందు ఒక ప్రహరలో భోజనం చేయరాదు అని మార్కండేయోక్తి. ఇది బాలాదుల విషయము. బాల వృద్ధ ఆతురులు తప్ప అని ముందే చెప్పాం గదా? వేధకాలమందు, లేదా గ్రహణమందు కాని పక్వమైన అన్నమును త్యజించాలి. రాహు దర్శనమైతే, అన్ని వర్ణముల వారికి సూతకం వస్తుంది. కనుక స్నానంచేసి కర్మలు చేయాలి, శ్రుత అన్నమును వర్జించాలి అని హేమాద్రియందు షట్త్రింశన్మతాభిప్రాయం. శ్రుత శబ్దము గ్రహణ మధ్య కాలంలో వండబడిన దానికి (దాని మధ్య దానికి) సూచకము. మితాక్షరంలో ఇట్లా చెప్పబడింది - నవశ్రాద్ధమందు మిగిలిందీ, అట్లాగే గ్రహణమందు మిగిలిందీ ఈ అన్నాలను తినరాదు అని.

మూ॥ భార్గవార్చన దీపికాయాం జ్యోతిర్నిబంధే మేధా తిథిః-

ఆరనాలం పయస్తక్రం దధిస్నేహాజ్య పాచితం

మణికస్థోదకం చైవ నదుష్యేత్ రాహుసూతకే॥

మన్వర్థముక్తావల్యాం -

అన్నంపక్వ మిహత్యాజ్యం స్నానం సవసనంగ్రహే

వారి తక్రార నాలాది తిలదర్భైర్న దుష్యతి॥

జలేత్వదోషో గాంగవిషయః - గ్రహోషితం జలంపీత్వా పాదకృచ్ఛ్రం సమాచరేత్, ఇతి తత్రైవ చతుర్వింశతిమతే అన్యజలస్య దోషోక్తేః వేధకాలే గ్రహణేవాభోజనే ప్రాయశ్చిత్త ముక్తం మాధవీయే కాత్యాయనేన -

చంద్ర సూర్య గ్రహే భుక్త్వా ప్రాజాపత్యేన శుద్ధ్యతి

తస్మిన్నేవదినే భుక్త్వా త్రిరాత్రేణైవ శుద్ధ్యతి॥ ఇతి.

గ్రహణేచ త్రిరాత్ర మేకరాత్రం చ ఉపవాసః శ్రేయోర్థినా కార్యః -

ఏకరాత్రము పోష్యైవ స్నాత్వాదత్వా చ శక్తితః

కంచుకాదివ సర్పస్య నివృత్తిః పాపకోశతః॥

త్రిరాత్రం సముపోష్యైవం గ్రహణే చంద్రసూర్యయోః
స్నాత్వాదత్వాచ విధివన్మోదతే బ్రహ్మణా సహ॥ ఇతి హేమాద్రౌ లైంగోక్తేః. ఇదంచ పుత్రవ్యతిరిక్త విషయం. **(పారణవిచారః)**

అదిత్యేహని సంక్రాంతౌ గ్రహణే చంద్ర సూర్యయోః
పారణంచోపవాసం చ నకుర్యాత్పుత్రవాన్గృహీ॥ ఇతి జైమిని వచనాత్. యదాతురవేః గ్రస్తాస్తః తదా పుత్రిణః ప్రహరద్వయం హిత్వా బాలాదివద్భోజనం, నతూపవాసః సాయాహ్నే గ్రహణం చేత్స్యాత్, ఇతి పూర్వోక్త మార్కండేయ వచనాత్.

సాయాహ్నే సంగవేఽశ్నీయా చ్చారదే సంగవాదధః
మధ్యాహ్నే పరతోఽశ్నీయాత్ నోపవాసో రవిగ్రహే॥ ఇతి స్మృతేశ్చేతి హేమాద్రిః. శారదోఽపరాహ్ణః. మాధవమతేతు పుత్రిణోఽపితత్రోపవాస ఏవ. అహోరాత్రం నభోక్తవ్యం, ఇతి పూర్వోక్త నిషేధస్య తేనాపి పాలనీయత్వాత్. ఉపవాస నిషేధస్తు వ్రతరూపోపవాసపరః కృష్ణైకాదశీ నిషేధవదితి. మదన రత్నేఽప్యేవం. ఇదమేవచ యుక్తం. వర్ధమానస్తు - అహోరాత్రం నభోక్తవ్యం, ఇతి. శాతాతపీయాగ్రే. సూర్యాచంద్రమసోర్లోకాన్ అక్షయాన్ యాతిమానవః ఇతి ఫలశ్రుతేః ముక్త్యదర్శనే ఉపవాసః కామ్యః నత్వయం నిషేధ ఇత్యాహ, తన్న అత్రవ్రతత్వేఽపి ప్రాగుక్త విష్ణుధర్మే నిషేధావశ్యం భావాత్. తథాచ వ్యాసః -

**(చూడామణియోగః)**

రవిగ్రహః సూర్యవారే సోమేసోమగ్రహఃతథా
చూడామణిరితి ఖ్యాతః తత్రదత్తమనంతకం॥

వారేష్వన్యేషు యత్పుణ్యం గ్రహణే చంద్రసూర్యయోః
తత్పుణ్యం కోటిగుణితం యోగేచూడామణౌస్మృతం॥

అత్రచ ఆద్యన్తయోః స్నానంకుర్యాత్ - **(గ్రహణేహోమవిచారః)**

గ్రస్యమానే భవేత్స్నానం గ్రస్తే హోమోవిధీయతే
ముచ్యమానేభవేద్దానం ముక్తే స్నానంవిధీయతే॥ ఇతి హేమాద్రౌ వచనాత్ స్నానంస్యాదుపరాగాదౌ మధ్యేహోమః సురార్చనం. ఇతి బ్రహ్మవైవర్తాచ్చ.

భార్గవార్చనదీపికయందు జ్యోతిర్నిబంధంలో మేధాతిథి ఇట్లా అంటాడు- ఆరనాళం (పులియబెట్టిన కడుగునీరు, కలి) పాలు, మజ్జిగ పెరుగు (పీటి తేట=ఆరనాళం) నూనె, నేయితో వండిన పదార్థం (అన్నం) కాగులోని నీరు ఇవన్నీ రాహుసూతకమందు దూషితములు కావు అని. మన్వర్థముక్తావళియందు ఇట్లా ఉంది - గ్రహణమందు వండిన అన్నాన్ని, అట్లాగే (గృహమందు) సచేల స్నానమును విడిచిపెట్టాలి నీరు, మజ్జిగ, ఆరనాళాదులు నువ్వులు, దర్భలు వేస్తే దూషితములుకావు అని. నీటియందు దోషంలేదు అనే మాట గంగాజల విషయకము. గ్రహణమందున్న జలాన్ని త్రాగినచో పాదకృచ్ఛ్రం ఆచరించాలి అని, అక్కడే చతుర్వింశతిమతంలో ఇతర జల విషయంలో దోషం చెప్పారు. వేధకాలమందు లేదా గ్రహణమందు కాని భోజనం చేస్తే ప్రాయశ్చిత్తాన్ని మాధవీయంలో కాత్యాయనుడు ఇట్లా చెప్పాడు - చంద్ర సూర్యగ్రహణాల్లో భుజించిన ప్రాజాపత్యవ్రతంతో శుద్ధుడౌతాడు, ఆరోజే భుజించినపక్షంలో మూడురాత్రులతో శుద్ధుడౌతాడు అని. గ్రహణకాలమందు, శ్రేయస్సుకోరేవారు మూడు రాత్రులు కాని, ఒక రాత్రి కాని ఉపవసించాలి. హేమాద్రియందు లింగపురాణవచనం ఇట్లా ఉంది: ఒక రాత్రి ఉపవసించి స్నానం చేసి, శక్తి కొలది దానం చేస్తే పాపముల ఆవరణనుండి విముక్తుడౌతాడు, పాము కుబుసంనుండి విముక్తి నందినట్లు. చంద్ర సూర్యుల గ్రహణమందు మూడు రాత్రులు ఉపవసించి స్నానం చేసి, శాస్త్ర ప్రకారం దానం చేస్తే బ్రహ్మతోసహ ఆనందమనుభవిస్తాడు అని. ఇది పుత్రులు లేనివారి విషయకము.

జైమిని ఇట్లా అంటాడు - ఆదివారం, సంక్రమణము, చంద్ర సూర్య గ్రహణకాలము పుత్రవంతుడైన గృహస్థు పారణ, ఉపవాసము చేయరాదు అని. సూర్యుడు గ్రహణమందుండగా అస్తమించిన పక్షంలో అప్పుడు పుత్రవంతుడు రెండు ప్రహరలకాలంవదలి బాలులవలె భుజించాలి. ఉపవసించరాదు. సాయాహ్నమందు గ్రహణమైన పక్షంలో (ఉపవసించరాదు) అని ముందు చెప్పిన మార్కండేయ వచనం అనుసరించి. ఇక్కడ ఒక స్మృతి కూడా ఉందని హేమాద్రి ఇట్లా అంటాడు—సాయాహ్నమందు గ్రహణమైన పక్షంలో సంగవమందు, అపరాహ్ణమందు గ్రహణమైన పక్షంలో సంగవంకన్నముందు, మధ్యాహ్నం గ్రహణమైతే దానితర్వాత భుజించాలి. సూర్యగ్రహణమందు ఉపవసించరాదు అని. శారదము అనగా అపరాహ్ణము. మాధవమతంలోనైతే పుత్రవంతులైనా అక్కడ ఉపవా

సమే. ఎందుకంటే, అహోరాత్రులు భుజించరాదు అని ముందు చెప్పిన నిషేధము ను అతడు కూడా పాలించాలి. ఉపవాస నిషేధము కృష్ణపక్ష ఏకాదశి నిషేధమువలె అలాంటి వ్రతరూప ఉపవాస విషయక నిషేధము. మదనరత్నంలో కూడా ఇట్లాగే చెప్పబడింది. ఇదే సరియైనది.

అహోరాత్రములు భుజించరాదు అని శాతాతపీయసారము. అట్లయితే మనుష్యుడు సూర్యచంద్రుల అక్షయలోకాలను పొందుతాడు అని శ్రుతి ఉన్నందువల్ల సూర్యచంద్రుల గ్రహణముక్తిని చూడనిపక్షంలో చేసిన ఉపవాసం కామ్యము అక్కడ ఈ నిషేధము రాదు అని వర్ధమానుడేదైతే అన్నాడో అది తప్పు. ఇది వ్రతమైనా ముందు చెప్పిన విష్ణుధర్మమందలి నిషేధం తప్పకుండా వస్తుంది. వ్యాసుడు ఇట్లా అన్నాడు—ఆదివారం సూర్యగ్రహణం, చంద్రగ్రహణము సోమవారం అయిన పక్షంలో దాన్ని చూడామణి అని అంటారు. అప్పుడు చేయబడ్డ దానం అనంతఫలాన్ని ఇస్తుంది. ఇతర వారాల్లో చంద్రసూర్యగ్రహణమైతే ఎంత పుణ్యమో, ఆ పుణ్యము చూడామణియోగమందు కోటిగుణితమౌతుంది అని అన్నారు.

ఇక్కడ గ్రహణ ఆద్యంతములందు స్నానం చేయాలి. గ్రహణ ఆరంభంలో స్నానం, గ్రహణకాలమందు హోమం విడుపుదలలో దానము, ముక్తి తర్వాత స్నానం విధించారు అని హేమాద్రి వచనము. బ్రహ్మవైవర్తం కూడా ఇదే చెప్తోంది. గ్రహణ ఆరంభంలో స్నానం, మధ్యలో హోమం, దేవపూజ అని.

మూ॥ సర్వేషా మేవవర్ణానాం సూతకం రాహుదర్శనే
సచైలంచభవేత్ స్నానం సూతకాన్నం చవర్జయేత్॥ ఇతి వృద్ధ వాసిష్ఠోక్తేశ్చ సచైలత్వం ముక్తి స్నానపరమితి మదనరత్నే ఉక్తం.

భార్గవార్చన దీపికాయాం చతుర్వింశతిమతే—
ముక్తౌ యస్తునకుర్వీతస్నానం గ్రహణ సూతకే
ససూత కీభవేత్తావత్ యావత్స్యాద పరోగ్రహః॥

ఇదంచ స్నానమమంత్రకం కార్యమితి స్మృతి రత్నావల్యాం.
తత్రతీర్థవిశేషోభారతే—
గంగాస్నానం తుకుర్వీతగ్రహణే చంద్రసూర్యయోః
మహానదీషుచాన్యాసు స్నానం కుర్యాద్యథావిధి॥

**మహానదీష్వపిమానవిశేషేకాశ్చిత్ శ్రేష్ఠాః—**

ప్రయాగం దేవికా రేవా సన్నిహత్యాచవారణం
సారస్వతీ చంద్ర భాగా కౌశికీ తాపికీ తథా
సింధుర్గండకి కాచైవ సరయూః కార్తికాదితః॥ మూలం హేమాద్రౌస్పష్టం.

వ్యాసః - (ఫలతారతమ్యం)

ఇందోః లక్ష గుణం పుణ్యం రవేః దశగుణం తతః
గంగాతోయేతుసంప్రాప్తే ఇందోః కోటీరవేర్దశ।
గవాంకోటి సహస్రస్య యత్ఫలంలభతేనరః
తత్ఫలం లభతే మర్త్యో గ్రహణే చంద్ర సూర్యయోః॥

**అనంభవేతు** మాధవీయేశంఖః -

వాపీకూపతడాగేషు గిరిప్రస్రవణేఽపిచ
నద్యాంనదే దేవఖాతే సరసీషూ ద్ధృతాంబుని।
ఉష్ణోదకేన, వాస్నాయాత్ గ్రహణే చంద్రసూర్యయోః॥

**అత్రతారతమ్యమాహ** మార్కండేయః -

శీతముష్ణోదకాత్ పుణ్యం అపారక్యం పరోదకాత్
భూమిష్ఠముద్ధృతా త్పుణ్యం తతః ప్రస్రవణోదకం।
తతోఽపి సారసంపుణ్యం తతో పుణ్యం నదీ జలం
తీర్థతోయం తతః పుణ్యం మహానద్యంబు పావనం॥
తతస్తతోఽపి గంగాంబు పుణ్యం పుణ్యంస్తతోఽం బుధిః॥ ఇతి.

ఉష్ణోదకమాతుర విషయం **తథా** -

గోదావరీ మహాపుణ్యా చంద్రేరాహు సమన్వితే
సూర్యేచరాహుణాగ్రస్తే తమో భూతేమహామునే॥
నర్మదాతోయసంస్పర్శే కృతకృత్యా భవంతితే

పృథ్వీచంద్రోదయే ప్రభాసఖండే -

గావోనాగాస్తిలా ధ్యానం రత్నాని కనకం మహీ
సంప్రదాయ కురుక్షేత్రే యత్ఫలం లభతేనరైః
తదిందు గ్రహణేఽంభోధౌస్నానాత్ భవతి షడ్గుణం॥

తత్రైవసౌరపురాణే **అంబుధిస్నానము ప్రక్రమ్య** -

దానాని యాని లోకేషు విఖ్యాతానిమనీషిభిః
తేషాం ఫలమవాప్నోతి గ్రహణే చంద్రసూర్యయోః॥

**దేవీ పురాణే-**

గంగాకన ఖలం పుణ్యం ప్రయాగే పుష్కరం తథా
కురుక్షేత్రం మహాపుణ్యం రాహుగ్రస్తే దివాకరే॥

**స్నానానంతరమే** స్మరణంకార్యం -

స్మృత్వాశతక్రతుఫలం దృష్ట్వా సర్వాఘనాశనం
స్పృష్ట్వా గోమేధపుణ్యంతు పీత్వాసౌత్రామణేర్లభేత్।
స్నాత్వావాజిమఖం పుణ్యం ప్రాప్నుయా దవిచారతః
రవిచంద్రోపరాగేచ అయనే చోత్తరే తథా॥ ఇతి మార్కండేయోక్తేః.

వృద్ధ వసిష్ఠోక్తి ఇట్లా ఉంది- రాహు దర్శనమైతే అన్ని వర్ణములవారికి సూతకము వస్తుంది. సచేల స్నానమాచరించాలి. సూతకాన్నాన్ని వర్జించాలి అని సచైల స్నానము ముక్తి స్నాన పరకము అని మదన రత్నంలో చెప్పబడింది. భార్గవార్చన దీపికయందు చతుర్వింశతి మతం ఇట్లా ఉంది: గ్రహణ సూతకమున ముక్తి స్నానం చేయని నరుడు, మరో గ్రహణం వచ్చేవరకు సూతకుడౌతాడు. ఈ స్నానాన్ని అమంత్రకంగా చేయాలని స్మృతి రత్నావలిలో కలదు. గ్రహణ స్నానం గూర్చి భారతంలో తీర్థ విశేషం ఇట్లా చెప్పబడింది. చంద్ర సూర్యగ్రహణ కాలంలో గంగాస్నానం చేయాలి. ఇతర మహానదులందు కూడా శాస్త్ర ప్రకారం స్నానంచేయాలి అని. మహానదులందు కూడా మాస విశేషాలలో కొన్ని కొన్ని శ్రేష్ఠమని చెప్పబడ్డాయి ప్రయాగ, దేవిక, రేవ, సన్నిహత్య, వరుణ, సరస్వతి, చంద్రభాగ, కౌశికి, తాపి, సింధు, గండకీ, సరయూ- వీటిలో కార్తికాది మాసాలు క్రమంగా గ్రహణస్నానానికి ఉత్తమమైనాయి. దీనికి మూలం హేమాద్రిలో స్పష్టంగా ఉంది. వ్యాసుడు ఇట్లా అంటాడు - చంద్ర గ్రహణంలో స్నానంవల లక్ష గుణితం పుణ్యం వస్తుంది. సూర్యగ్రహణంలో స్నానంవల్ల దానికన్న పదింత లెక్కువ పుణ్యం వస్తుంది. చంద్రగ్రహణ కాలంలో గంగా జలం లభిస్తే కోటి గుణితం పుణ్యం సూర్యగ్రహణ కాలంలో దశకోటి గుణితం పుణ్యం లభిస్తుంది. వేల కోట్ల కొలది గోదానంవల్ల ఏ ఫలితం

లభిస్తుందో, ఆ ఫలితాన్ని చంద్రసూర్యగ్రహణ కాలంలో గంగా స్నానంవల్ల పొందుతాడు అని.

గంగాది నదీ స్నానం లభించని పక్షంలో మాధవీయంలో శంఖుడు ఇట్లా అంటాడు - దిగుడుబావి, బావి, చెరువు, పర్వతం నుండి వచ్చే ప్రవాహం, నది నదము, దేవఖాతము (పుష్కరిణి) సరోవరం, పైకి తీయబడిన జలం, వేడి నీళ్ళు- వీనిలో దేంట్లోనైనా సూర్యచంద్రగ్రహణ కాలమందు స్నానం చేయాలి అని. ఇందులో తారతమ్యాన్ని మార్కండేయుడు ఇట్లా చెప్పాడు - వేడి నీటి కన్న చన్నీరు, ఇతరుల జలం కన్న తన జలము, ఉద్ధృత జలంకన్న భూమియందలి జలము, భూజలముకన్న పర్వతం నుండి ప్రవహించే జలము, దానికన్న సరస్సు జలం, దానికన్న నదీ జలము, దానికన్న తీర్థతోయము, దానికన్న మహానది జలము, దానికన్న గంగా జలము, దానికన్న సముద్ర జలము- ఇట్లా ఒక దానికన్న మరొకటి పవిత్రమైనవి అని. ఉష్ణోదకము ఆతురుల విషయకము. అట్లాగే - చంద్రగ్రహణ కాలంలో గోదావరి జలం మహా పుణ్యదాయకం. సూర్యగ్రహణ కాలంలో నర్మదాతోయ స్పర్శము కృతకృత్యత నిస్తుంది. పృథ్వీ చంద్రోదయంలో ప్రభాస ఖండంలో ఇట్లా ఉంది- ఆవులు, గజములు, నువ్వులు, అన్నము, రత్నములు, బంగారము, భూమి- వీటిని కురుక్షేత్రంలో దానం చేయటంవల్ల నరుడు ఏ ఫలితాన్ని పొందుతాడో, ఆ ఫలము చంద్ర గ్రహణ కాలంలో సముద్ర స్నానంవల్ల అరింత లెక్కువగా లభిస్తుంది అని ఉంది. అక్కడే సౌర పురాణంలో అంబుధి స్నానాన్ని గూర్చి ఆరంభించి ఇట్లా చెప్పారు- విద్వాంసులచే లోకంలో ఎన్ని రకాల దానాలు చెప్పబడ్డాయో వాటన్నిటి ఫలంను చంద్రసూర్యగ్రహణ కాలమందు (సముద్ర స్నానంవల్ల) పొందుతాడు అని. దేవీ పురాణంలో ఇట్లా ఉంది - సూర్యగ్రహణ కాలంలో గంగ, కనఖలము పవిత్రమైనవి. ప్రయాగ, పుష్కరము అట్లాగే పవిత్రమైనవి. కురుక్షేత్రము మహా పవిత్రమైనది అని. స్నానం చేయటం కుదరకపోతే తీర్థాన్ని స్మరించాలి. స్మరణంవల్ల నూరు యజ్ఞముల ఫలం లభిస్తుంది. చూడటంవల్ల పాపాలన్నీ నశిస్తాయి. స్పర్శవల్ల గోమేధపుణ్యం వస్తుంది. పానంవల్ల సౌత్రామణి యజ్ఞ ఫలాన్ని పొందుతాడు. స్నానంవల్ల అశ్వమేధయాగ ఫలాన్ని పొందు తాడు. సూర్యచంద్ర గ్రహణ కాలంలో, ఉత్తరాయణంలోనూ స్మరణాదులు ఫలప్రదాలని మార్కండేయోక్తి.

మూ॥ అత్రశ్రాద్ధమాహ ఋష్యశృంగః—

చంద్రసూర్యగ్రహే యస్తు శ్రాద్ధంవిధివ దాచరేత్

తేనైవ సకలాపృథ్వీ దత్తా విప్రస్యవైకరే॥

భారతే—

సర్వస్వేనాపి కర్తవ్యం శ్రాద్ధం వై రాహుదర్శనే

అకుర్వాణస్తు నాస్తిక్యాత్ పంకే గౌరివసీదతి॥

విష్ణుః—

రాహుదర్శనదత్తంహి శ్రాద్ధమా చంద్రతారకం. ఇదంచ ఆమాన్నేన హేమ్నావా కార్యం, నత్వన్నేన.

ఆపద్యనగ్నౌ తీర్థేచ, చంద్రసూర్య గ్రహేతథా

ఆమశ్రాద్ధం ప్రకుర్వీత హేమ శ్రాద్ధ మథాపివా॥ ఇతి శాతాతపోక్తే రితి హేమాద్రి మాధవాదయః అపరార్కస్తు - ఏతత్ ద్విజానాం పాకాభావే ద్రష్టవ్యం తీర్థశ్రాద్ధవత్. పాకాభావే ద్విజాతీనాం ఆమశ్రాద్ధం విధీయతే, ఇతి సుమంతూక్తేః

సైంహికేయో యదాసూర్యంగ్రసతే పర్వసంధిషు

గజచ్ఛాయాతు సాప్రోక్తాతస్యాం శ్రాద్ధం ప్రకల్పయేత్॥

ఘృతేన భోజయేత్ విప్రాన్ ఘృతంభూమౌ సముత్సృజేత్॥ ఇతి వాయవీయోక్తేశ్చేత్యాహ విజ్ఞానేశ్వరోఽప్యాహ- గ్రహణశ్రాద్ధే భోక్తుశ్దోషో దాతుస్త్వభ్యుదయః, ఇతి.

సూతకే మృతకే భుంక్తే గృహీతే శశిభాస్కరే

ఛాయాయాంహస్తి నశ్చైవ న భూయః పురుషోభవేత్॥

ఇత్యాపస్తంబేన భోజన నిషేధాత్ అయంచ నిషేధః శ్రాద్ధభోక్తుః హస్తిచ్ఛాయా సాహచర్యాత్. అత్రగ్రహణ నిమిత్తక శ్రాద్ధేనైవ అమా సంక్రాన్త్యాది నైమిత్తికానాంసిద్ధిః దార్శికాలభ్యయోరపి, ఇతికాలా దర్శోక్తేః.

అత్రాశౌచమధ్యేఽపి స్నానశ్రాద్ధాది కార్యమేవ.

సూతకేమ్మృతకే చైవనదోషో రాహుదర్శనే

తావదేవ భవేచ్ఛుద్ధిః యావన్ముక్తిర్న దృశ్యతే॥ ఇతి మాధవీయే వృద్ధ వసిష్ఠోక్తేః. స్మార్తకర్మ పరిత్యాగో రాహోరన్యత్ర సూతకే, ఇతి వ్యాఘ్రపాదోక్తేశ్చ. కాలాదర్శే అంగిరాః—

సర్వేవర్ణాః సూతకేఽపిమృతకే రాహుదర్శనే
స్నాత్వాశ్రాద్ధం ప్రకుర్వీరన్ దానంశాఠ్య వివర్జితం॥

మదన పారిజాతేఽప్యేవం తేన, స్నాన మాత్రం ప్రకుర్వీత దానశ్రాద్ధ వివర్జితం, ఇతి నిర్మూలం వదన్తోగౌడాః పరాస్తాః ఇయంచశుద్ధిర విశేషాన్మంత్ర దీక్షా పురశ్చరణాది సర్వస్మార్తకర్మవిషయా. మదనరత్నేఽప్యేవం

ఋష్యశృంగుడు గ్రహణకాలంలో శ్రాద్ధము గూర్చి చెప్పాడు - సూర్య చంద్రుల గ్రహణ కాలంలో ఎవరు శాస్త్రప్రకారంగా శ్రాద్ధాన్ని ఆచరిస్తారో, అతడు సమస్త భూమిని బ్రాహ్మణుని చేతిలో ధారపోసినంత వాడౌతాడు. భారత మందు ఇట్లా ఉంది - రాహుదర్శనమందు అన్నివిధాలా శ్రాద్ధాన్ని ఆచరించాలి. నాస్తికులై ఆచరించనివారు బురదలో ఆవువలె దుఃఖితులౌతారు. విష్ణువచనం ఇట్లా ఉంది: గ్రహణకాలమందు చేయబడ్డ శ్రాద్ధము ఆచంద్రతారకము ఫలాన్నిస్తుంది. ఈ శ్రాద్ధాన్ని ఆమ శ్రాద్ధంగా లేదా బంగారంతో చేయాలి, అన్నంతో మాత్రం కాదు. హేమాద్రి మాధవాదులు శాతాతపోక్తిని ఇట్లా ఉట్టంకిస్తారు- ఆపదలందు, అగ్ని లేన్నప్పుడు, తీర్థమందు, సూర్యచంద్రుల గ్రహణ కాలమందు ఆమ శ్రాద్ధం లేదా హేమశ్రాద్ధం చేయాలి అని. అప రార్కుని వచనం ఇట్లా - దీనిని ద్విజులు పాక అభావమందు తీర్థశ్రాద్ధం వలె తెలుసుకోవాలి అని. సుమంతుడిట్లా అంటాడు- ద్విజాతులకు పాకాభావ మందు ఆమ శ్రాద్ధంను విధిస్తున్నాము అని. వాయుపురాణంలో ఇట్లా ఉంది : పర్వ సంధులలో రాహువు, సూర్యుని గ్రసించినట్లైతే దానిని గజచ్ఛాయ అని అంటారు. దానిలో శ్రాద్ధం ఆచరించాలి. నేయితో బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. భూమియందు నేయిని విడవాలి, అని కూడా చెప్పాడు. విజ్ఞానేశ్వరుడు కూడా ఇట్లా అన్నాడు- గ్రహణ శ్రాద్ధమందు భుజించేవాడికి దోషం, శ్రాద్ధం ఆచరించేవాడికి అభ్యుదయము అని. ఆపస్తంబుడు ఇట్లా భోజనాన్ని నిషేధించాడు: సూతకమందు, మరణమందు, సూర్యచంద్రుల గ్రహణకాలమందు గజచ్ఛాయ యందు భుజించినవాడు తిరిగి పురుష జన్మమెత్తడు అని. ఈ నిషేధము గజ చ్ఛాయా సాహచర్యంవల్ల శ్రాద్ధాన్నభోక్తకు వర్తిస్తుంది.ఇక్కడ గ్రహణ నిమిత్తక శ్రాద్ధంవల్లనే,అమాసంక్రాంత్యాదినైమిత్తిక శ్రాద్ధములు సిద్ధిస్తాయి కాలాదర్శంలో ఉంది కూడా - అమావాస్య సంక్రాంతులందు కూడా శ్రాద్ధం చేయాలి అని. అశౌచం మధ్యయందు కూడా గ్రహణ స్నాన శ్రాద్ధాదులు చేయాల్సిందే. మాధ

పీయంలో వృద్ధవసిష్ఠోక్తి ఇట్లా ఉంది- సూతకం, మరణం, చంద్రగ్రహణం- వీటిలో దోషం లేదు. ముక్తి కన్పించనంతవరకు (అంతవరకు) శుద్ధియే అని. గ్రహణం కన్న భిన్నమైన ఇతర సూతకాల్లో స్మార్తకర్మలు విడిచిపెట్టాలి, ఆచరించరాదు అని వ్యాఘ్రపాదుని వచనం కూడా. కాలాదర్శంలో అంగిరోక్తి ఇట్లా ఉంది- సూతకం,మరణం, గ్రహణం వీటిలో అన్నివర్ణాలవారు స్నానంచేసి శ్రాద్ధంచేయాలి లోభిత్వం లేకుండా దానం చేయాలి అని. మదనపారిజాతంలో కూడా ఇట్లాగే ఉంది. స్నానం మాత్రం చేయాలి, దాన శ్రాద్ధములు చేయరాదు అని, ఆధారం లేకుండా పలికే గౌడుల వచనములు పైమాటలవల్ల తొలగి పోయాయి. ఈ శుద్ధి, విశేషం లేనందువల్ల మంత్రదీక్ష పురశ్చరణము మొదలగు సర్వస్మార్త కర్మ విషయకము అని గ్రహించాలి. మదనరత్నంలో కూడా ఇట్లాగే ఉంది.

మూ॥ రజస్వలాయాస్తు భార్గవార్చన దీపికాయాం సూర్యోదయ నిబంధే

నసూతకాది దోషోఽస్తి గ్రహేహోమజపాదిషు

గ్రస్తే స్నాయాదుదక్యాఽపి తీర్థాదుద్ధృత్య వారిణా॥ ఇతి.

అత్ర- స్నానే నైమిత్తికే ప్రాప్తే నారీయది రజస్వలా

పాత్రాంతరితతోయేన స్నానం కృత్వా వ్రతంచరేత్॥ ఇతి మితాక్షరోక్త విధిర్జ్ఞేయః తథా గ్రహణేరాత్రావపి శ్రాద్ధాది కార్యం.

గ్రహణోద్వాహ సంక్రాంతి యాత్రార్తి ప్రసవేషుచ

దానం నైమిత్తికం జ్ఞేయం రాత్రావపిత దిష్యతే॥ ఇతి అపరార్కే వ్యాసోక్తేః చంద్రగ్రహే తథా రాత్రౌ స్నానం దానం ప్రశస్యతే, ఇతి దేవలోక్తేశ్చ యదాతు జ్యోతిఃశాస్త్రగమ్యే దినే చంద్రగ్రహో రాత్రౌచ సూర్యగ్రహః తదా స్నానాది నకార్యం

సూర్యగ్రహో యదా రాత్రౌ దివాచంద్ర గ్రహస్తథా

తత్ర స్నానంన కుర్వీత దద్యాత్ దానంచ నక్వచిత్॥ ఇతి

షట్త్రింశన్మతాత్ -

గ్రహణదినే వార్షిక శ్రాద్ధప్రాప్తౌతు ప్రయోగపారిజాతే గోభిలః-

దర్శే రవిగ్రహే పిత్రోః ప్రత్యాబ్దికముపస్థితం

అన్నే నాసంభవే హేమ్నా కుర్యాదామేన వాసుతః॥ ఇతి అత్రరవి పితృ

సుతశబ్దాః ప్రదర్శనార్థాః. న్యాయసామ్యాత్ తేన చంద్రగ్రహణేఽపి సపిండాది వార్షికం అన్నాదినా తద్దినే ఏవకార్యమితి మదనపారిజాతే వ్యాఖ్యాతం. పృథ్వీ చంద్రోదయేఽప్యేవం. తేనయాని.

అమశ్రాద్ధం ప్రకుర్వీత మాస సంవత్సరాదృతే
అన్నేనైవాబ్దికం కుర్యాత్ హేమ్నాచామేనచక్వచిత్॥ ఇతి మరీచిలౌగాక్ష్యాదివచనాని, తాని గ్రహణ దినాతిరిక్త విషయాణి. నిర్ణయామృతేఽప్యేవం.

యానితు - గ్రహణాత్తుద్వితీయేఽహ్ని రజోదోషాత్తు పంచమే
గ్రస్తోదయే యథా చంద్రే ప్రత్యబ్దేసముపస్థితం॥ తద్దినే చోపవాసః స్యాత్ ప్రత్యబ్దంతుపరేఽహని. తథా

గ్రస్తావేవాస్త మానంతు రవిందూ ప్రాప్నుతోయది
ప్రత్యబ్దంతు తదాకార్యం పరేఽహన్యేవసర్వదా॥

చంద్రసూర్యో పరాగేచ తథా శ్రాద్ధం పరేఽహని, ఇత్యాదీని వచనాని, తాని మహా నిబంధేషు క్వాప్యను పలంభాన్నిర్మూలాని, ప్రత్యుత పూర్వోక్త నిబంధేషు తద్దినే ఏవశ్రాద్ధముక్తమిత్యలం.

రజస్వలగూర్చి, భార్గవార్చన దీపిక యందు సూర్యోదయ నిబంధమందు ఇట్లా వ్రాయబడి ఉంది - గ్రహణమందు హోమజపాదులందు రజస్వలకు సూతకాదిదోషం లేదు. గ్రహణకాలమందు నీటితో లేదా తీర్థమునుండి పైకి తీసిన నీటితో స్నానం చేయాలి అని. ఇక్కడ గ్రహణమందు నైమిత్తిక స్నానం ప్రాప్తిస్తే, రజస్వల ఐన స్త్రీ పాత్రయందుంచిన నీటితో స్నానంచేసి వ్రతమాచరించాలి అని మితాక్షరియందు చెప్పబడిన విధిని గ్రహించాలి. అట్లాగే గ్రహణమందు, రాత్రియందుకూడా శ్రాద్ధాదులు చేయాలి. అపరార్కమందు వ్యాసోక్తి ఇట్లా ఉంది - గ్రహణము, వివాహము, సంక్రమణము, యాత్ర, రోగము, ప్రసవము - వీటియందు దానము నైమిత్తికమైనది. రాత్రియందు కూడా దాన్ని ఆచరించవచ్చు అని. దేవలుడుకూడా ఇట్లా చెప్పాడు - చంద్రగ్రహణమందు రాత్రియందు కూడా స్నాన దానములు ప్రశస్తమైనవి, అని. జ్యోతిషశాస్త్రంలో మాత్రమే, ఒకవేళ పగలు చంద్రగ్రహణం, రాత్రి సూర్యగ్రహణం వస్తే అప్పుడు స్నానాదులు చేయరాదు. "రాత్రియందు సూర్యగ్రహణం, పగలు చంద్రగ్రహణం ఐనప్పుడు అక్కడ స్నానము చేయకూడదు. ఏ కొంచము కూడా

దానం చేయరాదు" అని షట్‌త్రింశన్మతము. గ్రహణదినమందు వార్షిక శ్రాద్ధం వస్తే ప్రయోగ పారిజాతంలో గోభిలుడు ఇట్లా అంటాడు - అమావాస్య సూర్య గ్రహణమందు ఒకవేళ తలిదండ్రుల శ్రాద్ధంవస్తే అన్నంతో చేయడం కుదరక పోతే బంగారంతో కాని ఆమ శ్రాద్ధం కాని సుతుడు చేయాలి అని.

ఇక్కడ సూర్యుడు పితరులు, సుతుడు అనే శబ్దాలు ఉదాహరణగా మాత్రమే చెప్పబడ్డాయి. న్యాయసామ్యం వల్ల. అందువలన చంద్రగ్రహణమందు కూడా, సపిండాది వార్షిక శ్రాద్ధములు అన్నాదులతో ఆ రోజే చేయాలి అని మదన పారిజాతంలో వ్యాఖ్యానించబడింది. పృథ్వీ చంద్రోదయమందు కూడా ఇట్లాగే చెప్పబడింది. మరీచిలౌగాక్ష్యాదులు ఇట్లా అన్నారు- మాస, సంవత్సర శ్రాద్ధములు తప్ప మిగిలినవి ఆమశ్రాద్ధం చేయాలి, ఆబ్దికము మాత్రం అన్నంతోనే చేయాలి ఆమశ్రాద్ధము, హేమశ్రాద్ధము చేయరాదు అని చెప్పారో ఆ మాటలు పైమాటల వల్ల గ్రహణదిన అతిరిక్త విషయములని గ్రహించాలి. నిర్ణయామృతంలో కూడా ఇట్లాగే ఉంది కొంతమంది-గ్రహణం తర్వాతి రెండో రోజు, రజో దోషం నుండి ఐదవరోజు, చంద్రుడు అస్త దశలోనే ఉదయిస్తే అప్పుడు ప్రత్యబ్దశ్రాద్ధము సంభవిస్తే ఆరోజు ఉపవసించాలి. శ్రాద్ధము మాత్రం తర్వాతి రోజు చేయాలి అని అన్నారో, అట్లాగే సూర్యచంద్రులు గ్రహణంలోనే అస్తమించే పక్షంలో ప్రత్యాబ్దికమును తరువాతి రోజు చేయాలి. చంద్రసూర్యుల గ్రహణమందు కూడా అట్లాగే తరువాతి రోజు శ్రాద్ధం చేయాలి అని అన్నారో ఇట్లాంటి వచనాలన్నీ మహా నిబంధములందు ఎక్కడా లభించలేదు. అందువల్ల నిర్మూలములు. అంతేకాక, అందుకు విరుద్ధంగా పూర్వోక్త గ్రంథములందు ఆ రోజే శ్రాద్ధము చేయాలని చెప్పారు అని. ఈ విషయం ఇక చాలు.

మూ॥ గ్రహణాది సప్త దిన పర్యంతం రామగోపాలాద్యాగమ దీక్షా శివార్చన చంద్రికాయాం జ్ఞానార్ణవే -

మంత్రాద్యారంభణం కుర్యాత్ గ్రహణే చంద్రసూర్యయోః
గ్రహణాద్యోఽపి దేవేశికాలః సప్తదినావధి॥ ఇతి.

రత్నసాగరే - సప్తర్షేఽర్కవిధుగ్రాసే తంతు దామన పర్వణి
మంత్ర దీక్షాంప్రకుర్వాణో మాసర్ క్షాదీన్న శోధయేత్॥

అత్ర సూర్య గ్రహణమేవ ముఖ్యం -

సూర్యగ్రహణకాలేతు నాన్యదన్వేషితం భవేత్
సూర్యగ్రహణకాలేన సమోనాన్యః కదాచన॥

నమాస తిథి వారాది శోధనం సూర్యపర్వణి. ఇతి తత్రైవ కాలోత్తర వచనాత్.

గ్రహణం నుండి ఏడు రోజుల వరకు రామ, గోపాలాది ఆగమ మంత్ర దీక్ష చెప్పబడింది. శివార్చన చంద్రికయందు జ్ఞానార్ణవంలో ఇట్లా ఉంది - చంద్ర సూర్య గ్రహణమందు మంత్రాదులు ఆరంభము చేయాలి. ఓ పార్వతీ! గ్రహణమందు లేదా గ్రహణం నుండి ఏడు రోజులపరకు మంత్రాదులు ఆరంభించాలి అని. రత్నసాగరంలో ఇట్లా - మంచి తీర్థమందు, సూర్య చంద్రుల గ్రహణమందు, తంతు (పవిత్రారోపణ), దామన (దమనారోపణ) పర్వమందు మంత్రదీక్షను చేసేవాళ్ళు, మాస నక్షత్రాదుల శుద్ధిని చూడనవసరం లేదు. ఇక్కడ సూర్యగ్రహణమే ముఖ్యము. సూర్యగ్రహణ కాలమందు మరో దానిని అన్వేషించరాదు. సూర్యగ్రహణ కాలంతో సమానమైన కాలం మరొకటి లేదు సూర్యగ్రహణమందు మాస, తిథి వారాదుల శోధనము చేయరాదు అని అక్కడే తర్వాత చోట చెప్పబడింది.

మూ॥ చంద్రగ్రహేతుయాదీక్షా యాదీక్షావ్రతచారిణాం

వనస్థస్యచయాదీక్షా దారిద్ర్యం సప్త జన్మసు॥ ఇతి తత్రైవయోగినీతంత్రే నిషేదాచ్ఛ. గ్రహణంచ జన్మరాశ్యాదౌ నిషిద్ధం. తదుక్తంజ్యోతిషే-

త్రిషట్ దశాఽఽయోపగతం నరాణాంశుభప్రదంస్యాత్గ్రహణంరవీందోః

ద్విసప్త నందేషుచ మధ్యమంస్యాత్ శేషేష్వనిష్టం కథితం మునీంద్రైః॥

ఇతి ఆయః=ఏకాదశ. నందాః=నవ. ఇషుః=పంచ. మదనరత్నేగర్గః -

జన్మసప్తాష్టరిః ఫాంకదశమస్థే నిశాకరే

దృష్టోఽరిష్టప్రదో రాహుర్జన్మర్షే నిధనేఽపిచ॥

రిఃఫం=ద్వాదశ. అంకాః = నవ. నిధనం=సప్తమతారా. పృథ్వీచంద్రోదయే విష్ణుధర్మే -

యన్నక్షత్రగతో రాహుః గ్రసతేశశి భాస్కరౌ

తజ్జాతానాంభవేత్ పీడా యేనరాః శాంతి వర్జితాః॥

తత్రైవ పురాణాంతరే -

సూర్యస్య సంక్రమో వాఽపి గ్రహణం చంద్రసూర్యయోః

యస్యత్రి జన్మనక్షత్రే తస్యరోగోఽథవా మృతిః॥

తస్యదానంచ హోమంచ దేవార్చన జపౌతథా
ఉపరాగాభిషేకంచ కుర్యాచ్ఛాంతిర్భ విష్యతి॥
స్వర్ణేనఽవాఽథపిష్టేన కృత్వా సర్పస్య చాకృతిం
బ్రాహ్మణాయ దదేత్తస్యన రోగాదిశ్చ తత్కృతః॥

జన్మనక్షత్రం తత్పూర్వోత్తరేచ త్రిజన్మనక్షత్ర మిత్యుచ్యతే, జన్మదశమైకోనవింశతి తారా కేచిత్. సర్పస్య=తదాకారస్య రాహోరిత్యర్థః.

చంద్ర గ్రహణమందలి దీక్ష, వ్రతచారుల యొక్క దీక్ష, వానప్రస్థుని దీక్ష- ఇవి ఏడు జన్మల వరకు దారిద్ర్యాన్నిస్తాయి అని అక్కడే యోగినీ తంత్రంలో నిషేధించారు కూడా జన్మ రాశ్యాదులలో గ్రహణం చెడ్డదన్నారు. జ్యోతిషంలో ఇట్లా ఉంది- జన్మరాశి నుండి మూడు, ఆరు, పది, పదకొండు రాసులలో సూర్యచంద్ర గ్రహణమైన నరులకు శుభప్రదము; రెండు, ఏడు, తొమ్మిది, ఐదు రాసులందైన మధ్యమము; మిగిలిన వాటియందు గ్రహణమైన అనిష్టమని మునీంద్రులు చెప్పారు, అని. ఆయ=పదకొండు, నంద=తొమ్మిది, ఇషు=ఐదు.

మదనరత్నంలో గర్గుడు ఇట్లా అంటాడు - జన్మనుండి ఏడు, ఎనిమిది, పన్నెండు, తొమ్మిది, పదిలో గ్రహణమైతే అరిష్టప్రదము. రాహువు జన్మ నక్షత్రమందు లేదా దాని 7 వ నక్షత్రమందు ఉన్నపక్షంలో అనిష్టప్రదుడు అని. రిఃపం=పన్నెండు, అంకాః=తొమ్మిది; నిధనం=నిధన (7 వ) తార.

వృద్ధ చంద్రోదయమందలి విష్ణుధర్మంలో ఇట్లా ఉంది - ఏ నక్షత్రంలో ఉండి రాహువు చంద్రసూర్యులను మింగుతాడో, ఆ నక్షత్ర జాతకులకు పీడ కలుగుతుంది, వాళ్ళు శాంతి చేయని పక్షంలో అని. అక్కడే మరో పురాణంలో ఇట్లా ఉంది - సూర్య సంక్రమణం కాని, చంద్రసూర్యుల గ్రహణం కాని ఎవని జన్మనక్షత్రమందు లేదా ముందు వెనక నక్షత్రాల్లో ఔతుందో వానికి రోగం కాని మృతి కాని సంభవిస్తుంది. అందుకై దానము, హోమము, దేవార్చన, జపము, గ్రహణమందభిషేకము చేయాలి అట్లైన దానికి శాంతి లభిస్తుంది. బంగారంతో కాని, పిండితో కాని సర్పాకారాన్ని చేసి బ్రాహ్మణుని కివ్వాలి. దీనివల్ల అరిష్ట సంబంధ రోగాదులు రావు అని. జన్మనక్షత్రము, దాని పూర్వనక్షత్రము, పర నక్షత్రము - ఈ మూటిని త్రిజన్మనక్షత్రం అని అంటారు. కొందరు జన్మనక్ష

త్రము పదవది, పందొమ్మిదవ నక్షత్రము నిషిద్ధం అని అంటారు. సర్పము అనగా సర్పాకారంగల రాహువు యొక్క (దానం) అని అర్థం.

మూ॥ అద్భుత సాగరే భార్గవః -

యస్యరాజ్ఞస్య నక్షత్రే స్వర్భానురుపరజ్యతే
రాజ్యభంగం సుహృన్నాశం మరణం చాత్రనిర్దిశేత్.
రాజ్యస్య నక్షత్రం=అభిషేక నక్షత్రమితి తత్రైవ వ్యాఖ్యాతం. భార్గవార్చన దీపికాయాంజ్యోతిః సాగరే -

సౌవర్ణం కారయేన్నాగం పలేనాథ పలార్థతః
తదర్థేన తదర్థేన ఫణాయాం మౌక్తికం న్యసేత్॥
తామ్రపాత్రే నిధాయాథ ఘృతపూర్ణే విశేషతః
కాంస్యేవా కాంతి లోహేవాన్యస్య దద్యాత్ సదక్షిణం॥
చంద్రగ్రహేతురూప్యస్యబింబం దద్యాత్సదక్షిణం
నాగం రుక్మమయం సూర్యగ్రహేబింబంచ హేమజం॥
తురంగ రథగోభూమి తిల సర్పిశ్చకాంచనం.
కాలవివేకేఽపి -
సువర్ణనిర్మితంనాగం సతిలం, కాంస్య భాజనం
సదక్షిణంసవస్త్రంచ బ్రాహ్మణా యనివేదయేత్॥
సౌవర్ణం రాజతం వాఽపిబింబం కృత్వాస్వశక్తితః
ఉపరాగ భవక్లేశచ్ఛిదే విప్రాయకల్పయేత్॥

అద్భుత సాగరమందు భార్గవుడు ఇట్లా అంటాడు - ఎవని రాజ్యాభిషేక నక్షత్రమందు సూర్యగ్రహణం ఔతుందో వానికి రాజ్యభంగం, మిత్రనాశము, మరణమూ ఔతుంది అని. రాజ్యనక్షత్రమంటే అభిషేకనక్షత్రమని అక్కడే వ్యాఖ్యానించారు.

భార్గవార్చన దీపికయందు జ్యోతిః సాగరుని వచనం ఇట్లా - ఒక పలం లేదా పలార్ధంతో లేదా దాని అర్ధంతో లేదా, దాని అర్ధంతో సువర్ణనాగాన్ని చేయించి, దాని పణముపై ముత్యాన్ని ఉంచాలి. నేయితో నిండిన రాగి పాత్ర యందు దాన్ని ఉంచి, లేదా కాంస్య పాత్ర లేదా కాన్తిలోహ పాత్ర యందు కాని దాన్ని ఉంచి దక్షిణపూర్వకంగా దాన్ని దానం చేయాలి. చంద్రగ్రహణమందు

వెండితో చేసిన చంద్రబింబాన్ని, దక్షిణతో కూడా ఇవ్వాలి. సూర్యగ్రహణమందు బంగారు నాగాన్ని చేయించి సూర్యబింబాన్ని హేమంతో చేయించి దక్షిణతో కూడా బ్రాహ్మణునకివ్వాలి. గుర్రము, రథము, గోవులు, భూమి, నువ్వులు, నేయి, బంగారం- వీటిని దానం చేయాలి అని ఉంది.

కాలవివేకమందు కూడా - బంగారంతో చేసిన సర్పాన్ని, నువ్వులతో నిండిన కాంస్య పాత్రను, వస్త్రము, దక్షిణతో కూడి బ్రాహ్మణునికివ్వాలి. తన శక్తి కొలది బంగారుది, వెండిది కాని బింబాన్ని చేసి, గ్రహణంవల్ల వచ్చిన కష్టముల నివృత్తి కొరకు బ్రాహ్మణునకు ఇవ్వాలి అని ఉంది.

మూ॥ **మంత్రస్తు** -

తమోమయ మహా భీమ సోమ సూర్యవిమర్దన
హేమతారాప్రదానేన మమశాంతి ప్రదోభవ॥
విధుంతుద నమస్తుభ్యం సింహికానందనాచ్యుత
దానేనానేననాగస్య రక్షమాం వేధజాద్భయాత్॥

అత్రశాన్తిరప్యుక్తా హేమాద్రౌ మాత్స్యే—

యస్యరాశిం సమాసాద్యభవేత్ గ్రహణసంభవః
స్నానంతస్య ప్రవక్ష్యామి మంత్రౌషధి సమన్వితం॥
చంద్రోపరాగంసంప్రాప్య కృత్వాబ్రాహ్మణవాచనం
సంపూజ్య చతురోవిప్రాన్ శుక్లమాల్యానులేపనైః॥
పూర్వమేవోపరాగస్య సమానీ యౌషధాదికం
స్థాపయేచ్చతురః కుంభాన్ అవ్రణాన్ సలిలాన్వితాన్॥
గజాశ్వరథ్యా వల్మీకసంగమాత్ హ్రదగోకులాత్
రాజద్వార ప్రదేశాచ్చ మృదమానీయనిక్షిపేత్॥
పంచగవ్యం పంచరత్నం పంచత్వక్ పంచపల్లవం
రోచనం పద్మకం శంఖం కుంకుమం రక్త చందనం॥
శుక్తి స్ఫటిక తీర్థాంబు సిత సర్షపగుగ్గులాన్
మధుకం దేవదారుంచ విష్ణుక్రాంతాంశతావరీం॥
బలాంచ సహదేవీంచ నిశాద్వితయమేవచ
గజదంతంకుంకుమంచ తద్వైవో శీర చందనం॥

ఏతత్సర్వం వినిక్షిప్య కుంభేష్వా వాహయేత్ సురాన్
సర్వే సముద్రాః సరితః తీర్థాని జలదా నదాః
ఆయాంతు యజమానస్య దురిత క్షయ కారకాః॥
యోఽసౌ వజ్రధరో దేవ ఆదిత్యానాం ప్రభుర్మతః
సహస్రనయనః శక్రో గ్రహపీడాం వ్యపోహతు॥
ముఖంయః సర్వదేవానాం సప్తార్చిరమిత ద్యుతిః
చంద్రోపరాగ సంభూతా మగ్నిః పీడాం వ్యపోహతు॥
యఃకర్మ సాక్షిలోకానాం ధర్మో మహిష వాహనః
యమశ్చం ద్రోపరాగోత్థాం గ్రహపీడాం వ్యపోహతు॥
రక్షో గణాధిపః సాక్షాత్ నీలాంజన సమప్రభః
ఖడ్గహస్తోఽతి భీమశ్చ గ్రహపీడాం వ్యపోహతు॥
నాగపాశధరో దైవః సదా మకర వాహనః
సజలాధిపతిర్దేవో గ్రహపీడాం వ్యపోహతు॥
ప్రాణరూపోహిలోకానాం సదా కృష్ణమృగప్రియః
వా యుశ్చంద్రో పరాగోత్థాం గ్రహపీడాం వ్యపోహతు॥
యోఽసౌ నిధిపతిర్దేవః ఖడ్గ శూల గదాధరః
చంద్రోపరాగ కలుషం ధన దోఽత్ర వ్యపోహతు॥
యోఽసౌ విందుధరో దేవః పినాకీ వృష వాహనః
చంద్రోపరాగ పాపాని సనాశయతు శంకరః॥
త్రైలోక్యేయాని భూతాని స్థావరాణి చరాణిచ
బ్రహ్మవిష్ణ్వర్క రుద్రాశ్చ దహంతు మమ పాతకం॥
ఏవమావాహయేద్దేవాన్ మంత్రైరేభిశ్చ వారుణైః
ఏతానేవ తథా మంత్రాన్ స్వర్ణపట్టే విలేఖయేత్॥
తామ్రపట్టేఽథవాలిఖ్య నవవస్త్రైత త్రైవచ
మస్తకే యజమానస్య నిదధ్యాస్తే ద్విజోత్తమాః॥
కలశాన్ ద్రవ్య సంయుక్తాన్నానా రూప సమన్వితాన్
గృహీత్వా స్నాపయేత్ గూఢం భద్రపీఠో పరిస్థితం॥
పూర్వైరేవతు మంత్రైశ్చ యజమానం ద్విజోత్తమాః
అభిషేకం తతః కుర్యాత్ మంత్రైర్వారుణ సూక్తకైః॥

ఆచార్య మర్చయేత్ పశ్చాత్ స్వర్ణపట్టం నివేదయేత్
ఆచార్య దక్షిణాం దద్యాత్ గోదానంచ స్వశ క్తితః
హోమం వాఽపి ప్రకుర్వీత తిలైః వ్యాహృతి భి స్తథా
దానంచ శ క్తితో దద్యాత్ యదీచ్ఛేదాత్మనోహితం॥
సూర్యగ్రహే సూర్యనామ యుక్తాన్ మంత్రాంశ్చ కీర్తయేత్.

అనేనవిధినా యస్తు గ్రహణే స్నానమాచరేత్
నతస్యగ్రహణేదోషః కదాచిదపిజాయతే॥ ఇతి గ్రహణ శాంతిః.

మంత్రంద్వారా ప్రార్థన :

మంత్రమైతే-అంధకారస్వరూప, మిక్కిలి భయంకరుడా, చంద్రసూర్యుల మర్దించేవాడా, సువర్ణతారదానంతో నాకు శాంతిని ప్రసాదించు. సింహికానందన, అచ్యుత, విధుంతుద నీకు నమస్కారము. ఈ సర్పదానంతో గ్రహణజనిత భయంనుండి నన్ను రక్షించు అని.

హేమాద్రియందు మత్స్యపురాణమందలి దీని శాన్తి కూడా ఇట్లా చెప్ప బడింది–ఎవని రాశిని చేరి గ్రహణం సంభవిస్తుందో వానికి మంత్ర ఓషధులతో కూడిన స్నానాన్ని చెప్పుచున్నాను. చంద్రగ్రహణం వచ్చాక బ్రాహ్మణునితో స్వస్తివాచనం చేయించి తెల్లని మాలలు, సుగంధములతో నలుగురు బ్రాహ్మణు లను పూజించాలి. గ్రహణంకన్నా ముందే ఔషధాదులు తేవాలి. నీళ్ళతో నింపిన సొట్టలులేని నాల్గు కుంభములను ఉంచాలి. గజ, అశ్వ, రథ,పుట్ట-వీని సంగమం నుండి; చెరువు, గోశాలనుండి, రాజద్వార ప్రదేశంనుండి మట్టిని తెచ్చిఉంచాలి. పంచగవ్యం, పంచరత్నము, పంచవృక్షముల త్వక్, పంచపల్లవాలు,గోరోచనం, పద్మకం (ఓషధి), శంఖం, కుంకుమ, ఎర్ర చందనం, ముత్యం, స్ఫటికం, తీర్థజలము, తెల్ల ఆవాలు, గుగ్గులు, మధుకం (గురిగింజ వేరు), దేవదారువు, విష్ణుక్రాంతము, శతావరీ (పిల్లిపిసర), బల (ముత్తవపులగం),సహదేవి (స్పృక్క- గంధ ద్రవ్యం), రెండురకాల పసుపు, ఏనుగదంతం, కుంకుమపువ్వు, ఉశీరం (వట్టివేరు), చందనం - ఇవన్నీ ఆ కుంభములందుంచి దేవతలను ఆవాహన చేయాలి.

అన్ని సముద్రములారా, నదులారా, తీర్థములారా, మేఘములారా, నదములారా! మీరంతా యజమానుని దురితక్షయమునకై రండి. ఆదిత్యులకు ప్రభువ, వజ్రధర, సహస్రనయనుడ, ఓ ఇంద్ర! గ్రహణపీడను తొలగించు. దేవతలందరికి ముఖస్థానీయుడ, అమితతేజశ్శాలి, సప్తజిహ్వుడ ఓ అగ్ని! చంద్రగ్రహణం మూలంగా వచ్చిన పీడను తొలగించు. లోకముల కర్మలకు సాక్షిభూతుడ, మహిషవాహనుడ ఓ యమధర్మరాజ! చంద్రగ్రహణంవల్ల వచ్చిన గ్రహపీడను తొలగించు. రాక్షసగణాధిపుడు, నల్లని కాటుకవంటి కాంతి గలవాడ, ఖడ్గధారి, మిక్కిలి భయంకరుడ ఓ నిర్ఋతి! గ్రహణపీడను తొలగించు. నాగపాశమును ధరించినవాడ, మకరవాహనుడ, జలాధిపతి, వరుణ దేవ! గ్రహణపీడను తొలగించు. లోకములకు ప్రాణస్వరూపుడ, ఎప్పుడు కృష్ణ మృగంను ఇష్టపడేవాడ ఓ వాయు! చంద్రగ్రహణ మూలంగా వచ్చిన గ్రహణ పీడను తొలగించు. నిధిపతి, ఖడ్గశూలగదాధర, ఓ కుబేర! చంద్రగ్రహణ మూలకమైన పాపాన్ని తొలగించు. చంద్రధారి,పినాకి,వృషవాహన, ఓ శంకర! చంద్రగ్రహణమూలక పాపాలను నశింపజేయి. ముల్లోకములందున్న భూతములు చరాచరములన్ని బ్రహ్మ, విష్ణు, అర్కరుద్రులు నా పాతకములను కాల్చనీ. ఈ రకంగా ఈ మంత్రాలతో, వరుణ మంత్రాలతో దేవతల నావాహనచేసి, ఇవే మంత్రములను బంగారు లేదా రాగిరేకుయందు వ్రాసి లేదా క్రొత్త బట్టయందు వ్రాసి ఆ బ్రాహ్మణులు వీటిని యజమానుని తలపై ఉంచాలి.

ద్రవ్యములతోకూడిన, నానా రూపములతోకూడిన కలశములను తీసుకొని భద్రపీఠముపై కూర్చున్న యజమానిని పూర్వమందలి మంత్రములతో బ్రాహ్మణులు స్నానం చేయించాలి. తర్వాత వరుణసూక్తములతో అభిషేకం చేయించాలి. తర్వాత ఆచార్యుని పూజించి స్వర్ణపట్టమును ఇవ్వాలి. ఆచార్యునకు శక్తి కొలది దక్షిణ, గోదానము చేయాలి. నువ్వులతో, వ్యాహృతులతో హోమం చేయాలి. తనహితం కోరుకునేవాడు శక్తి కొలది దానం కూడా చేయాలి. సూర్య గ్రహణమందు సూర్య నామంగల మంత్రములను పఠించాలి. ఈ విధంగా గ్రహణమందు ఎవరు స్నానం చేస్తారో అతనికి గ్రహణ దోషం ఎప్పుడూ కలగదు అని గ్రహణ శాంతి చెప్పబడింది.

మూ॥ భార్గవార్చన దీపికాయాం బ్రహ్మ సిద్ధాంతే-
నద్యైవాశి పటస్థితం వీక్ష్యం భస్మం తైలాంబు దర్పణే।
గ్రహణం గుర్విణీ జాతు నవశ్యేత పటంవినా॥

తథా మంగళకృత్యేషు విధి విశేషో హేమాద్రౌ-

త్రయోదశ్యాదితో వర్జ్యం దినానాం నవకంధ్రువం
మాంగల్యేషు సమస్తేషు గ్రహణే చంద్ర సూర్యయోః॥

ప్రకారాంతరం తత్రైవోక్తం -

ద్వాదశ్యాది తృతీయాన్తో వేధ ఇందుగ్రహే స్మృతః
ఏకాదశ్యాదికః సౌరేచతుర్థ్యంతః ప్రకీర్తితః॥ ఇదంచ

పూర్ణగ్రాసే త్ర్యహం ఖండగ్రహేతయోః, ఇతితత్రైవోక్తేః. ఇదంచ గ్రస్తాస్తే త్రిదినం పూర్వం, ఇతి నారదేన గ్రస్తాస్తే విశేషోక్తేః గ్రస్తాస్తభిన్న గ్రహణ పరం.

జ్యోతిర్నిబంధే చ్యవనః -

గ్రహణోత్పాతభంత్యాజ్యం మంగళేషు ఋతుత్రయం
యావచ్చ రవిణాభుక్త్వా ముక్తం భం దగ్ధ కాష్ఠవత్॥

అన్యానిచ ఆగ్నేయాదిమండలాని, తత్ఫలం వర్ణవికారాది ఫలంచ దైవజ్ఞేభ్యోజ్ఞేయం.

భార్గవార్చన దీపికయందు బ్రహ్మ సిద్ధాంతమందలి వచనం ఇట్లా ఉంది: అందరు, ఆకాశంలోని గ్రహణాన్ని గుడ్డను అడ్డంగా పెట్టుకొని, నూనె, నీరు, అద్దంల ద్వారా చూడాలి. గర్భిణీ స్త్రీ మాత్రం గుడ్డ అడ్డం లేకుండా ఎప్పుడూ గ్రహణాన్ని చూడరాదు అని.

మంగళ కార్యములందు విశేష విధి హేమాద్రియందు ఇట్లా ఉంది: సూర్యచంద్ర గ్రహణం వస్తే త్రయోదశినుండి తొమ్మిది దినములవరకు సమస్త మంగళ కార్యములను వదలాలి అని. అక్కడే ప్రకారాంతరంగా ఇట్లా చెప్ప బడింది: చంద్రగ్రహణమందు ద్వాదశినుండి తృతీయవరకు వేధ. సూర్యగ్రహణ మందు ఏకాదశినుండి చతుర్థివరకు వేధ ఉంటుంది అని. ఇది సంపూర్ణగ్రహణ మందని గ్రహించాలి. ఎందుకంటే, అక్కడే ఖండ గ్రహణమందు మూడు రోజులు వేధ అని చెప్పబడింది. ఇది గ్రస్తాస్తభిన్న గ్రహణ విషయకము. ఎందువల్లనంటే, నారదుడు గ్రస్తాస్తమందు మూడు రోజులు పూర్వం వేధ అని విశేషంగా చెప్పాడు కనుక. జ్యోతిర్నిబంధములో చ్యవనుని వచనం ఇట్లా ఉంది: గ్రహణము ఉత్పాతముల నక్షత్రాన్ని మూడు ఋతువులవరకు మంగళ

కార్యములందు విడిచిపెట్టాలి. సూర్యుడు ఆ నక్షత్రాన్ని భుక్తిచేసి విడిచేవరకు ఎట్లాంటే- మండుతున్న కట్టెను వదలినట్లు అని. ఇతరములైన ఆగ్నేయాది మండలములను వాటి ఫలాన్ని వర్ణ వికారాది ఫలాన్ని జ్యోతిష్యలచే తెలుసుకొనవలెను.

మూ॥ పురశ్చరణ చంద్రికాయాం-

చంద్ర సూర్యోపరాగేచస్నాత్వా ప్రయతమానసః
స్పర్శాదిమోక్ష పర్యంతం జపేన్మంత్రం సమాహితః॥
జపాద్దశాంశతో హోమః తథా హోమాత్తు తర్పణం
తర్పణస్య దశాంశేన మార్జనం కథితం కిల॥
తత్రైవ దేవతారూపం ధ్యాత్వాత్మానం ప్రపూజ్యచ
నమోంతం మంత్ర ముచ్చార్యతదంతే దేవతాభిధాం॥
ద్వితీయాన్తా మహంపశ్చాత్ అభిషించామ్యనేనతు
తోయైరంజలినాశుద్ధైః అభిషించేత్ స్వమూర్ధని॥ మార్జనస్య దశాంశేన బ్రాహ్మణానపి భోజయేత్.

జపోర్చాపూర్వకో హోమః తర్పణంచాభిషేచనం
భూదేవ పూజనం పంచ ప్రకారోక్తా పురస్క్రియాః॥

తథా—

హోమాశక్తౌ జపంకుర్యాత్ హోమసంఖ్యా చతుర్గుణం
ఏవంకృతేతుమంత్రస్య జాయతేసిద్ధి రుత్తమా॥

గ్రహణ ప్రసంగాత్ కురుక్షేత్ర ప్రతిగ్రహే ప్రాయశ్చిత్త ముచ్యతే తత్రారుణ స్మృతౌ - ప్రతిగ్రాహీకురుక్షేత్రే నభూయః పురుషోభవేత్.

తథాపి మనసశ్శుద్ధౌ ప్రాయశ్చిత్తం సమాచరేత్
తప్తకృచ్ఛ్ర ద్వయంకుర్యాత్ జందవేన సమన్వితం॥
సత్రేణవా యజేతాథజపేద్వాలక్ష సప్తకం
వాపీకూప తటాకాది ఖననైః విసృజేద్ధనం॥ ఇతి.

ఏతచ్చ—

యద్గర్హితేనార్జయన్తి కర్మణా బ్రాహ్మణాధనం
తస్యోత్సర్గేణ శుద్ధ్యంతిదానేన తపసైవచ॥ ఇతి మనూక్తేః ఉత్సర్గోత్తరం

జ్ఞేయమితిదిక్. గ్రహణాంతరితస్య పూర్వసంకల్పిత ద్రవ్యస్య ద్వైగుణ్యం భవతీతిశిష్టాః. పఠన్తిచ బ్రహ్మవైవర్తే—

దాతవ్యమితి నోకాభ్యాం వక్తవ్యం కుత్రచిత్క్వచిత్
అహోరాత్రమతిక్రమ్య తద్దానం ద్విగుణం భవేత్॥

దశోత్తరం పర్వసుస్యాత్శతం చంద్రగ్రహేభవేత్
సూర్యగ్రహే సహస్రం తత్ మరణేఽనన్తకం స్మృతం॥ ఇతి. అత్రమూలం చింత్యం.

అత్రకేచిత్ బౌద్ధతుల్యా ఆహుః గ్రహణస్య నిమిత్తత్వేన తన్నిశ్చయస్య ప్రయోజకత్వాత్ జ్యోతిః శాస్త్రాదినాజాతస్య జ్ఞానస్య నిమిత్తత్వే ప్రాప్తేఽపి—

స్నానం దానంతపః శ్రాద్ధం అనంతం రాహుదర్శనే
చంద్రసూర్యో పరాగేతు యావద్దర్శన గోచరే॥ ఇతి జాబాల్యాది వచనేషు దృశిప్రయోగాచ్చాక్షుశ జ్ఞానస్యైవోప సంహారన్యాయేన నిమిత్తత్వం. అన్యథా దృశా లక్షణాస్యాత్. తేనమేఘాచ్ఛాదనే అంధాదీనాంజన్మ సప్తాష్టేత్యాది నిషిద్ధ దర్శనానాంచ స్నానశ్రాద్ధాదౌనాధికారః, ఇతి.

కల్పతరురప్యాహ - దర్శనశబ్దేన చాక్షుశజ్ఞానంగృహ్యతే, నజ్ఞాన మాత్రం అజ్ఞాతస్య నిమిత్తత్వా సంభవాన్నిమిత్త మహిమ్నైవ జ్ఞానలాభేన దర్శనపద వైయర్థ్యాపత్తేః తేన చాక్షుశధీయోగ్యః కాలః పుణ్యః యోగ్యత్వంచ ప్రయత్నానపనేయ చాక్షుశజ్ఞాన ప్రతిబంధక రాహిత్యం తేనమేఘచ్ఛన్నే యోగ్యతాఽభావాన్నస్నానాది, ఇతి. నిర్ణయామృతేఽప్యేవం. తదేతత్తుచ్ఛం యది చాక్షుశజ్ఞానం నిమిత్తం స్యాత్తదా—

సూర్యగ్రహో యదారాత్రౌ దివాచంద్ర గ్రహస్తథా
తత్ర స్నానంన కుర్వీత దద్యాద్దానం, నచక్వచిత్॥

ఇతివాక్యం వ్యర్థం స్యాత్ చాక్షుశజ్ఞానాభావేన ప్రాప్త్య భావాత్ తత్ప్రాప్యకత్వాచ్ఛ నిషేధస్య నచేదంగ్రస్తాస్తపరం రవిచంద్రయో రస్తానంతరం రాత్రిదివాగ్రహణత్వాదితి వాచ్యం తత్రపదస్య గ్రహపరత్వే అధికరణ - త్వాయోగాత్ నిమిత్త పరత్వేచ తత్గ్రహ నిమిత్తక స్నానదానాదేః అస్తాత్ప్రాగ

వ్యభావా పత్తేః. అథ తత్రేతి రాత్రిదినే ఉచ్యేతే సా వైశ్వదేవీతివత్ గుణభూతే అపి. తన్న. తాదృశ మంత్ర లింగాభావాత్ తయోర్నిమిత్తత్వే అధికరణత్వేవా అన్య ప్రయుక్త స్నానాద్య భావాపత్తేశ్చ.

పురశ్చరణ చంద్రికయందు ఇట్లా ఉంది : చంద్ర సూర్యగ్రహణమందు ప్రయత్న పూర్వకంగా నిష్ఠతో స్నానంచేసి, స్పర్శనుండి మోక్షకాలం వరకు నిశ్చల మనస్సుతో మంత్రాన్ని జపించాలి అని. జపంలో దశాంశ భాగం హోమం, హోమంలో దశాంశ భాగం తర్పణం, తర్పణంలో దశాంశ భాగం మార్జనం అని చెప్పారు. అక్కడే ఇట్లా చెప్పారు - ఏ దేవతను జపిస్తామో ఆ దేవతా రూపాన్ని ధ్యానించి, తనను పూజించుకొని చివర నమః చేర్చి మంత్రాన్ని ఉచ్చరించి, ఆ పిదప దేవతా నామాన్ని ద్వితీయాంతంగా చేర్చి, పిదప నేను అని చేర్చి పిదప అభిషేకిస్తున్నాను అని ఈవిధంగా చెప్పి (ఓం సూర్యాయ నమః సూర్యం అహం అభిషించామి) స్నానం చేయించాలి. ఈ మంత్రంతోనే అంజలితో పవిత్ర జలం తీసుకొని తన తలపై ప్రోక్షించు కోవాలి. మార్జనంలో దశాంశ భాగం బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. అట్లాగే హోమం చేయలేని పక్షంలో హోమ సంఖ్యకు నాల్గింతలు జపం చేయాలి. ఇట్లా చేస్తే మంత్రం ఉత్తమంగా సిద్ధిస్తుంది.

గ్రహణ సందర్భం కాబట్టి కురుక్షేత్రంలో దానంపట్టే ప్రాయశ్చిత్తాన్ని ఇట్లా చెప్తున్నారు: అరుణస్మృతియందు ఇట్లా ఉంది - కురుక్షేత్రంలో దానం స్వీకరించినవాడు తిరిగి పురుషుడు కాడు. అయినా మనశ్శుద్ధికొరకు ప్రాయశ్చిత్తాన్ని ఆచరించాలి, చాంద్రాయణ సహితమైన రెండు తప్త కృచ్ఛ్రములను ఆచరించాలి. సత్రయాగం చేయాలి. లేదా ఏడులక్షలు మంత్ర జపం చేయాలి. లేదా దిగుడుబావి, బావి, చెరువు మొదలగు వానిని త్రవ్వించేకొరకు ధనమును ఇవ్వాలి అని. నీచమైన కర్మతో బ్రాహ్మణులు ధనం సంపాదిస్తే, దానిని దానం చేయటం ద్వారా, త్యాగం చేయటం ద్వారా తపస్సు చేత కూడా పరిశుద్ధు లౌతారు అని. ఈ ప్రాయశ్చిత్తమును మనువు కూడా చెప్పాడు కాబట్టి, ఆ ధనం త్యాగం చేశాకనే అని తెలుసుకోవాలి. ఇక ఈ విషయం చాలు. శిష్టులిట్లా అంటారు - గ్రహణంకన్న ముందు సంకల్పించిన ద్రవ్యాన్ని ఇవ్వని పక్షంలో గ్రహణం తర్వాత దానికి రెండింతలివ్వాలి అని. బ్రహ్మ కైవర్తంలో ఇట్లా ఉంది - కాశీలో ఇవ్వాలి, మరోచోట ఇవ్వాలి అని ఇట్లా ఎవ్వరూ చెప్పొద్దు.

ఎందువల్లనంటే, ఆ దానం అహోరాత్రముల తర్వాత రెట్టింపు అవుతుంది అని కూడా చెప్తారు. పర్వమందు పదింతలు, చంద్రగ్రహణమందు నూరు రెట్లు, సూర్యగ్రహణమందు వేయి రెట్లు, మరణమందు అనంత మౌతుంది అని కొందరంటారు. దీనికి మూలం వెతకాలి.

ఇక్కడ కొందరు బౌద్ధులవలె ఇట్లా అంటారు—గ్రహణము (దాన జపములకు) నిమిత్తము. గ్రహణ నిశ్చయము, ప్రయోజనం కలది (నిశ్చయమైతే స్నానాది). జ్యోతి శ్శాస్త్రాదులతో కల్గిన జ్ఞానం నిమిత్తం కాగలదు. అయినా జాబాల్యాదులు- రాహు దర్శనమైతే చేసే స్నాన దాన తప శ్రాద్ధాదులు అనంత ఫలాన్నిస్తాయి. చంద్ర సూర్యగ్రహణమందు ఎంతవరకు గ్రహణం దృష్టి గోచరమౌతుందో అని చెప్పారో ఈ మాటల్లో దృశి అనే శబ్ద ప్రయోగముంది కనుక చాక్షుశ జ్ఞానమే ఉపసంహారన్యాయా న్ననుసరించి నిమిత్తమౌతుం లేకున్న దృశి శబ్దానికి లక్షణ చెప్పుకోవాలి. దానివల్ల మేఘాచ్ఛాదన జరిగినప్పు అంధులు మొదలగువారికి, జన్మరాశి, సప్తమ అష్టమ మొ॥ రాశివారికి కూడ (గ్రహణ దర్శన నిషేధం కలవారికి కూడా) స్నాన శ్రాద్ధాదులందు అధికారముండదు, అని. కల్పతరువు కూడా ఇట్లాగే చెప్పింది. దర్శన శబ్దంవల్ల చాక్షుశ జ్ఞానం గ్రహించబడుతుంది. జ్ఞానమాత్రం కాదు. తెలియబడని దానికి నిమిత్తత్వం కుదరదు. నిమిత్త మహిమవల్లనే జ్ఞానం లభించే పక్షంలో, దర్శన పదం వ్యర్థం కావలసివస్తుంది. అందువల్ల చాక్షుశజ్ఞానయోగ్యకాలము పుణ్యకాలము, యోగ్యత్వం అంటే ప్రయత్నంచే తొలగించరాని, చాక్షుశజ్ఞానమునకు, ప్రతిబంధకం లేకపోవటం. అందువల్ల మేఘచ్ఛన్నమైతే యోగ్యత ఉండదు కాబట్టి స్నానాదులు లేవు అని. నిర్ణయామృతంలో కూడా ఇట్లాగే ఉంది. ఇదంతా తుచ్ఛము.

ఒకవేళ చాక్షుశజ్ఞానమే నిమిత్తమయ్యే పక్షంలో అప్పుడు, రాత్రి-సూర్య గ్రహణమైతే పగలు చంద్రగ్రహణమైతే అక్కడ స్నానం చేయరాదు. ఏ కొంచం దానం చేయరాదు అనేవాక్యం వ్యర్థమౌతుంది. చాక్షుశజ్ఞానం లేదు కాబట్టి స్నానాదులు ప్రాప్తించవు. స్నానం ప్రాప్తిస్తేనే కదా, దానికి చెందిన ఈ నిషేధము వర్తించేది. ఈ నిషేధము గ్రస్తాస్తవరము సూర్యచంద్రుల అస్తమయం తర్వాతనే రాత్రి, పగలు అని గ్రహిస్తాము అని చెప్పరాదు. అక్కడ పదం గ్రహపరమైతే అధికరణత్వం సంభవించదు. నిమిత్తపరత్వంలో ఆ గ్రహణ

నిమిత్తక స్నానదానాదులు అస్తమయం కన్న ముందుకూడా సంభవించే వీలు లేదు. అక్రుడ అనే పదం వల్ల రాత్రి దినములు చెప్పబడతాయి, ఆ వైశ్వదేవి అనే దానివలె గుణభూతమైన దానికి గూడా సూచకాలు అని అనరాదు. ఎందుకంటే, అటువంటి మంత్రలింగములు (సూచనలు) లేవు కాబట్టి. అవి (రాత్రి దివములు) నిమిత్తమో, అధికరణమో ఐతే ఇతర కారణంగా వచ్చే స్నానాదులు రాకుండా పోతాయి.

మూ॥ కించ - నేక్షేతోద్యంతమాదిత్యం నాస్తం యన్తం కదా చన
నోపరక్తంన వారిస్థం నమధ్యం నభసోగతం॥ ఇతి మనువచనం బాధ్యేత దృష్టోఽరిష్ట ప్రదోరాహుః, ఇత్యాదిచ. న చాత్రవిహితే దర్శనే నిషేధా ప్రవృత్తి వశ్ పర్యుదాసనీయతాఽపి నయుక్తేతి వాచ్యం. దర్శనస్య నిమిత్తత్వానువాదేన విధేయత్వాభావాత్. ఏతచ్చాగ్రేవక్ష్యామః

తత్వేవా దర్శనస్య విధౌత్కృతస్నాన విధౌచ విరుద్ధ త్రికద్వయాపత్తే, అస్తు సకృద్దర్శన విధానేన సంకోచ ఇతిచేన్న. ముక్తిందృష్ట్వాతతః స్నాయాత్, ఇతి ముక్తి స్నానేఽపి చాక్షుశజ్ఞానస్య నిమిత్తత్వాపత్తేః. అస్తుకింనశ్ఛిన్న మితి చేత్ నగ్రస్తాస్తె - తయోఃపరేద్యురుదయే దృష్ట్వా అభ్యవహరేచ్ఛుచిః, ఇతి దర్శనోత్తరం భోజన విధానా దంధస్య పూర్వవేధకాల ఇవయావద్దర్శనం భోజన నిషేధావత్తిః మధ్యేఽస్థి భూతస్య సుతరాం యావత్ చక్షుః ప్రాప్త్యవవాస ప్రసంగశ్చ. అథాన్నలోలుపతయాతత్రజ్ఞాన మాత్రం వివక్ష్యతే. తత్తత్ పూర్వమపినిర్లజ్జేన స్వీక్రియతాం. ఏతేన యత్కేన చిదుక్తం స్పర్శస్నానం ముక్తిస్నానం చయస్య దర్శనం తేనైవకార్యం నాన్యేన క్త్వాప్రత్యయేన సమాన కర్తృకత్వావగతేరితి, తన్నిరస్తం. కాతర్హి తస్యగతిః. దృశేరుద్దేశ్య విశేషణత్వాత్ గ్రహైకత్వవదవివక్షయా అర్థతః సిద్ధజ్ఞాన మాత్రాను వాదత్వేసర్వం సుస్థం. అంగుళ్యాద్యనా దేశ్యగ్రహవ్యావృత్యావా దర్శన స్యార్థవత్వం. నచోక్త యోగ్యతాపి సాధ్వీ, దర్శనోత్తరం మేఘచ్ఛన్నే యోగ్యతాఽభావాపత్యా దానాద్యభావాపత్తేః. తేన తత్తత్ రేఖావచ్ఛేదేన జ్యోతిః శాస్త్రివేద్యత్వమేవ యోగ్యతా. కించ -

రజసో దర్శనే నారీ త్రిరాత్రమశుచిర్భవేత్. ఇత్యత్రాపి అంధస్త్రీణామపి అశౌచాభావ ప్రసంగః

ఇంకను - ఉదయిస్తున్న, అస్తమిస్తున్న, రాహుగ్రస్తుడైన, నీటియందున్న, మధ్యాహ్నమందలి సూర్యుణ్ణి చూడరాదు. అనే మనువచనం బాధితమౌతుంది. గ్రహణ సమయంలో చూడబడ్డ రాహువు అరిష్టాన్ని కల్గిస్తాడు అనే

మొదలగు వాటికి కూడా బాధ కల్గుతుంది. ఇక్కడ దర్శనం విధించబడగా నిషేధం ప్రవర్తించనట్లు, పర్యుదాసం కూడా యుక్తం కాదు అని అనరాదు. దర్శనము నిమిత్తత్వ సూచకము - విధేయత్వం కాదు. దీనిని ముందు వివరిస్తాము. నిజానికి దర్శన విధియందు, అప్పుడే స్నానవిధి ఐతే పరస్పరం విరుద్ధత్రిక ద్వ్యావత్తి సంభవిస్తుంది. ఒకవేళ ఒకసారి దర్శన విధిని సంకోచిస్తామంటే కుదరదు. ఎందువల్లనంటే, ముక్తిని చూసి ఆ తర్వాత స్నానం చేయాలి అనే ముక్తి స్నానమందు కూడా చాక్షుశ జ్ఞానము నిమిత్తం కావల్సి వస్తుంది. కాని (అవసీ) మాదేంపోయింది అని అంటే, అట్లా కాదు. అస్తమయమందు గ్రహణమైతే సూర్యచంద్రులను తరువాతి రోజు ఉదయం చూసి శుద్ధులై భుజించాలి అని దర్శనం తర్వాతనే భోజనం విధించినందువల్ల, గుడ్డివానికి పూర్వ వేధకాలమందు భోజన నిషేధంవలె, దర్శనం లభించేవరకు భోజన నిషేధం ప్రాప్తిస్తుంది. మధ్యలో గ్రుడ్డివాడైన వానికి మిక్కిలిగా కళ్ళు వచ్చేవరకు ఉపవాసం ప్రాప్తించే అవకాశం ఉంది. ఒకవేళ అన్నంమీది ఆశతో అక్కడ జ్ఞాన మాత్రాన్ని అంగీకరిస్తే అంతకన్నముందుకూడా సిగ్గులేకుండా అంగీకరించండి.

దీనివల్ల స్పర్శ స్నానం, ముక్తి స్నానం - వీటిని గ్రహణాన్ని దర్శించినవాడే చేయాలి, ఇతరులు చేయరాదు. క్త్వాప్రత్యయంవల్ల సమాన కర్తృకత్వం అవగతమౌతోంది అని ఏ వాకరన్నారో ఆ మాట వీగిపోతుంది. మరి దానికి గతేమిటి అని అంటే, దర్శన శబ్దము ఉద్దేశ్య విశేషణం మాత్రమే కాబట్టి గ్రహైకత్వమువలె వివక్ష లేనందువల్ల అంటే సిద్ధజ్ఞాన మాత్రాన్ని అనువదిస్తుంది అని చెపితే అన్నీ దిద్దుకుంటాయి. అంగుళి మొదలగు వానితో అనిర్దిష్ట గ్రహణ నిషేధం చేయటంవల్ల, దర్శన పదం సార్థకమౌతుంది. ముందు చెప్పిన యోగ్యత కూడా బాగాలేదు. ఎందువల్లనంటే, దర్శనం తర్వాత మేఘములు కప్పితే యోగ్యత ఉండకుండాపోతుంది. కాబట్టి దానాదులు చేయకుండా పోవాల్సి వస్తుంది. అందువల్ల ఆయా రేఖల విభాగంవల్ల జ్యోతిష శాస్త్రంలో కన్పించకపోవటమే యోగ్యత అని గ్రహించాలి.

ఇంక - రజోదర్శనమైతే స్త్రీ మూడు రాత్రులు అశుచి ఔతుంది అనే చోట కూడా గుడ్డివారైన స్త్రీలకు అశౌచం లేకుండా పోవాల్సివస్తుంది.

మూ॥ యత్తు వర్ధమానే నోక్తం - జ్ఞానోత్తరం హ్యధికారః నజ్ఞానకాలే. స్నానకాలే జ్ఞానా భావాత్. ఏవం దర్శనోత్తరం ముక్తి పర్యంత మస్త్యేవ యోగ్య

తేతి, తదపి ప్రతిజ్ఞామాత్రం. కించగ్రస్తాస్తే - తయోః పరేద్యురుదయే దృష్ట్వా వ్యవహరేచ్ఛుచిః, ఇత్యాది వాక్యవైయర్థ్యాపత్తిః. చాక్షుశ జ్ఞాన అన్యథానుపపత్త్యైవార్థాదుదయే స్నానసిద్ధేః. నతు ముక్తిస్నానే శాస్త్రీయమేవ, జ్ఞానం నిమిత్తం నచాక్షుశం,

చంద్రసూర్య గ్రహే నా ద్యాత్తస్మిన్నహని పూర్వతః
రాహోర్విముక్తిం విజ్ఞాయ స్నాత్వాకుర్వీత భోజనం॥ ఇతివృద్ధ గౌతమేన విజ్ఞాయేతి జ్ఞానమాత్రోక్తేః. యత్తు - ముక్తిం దృష్ట్వాతు భోక్తవ్యం స్నానం కృత్వాతతః పరం, ఇతి తదపి జ్ఞానమాత్రపరం

మేఘమాలాది దోషేణ యది ముక్తిర్న దృశ్యతే.
ఆకలయ్యైతు తత్కాలం స్నాత్వాభుంజీత వాగ్యతః॥

ఇతి గౌడని బంధే వచనాత్. మైవం అజ్ఞానస్య నిమిత్త త్వాభావేన నిమిత్త మహిమ్నైవ జ్ఞానలాభే వాక్యవైయర్థ్యాత్ గ్రస్తాస్తేఽపి తదాపత్తేశ్చ.

వర్ధమానుడు ఏదైతే చెప్పాడో - చాక్షుశ జ్ఞానం తర్వాతే అధికారము, జ్ఞానకాలంలో కాదు. ఎందుకంటే - స్నానకాలంలో జ్ఞానంలేదు కాబట్టి. అట్లాగే దర్శనం తర్వాత ముక్తి పర్యంతము యోగ్యత ఉంది అని అన్నమాట ప్రతిజ్ఞా మాత్రము (మాట మాత్రమే) ఇంకా గ్రహణకాలంలో అస్తమిస్తే-చంద్రసూర్యులను తరువాతి రోజు ఉదయం చూచి శుచియై భుజించాలి అనే మొదలగు మాటలు వైయ్యర్థం కావల్సివస్తుంది. ఎందువల్లనంటే, చాక్షుశజ్ఞానం మరొక రకంగా సిద్ధించదు కాబట్టే. అనగా ఉదయమందు స్నానం సిద్ధిస్తుంది. ముక్తిస్నానమందు శాస్త్రీయజ్ఞానమే నిమిత్తము, చాక్షుశజ్ఞానం కాదు. చంద్ర సూర్య గ్రహణమందు ఆ రోజు తినకూడదు. రాహు విముక్తిని తెలుసుకొని స్నానంచేసి భుజించాలి అని వృద్ధ గౌతముడు విజ్ఞాయ (తెలుసుకొని) అని జ్ఞానమాత్రాన్నే చెప్పాడు అని అన్నారో, అది తప్పు. ముక్తిని చూచి- స్నానం చేసి భుజించాలి అని గౌడ నిబంధంలోని వచనం కూడా జ్ఞాన మాత్రపరకమే. మేఘమాలాదుల దోషంవల్ల ఒకవేళ ముక్తి కన్పించని పక్షంలో, ఆ కాలాన్ని తెలుసుకొని స్నానంచేసి మౌనంగా భుజించాలి అని గౌడ నిబంధంలోని వచనం ఉంది అని ఏది అన్నారో అది తప్పు. అజ్ఞానం నిమిత్తంకాదు కాబట్టి, నిమిత్తమహిమవల్లనే జ్ఞానం లభించే పక్షంలో వాక్యం వ్యర్థమౌతుంది. గ్రస్తాస్త మందుకూడా భోజనప్రాప్తి సంభవిస్తుంది.

మూ॥ కించ దర్శనం పుంసో విశేషణము పలక్షణంవా? నాద్యః దర్శనావచ్ఛిన్నే కాలే స్నానతులా దానాదేర్బాధాత్. దర్శనవిచ్ఛేదే కృతమపి స్నానాది న గ్రహణ నిమిత్తం స్యాత్ నాంత్యః యావద్దర్శన గోచరే, ఇతి యావత్ పదవైయర్థ్య ప్రసంగాత్ దృష్ట గ్రహణోత్తరమపి స్నానాద్యాపత్తేశ్చ జ్ఞానపక్షేఽప్యేష దోషస్తుల్య ఇతి చేత్ మూర్ఖోఽసి. యది జ్ఞానవాచకం పదంశ్రూయేత, తతస్త స్యాన్వయోవిచార్యేత దృశిస్తుశ్రూయత ఇతి వైషమ్యం కథంతర్హి జ్ఞానంలభ్యతే? సంక్రాంతౌ స్నాయాత్, ఇతివదర్థాదిత్యవేహి. అశ్రుతత్వాదేవనోద్దేశ్య విశేషణ వివక్షాకృతో వాక్యభేదోఽపి అస్తుతర్హి దృష్టం గ్రహణం నిమిత్తమితి చేత్ గ్రస్తాస్తే అస్తోత్తరం స్నానాపత్తేః విశిష్టోద్దేశే వాక్యభేదాచ్చ తవాప్యే తత్తుల్య మితిచేత్ యావద్దర్శన గోచరే, ఇతి వచనేన, తన్నిషేధాత్. తవత్వన్య గ్రహ ఇవ గ్రస్తాస్తేఽపిస్యాత్.

దర్శనశబ్దము పురుషునకు విశేషణమా కాక ఉపలక్షణమా? విశేషణం కాదు. దర్శనంతో కూడిన కాలంలో స్నానతులాదానాదులకు బాధ. దర్శన విచ్ఛేదం తర్వాత చేసిన స్నానాదులు గ్రహణ నిమిత్తాలు కావు. ఉపలక్షణం కాదు. ఎంతవరకు దర్శన గోచరమౌతుందో అనేచోట ఎంతవరకు (యావత్) అనే మాట వ్యర్థమయ్యే అవకాశముంది. గ్రహణం చూడగానే స్నానం చేయాల్సి వస్తుంది. జ్ఞానపక్షమందు కూడా ఇవే దోషాలు సమానంగా ఉంటాయనగా అంటే మూర్ఖుడివా ఏం? ఒకవేళ జ్ఞానవాచకపదం విన్పిస్తే, తర్వాత దాని అన్వయం విచారించబడుతుంది. దృశ ధాతువుకు (చూడటం అనే దానికి) శ్రూయతే (వినటం)అనే అర్థం విషమంగా ఉంది. ఐతే జ్ఞానం ఎట్లా లభిస్తుంది? సంక్రాంతి యందు స్నానం చేయాలి అనే దానివలె అర్థంవల్లనే అని తెలుసుకో. (శబ్దం వల్లనే అర్థజ్ఞానం) వాక్యంలో వినలేదు కాబట్టే ఉద్దేశ్య విశేషణ వివక్షవల్ల వచ్చే వాక్యభేదం కూడా లేదు. ఉండనీ, ఐతే చూచిన గ్రహణమే నిమిత్తంగా అంగీకరిస్తాం అంటే గ్రహణంలో అస్తమిస్తే, అస్తమయం తర్వాత స్నానం చేయాల్సి వస్తుంది. విశిష్ట ఉద్దేశ్యం అంగీకరిస్తే వాక్యభేదం వస్తుంది. ఇది నీకు గూడా సమానమే కదా అని అంటే? ఎంతవరకు దర్శన గోచరం ఔతుందో అనే మాటతో దాన్ని నిషేధించాము. నీ మతంలోనైతే అన్యగ్రహణములవలె గ్రస్తాస్త మందు కూడా (స్నానం) సిద్ధిస్తుంది.

మూ॥ కించ దర్శనస్య విధిః అనువాదోవా? ఆద్యే గ్రహణోద్దేశేన దర్శన విధిరుత దర్శన విశిష్టస్నానవిధిరుత స్నానోద్దేశేన దర్శనవిధిః నాద్యః గ్రహోద్దేశన స్నానవిధానే దర్శన విధానేచ వాక్యభేదాత్ ఏతేన ద్వితీయోఽపి పరాస్తః నతృతీయః స్నానస్యాప్రాప్తేః దర్శనస్య నిమిత్తత్వేన అవిధేయత్వాచ్చ, అన్యథా సోమవమనాదౌ ప్రసంజనవిధిః కేనవార్యేత అథనానావాక్యైమక్వచిద్దర్శన విశిష్ట స్నానవిధిః క్వచిచ్చ ప్రాప్తదర్శనం నిమిత్తీకృత్య స్నానమాత్ర విధిః తన్న స్నానస్య ప్రధానస్యాప్రాప్తౌ తదంగదరన్మప్రాప్తిః, తస్యాంచ నిమిత్తే సతి స్నానమిత్యన్యో న్యాశ్రయాత్, ఏవందర్శన విధౌసతి తన్నిమిత్తక స్నానవిధిః సతిచ ప్రధాన స్నానవిధౌ తదంగదర్శన విధిః. ఏవంఅధికారే ప్రయోజకత్వేచయోజ్యం. క్త్వార్థ పూర్వకాలవిధౌ చాస్త్యేవ వాక్యభేదః అన్యథా స్నానోత్తర మపి దర్శనమంగం స్యాత్ నద్వితీయః తత్రాపి దర్శనగ్రహయోర్నిమిత్తత్వే స్నానద్వయావత్తేః దర్శనావృత్తౌ నైమిత్తికావృత్తి ప్రసంగాద్దర్శన (విశిష్టగ్రహణస్య విశిష్టస్యానువాదే వాక్య భేదా పత్తేః నచ హవిరార్తి వద్విశిష్టం నిమిత్త మితి వాచ్యం. ఆర్తి మాత్రస్యహి నిమిత్తత్వే నిమేషా ద్యార్తేరపి తత్వాపత్తేర్నైమిత్తికత్వ భంగాద్యుక్తం విశిష్టోద్దేశ్యత్వం ఇహతు గ్రహణ మాత్రస్య నిమిత్తత్వే నకాచిత్ క్షతిః తస్మాద్దర్శనవాక్యానాం గ్రస్తాస్త విషయత్వాదనాదేశ్య గ్రహపరత్వాద్వా జ్ఞానస్య చార్థతః ప్రాప్తేః తదేవనిమిత్తం తేనమేఘాద్యాచ్ఛాదనే అంధాదేశ్చ స్నానాదిభవత్యేవేత్యలంవేద బాహ్యైస్సంలాపేన. ఇతి గ్రహణ నిర్ణయః.

ఇంకా, దర్శనము విధా, అనువాదమా? (దర్శనంవిధైతే) మొదటి దానిలో గ్రహణోద్దేశంతో దర్శన విధా లేక దర్శన విశిష్ట స్నానవిధా లేక స్నానోద్దేశంతో దర్శన విధా? అందులో మొదటిదికాదు. గ్రహణోద్దేశంతో స్నానవిధానంలో దర్శనవిధానంలో కూడా వాక్యభేదం ఏర్పడుతుంది. దీనితో రెండోది కూడా పోతుంది.. మూడోది కూడా కాదు. స్నానం ప్రాప్తించలేదు. పైగా దర్శన నిమిత్తము, కనుక అవిధేయం కూడా (విధికాదు). లేనిపక్షంలో సోమవమనాదు లందు ప్రసంజనవిధిని ఎట్లా నివారిస్తాం. కొందరన్నారు - అనేక వాక్యాలుంటే ఒకచోట దర్శనవిశిష్టస్నానవిధి, ఒకచోట సంభవించిన దర్శనాన్ని నిమిత్తంగా చేస్తుకొని స్నానమాత్రవిధి అని అంటే అట్లా కాదు. ప్రధానమైన స్నానం

ప్రాప్తిస్తే దాని అంగమైన దర్శనప్రాప్తి, దర్శనం నిమిత్తమైతేనే స్నానప్రాప్తి. ఇట్లా అన్యోన్యాశ్రయదోషం వస్తుంది. ఈ రకంగా దర్శనవిధి వస్తే దాన్ని నిమిత్తంగా చేసుకొని స్నానవిధివస్తుంది. ప్రధానస్నానవిధి ఉంటే దాని అంగమైన దర్శనవిధి. ఈ రకంగా అధికారమందు, ప్రయోజకత్వమందు అన్వయించుకోవాలి. దృష్ట్వా అనేచోట క్త్వా ప్రత్యయ అర్థం పూర్వకాలికవిధిగా అంగీకరిస్తే వాక్యభేదం ఉండనే ఉంది. లేనిపక్షంలో స్నానంతర్వాత కూడా దర్శనం అంగం కావాల్సివస్తుంది. రెండోది కాదు (అనువాదం). అక్కడ కూడా దర్శనగ్రహణములను నిమిత్తంగా భావిస్తే రెండు స్నానాలు చేయాల్సి వస్తుంది. దర్శనం ఆవృత్తమైతే నైమిత్తిక ఆవృత్తి కూడా జరగాల్సి వస్తుంది. దర్శన విశిష్ట గ్రహణం అనే చోట విశిష్టం అనువాదమయ్యే పక్షంలో వాక్యభేదం సంభవిస్తుంది. హవిరార్తి వలె విశిష్టం నిమిత్తము అని చెప్పరాదు. ఎందువల్లనంటే ఆర్తిమాత్రం నిమిత్తమైతే నిమేషాది ఆర్తికిగూడా నిమిత్తత్వం వస్తుంది, దానివల్ల నైమిత్తికత్వభంగం ఏర్పడుతుంది. అందువల్ల విశిష్టమునకు ఉద్దేశ్యత్వం అంగీకరించటం యుక్తం. ఇక్కడ గ్రహణమాత్రానికి నిమిత్తత్వమైతే నష్టంలేదు. అందువల్ల దర్శనవాక్యములకు గ్రస్తాస్త విషయకంగా కాని, లేదా అనాదేశ్య గ్రహణ విషయకంగా గాని నిజంగా జ్ఞానము లభించింది కాబట్టి అదే నిమిత్త కారణము. అందువల్ల మేఘాది ఆచ్ఛాదనలో అంధాదులకు గూడా స్నానాదులు సంభవిస్తాయి అని. ఇక ఈ వేద బాహ్యులతో సంభాషణం చాలు అని గ్రహణ నిర్ణయము.

మూ॥ అథసముద్ర స్నానం - ఆశ్వలాయనః -

సముద్రేపర్వసుస్నాయాత్ అమాయాంచవిశేషతః

పాపైర్విముచ్యతే సర్వైః అమాయాం స్నానమాచరన్॥

భృగౌభౌమదినే స్నానం నిత్యమేవ వివర్జయేత్.

భారతే -

అశ్వత్థసాగరౌ సేవ్యౌనస్ప్రష్టవ్యౌకదాచన

అశ్వత్థం మందవారేతు సాగరం పర్వణి స్పృశేత్॥

పృథ్వీచంద్రోదయేస్కాందే -

పునాతి పర్వణి స్నానాత్ తర్పణైః సరితాంపతిః

కదా చిదపినైవాత్ర స్నానంకుర్యా దపర్వణి॥

అస్య అపవాదః తత్రైవ ప్రభాసఖండే -

పర్వకాలేచ సంప్రాప్తే నదీనాంచ సమాగమే
సేతుబంధే తథా సింధౌతీర్థేష్వన్యేషు సంయుతే.
(పవిత్రం) ఏవమాదిషుసర్వేషుమేధ్యోఽన్యేతు స్వకర్మణి.

తథా.

వినామంత్రం వినాపర్వక్షుర కర్మవినానరైః
కుశాగ్రేణాపిదేవేశి నస్పృష్టవ్యోమహోదధిః॥

తథా -

నకాలనియమః సేతౌ సముద్ర స్నానకర్మణి.

ఇక సముద్ర స్నానము. ఆశ్వలాయన వచనం ఇట్లా - పర్వములందు, విశేషించి అమావాస్యయందు సముద్ర స్నానం చేయాలి. అమావాస్యయందు స్నానం చేసిన మానవులు అన్ని పాపముల నుండి విముక్తు లౌతారు. శుక్ర, మంగళవారాలు సముద్ర స్నానాన్ని ఎప్పుడూ వదిలిపెట్టాలి అని. భారతంలో ఇట్లా ఉంది - అశ్వత్థం (రావిచెట్టు), సముద్రము ఈ రెండు సేవించతగినవి. వీటి నెప్పుడూ తాకరాదు. అశ్వత్థాన్ని శనివారంరోజు, సముద్రాన్ని పర్వదిన మందు స్పృశించాలి (స్నానం) అని. పృధ్వీచంద్రోదయంలో స్కాంద వచనం ఇట్లా ఉంది- సముద్రుడు, పర్వస్నానంవల్ల, తర్పణాలవల్ల పవిత్రులను చేస్తాడు. ఎప్పుడూ పర్వం కాని రోజున సముద్రస్నానం చేయరాదు అని. అక్కడే ప్రభాస ఖండంలో దీని అపవాద వాక్యం ఇట్లా ఉంది - పర్వకాలం వస్తే నదుల సమాగమంలో సేతుబంధమందు, అట్లాగే సముద్రమందు, అట్లే అన్యతీర్థములకు పోయిన పక్షంలో ఇటువంటి వాటన్నింటియందు స్నానం చేయటం పవిత్ర కార్యము అని. ఇతరులంటారు - తన పనియందు స్నానం చేయటం పుణ్యము అని. అట్లాగే - నరులు మంత్రం లేకుండా, పర్వంలేకుండా, క్షురకర్మ లేకుండా, దర్భాగ్రంతో కూడా సముద్రాన్ని తాకరాదు ఓ దేవేశి అని అన్నారు. అట్లాగే సేతువుయందు సముద్ర స్నానంచేయటానికి కాలనియమం లేదు అని అంటారు.

మూ॥ తద్విధిశ్చతత్రైవ—

పిప్పలాదసముత్పన్నే కృత్యేలోకభయంకరే
పాషాణస్తే మయాదత్తం అహారార్థే ప్రకల్పితాం॥ ఇతి పాషాణం ప్రక్షిప్య.

విశ్వాచీచ ఘృతాచీచ విశ్వయోనే విశాంపతే
సాన్నిధ్యం కురుమేదేవ సాగరే లవణాంభసి॥

నమస్తే విశ్వగుప్తాయ నమో విష్ణో అపాంపతే
నమో జలధిరూపాయనదీనాం పతయేనమః॥

సమస్త జగదాధార శంఖచక్రగదాధర
దేవ దేహిమమానుజ్ఞాం తవతీర్థ నిషేవణే॥

త్రితత్వాత్మక మీశానం నమో విష్ణు ముమాపతిం
సాన్నిధ్యం కురుదేవేశ సాగరే లవణాంభసి॥

అగ్నిశ్చ యోనిరనిలశ్చ దేహో రేతోధా విష్ణు రమృతస్యనాభిః
ఏతద్బ్రువన్ పాండవ సత్యవాక్యం తతోఽవగా హేత పతిం నదీనాం.

**ఇతి భారతోక్తమంత్రాన్ పఠిత్వావిధివత్ స్నాత్వా**

స్నానవిధి కూడా అక్కడే ఇట్లా ఉంది. పిప్పలాదునిచే ఉత్పన్నమైన లోకభయంకరమైన ఓ కృత్యా నేను ఈ రాయిని నీకిస్తున్నాను. దీనిని ఆహారం కొరకు వినియోగించుకో అని పాషాణం సముద్రంలోవేసి భారతంలోని ఈ క్రింది మంత్రాలను చదివి శాస్త్రప్రకారం స్నానం చేయాలి. ఆ మంత్రాలివి - విశ్వాచి ఘృతాచి, విశ్వయోని, విశాంపతి ఓ దేవ. ఉప్పు నీళ్ళుగల ఈ సముద్రంలో నాకు నీ సన్నిధిని ప్రసాదించు. విశ్వాన్ని రక్షించే నీటికి అధిపతియైన విష్ణూ నీకు నమస్కారం. జలస్వరూపుడవైన, నదులకు పతివైన నీకు నమస్కారం. సమస్త జగత్తుకు ఆధారమైన శంఖచక్రములను ధరించిన ఓ దేవా! నీ తీర్థాన్ని సేవించటానికి నాకు అనుజ్ఞ నివ్వు త్రితత్వాత్మకుడు, ప్రభువు ఐన ఉమాపతికి, విష్ణునకు నమస్కారము. ఓ దేవేశా! ఉప్పు నీరుగల సముద్రంలో నాకు సన్నిధిని ప్రసాదించు. అగ్నిస్వరూప, సర్వకారణ, వాయురూప, దేహంలో రేతస్సును పోషించేవాడా, అమృతకేంద్రమైన ఓ విష్ణూ అని సత్యవాక్యం పలుకుతూ (ఓ పాండవ) పిదప సముద్రమందు మునుగాలి (స్నానం చేయాలి).

మూ॥ సర్వరత్నోద్భవాన్ శ్రీమాన్ సర్వరత్నాకరో యతః
సర్వరత్న ప్రధానస్త్వం గృహాణార్ఘ్యం మహోదధే॥ ఇత్యర్ఘ్యందత్వా తర్పయేత్. యథోక్తం వృద్ధేచంద్రోదయే స్కాందే.

పిప్పలాదం వికణ్వంచ కృతాంతం జీవికేశ్వరం
వసిష్ఠం వామదేవంచ పరాశర ముమాపతిం॥
వాల్మీకిం నారదం చైవ వాలఖిల్యాం స్త థైవచ
నలం నీలం గవాక్షం చ గవయంగంధమాదనం॥
జాంబవంతం హనూమంతం సుగ్రీవం చాంగదం తథా
మైందంచ ద్వివిదం చైవ వృషభం శరభం తథా॥
రామంచ లక్ష్మణంచైవ సీతాంచైవ యశస్వినీం
ఏతాంస్తు తర్పయేత్ విద్వాన్ జలమద్యే విశేషతః॥
ఆబ్రహ్మ స్తంబ పర్యంతం యత్కించిత్స చరాచరం
మయాద త్తేనతోయేన తృప్తిమేవాభిగచ్ఛతు॥

సవిధిగా స్నానం చేసి - ఓ సముద్రుడా! నీవు అన్ని రత్నాలు కల వాడవు, శ్రీ సంపన్నుడవు, అన్ని రత్నములకు స్థానము నువ్వు, అన్ని రత్న ములకు ప్రధానమైన నీవు ఈ అర్ఘ్యాన్ని స్వీకరించు అని, అర్ఘ్యం ఇచ్చి తర్పణం చేయాలి. పృధ్వీ చంద్రోదయంలో స్కాంద వచనం ఇట్లా ఉంది: పిప్పలాదుడు, వికణ్వుడు, కృతాంతుడు, జీవికేశ్వరుడు, వసిష్ఠుడు, వామ దేవుడు, వరాశరుడు, ఉమాపతి, వాల్మీకి, నారదుడు, వాలఖిల్యులు, నల, నీల, గవాక్ష, గవయ, గంధమాదన, జాంబవంత, హనుమంత, సుగ్రీవ, అంగద, మైంద, ద్వివిద, వృషభ, శరభ, రామ, లక్ష్మణ సీత(లు) వీరందరికి విద్వాంసుడైనవాడు, విశేషించి జల మధ్యంలో తర్పణం విడువాలి అని చెప్ప బడింది.

బ్రహ్మ మొదలుకొని స్తంబంవరకు చర, అచరం ఏదైతే ఉందో అదంతా నేను ఇచ్చే ఈ నీటితో తృప్తినే పొందనీ.

ఇది నిర్ణయ సింధువు యందు ప్రథమ పరిచ్ఛేదము.



## అనుబంధం - 1

# శ్రీ వైష్ణవులకు, అరుణోదయమందలి శుద్ధ ఏకాదశి 9 విధాలు

| | | దశమి | ఏకాదశి | ద్వాదశి | |
|---|---|---|---|---|---|
| 1. | ఏకాదశ, ద్వాదశి రెండు న్యూనం | 55 59 | 58 0 | 59 59 | ఏకాదశి ద్వాదశులు అధికంగా లేవు, అందువల్ల |
| | | 55 0 | 57 0 | 58 0 | స్మార్తులు, వైష్ణవులు ఏకాదశియందే ఉపవసించాలి. |
| 2. | ఏకాదశి న్యూనం - | 55 59 | 58 0 | 60 0 | Do |
| | ద్వాదశి సమం. | 55 0 | 57 0 | 58 0 | |
| 3. | ఏకాదశి న్యూనం - | 55 59 | 58 0 | 60 1 | ద్వాదశి అధికం. స్మార్తులు ఏకాదశిన, వైష్ణవులు |
| | ద్వాదశి అధికం. | 55 0 | 58 0 | 60 1 | ద్వాదశిన ఉపవాసం చేయాలని మాధవుడు అందరు ద్వాదశిన ఉపవాసం అని హేమాద్రి.) |
| 4. | ఏకాశశి సమం - | 55 59 | 60 0 | 59 59 | రెండూ అధికంగా లేవు, ఇద్దరు ఏకాదశిలో |
| | ద్వాదశి న్యూనం | 55 0 | 57 0 | 58 0 | ఉపవసించాలి. |
| 5. | ఏకాదశి, ద్వాదశి రెండు సమం | 55 59 | 60 0 | 60 0 | Do |
| | | 55 0 | 57 0 | 58 0 | |
| 6. | ఏకాదశి సమం ద్వాదశి అధికం | 55 59 | 60 0 | 60 0 | ద్వాదశి అధికం. స్మార్తులు ఏకాదశిన, వైష్ణవులు |
| | | 55 0 | 58 0 | 3 1 | ద్వాదశిన ఉపవసించాలని మాధవుడు, అందరు |
| | | | | 60 1 | ద్వాదశిన ఉపవాసం అని హేమాద్రి.) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 7. | ఏకాదశి అధికం, ద్వాదశి న్యూనం | 55 59 | 60 0 | 59 58 | ఏకాదశి అధికం. కనుక స్మార్తులు ఏకాదశిన, వైష్ణవులు ద్వాదశిన ఉపవసించాలి. ఇది మాధవ మతం. |
| | | 55 0 | 0 1 | క్షయం | |
| | | | 1 | 58 0 | |
| 8. | ఏకాదశి అధికం, ద్వాదశి సమం | 55 59 | 60 0 | 59 59 | —Do— |
| | | | 0 1 | క్షయం | |
| | | 55 0 | 60 1 | 58 0 | |
| 9. | ఏకాదశి, ద్వాదశులు రెండు అధికం | 55 59 | 60 1 | 3 55 | రెండూ అధికం కనుక ఇద్దరూ పర ఏకాదశిన ఉపవసించాలి. |
| | | 50 0 | 60 1 | 5 0 | |

## శ్రీ వైష్ణవులకు, దశమీ విద్ధ ఏకాదశి 9 విధాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఏకాదశి, ద్వాదశి రెండు న్యూనం | 56 1 | 58 0 | 59 59 | రెండు అధికం లేవు. అందువల్ల స్మార్తులు ఏకాదశిన, వైష్ణవులు ద్వాదశిన ఉపవసించాలి. |
| | | 57 0 | 58 0 | 58 0 | |
| 2. | ఏకాదశి న్యూనం, ద్వాదశి సమం | 56 1 | 58 0 | 60 0 | —Do— |
| | | 57 0 | 58 0 | 59 0 | |
| 3. | ఏకాదశి న్యూనం, ద్వాదశి అధికం | 56 1 | 58 0 | 60 0 | ద్వాదశి అధికం స్మార్తులు మొదటి రోజున (ఏకాదశిన), వైష్ణవులు ద్వాదశిన ఉపవాసం చేయాలి అని మాధవుడు, అందరు ద్వాదశి యందే ఉపవసించాలి అని హేమాద్రి అన్నారు. |
| | | 58 0 | 59 0 | 1 1 | |
| | | | | 60 1 | |
| 4. | ఏకాదశి సమం, ద్వాదశి న్యూనం | 58 59 | 60 0 | 59 59 | రెండు అధికం. కాన స్మార్తులు ఏకాదశిన, వైష్ణవులు ద్వాదశిన ఉపవసించాలి అని. |
| | | 57 0 | 58 0 | 59 0 | |

| | | దశమి | ఏకాదశి | ద్వాదశి | |
|---|---|---|---|---|---|
| 5. | ఏకాదశి, ద్వాదశి సమం, రెండూనూ | 59 1<br>57 0 | 60 0<br>58 0 | 60 0<br>59 0 | —Do— |
| 6. | ఏకాదశి సమం, ద్వాదశి అధికం | 57 1<br>58 0 | 60 0<br>59 0 | 60 0<br>1 0<br>60 1 | ద్వాదశి అధికం. కనుక స్మార్తులు ఏకాదశిన, వైష్ణవులు ద్వాదశిన ఉపవసించాలని మాధవుడు, అందరు ద్వాదశియందే ఉపవసించాల హేమాద్రి అన్నారు. |
| 7. | ఏకాదశి అధికం, ద్వాదశి న్యూనం | 59 1<br>58 0 | 60 0<br>0 1<br>60 1 | 59 0<br>క్షయం<br>58 0<br>క్షయం | ఏకాదశి అధికం. స్మార్త గృహస్థు ఏకాదశిన, యతి, నిష్కామగృహస్థు, వనస్థుడు, విధవ, వైష్ణవులు పరమందు ఉపవసించాలి. విష్ణు ప్రీతి కాములైన స్మార్తులు రెండు రోజులు ఉపవసించాలని కొందరు అంటారు. |
| 8. | ఏకాదశి అధికం, ద్వాదశి సమం | 59 1<br>58 0 | 60 0<br>0 1<br>60 1 | 59 59<br>క్షయం<br>58 0<br>క్షయం | —Do— |
| 9. | రెండూ అధికం | 56 1<br>58 0 | 60 0<br>1 0<br>60 1 | 5 0<br>4 0 | అందరూ పరఏకాదశియందే ఉపవసించాలి. |

## స్మార్తులకు సూర్యోదయంలో దశమీరహిత శుద్ధ ఏకాదశి 9 భేదాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రెండూ న్యూనం | 59 59 | 59 0 | 59 0 | ఇక్కడ రెండు అధికం. అందువల్ల స్మార్తులు |
| | | 57 0 | 58 0 | 59 0 | ఏకాదశి రోజున, వైష్ణవులు ద్వాదశి రోజున ఉపవసించాలి. |
| 2. | ఏకాదశి న్యూనం, ద్వాదశి సమం | 59 59 | 59 45 | 60 0 | —Do— |
| | | 57 0 | 58 0 | 59 0 | |
| 3. | ఏకాదశి న్యూనం, ద్వాదశి అధికం | 59 59 | 59 59 | 60 0 | ద్వాదశి అధికం. కనుక స్మార్తులు ఏకాదశి |
| | | 58 0 | 59 0 | 1 0 | రోజు ఉపవసించాలని మాధవుడు, అందరూ |
| | | | | 60 0 | ద్వాదశిలోనే ఉపవసించాలని హేమాద్రిఅన్నారు. |
| | | | | 0 1 | కొందరు, ముముక్షు స్మార్తులు ద్వాదశిలో ఉపవసించాలనిరి. |
| 4. | ఏకాదశి సమం, ద్వాదశి న్యూనం | 58 59 | 60 0 | 59 59 | ఇక్కడ రెండూ అధికం. అందువల్ల స్మార్తులు |
| | | 57 0 | 58 0 | 59 0 | ఏకాదశిన, వైష్ణవులు ద్వాదశిన ఉపవసించాలి. |
| 5. | రెండూ సమం | 58 59 | 60 0 | 60 0 | —Do— |
| | | 57 0 | 58 0 | 59 0 | |
| 6. | ఏకాదశి సమం, ద్వాదశి అధికం | 59 59 | 60 0 | 60 0 | ఇక్కడ ద్వాదశి అధికం. స్మార్తులు ఏకాదశిన, |
| | | 58 0 | 59 0 | 1 0 | వైష్ణవులు ద్వాదశిన ఉపవసించాలని మాధవ |
| | | | | 60 0 | మతం. అందరూ ద్వాదశిలో ఉపవసించాలని |
| | | | | 0 1 | హేమాద్రి అన్నారు. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 7. | ఏకాదశి అధికం, ద్వాదశి న్యూనం | 59 59<br>58 0 | 60 0<br>1 0<br>60 1 | 58 0<br>క్షయం<br>58 0<br>క్షయం | ఏకాదశి అధికం, అందువల్ల స్మార్త గృహస్థులు పూర్వ ఏకాదశి రోజున యతి, నిష్కామ గృహస్థులు, వనస్థులు, విధవలు, వైష్ణవులు పరమున ఉపవసించాలి.<br>విష్ణుప్రీతికాములైన స్మార్తులు, రెండు రోజులు ఉపవసించాలని కొందరు అంటారు. |
| 8. | ఏకాదశి అధికం, ద్వాదశి సమం | 59 59<br>58 60 | 60 0<br>1 0<br>60 1 | 59 0<br>క్షయం<br>58 0<br>క్షయం | —Do— |
| 9. | రెండూ అధికం | 59 59<br>58 0 | 60 0<br>1 0<br>60 0<br>1 0 | 3 0<br>4 0 | రెండూ అధికం కనుక కనుక ఇద్దరూ పరమందే ఉపవసించాలి. |

## స్మార్తులకు, సూర్యోదయంలో దశమివిద్ధ ఏకాదశి 9 భేదాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రెండూ న్యూనం | 2 0<br>2 0 | 57 59<br>క్షయం<br>56 0<br>క్షయం | 57 0<br>55 0 | ఏకాదశి, ద్వాదశి రెండూ అధికం. అందువల్ల స్మార్తులు ఏకాదశిలో వైష్ణవులు ద్వాదశిలో ఉపవసించాలి. |
| 2. | ఏకాదశి న్యూనం ద్వాదశి సమం | 2 0<br>2 0 | 57 59<br>క్షయం<br>56 0<br>క్షయం | 60 0<br>55 0 | —Do— |
| 3. | ఏకాదశి న్యూనం ద్వాదశి అధికం | 1 0<br>1 0 | 58 59<br>58 0 | 60 0<br>1 0<br>60 0<br>0 1 | ద్వాదశి అధికం. అందువల్ల స్మార్తులు ఏకాదశి రోజున ఉపవసించాలని మాధవులు అంటారు. వైష్ణవులు ద్వాదశి రోజున ఉపవసించాలి. |
| 4. | ఏకాదశి సమం ద్వాదశి న్యూనం | 2 0<br>2 0 | 58 0<br>క్షయం<br>56 0<br>క్షయం | 58 59<br>55 0 | ఏకాదశి ద్వాదశులు రెండూ అధికం. కాన స్మార్తులు ఏకాదశిన, వైష్ణవులు ద్వాదశిన ఉపవసించాలి. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5. | రెండూ సమం | 2 0<br>2 0 | 58 0<br>క్షయం<br>56 0<br>క్షయం | 60 0<br>55 0 | —Do— |
| 6. | ఏకాదశి సమం, ద్వాదశి అధికం | 2 0<br>1 0 | 58 0<br>క్షయం<br>58 0<br>క్షయం | 0 0<br><br>0 0 | ద్వాదశి అధికం. కనుక స్మార్తులు ఏకాదశిన ఉపవసించాలి. |
| 7. | ఏకాదశి అధికం, ద్వాదశి న్యూనం | 7 0<br>4 0 | 2 0<br>2 0 | 55 0<br>క్షయం<br>58 0<br>క్షయం | ఏకాదశిమాత్రం అధికంగా ఉంది. కాన స్మార్తులు ఏకాదశిన, వైష్ణవాదులు ద్వాదశిన ఉపవసించాలి |
| 8. | ఏకాదశి అధికం, ద్వాదశి సమం | 5 0<br>4 0 | 2 0<br>2 0 | 58 0<br>క్షయం<br>58 0<br>క్షయం | —Do— |
| 9. | రెండూ అధికం | 7 0<br>2 0 | 4 0<br>3 0 | 3 0<br>4 0 | రెండూ అధికం. అందరూ పరఏకాదశియందే ఉపవసించాలి. |

# అనుబంధం - 2

# గ్రహణవిచారము

ఎ) సూర్యాస్తమయం కన్న రెండు పలల కాలంముందే చంద్రగ్రహణం విడిస్తే ఆ గ్రహణ పుణ్యకాల స్నానంచేయాలా వద్దా అని సంశయంలో, చంద్ర గ్రహణం కాని, సూర్యగ్రహణం కాని ఎవరికి కన్పిస్తే వారే స్నానదానాదులు చేయాలి, వారికే పుణ్యం. సూర్యాస్తమయం కన్న ముందు జరిగింది కనుకదాన్ని దివాగ్రహణంగా గ్రహించాలి. సూర్య గ్రహణం రాత్రి, చంద్ర గ్రహణం పగలు జరిగితే అప్పుడు స్నానదానాదులు వద్దు అని శాస్త్రం కనుక అది పుణ్యం ఇవ్వదు, అక్కడ స్నానదానాలు వద్దు అని.

## బి) జ్వరావస్థలో రజస్వల యొక్క శుద్ధి విషయ చర్చలో ఉశనులు ఇట్లా :

రజస్వలయై, జ్వరంతో ఉన్న స్త్రీకి శుచిత్వం ఎట్లా? ఏ కర్మవల్ల ఆమెకు శుద్ధి అంటే - నాల్గోరోజు వచ్చాక, ఆ స్త్రీని ఎవరైనా ముట్టినట్టైతే, ఆమె వంటి మీద వస్త్రాలతో సహా నీళ్ళల్లో మునిగి స్నానంచేసి స్నానంచేసి మళ్ళా ముట్టాలి. 10 సార్లు కాని 12 సార్లు కాని మళ్ళీ మళ్ళీ ఆచమనం చేయాలి. చివర ఆ వస్త్రాలు వదిలిపెట్టాలి. అట్లా ఆమె శుద్ధమౌతుంది. ఆతుర స్నానం చేయాల్సొస్తే పది సార్లతో అనాతురుడౌతాడు. స్నానం చేసి స్నానం చేసి ఇతన్ని ముట్టాలి. అప్పుడు ఆ ఆతురుడు శుద్ధుడౌతాడు (పరాశరస్మృతి). ఆ పిదప శక్తి కొద్ది దానం ఇవ్వాలి. ఆ పుణ్యాహంతో శుద్ధుడౌతాడు. గ్రహణ కాలమందు హోమజపాదులు చేస్తే-చేయాల్సి వస్తే సూతకాది దోషం లేదు. గ్రహణంలో తీర్థం నుండి తీసిన నీటితో కాని నీటిలో గాని స్నానం చేయాలి, అని.

### రజస్వల స్నానవిధి ఇట్లా :

స్త్రీ రజస్వలగా ఉన్నప్పుడు నైమిత్తిక స్నానంవస్తే, వేరే పాత్రలోని నీటితో స్నానంచేసి వ్రతమాచరించాలి. నీళ్ళతో సాంగోపాంగముగా ఎట్లా గోట్ల శరీరాన్ని తడుపుకొనాలి. వస్త్రమును పిండరాదు, ఇంకో వస్త్రాన్ని కూడా ధరించరాదు, అని. 3 రాత్రులు లేదా ఒక రాత్రి బాగా ఉపవసించి గ్రహణ కాలంలో స్నానదానాదులు అనుష్ఠిస్తే గొప్ప ఫలము అని.

### సి) ఏకాదశి ఉపవాస నిర్ణయం ఇట్లా :

మొదటిరోజు 3 గడియల వరకు దశమి, పిదప ఏకాదశి, తర్వాతి రోజు ఒక గడియ పర్యంతం ఏకాదశి తరువాత ద్వాదశి ఉంది, మూడవరోజు 1 గడియ 14 విగడియల వరకే ద్వాదశి ఉంటే ఏకాదశి ఉపవాసం ఏ రోజు చేయాలి అని అనుమానం వస్తే - "త్రయోదశిరోజు కలా మాత్రమైనా ద్వాదశి ఉంటే అద్వాదశి కన్న ముందురోజే పారణచేస్తే ఆ ద్వాదశి, ద్వాదశి ఆచరించే వాణ్ణి నశింపచేస్తుంది." "పారణరోజు ద్వాదశి కలామాత్రం కూడా లేని పక్షంలో, దశమీ విద్ధఐన ఏకాదశి రోజుకూడా ఉపవసించి ఏకాదశి తిథి ఆచరించాలి" అనే నిర్ణయసింధు మాటల వల్ల సూర్యోదయం తర్వాత కలా మాత్రమైనా ద్వాదశి ఉన్నరోజు పారణ చేయాలి. దానికన్న ముందురోజు ఏకాదశీ ప్రయుక్త ఉపవాసం చేయాలి అని గ్రహించండి. మిగిలిన చోట్ల ఏకాదశి ఉపవాసమే చేయాలి అని తెలుస్తోంది.

### డి) అగ్నిహోత్ర విచారము :

ఒక ధార్మికబుద్ధి కలవాడు, రాజ్యవిషయాల్లో వ్యాపృతుడు, స్వయంగా అగ్నిహోత్రం చేసే అవకాశం లేనివాడు, మరొకణ్ణి శ్రౌతస్మార్త నిత్యకర్మాను ష్ఠాన నిరతుణ్ణి బ్రాహ్మణ్ణి నియోగించి అతనితో అగ్నిహోత్రాది కర్మలు చేయి స్తుంటే కాలవశాత్తు ఆ చేయించేవాడు చనిపోతే, వాని కొడుకులు అనధికారులైతే, విధురత్వం లాంటివి వస్తే, ముందటి బ్రాహ్మణుడు చేసిన అగ్నిహోత్రాదులకు అధికారి దొరక్క పోవటం అనే లోపం వస్తుందో రాదో అనే సంశయం వస్తే ఇది సమాధానం—

"వసంత రుతువులో బ్రాహ్మణుడు అగ్న్యాధానం చేయాలి" అనే దానిలో ఆత్మనే పదం కన్పిస్తోంది. కాన అగ్ని సిద్ధిరూపఫలం, అధానము ఈ రెంటికి సామానాధికరణ్యం కావాలి కనుక (ఆధానం చేసినవానికే ఫలం) ఆధానం లేని వానికి ఆహవనీయాదులు ఉండవు కనుక కూలికిగాని లేదా మరోవిధంగా కాని ఆ హితాగ్ని స్వసంపాదనం చేస్తే ఆధాన అధికరణాలు నిరసించారు కాబట్టి ఎవనిలో ఉన్న ఎటువంటి కర్తృ విశేషణం అధికారిత్వాన్ని సంపాదించి పెట్టుందో వానిలోని అటువంటి అభావదశయే దాని అభావమునకు ప్రయోజక మవటం తప్పనిసరి పరిస్థితి కాబట్టి ప్రయోజక పురుషునిలోని వైధుర్యాదులు తత్వం కాదు కాబట్టి అధికార నాశకత్వం సంభవించలేదు కాబట్టి ముందు చెప్పిన బ్రాహ్మడిలో అధికారం అమితంగా ఉంది కాబట్టి అతడు అగ్నిహోత్రాన్ని యథా ప్రకారం రక్షించాలి. "దేవతల అగ్నిని ఉద్వాసన చేసేవాడు వీరహత్యా దోషం పొందుతాడు" అనే శ్రుతివల్ల అగ్నిని విసర్జించేవాడు వీరహత్యా దోషాన్ని పొందు తాడు అని అనటంవల్ల ఆ బ్రాహ్మణుడు వీరహత్యా దోషం రాకుండా ఉండటం కోసం తప్పకుండా అగ్నిని సంరక్షించాలి. అగ్నిహోత్రం చేయాలి. ఈ బ్రాహ్మ ణుడు, నియతవృత్తి దానాదులు పొంది ఎవరిచేత ఇందులో ప్రవేశపెట్టబడ్డాడో ఈ ధర్మ కార్యంలో, వారి నారి సంతతి వారికి అట్టి దోషమే వస్తుంది కాబట్టి తమను రక్షించుకునే కొరకు యథా ప్రకారం నియతవృత్తి దానం చేయాలి. అగ్నిని, అగ్నిహోత్రమును రక్షించాలి ఇది ధార్మిక పంథ అని.

శ్రౌతాగ్నిహోత్రాన్ని ఆచరింపచేసే అతని శరీరాన్ని (శవాన్ని) కాల్చే కొరకు అగ్నిని ఇచ్చినా, అరణి నుండి పుట్టిన అగ్నిలో అగ్నిహోత్రం నాశం కాదు.

ఒక ధార్మికుడు, ఒక శ్రౌత స్మార్తకర్మ నిష్ఠుడైన బ్రాహ్మణుడికి వృత్తిని కల్పించే కొరకు శ్రౌతాగ్నిహోత్ర ఫలాన్ని కాంక్షించి, అతన్ని అగ్న్యాధానంలో నియమించాడు. ఆ బ్రాహ్మణుడు యథావిధి శ్రౌతాగ్నిహోత్రాదులు చేస్తున్నాడు. వృత్తిని కల్పించిన, శ్రౌతాగ్నిహోత్ర ప్రయోజనాన్నాశించే ఆ యజమాని కాల వశంవల్ల మరణిస్తే, అతనివాళ్ళు కోరితే, అగ్నిహోత్రి బ్రాహ్మణుడు, లౌకిక అరణినుండి పుట్టిన అగ్ని అతవి సంస్కారమును తగులబెట్టేందుకొరకు ప్రశస్త మని భావించి ఇచ్చాడు. ఇట్టి స్థితిలో పూర్వపు అగ్ని నశించింది అని కొందరి అభి ప్రాయం. ఇది సరియైనదా? కాదా? అని అంటే సరియైంది కాదని సమాధానం.

ఎట్లాంటే-ఆధానసిద్ధమైన అగ్నులకే అగ్నిహోత్రాదికర్మల్లో ఉపయోగ మనేది అన్ని శాస్త్రాలు అంగీకరించాయి. అనుమానంలేదు. అగ్నిసిద్ధిని కోరే వాడు ఆధానకర్త ఆచరిస్తాడు కనుక ఇది కామ్యకర్మ. "కామ్యకర్మలో ప్రతినిధి లేదు" అనే శాస్త్రాన్ననుసరించి, ప్రతినిధి ద్వారా అనుష్ఠింపచేసే అవకాశం లేదు కాబట్టి యజమానే కర్త. కాబట్టి చేయించే ధార్మికాగ్రేసరుని ప్రతినిధిగా బ్రాహ్మణుడు అగ్న్యాధానం చేశాడనటం పిలుకానిపని. అందువల్ల ప్రయోజక కర్త్రధీనమైన పుణ్యమును పొందుటకై చేయించబడిన అగ్నిహోత్రము ప్రయోజక కర్తృనాశంవల్ల నాశంకాదు. ఇట్లా ఉండగా, లౌకిక అరణియందున్న అగ్నివల్ల చేసిన సంస్కారము, సద్గతిప్రాప్తి రూపఫల విశేషాన్ని ఇచ్చేదైనా, పూర్వాగ్నిహోత్రాన్ని నాశనంచేసేది కాదనేది దృఢము. ముందు గ్రహించిన శ్రౌతాగ్ని అగ్నిహోత్రంచేసే బ్రాహ్మణుడిది, కనుక అగ్నిహోత్రాదికర్మ మునుపటినాదే బాగా ఆచరించాలి. యజమానియొక్క పుత్రులుకూడా తమ తండ్రిచేసిన పనిని, వృత్తిని కల్పించటం ద్వారా మునుపటిలాగే బాగా రక్షించాలి అనేదే ధర్మతత్వ విదుల మతం.

## అగ్నిహోత్రులు తినతగిన పదార్థములు :

ఉపవాసంరోజు అగ్నిహోత్రి హవిష్యాన్నం తినాలి. అనగా హవిష్యంలో యవలు ముఖ్యం. ఆ తరువాత వ్రీహులు ముఖ్యం. మాషము (మినుములు) కోద్రవము (అళ్ళు) తెల్ల, ఎర్ర, పచ్చనిరంగుగల ధాన్యాలు (గౌరాది) అన్నీ లభించినా వదలాలి. (గౌర=తెల్ల ఆవాలు) (ఆది అనగా శనగలు, చిరుసెనగలు, ఉలవలు వగైరా.) అగ్నిహోత్రి ఉపవసించేరోజు ఏం తినకూడదో కాత్యాయనుడు ఇట్లా చెప్పాడు : శాకము, మాంసము, చిరుసెనగలు, శనగలు, అళ్ళు, మినుములు, మధు, ఇతరుల అన్నము, ఇవన్నిటిని ఉపవాసం రోజున వదలాలి అని. నువ్వులు, పెసలువదలి, నల్లపెసలు, సస్యములైన గోధుమలు, అళ్ళు, శనగలు, దేవధాన్యము, అన్ని శాకములు, చెరుకునుండి వచ్చినవన్ని, సర్జిక్షారము, యవక్షారము, వంకణం, క్షారము, సముద్రలవణము వీటన్నిటిని వ్రతమందున్నవాడు ఎల్లప్పుడు వదలాలి అని పరిశిష్టము.

(యవ = Barley; వ్రీహి=ఎర్ర వడ్లు; శైబ్యం = పొట్టుధాన్యము; పొలంలో ఉండేది సస్యం, అదే పొట్టు ఉన్నప్పుడు ధాన్యం అన్నారు. పొట్టుపోతే తండులం, వండితే అన్నం అంటారు; క్షారం=ఉప్పు; టంకణం=ఎలిగారము.)

## ఇ) యజ్ఞాదుల్లో స్త్రీలకు అధికార విచారము:

రుద్రయాగ, విష్ణుయాగాదుల్లో పురుషులవలె స్త్రీలకు గూడా అధికారం ఉందా లేదా అని చర్చలో - స్త్రీలకు వేదాధ్యయనం నిషేధించారు, కనుక విద్యలేదు కాబట్టి మంత్రాన్ని గ్రహించలేరు కాబట్టి, మంత్ర సాధ్యములైన శ్రౌతకర్మల్లో స్వతంత్రంగా అధికారంలేదని జైమినికాత్యాయనాది ఋషులు నిర్ణయించారు. ఐనా స్మార్తమైన రుద్రయాగాది క్రతువుల్లో అధికారంఉంటుంది. ఎట్లాగంటే, వైదికమంత్ర సాధ్యమైన శ్రాద్ధాదుల్లో స్త్రీలకు, స్వతంత్రంగా మంత్రోచ్చారణ నిషేధమున్నా, ఋత్విక్కు ద్వారా శ్రాద్ధాదులు చేయటంలో అధికారం ఉంది కదా అని నిబంధకారులు నిర్ణయించారు. "విధవ స్వయంగా సంకల్పం చేసి, మిగిలినది యజ్ఞాదులు, బ్రాహ్మణుని ద్వారా చేయించాలి" అని నిర్ణయసింధువులో అన్నారు. శాంతిక, పౌష్టిక, వాస్తు, తటాక, ఉత్సర్గాదులు (స్మార్తకర్మలు)వైదికమంత్రసాధ్యములైనా, ఋత్విక్కు ఉచ్చరించే మంత్రోచ్చారణ ద్వారా (స్వతంత్రముగా) స్త్రీలకు అధికారం, దానకమలాకరాదుల్లో స్థాపితమైంది. ఎట్లాంటే - గృహ్య సూత్రాల్లో చెప్పబడ్డ హోమాంగమైన కుశకండికాది అంగముల నపేక్షించే తులాదానాదులందు, వాని అధ్యయనం లేనందువల్ల స్త్రీలకు అధికారం ఎట్లా వస్తుంది అని అంటే అట్లాకాదు, గృహ్య సూత్రాల్లో చెప్పబడిన అంగ జ్ఞానాన్ని ఉపదేశంవల్ల పొందవచ్చు. ఎన్నుకున్నవారు పఠించే (మంత్రాలు) ఋత్వికులు చేసే హోమంలో వైదిక మంత్రాలు ఉండే ఉంటాయి అని దానకమలాకరంలో అన్నారు. ఇట్లాగే రుద్రయాగాదుల్లో కూడా ఋత్విక్కులే మంత్రాలు చదువుతారు కాబట్టి స్త్రీలు కేవలం ద్రవ్యత్యాగాన్నే అనుష్ఠించాలి కాబట్టి దాన్ని ఆచరించటంలో నిషేధంలేదు. కాబట్టి స్త్రీలకుకూడా ఋత్విక్కు ద్వారా స్మార్త రుద్ర విష్ణుయాగాదులు అనుష్ఠించటంలో అధికారం ఉంది అని అనటం సబబు.

రుద్ర కల్పద్రుమకారులు స్త్రీ శూద్ర అనుపనీతులకు వైదికమంత్ర యుక్తకర్మల్లో అధ్యయనాదులు లేవు కాబట్టి సాక్షాత్తు (విధి) వచనంలేకపోతే అధికారంలేదు అని అన్నారు. అక్కడ ఒక విషయం చూడాలి. వైదికమంత్రాల వల్లనే అధికారం సాధ్యమయ్యేటట్లయితే, శ్రాద్ధతులాదానాదులు కూడా వైదిక మంత్ర సాధ్యాలుగదా, అక్కడ కూడా స్త్రీలకు ఋత్విక్కు ద్వారా అధికారం

ఎట్లా వచ్చింది? ఒకవేళ ఋత్విక్కు ద్వారా అనుష్టిస్తే దోషంలేదంటారా? ఐతే ఇక్కడ కూడా అట్లాగే చేస్తే అధికారం ఎందుకు రాదు? అందువల్ల స్త్రీలకు వేద మంత్రోచ్చారణ నిషేధం ఉంది కాబట్టి అక్కడ అధికారం లేకపోయినా ఋత్విక్కు ద్వారా రుద్రయాగ, విష్ణుయాగాదుల అనుష్ఠానంతో దోషం లేదు అని.

## ఎఫ్) యజ్ఞాదుల్లో స్వాహాకార నిర్ణయం

అన్ని పద్ధతుల ప్రకారం పురుష సూక్తంలో చివర నామమంత్రంతో కూడిన దాన్ని ఒకే మంత్రంగా భావించారు. అందువల్ల మంత్రాదిలోనే ఓంకారం ప్రయోగించాలి. ఇట్లా ఋక్కు యొక్క అంతంలో ఎక్కడెక్కడైతే నామ మంత్రం కూడా కలపబడిందో అక్కడ అంతటా నామమంత్రంతో కూడిన ఋగాదిని, బాధకంలేకపోతే ఒకే మంత్రంగా భావించటం వల్ల మంత్రాంతము లతో కర్మాదులు స్మరించాలి, చెప్పాంకాబట్టి" అనే సూత్రకారవచనాన్ననుసరించి, మంత్రములకు ప్రయోగంతో కూడా అర్థస్మారకత్వము అనే మీమాంస న్యాయప్రకారం కూడా మంత్ర ఏకత్వమే పర్యవసానము. మంత్రభేదాన్నంగీకరిస్తే వికల్పం వస్తుంది కాబట్టి, మంత్రం ఆదిలోనే ఓంకారం ఉచ్చరించాలి, మధ్యలోకాని, నామమంత్రం మొదట్లో కాని కాదు కనుక, ఓం సహస్రశీర్షా.... సాధ్యాః సంతిదేవాః నారాయణస్వాహా అని చెప్పి హోమం చేయాలి. కాని నారాయణస్వాహా అనే దాని ముందు ఓంకారం పఠించరాదు. అట్లాచేస్తే మంత్ర భేదం ఏర్పడి, ముందు చెప్పిన దోషం వస్తుంది. ఎక్కడైతే ఋక్కు చివర ద్వాదశాక్షరమంత్ర సంయోజనం చెప్పబడిందో అక్కడ ఓంకారం కలిస్తేనే ద్వాదశాక్షరాలౌతాయి కనుక ఓంకారం పఠించాలి. ఎట్లాంటే "ఓం సహస్రశీర్షా సంతిదేవాః ఓం నమోభగవతే వాసుదేవాయ స్వాహా" అని ఎక్కడ ఋక్కు చివర నామమంత్రం సంయోజితమైందో అక్కడ ఋక్కు చివర, చతుర్థ్యంతమైన నామాన్ని చదివి, దాని చివర స్వాహాకారాన్ని కూర్చి హోమం చేయాలి. ఎట్లాంటే - "ఓం సహస్రశీర్షా.... దశాంగులం విష్ణవే స్వాహా" అని ఎక్కడ కేవల నామ, మంత్రంతోనే హవనం చెప్పబడిందో అక్కడ కూడా చతుర్థ్యంతం నామాన్ని పఠించి ఆ పిదప స్వాహాకారం చేర్చి హోమం చేయాలి. ఎట్లాంటే "అగ్నయే స్వాహా మొదలగునవి. ఇట్లాగే అన్ని సూత్రాల్లో విధి ఉంది. నామ

మంత్రం చివర నమశ్శబ్దం చేర్చి ఆ పిదప స్వాహాకారం చేర్చి అగ్నయే నమః స్వాహా'' అని హోమం చేయటం సముచితం కాదు. కాని ''అగ్నయేస్వాహా'' అనే చేయటం ఉచితం. ఎక్కడైతే మంత్రాదిలో నమశ్శబ్దాంతమైందే మంత్ర మని చెప్పబడిందో అక్కడ మాత్రం నమః శబ్దాన్ని పఠించి ఆ పిదప స్వాహా కారం కూర్చాలి. ఎట్లాంటే - ''అగ్నియే నమః స్వాహా'' అని. ఇంత మాత్రం చేత అన్ని నామాల అంతంలో నమః శబ్దం పఠించి స్వాహాకారం కూర్చరాదు. ఎక్కడైతే స్వాహాంతమే మంత్రంగా చెప్పబడిందో అక్కడ అంతమాత్రమే హోమం, అంతేకాని దానిమీద మళ్ళా స్వాహాకారము చేర్చరాదు. ఎట్లాంటే— ''వేట్స్వాహా'' ఇత్యాదులు.

శ్రుతుల్లో కూడా ''వాజాయస్వాహా'' అని మొదలుగా స్పష్టంగా వ్రాశారు కాబట్టి ఏమాత్రం సందేహంలేదు, అని. కొందరు ''నమః'' శబ్దం తర్వాత ''స్వాహా" శబ్దాన్ని పఠిస్తారో అక్కడ మూలాన్ని వెదకాలి. అందువల్ల నమః శబ్దరహితమైన నామమాత్రంతో హోమము అని ఉద్యోతరత్నాదుల్లో ఉంది అని ప్రతిష్ఠేందువు అంటారు.

# అనుబంధం - 3

1. గ్రహణమందు రజస్వల స్త్రీ గంగా ఆది జలంతో స్నానం చేయాలి.
2. గ్రహణంలో జనన మరణ ఆశౌచంలోను యజ్ఞోపవీతం మార్చాలి.
3. గ్రహణంలో ఒక రోజు, గ్రస్త అస్తమయంలో మూడు రోజులు అనధ్యయనం.
4. గ్రహణంలో పుత్రుడు జన్మిస్తే శాంతి చేయాలి.
5. తీర్థంలో, గ్రహణంలో, ఆమశ్రాద్ధం లేదా హేమశ్రాద్ధం అని నిర్ణయ సింధుకారులు. అపరార్కులైతే పాకం లేనిపక్షంలో తీర్థశ్రాద్ధంవలె అమశ్రాద్ధం అంగీకరిస్తారు.
6. ఆదివారం సూర్యగ్రహణం, సోమవారం చంద్రగ్రహణమైతే చూడామణి అంటారు. దీనిలో దానాదులు చేయాలి.
7. గ్రహణ స్పర్శకాలంలో స్నానం, మధ్యలో హోమం, దేవపూజ, శ్రాద్ధం, విడుపులో దానము చేయాలి.
8. గ్రహణంలో స్నానం మంత్రం లేకుండా చేయాలి.
9. సువాసిని స్త్రీలు, తల తడపకుండా స్నానం చేయాలి (గ్రహణంలో)
10. శిష్ట స్త్రీలు సశిరస్క స్నానం (గ్రహణంలో) చేయాలి.
11. తిథిక్షయమైన రోజు గ్రహణం వస్తే, బ్రాహ్మణుడు లభిస్తే అదే రోజు శ్రాద్ధం పెట్టాలి. లేదా ఆమశ్రాద్ధం లేదా సువర్ణదానం చేయాలి. తర్వాతి రోజు అనటం నిర్మూలనం. ఆమశ్రాద్ధం చేయలేని పక్షంలో "న్యూమఖాచం" అనే మంత్రాన్ని 100 సార్లు జపించాలి.
12. చంద్ర, సూర్యగ్రహణ స్పర్శకాలంలో ఆశౌచ మధ్యంలో షట్ దైవత సాంకల్పిక శ్రద్ధం చేయాలి. గ్రహణంలో సంపన్న వ్యక్తి అన్నశ్రాద్ధం చేయాలి.
13. సూర్యగ్రహణంలో, తీర్థయాత్రాంగ శ్రాద్ధంవలె, మృత ప్రధాన అన్నంతో శ్రాద్ధం చేయాలి.

14. అమావాస్య రోజు క్షయాహ శ్రాద్ధం వస్తే క్షయాహ శ్రాద్ధంచేసి, అమా శ్రాద్ధం చేయాలి. అదే రోజు గ్రహణం వస్తే అమాశ్రాద్ధం తర్వాత గ్రహణ శ్రాద్ధం చేయాలి.

15. గ్రహణం కంటె ముందు 9 గంటలు భోజనం చేయరాదు. సూర్య గ్రహణంలో 12 గంటల ముందు భోజనం చేయరాదు. ఇది నిర్ణయసింధు మతం.

16. ధర్మసింధుకారుడంటాడు - గ్రహణంకంటె ఆరు ముహూర్తముల కాలం ముందు గ్రహణ వేధకాలంలో భోజనం చేయరాదు. ఇది ఒకని మతం.

17. గ్రహణంలో బాల, వృద్ధ, రోగులు వీరు భోజనం చేయవచ్చు. కాని వీళ్ళు కూడా గ్రహణంకంటె ఒక ఝాము ముందు భోంచేయరాదు.

18. గ్రహణ, సంక్రాంతి, అమా, పక్ష మహాలయాదుల్లో శ్రాద్ధం చేయలేని పక్షంలో దానిస్థానంలో వచ్చిన తిలతర్పణం చేయాలి.

19. శ్రాద్ధ దినంలో ఏకాదశి వ్రతం, కామ్యోపవాస వ్రతం, శివరాత్రి, జన్మాష్టమి వగైరాలు వస్తే శ్రాద్ధ శేషాన్నాన్ని వాసన మాత్రమే చూడాలి.

20. ఫలాహారాదులతో శ్రాద్ధం చేయాల్సివస్తే అట్లాగే చేయండి.

21. శ్రాద్ధ శేషాన్నమును తాను తప్పకుండా భుజించాలి.

22. శ్రాద్ధ శేషాన్నమును శూద్రునకు పెట్టరాదు. శూద్రునకు ఆ రోజు ఇంట్లో భోజనం పెట్టరాదు.

23. శ్రాద్ధ శేషాన్నమును, విశేష సంబంధం లేకుండా, ప్రతి మనిషి భోజనం చేయరాదు.

24. అమావాస్య రోజు వార్షిక శ్రాద్ధం వస్తే మొదలు వార్షిక శ్రాద్ధం చేసి, పిండ పితృ యజ్ఞం, దర్శశ్రాద్ధం సాగ్నికంగా చేయాలి. నిరగ్నికునికి పిండ పితృ యజ్ఞం లేదు. కమలాకరుడైతే, మొదలు పిండపితృ యజ్ఞం, తర్వాత వార్షిక శ్రాద్ధం, ఆ పిదప అమాశ్రాద్ధం చేయాలంటాడు. ఇది వాజసనేయి శాఖకన్న ఇతరులైన శాఖలవారి మతం.

25. ఆహితాగ్ని, పర్వ అతిరిక్త కాలంలో కూడా, తీర్థ ప్రాప్తి నిమిత్తమైన ముండనం ఆచరించాలి.

# అనుబంధం - 4

1. "నాహింస్యాత్ సర్వా భూతాని" అని నిషేధం. కనుక కపింజలాన్ బహు వచనం వల్ల మూటితోనే పూర్తి 47 పేజి.
2. కూర్మ, శూకర (గడ్డలు) 80 పేజి.
   ఔదయికి ఏకాదశి 80 పేజి.
3. విదేర్యత్ర ప్రధానత్వం ప్రతిషేదే్ప్రధానతా
   పర్యుదాసః స విజ్ఞేయః యత్రోత్తర పదేన నఙ్ 80 పేజి.
4. తాత్పర్య నిర్ణాయక ప్రమాణాలు :- 6 (ఆరు)
   ఉపక్రమం అభ్యాసం అర్థవాదం
   ఉపసంహారం అపూర్వతాఫలం ఉపపత్తి
5. కైముతికన్యాయం :-
   అసలు పదార్థం లేనప్పుడు, ప్రతినిధి వస్తువు స్వీకరించిన దానియందు అన్ని అంగాలు ఆచరింటం అర్థాత్ సిద్ధం 92 పేజి
6. శ్వశురాన్నం గురోరన్నం మాతులాన్నం తథైవచ
   పితృవ్య, భ్రాతృ పుత్రాణాం పరాన్నం నైవ దోషకృత్ 110 పేజి
7. అన్వాధానము = ఉపవాసం, సమిదా ధానం 119 పేజి.
   ఆవర్తనం = మధ్యాహ్నకాలం, (సంధి కాలం) 119 పేజి
8. దర్శాంగం కనుక పిండ, పితృయజ్ఞంను మొదలు ఆచరించాలి
   దర్శశ్రాద్ధం (అన్వాహార్యం) పిండ పితృయజ్ఞం (రెండు)
9. న్యూషు వాచం ప్రమహే, భరామహే, గిర ఇంద్రాయ సదనే వివస్వతః నూచిద్ధి రత్నం స, సతామి వా విదన్న దుష్ట తిర్ద్రవిణో దేష శస్యతే 140 పేజి.
10. అర్చాపూర్వక జపము, హోమము, తర్పణము, అభిషేకము, బ్రాహ్మణ పూజ అని ఐదు రకాలుగా ఆదర ప్రదర్శనము అని అన్నారు 164 పేజి.

11. దేవనక్షత్రాలు :- కృత్తికనుండి విశాఖవరకు
యమనక్షత్రాలు :- అనూరాధనుండి భరణీవరకు

12 a) దర్శనం విధిఐతే :- ఉపాదేయత్వం, విధేయత్వం, గుణత్వం
దర్శనం అనువాదమైతే :- ఉద్దేశ్యత్వం, అనువాదత్వం, ముఖ్యత్వం
ఇవి పరస్పర విరుద్ధ గుణాలు. విరుద్ధ త్రికద్వయాపత్తి. అందుకు వాక్య భేదం అంగీకరించాలి. అదో దోషం మళ్ళా 168 పేజి.

b) అప్రాప్తార్థ ప్రతిపాదన విధి
జ్ఞాతార్థ ప్రతిపాదనం అనువాదం 172 పేజి.

13. సప్తదశసా మిధేనీ ఈ వాక్యం పశుమిత్రవింద ప్రకరణంలో ఉన్న అగ్నిని దీపింపచేసే 17 ఋక్కులను సంకోచింప చేసినట్లు, ఆయా వ్రత విశేషాల్లోని హోమ విధుల ద్వారా "హవనం" అనేది "జపో హో మశ్చ సామాన్యం" అనే వాక్యంలో ఉపసంహరిస్తుంది 55 పేజి.

## అనుబంధం - 5

# సంక్షిప్తంగా కొన్ని అంశములు

1. సంతానం కల గృహస్థు ఆదివారం, సంక్రమణం, గ్రహణంలలో ఉప వాసం చేయరాదు. భుజించాలి లేదా కొంచెం తినాలి.
2. దైవకార్యాల్లో ఉత్తరాయణం, శుక్లపక్షం; పితృ కార్యాల్లో దక్షిణాయనం, కృష్ణపక్షం శ్రేష్టం.
3. సంక్రమణములలో రాత్రి పుణ్యకాలం కాదు.
4. ఏ కర్మకైనా కర్మకాల వ్యాపిని తిథి ముఖ్యం.
5. ఏక భక్తంలో మధ్యాహ్న వ్యాపిని తిథి, నక్తంకు ప్రదోష తిథి ముఖ్యం.
6. బ్రహ్మచారి భుజించాలి (ఉపవసించరాదు)
7. శూద్రుడు ధర్మాచరణాధికారి.
8. వైశ్య శూద్రులు 2 రాత్రులు ఉపవాసం చేయొచ్చు (ఎక్కువ వద్దు). 4 వ సారి భోంచేయవచ్చు.
9. సోమ, బుధ, గురువారాలు అన్ని పనుల్లో సిద్ధిని కల్గిస్తాయి. ఆది, మంగళ, శనివారాలు చెప్పబడిన కర్మల్లోనే సిద్ధినిస్తాయి.
10. వైధృతి, వ్యతీపాతాలు అరిష్టాలు. పరిఘయొక్క సగభాగం అరిష్టకం. విష్కుంభ, వజ్రముల 3 గడియలు, వ్యాఘాతంలో 9 గడియలు, శూల యోగంలో 5 గడియలు, అతి గండం, గండంలో 6 గడియలు వదలాలి.
11. 1 మాసం నుండి 4 తులముల వరకు ప్రతిమ (దేవ) ఉండొచ్చు.
12. దేవ కార్యాల్లో రజతదానం వద్దు.
13. ఉపవాసి అభ్యంగ స్నానం చేయరాదు. వ్రతంలో స్త్రీ, పురుషులు రక్త వస్త్రం, తెల్లపూలు ధరించాలి. (ఏకాదశి వ్రతంలో కాదు.)
14. గృహస్థు మాత్రం శుక్లఏకాదశి పాటించాలి. (పుత్రవంతుడు.)

15. అరుణోదయంలో దశమివేధ ఉంటే వైష్ణవులు, సూర్యోదయంలో దశమి వేధ ఉంటే స్మార్తులు ఏకాదశి ఆచరించరాదు.
16. పారణలో తులసీ, ఆవిశె ఆకులు, ఉసిరి ఉంటే, ఉపవాసంలో నిషిద్ధులైనవారితో మాట్లాడిన దోషం పోతుంది.
17. ద్వాదశి శ్రవణా నక్షత్రంతో కూడినది ఉపవాసానికి శ్రేష్టం.
18. ద్వాదశి పారణ అపరాహ్ణమందే చేయాలి.
19. అమావాస్యతో కూడిన పాడ్యమిలో అపరాహ్ణవ్యాపిత్వం శ్రాద్ధానికి ముఖ్యం.
20. గ్రహణంలో 4 ప్రహరల ముందు భోజనం చేయరాదు. బాల వృద్ధులకు ఆతురులకు 1 యామం ముందు భోజనం కూడదు.
21. నువ్వులు దర్భ గ్రహణంలో వస్తువులపై వేయాలి.
22. గ్రహణం రాత్రి, అపుత్రునకు (సంతాన హీనునకు) భోజనం నిషేధం. సూర్యచంద్రులు గ్రహణంలో అస్తమిస్తే పుత్రవంతుడు కూడా భుజించరాదు. చంద్రగ్రహణంలో (అమంత్రంగా) గోదావరి స్నానం చేయాలి. సూర్యగ్రహణంలో నర్మదా స్నానం చేయాలి. సూర్యగ్రహణం, మంత్ర దీక్షకు మంచిది. గ్రహణంలో స్నానం కుదరకపోతే తీర్థాలను స్మరించాలి. (గంగేచ యమునే చైవ వగైరా.)
23. తిథి ఖర్వ, దర్పములందుండగా శ్రాద్ధం వస్తే పరమైనది పూజ్యము. తిథి, హింసల్రి మందుండగా పూర్వము పూజ్యము. (పరం రోజు, పూర్వం రోజు.)
24. దశమి, అష్టమిల 5 గడియల తర్వాత 3 గ.లు, ఏకాదశి 12 గ.ల తర్వాత 3 గ.లు తదియ, పూర్ణిమల 20 గ.లు; చతుర్దశి, చతుర్థుల చివరి 3 గ.లు భద్ర యొక్క పుచ్ఛం శుభకరమైనవి.
25. సర్పిణి ముఖం, వృశ్చికి పుచ్ఛం వదలాలి. పగలు ఉండి రాత్రికి కూడా సాగిన భద్ర, అట్లా రాత్రి ఉండి ప్రొద్దుటకు కూడా ఉన్న భద్ర మంచిది.
26. చతుర్దశిన పితృయజ్ఞం, అమావాస్య నాడు ఉపవాసం, పాడ్యమిన దేవయజ్ఞం ఆచరించాలి.
27. అమావాస్య రోజున మొదట బలివైశ్వదేవంను, తర్వాతవస్తే క్షయాహ శ్రాద్ధంను ఆపై దర్శశ్రాద్ధంను ఆచరించాలి.

28. గ్రహణంలో ఆదిలో స్నానం, మధ్యలో హోమం, ముక్తి దశలో దాన శ్రాద్ధములు, ముక్తి తర్వాత స్నానం ఆచరించాలి. గ్రహణంలో జప, హోమ, తర్పణ, మార్జన, బ్రాహ్మణ భోజనములు జరపాలి.

29. పూర్ణిమ సోమవారం, అమావాస్య సోమవారం, సప్తమి ఆదివారం, చతుర్థి మంగళవారం ఏవు వత్తుల్యములు, పుణ్యప్రదములు.

30. సంధిని నిర్ణయించేప్పుడు ప్రతిపద వృద్ధిలో ఉంటే దాని సగభాగాన్ని పర్వంలో కలపాలి. అట్లాగే క్షయ తిథియొక్క సగభాగాన్ని కలిపి సంధిని నిర్ణయించాలి.

31. ఒకే రోజు ఏకాదశి, ద్వాదశి, త్రయోదశులుంటే ఆ రోజు ఉపవాసం చేయకూడదు.

32. 42 వ పేజీలోని ద్వితీయ తృతీయ మొదలగు జంటలు, కృష్ణపక్షంలోని అమాప్రతిపత్ జంట మహాఫలాన్ని యిచ్చేవి (మంచివి). అట్లాగే శుక్ల పక్షంలోని నవమితో కూడిన దశమి, ఏకాదశిగల ద్వాదశి, ద్వాదశిగల త్రయోదశి, చతుర్దశిగల పున్నమి మంచివి. అట్లాగే కృష్ణపక్షంలో ప్రతిపదతో కూడిన విదియ, తృతీయగల చతుర్థి, పంచమిగల షష్ఠి, సప్తమి గల అష్టమి త్రయోదశితో కూడిన చతుర్దశి, నవమితో కూడిన దశమి మంచివి. షష్ఠి, అష్టమి, అమావాస్యలు పరంతో కూడిన పరములు పూర్వం కూడినా బహుళంలో మంచివని అన్నారు,

33. శుక్ల,కృష్ణ పక్షాలలో ప్రతిపదాది తిథులు ఏవి శుభమో(పరంతో కూడినవో, కాక పూర్వంతో కూడినవో) ఇట్లా నిర్ణయించారు.

| | తిథి | శుక్లపక్షం | కృష్ణపక్షం |
|---|---|---|---|
| 1. | ప్రతిపద | అమా + ప్రతిపత్ (అపరాహ్ణవ్యాప్తి) | ప్రతిపత్ + ద్వితీయ |
| 2. | ద్వితీయ | ద్వితీ + తృతీయ | ప్రతిపత్ + ద్వితీయ |
| 3. | తృతీయ | తృతీ + చతుర్థి | తృతీయ + చతుర్థి |
| 4. | చతుర్థి - | చతు + పంచమి | చతుర్థి + పంచమి |
| 5. | పంచమి - | చతుర్థి + పంచమి | చతుర్థి + పంచమి |
| 6. | షష్ఠి - | షష్ఠి + సప్తమి | షష్ఠి + సప్తమి |
| 7. | సప్తమి - | షష్ఠి + సప్తమి | షష్ఠి + సప్తమి |

| | | |
|---|---|---|
| 8. | అష్టమి - అష్టమి + నవమి | సప్తమి + అష్టమి |
| 9. | నవమి - అష్టమి + నవమి | అష్టమి + నవమి |
| 10. | దశమి - నవమి + దశమి | నవమి + దశమి |
| 11. | ఏకాదశి - ఏకాదశి + ద్వాదశి | ఏకాదశి + ద్వాదశి |
| 12. | ద్వాదశి - ఏకాదశి + ద్వాదశి | ఏకాదశి + ద్వాదశి |
| 13. | త్రయోదశి - ద్వాదశి + త్రయోదశి | త్రయోదశి + చతుర్దశి |
| 14. | చతుర్దశి - చతుర్దశి + అమా | త్రయోదశి + చతుర్దశి |
| 15. | పూర్ణిమ - పూర్ణిమ + పాడ్యమి | పూర్ణిమ + పాడ్యమి |
| 16, | అమావాస్య - అమా + పాడ్యమి | అమా + పాడ్యమి |

(ఉదా॥ ద్వితీయకు పూర్వం పాడ్యమి, పరం తృతీయ)

34. a) రంభావ్రతంను ద్వితీయతో కూడిన తృతీయరోజు ఆచరించాలి.

b) గౌరి వ్రతంను, గణేశవ్రతంను బహులావ్రతంను తృతీయతో కూడిన చతుర్థిలో ఆచరించాలి. గణేశ వ్రతంలో చతుర్థికి మధ్యాహ్న వ్యాప్తి ఉండాలి. సంకష్ట చతుర్థిలో చతుర్థి చంద్రోదయ వ్యాపి కావాలి.

c) నాగచతుర్థి (కార్తీక మాసంలోది)కి చతుర్థి సహిత పంచమి ముఖ్యం. చతుర్థి మధ్యాహ్న వ్యాప్తి కావాలి. ఉపవాసం చతుర్థిలో, పూజ పంచమిలో చేయాలి,

d) శ్రావణ మాసంలోని, నాగపంచమిని, స్కంద వ్రతాన్ని పంచమీయుత షష్ఠిలో చేయాలి.

e) అష్టమినాడు బుధవారం ఉంటే ఆ రోజు ఏకభక్తం ఆచరించాలి.

f) అష్టమితో కూడిన నవమినాడు శివశక్త్యుత్సవం ఆచరించాలి.

g) సావిత్రివ్రతాన్ని చతుర్దశితో కూడిన పూర్ణిమరోజు ఆచరించాలి.

h) అమావాస్యరోజు మంగళవారం ఉంటే మంచిరోజు.

35. 97 వ పేజీలోని శుద్ధ 9, విద్ధ 9 విధాల ఏకాదశులలో ఏకాదశి ఉపవాసాన్ని ఏ రోజు ఆచరించాలో వివరిస్తున్నారు. (పూర్వం మొదటిరోజు, పరం తర్వాతి రోజు)

## శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఏకాదశి న్యూనం | ద్వాదశి | న్యూనం | (పూర్వం) |
| 2. | ,, | ,, | సమం | (పూర్వం) |
| 3. | ,, | ,, | అధికం | (పరం) |
| 4. | ఏకాదశి సమం | ద్వాదశి | న్యూనం | (పూర్వం) |
| 5. | ,, ,, | ,, | సమం | (పూర్వం) |
| 6. | ,, ,, | ,, | అధికం | (పరం) |
| 7. | ఏకాదశి అధికం | ద్వాదశి | న్యూనం | (పూర్వం) |
| 8. | ,, ,, | ,, | సమం | (పూర్వం) |
| 9. | ,, ,, | ,, | అధికం | (పరం) |

## విద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఏకాదశి న్యూనం | ద్వాదశి | న్యూనం | (పూర్వం) |
| 2. | ,, ,, | ,, | సమం | (పరం) |
| 3. | ,, ,, | ,, | అధికం | (పరం) |
| 4. | ఏకాదశి సమం | ,, | న్యూనం | (పరం) |
| 5. | ,, ,, | ,, | సమం | (పరం) |
| 6. | ,, ,, | ,, | అధికం | (పరం) |
| 7. | ఏకాదశి అధికం | ద్వాదశి | న్యూనం | (పరం) |
| 8. | ,, ,, | ,, | సమం | (పూర్వం) |
| 9. | ,, ,, | ,, | అధికం | (పరం) |

# అనుబంధం - 6

# శాస్త్ర సంకేతపదాలు

దక్షిణాయనం - కర్కాట సంక్రాంతి మొదలు

ఉత్తరాయణం - మకర సంక్రాంతి మొదలు

విషువత్తు - మేష, తుల సంక్రమణాలు

విష్ణుపదం - వృషభ, సింహ, వృశ్చిక కుంభ సంక్రమణాలు

షడశీతి - కన్య, మీన, ధనుస్, మిధున సంక్రమణాలు

కులకం - విడువదగ్గ కాలం

ఝాము - 3 గంటలు

పక్షిణీ - 2 పగళ్ళతో కూడిన రాత్రి

మలమాసం - 1. అధిమాసం (అసూర్య) సంక్రాంతి లేని మాసం 2. క్షయమాసం 2 సంక్రాంతులు కల మాసం.

సావనం - 30 రోజుల నెల

నపుంసకమాసం - సంక్రమణ రహితము

ఆగ్రయణం - యజ్ఞబలి

కృచ్ఛ్రం - మార్గశిర పూర్ణిమా యజ్ఞం

గజచ్ఛాయా- పర్వసందులలో రాహువు సూర్యుని మింగితే ఈ పేరు

మహాలయ - మఘ త్రయోదశి; గోదావరి పుష్కరం - సింహరాశిలో గురువు ప్రవేశించినపుడు.

కృష్ణాపుష్కరం - కన్యలో గురువు ప్రవేశించినపుడు.

బాలవృద్ధ అస్తమయాలు - ఇతర గ్రహాలకు సూర్యునితో సాహచర్యం

బాల్యం - గురుశుక్రులు తూర్పు పడమరలలో ఉదయించటం

వృద్ధత్వం - గురుశుక్రులు తూర్పు పడమరలలో అస్తమించటం

శుద్ధ - మరొకతిథితో సంబంధలేని తిథి

విద్ధ - మరొకతిథితో సంబంధంకల తిథి

ఖర్వం - రెండు రోజులూ తిథి సమంగా కలది

దర్ప - తిథి వృద్ధి కలది

హింస్ర - తిథి క్షయం కలది

ప్రదోషం - అస్తమయం తర్వాత 3 ముహూర్తాలు

ఖండతిథి - ఉదయం ఉండి మధ్యాహ్నానికి లేనిది

భద్ర (విష్టి) - కృష్ణపక్షంలో తృతీయ, దశమిల తర్వాత సప్తమి, చతుర్దశులకుముందు, శుక్ల పక్షంలో చతుర్థి, ఏకాదశుల తర్వాత అష్టమి, పూర్ణిమలకు ముందు ఉండేది.

సర్పిణి - శుక్ల పక్షంలోని భద్రముఖం

వృశ్చికి - కృష్ణ పక్షంలోని భద్ర పుచ్ఛం

అపరాహ్ణం - దినాన్ని 5 భాగాలుచేస్తే అందు 4 వ భాగం

శయనీ - ఆషాఢ శుద్ధ ఏకాదశి | విష్ణువు
బోధినీ - కార్తిక శుద్ధ ఏకాదశి | పరున్న - లేచిన రోజులు

అరుణోదయం - సూర్యోదయంకన్న ముందు 4 గడియలు

అనద్యతనం - నిన్నటి రాత్రి చివరి రెండు ఝాములు, పగలు పూర్తి ఈ రోజు, నేటి రాత్రి మొదటి 2 ఝాములు

పౌత్ర - పుత్రుని పుత్రుడు

పౌత్రేయ - పుత్రికా పుత్రుడు. కాని పౌత్ర శబ్దం ఇద్దరికి వాడుకగా ఉంది

వ్యతిషంగం - రెండు కార్యాలను ఒకేసారి చేయటం

స్థాలీపాకం - పితృయజ్ఞం

పక్షాంతకర్మ - అన్వాధానం, సమిదాధానం

అన్వాహార్యకం - దర్శశ్రాద్ధం

కుతపకాలం - పగలును 15 భాగాలు చేస్తే అందులో 8,9,10 వ భాగాలు

శ్రుతం - గ్రహణంలో వండబడిన అన్నం

శారదం - అపరాహ్ణం

చూడామణి - ఆదివారం సూర్యగ్రహణం వస్తే సోమవారం చంద్ర గ్రహణం వస్తే

త్రిజన్మ నక్షత్రం - జన్మనక్షత్రానికి ముందు వెనుక ఉన్న నక్షత్రాలు ఉదా॥ భరణికి ముందు అశ్విని తర్వాత కృత్తిక ఈ 3.)

వ్యతీపాతం - ఆదివారం, అమావాస్య రోజున ఈ క్రింది నక్షత్రాలలో ఏ నక్షత్రమైనా ఉంటే, ఇట్లా అంటారు. శ్రవణం, ధనిష్ఠ, ఆశ్లేష, అశ్విని, ఆర్ద్ర, మృగశిరలు

అవర్తనం - పూర్వాహ్ణ, అపరాహ్ణ సంధికాలం, (మధ్యాహ్నం)

ప్రణయనం - అగ్ని పుట్టించటం

పద్మకం - షష్ఠితో కూడిన సప్తమి ఆదివారం వస్తే అట్లా అంటారు.

## అనుబంధం - 7

# గ్రంథకర్త పేర్కొన్న రచయితలు

ఆంగిరసుడు
అనంతభట్టు
అపరార్కుడు
ఆచార్యచూడామణి
ఆపస్తంబుడు
ఆర్ష్టిషేణుడు
ఆశ్వలాయనులు
ఉషనుడు
ఋష్యశృంగుడు
కణ్వుడు
కర్కాచార్యులు
కాత్యాయనుడు
కార్ష్ణాజిని
కేశవస్వామి
గర్గుడు
గాలవుడు
గోభిలుడు
గౌడులు
గౌతముడు
చ్యవనుడు
జాబాలి
జైమిని
జ్యోతిర్గర్గుడు
జ్యోతిఃసాగరుడు
త్రికాండమండనుడు
తోడరానందుడు
దక్షుడు
దేవజాని
దేవలుడు
ధూర్తస్వామి
నారదుడు
ప్రచేతసుడు
పార్థసారధి
పులస్త్యుడు
పైఠీనసుడు
బృహన్మనువు
బృహస్పతి
బోధాయనుడు
బౌధాయనుడు
భట్టు
భార్గవుడు
భూపాలుడు
మనువు
మరీచి
మాధవుడు
మార్కండేయుడు
మిహిరుడు
మేధాతిథి

యముడు
యాజ్ఞవల్క్యుడు
రాణకధృతుడు
రామాండారులు
లల్లుడు
లౌగాక్షి
వత్సుడు
వర్ధమానుడు
వసిష్ఠుడు
వాచస్పతిమిశ్రుడు
వాజసనేయి శాఖీయులు
వ్యాఘ్రుడు
వ్యాఘ్రపాదుడు
వ్యాసుడు
విశ్వామిత్రుడు
విష్ణుగోభిలుడు
విష్ణువు
వృద్ధగౌతముడు
వృద్ధపరాశరుడు
వృద్ధవసిష్ఠుడు
వృద్ధశాతాతపుడు
వైఖానసుడు
వైజవాపుడు
శంఖుడు
శాంకాయనుడు
శాతాతపుడు
శ్రాద్ధశూలపాణి
శ్రీపతి
శూలపాణి
సత్యతపుడు
సత్యవ్రతుడు
సత్యాషాఢుడు
సుమంతుడు
హారీతుడు
హేమాద్రి

## అనుబంధం - 8

# గ్రంథకర్త పేర్కొన్న గ్రంథాలు

అగ్నిపురాణం
అద్భుతసాగరం
అనంతభాష్యం
అరుణస్మృతి
ఆదిత్యపురాణం
ఆపస్తంబ భాష్యార్థసంగ్రహం
కర్కభాష్యం
కర్మోపదేశిని
కల్పతరువు
కాఠకగృహ్యసూత్రం
కాలవివేకం
కాలహేమాద్రి
కాలాదర్శం
కాలికాపురాణం
కాశీఖండం
కూర్మపురాణం
గణేశకల్పం
గరుడపురాణం
గౌడనిబంధం
చతుర్వింశతిమతం
చమత్కారచింతామణి
ఛాందోగ్యసూత్రం
జ్ఞానార్ణవం
జ్యోతిర్నిబంధం
జ్యోతిషసిద్ధాంతం
తత్త్వసాగరం
తంత్రరత్నం
తంత్రరత్నవార్తికం
త్రిస్థలీసేతువు
తైత్తిరీయశ్రుతి
దివోదాసీయం
దీపిక
దేవత్రాతభాష్యం
దేవీపురాణం
నందిపురాణం
నారదీయం
నారాయణవృత్తి
నిగమం
నిర్ణయదీపం
నిర్ణయామృతం
పద్మపురాణం
పరాశరమాధవీయం
పరిశిష్టం
పురశ్చరణచంద్రిక
పురాణసముచ్చయం
పృథ్వీచంద్రోదయం
ప్రయోగపారిజాతం
ప్రయోగరత్నం

బ్రహన్నారదీయం
బ్రహ్మపురాణం
బ్రహ్మయామలం
బ్రహ్మవైవర్తం
బ్రహ్మసిద్ధాంతం
బ్రహ్మండపురాణం
భవిష్యపురాణం
భారతం
భారద్వాజసూత్రం
భార్గవార్చనదీపిక
మత్స్యపురాణం
మదనపారిజాతం
మదనరత్నం
మదనరత్న పారిజాతం
మన్వర్థముక్తావళి
మంత్రరత్నం
మాతృదత్తీయం
మార్కండేయ పురాణం
మితాక్షరి
ముహూర్తదీపిక
యోగినీతంత్రం
రత్నమాల
రత్నసాగరం
రుగ్విధానం
రుద్రదత్తవృత్తి
రేణుక కారిక
లఘునారదీయం
లాటాయనసూత్రం
లింగపురాణం
వరాహపురాణం
వాయుపురాణం
విజ్ఞానేశ్వరీయం
విష్ణుధర్మం
విష్ణురహస్యం
వృత్తశతం
వ్యవహారసముచ్చయం
శతపథశ్రుతి
శాతాతపీయసారం
శివధర్మం
శివార్చనచంద్రిక
శుద్ధితత్వం
షట్త్రింశన్మతం
షడ్గురుభాష్యం
సంగ్రహం
సంవత్సరప్రదీపం
సంహితాప్రదీపం
స్కాందపురాణం
సిద్ధాంత శిరోమణి
సూర్యోదయ నిబంధం
స్మృతిచంద్రిక
స్మృతిరత్నావళి
స్మృతిసంగ్రహం
సౌరధర్మం
సౌరపురాణం
హరివంశం
హిరణ్యకేశివృత్తి
హిరణ్యకేశిసూత్రం

# అనుబంధం - 9

## సవరణలు

| తప్పు | ఒప్పు | పేజి | పంక్తి |
| --- | --- | --- | --- |
| సంస్కృతి | సంస్కృతి | 1 | 15 |
| గార్గ్యులు | గర్గుడు | 4 | 7 |
| ఆయన | ఆయన | 5 | 12 |
| మాసర్తు | (ఛందోభంగం) | 7 | 5 |
| పర్గ్యే | పరే | 16 | 14 |
| యేపిచ్చంతిన | (ఛందోభంగం) | 18 | 12 |
| కృతానాం | మృతానాం | 29 | 13 |
| ప్రతి సంవత్సరం క్రియమాణం మాసికం (లేదు) | | 29 / 30 | 28 / 1 |
| శసౌ | శస్తౌ | 34 | 28 |
| (అని) సంపూర్ణే అనగా (చేర్చాలి) | | 42 | 19 |
| పూర్వమంటే | పూర్వమందే | 45 | 4 |
| ఇది | ఇతి | 46 | 10 |
| హస్తై | హస్తే | 51 | 20 |
| పక్షంతో | పక్షంతో | 53 | 12 |
| తేభో | తేభ్యో | 55 | 22 |
| స్నాయ | స్నాయీ | 59 | 19 |
| అలాబు | అలాబు | 60 | 10 |
| సౌభాగా | సౌభాగ్య | 64 | 7 |
| ప్రియం | స్త్రియం | 65 | 21 |
| కర్మణి | కర్మణః | 70 | 20 |
| రంభాభ్యాం | రంభాభ్యాం | 74 | 26 |
| మపవనే | ముపవసేత్ | 84 | 8 |
| పక్షాలకు | పక్షాలను | 92 | 6 |
| మహా | మాహా | 127 | 17 |
| గ్రహణేనా | గ్రహణేవా | 142 | 20 |

a) ఇవికాక కొన్ని దోషాలున్నాయి. ప - వ; మ - య: స - న వంటి అక్షరాలు ఒకదాని బదులు మరొకటి వచ్చే అవకాశాలున్నాయి.

b) అక్షరాల కూర్పులో వచ్చే దోషం :- ఉదాహరణకు పేజి - 20 25 పంక్తి మాసేన సంక్రాంతి (gap) న తర్వాత ఇచ్చారు. అట్లాకాక మాసే నసంక్రాంతిః అని సే తర్వాత (gap) వచ్చి, న తరువాతి పదంతో కలియాలి. ఇలాంటి దోషాలు కొన్ని.

c) ఇట్లాకాక ఎక్కడైనా మూలంలో దోషం ఉంటే అనువాదాన్ని చూచి అనువాదంలో దోషాన్ని మూలంద్వారా సవరించుకోగల అవకాశాలున్న దోషాలు ఉండొచ్చు.

ఇట్లాంటి కొన్ని దోషాలు సవరణల్లో చూపలేదు.

d) మూలం అన్నచోట మూ॥ అక్షరం ఉన్నా అనువాదం - అన్నచోట అను॥ అనేమాట ఎక్కడా, పొరపాటున చేర్చలేదు. సంస్కృత, తెలుగు వాక్యాల బట్టే ఇది మూలం, ఇది అనువాదం అన్న అంశాన్ని విజ్ఞులు గమనిస్తారని భావిస్తాను.

